విజ్ఞానచంద్రికా గ్రంథమాల ౩౬

# బౌద్ధమహాయుగము

(హిందూదేశచరిత్ర)

**ప్రవేశ సంఖ్య**

ఇయ్యది శ్రీయుత

వేలూరి సత్యనారాయణ, బి. ఏ. గారిచే

ర చి యి ం ప ఁ బ డి యె

మొదటి కూర్పు 1500

బెజవాడః

ఆంధ్ర గ్రంథాలయ ముద్రాక్షరశాల (లిమిటెడ్) యందు

క. కోదండరామయ్యగారిచే ముద్రింపఁబడియె.

1925

 [వెల రు 2—4—0

చందాదారులకు రు 1—12—0

# కృతి సమర్పణము



మహదైశ్వర్యములతో తులదూగి సర్వసంపదల కనికిపట్టై ఈ జగతీతలమునకెల్ల నాయకమణియై పుణ్యభూమియై ఆధ్యాత్మిక తేజోవిరాజితయై పావన సీమయై వెలిగిన మదీయ మాతృభూమిపద సరోజములకు ఈచిన్నిపొత్తమును సమర్పించుచున్నాను.

—గ్రంథకర్త.



**S.N.C V[illegible]aryulu**

# బౌద్ధ మహాయుగము.

---

## కొన్ని సవరణలు

### విషయ విభాగసూచిక

| పుట. | పంక్తి | అచ్చుపడినది. | సవరణ. |
|---|---|---|---|
| III | 14 | X ఆంధ్రరాజ్యప్రశంస, కుసనులు ౨౦౨-౨౬౨ | X ఆంధ్రసామ్రాజ్య ప్రశంస ౨౦౨-౨౪౨ |
| IV | 3 | (ప్రకరణసంఖ్య అచ్చుపడలేదు) | XI యవనశకయూచీదండయాత్రలు ౨౪౨-౨౬౨ |

### తొలిపలుకు.

| | | | |
|---|---|---|---|
| | 3 | వియమ్స్ | విలియమ్స్ |
| | 6 | బింబసారనృపాలుడు 582-551 | బింబిసార నృపాలుడు 582-554 |
| 24 | చివరిపంక్తి | పుప్యము | పుష్యమి |

### గ్రంథము.

| | | | |
|---|---|---|---|
| | 16 | క్రీ. శ. | క్రీ. పూ. |
| | 6-7 | (ప్రకరణ సంఖ్య అచ్చుపడలేదు) | XI |
| | 2 | VIX | XIV |
| | 1 | గుప్తసామ్రాజ్యవినాశము | హర్షవర్ధనుడు |
| | 2 | XIV | XVI |

---

# సంపాదకీయభూమిక.

౩౪ నెంబరు కుసుమమగు "బౌద్ధమహాయుగము" అను అమూల్యగ్రంథమును రచించి మామండలి కొసంగినందులకు సుప్రసిద్ధదేశభక్తులగు శ్రీయుత వేలూరి సత్యనారాయణ గారికి మేమెంతయు కృతజ్ఞులము భారతేతిహాసమునందు బౌద్ధమహాయుగము అత్యంత తేజోమయమగు ఆశ్వాసము. భరతఖండము సమస్తైశ్వర్యములతో తులతూగి ఉత్కృష్టమగు నాగరకతకు జన్మభూమియై లోకమునకు నాయకమణియై ఆచార్యత్వమును పొంది ప్రపంచములోని ఇతర జాతులకు నాగరకతను, ధర్మమును ప్రసాదించి వారిని తరింప చేసినది. నాడు అజంతాగుహాలలోని చిత్తరువులను చెక్కిన శిల్పులు, యవనహూణుల దండయాత్రలనుండి భరతవర్ష స్వాతంత్ర్యమును సంరక్షించిన వీరాగ్రేసరులు, తక్షశిల, నలంద, అమరావతి విశ్వవిద్యాలయములకు జగద్విఖ్యాతిగడించిన పండితోత్తములు, వైద్య, జ్యోతిష, భూగర్భ, వేదాంత శాస్త్రములను రచించిన శాస్త్రజ్ఞులు, విదేశీయ యాత్రికులను అచ్చెరువంద జేసిన సుపరిపాలనము నిచ్చిన రాజ్యాంగవేత్తలు, నేటి భారతవర్షమునందు గానరారేమి? నాటి కళలు, శిల్పములు, నౌకానిర్మాణము, ప్రకృతిశాస్త్రములు, పరిశ్రమలు, రత్నములు, ధనరాసులు, సౌఖ్యము, శీలము, ధర్మానురక్తి, నేడు గాన్పింపవేమి? రెండువందల ఏండ్లకిందట ఈదేశమును ఆక్రమించిన పారతంత్ర్య మహాపిశాచి సమస్తమును మ్రింగివేసినది

అహింసాయుగమునకు పునాదులు వైచినవాడు మహాతపస్వి, అఖండత్యాగమూర్తి యగు బుద్ధుడు బానిసత్వమునకు నిరాశకును లోనై యున్న నేటి భరతవర్షమున షుమారు రెండు వేల నాలుగు వందల ఏండ్ల తరువాత గౌతమబుద్ధునివలెనే సత్యము, అహింస యను సిద్ధాంతములను బోధించుచు ఒక త్యాగస్వరూపి, తేజోరాశి మోహనదాసు గాంధి భారత స్వతంత్ర నినాదమును పూరించుచున్నాడు. నాటిబుద్ధునివలెనే నేటిగాంధి ఇతర జాతులయొక్క దృష్టిని లోకకళ్యాణపథము నకై భరతవర్షమునకు త్రిప్పుచున్నాడు కాలగర్భమున నేమి దాగియున్నదో! స్వతంత్రయుతమును, తేజోవంతమును నగు స్వర్ణయుగమునకు నేడు తిరిగి పునాదులు పడనున్నవేమో! నాడు వేలకువేల హైందవయువకులు సంసారసుఖములను త్యజించి సన్యాసదీక్ష గైకొని వాడవాడల తిరిగి బౌద్ధధర్మములను బోధించి స్వర్ణయుగమును స్థాపించియున్నారు. నేడును స్వతంత్రసందేశమును వాడవాడలకు గొనిపోయి ప్రజలను స్వతంత్రాభిలాషులుగను, ధర్మానురక్తులుగను చేయుటకు వేలకు వేల త్యాగశీలురగు హైందవ యువకులు గంవలసియున్నారు

శ్రీయుత వేలూరి సత్యనారాయణగారు బౌద్ధమహాయుగకథను హృదయాకర్షముగ వ్రాసినారు. ఆంధ్రభాషకు గొప్ప సేవను చేసినారు.

మేము మొదట ఫాహియాన్ భారతవర్షయాత్రను మాత్రము ప్రచురింపదలచితిమి గాని కీర్తిశేషులగు శ్రీయుత

కొమర్రాజు లక్ష్మణరావుగారు హిందూమహాయుగమును వ్రాసిననాటికంటె నేడు బౌద్ధమహాయుగమునుగూర్చి పరిశోధన లెక్కువ జరిగి, అనేక నూతన గ్రంథములు వెలువడినందున వాటినన్నిటిని శోధించి బౌద్ధమహాయుగమును ఆంధ్రమున ప్రత్యేకముగ వ్రాయవలసినదని మేముకోరిన కోరికను సత్యనారాయణగారు మన్నించి ఈగ్రంథమును వ్రాసినారు. గ్రంథము మేమనుకొనిన దానికంటె కొంచెము ఎక్కువ అయినది. 450 పేజీల గ్రంథమైనది. అందువలన చందాదారులకీగ్రంథమును రు 1—12—0 ల కన్న తక్కువకు ఇచ్చుటకు వీలుకలుగలేదు. ఇతరులకు వెల రు 2—4—0

నె 3కి రు కుసుమముగ అనుబంధగ్రంథముగ "ఫాహియాను భారతవర్ష యాత్ర" ను కూడ ప్రకటించినాము. దానిని చందాదారులకు రు0—12—0 ల కిచ్చుచున్నాము. ఇతరులకు 1—0—0 వెల. 'ఫాహియాన్ భారతవర్షయాత్ర' కూడ మిగుల మనోహరముగ వ్రాయబడినది దానిని కొద్ది ప్రతులు మాత్రమే ప్రస్తుతము అచ్చువేయుచున్నాము. దానిని కావలెనని ప్రత్యేకముగ కోరినవారికి మాత్రమే పంపెదము

ఆంధ్రలోకము ఇంక నెక్కువగ మామండలి నాదరించి మేము ఎక్కువగ భాషాసేవ చేయుటకు సహాయము చేయవలెనని కోరుచున్నాను.

కార్యదర్శి, విజ్ఞానచంద్రికామండలి,

బెజవాడ.

# విషయ విభాగ సూచిక

---

---

## చిత్రపటములు





# తొలి పలుకు

నేనీగ్రంథమును వ్రాయబూనుటకు రెండుమూడు కార ణములుగలవు. ఆంధ్రవాఙ్మయమునచరిత్రగ్రంథములుమిగుల కొలదిగ నుండుటొకటి. ఉన్నవైనను పాశ్చాత్యచరిత్రకారుల ననుసరించి, మన ప్రాచీననాగరికతను, పూర్వపుటౌన్నత్యమును రాజ్యాంగవైభవమును, వాణిజ్యసంపదను, కళాకౌశలమును, రణప్రావీణ్యమును యథార్థముగ చిత్రింపకుండు టొకటి. భార తయితిహాసరంగమున స్వర్ణయుగ మనిపించుకొనిన బౌద్ధమహా యుగచరిత్రము మన తెనుగుభాషయందు లేకుండుటొకటి. పాశ్చాత్యచరిత్రకారులచే వ్రాయబడిన హైందవచరిత్ర లును, వనవారిచే వ్రాయబడిన తదనుకరణములును అస త్యకల్పనలతో నిండియుండుటచే అందలి చరిత్రాంశములను కాలనిర్ణయములను దిద్ది యథాతథముగ వ్రాయవలసిన యా వశ్యకత యుండుటొకటి.

మనభాషయందు చరిత్రగ్రంథములు మిగుల నపురూప ముగ నున్నవి. దివంగతులైన లక్ష్మణరావుగారు తమ హిందూ మహావ్మదీయయుగముల వ్రాయకపూర్వము ఆంగ్లభాషా పరిచయములేని ఆంధ్రజనులు పఠింపగల చరిత్రగ్రంథములు మనభాషయందు లేవనియే చెప్పవలయును. ఇట్టి హైన్యస్థితి దేశమునకు మిగుల అనర్థదాయకము అన్నిటికంటెను దేశా భ్యుదయమున కెక్కుడుగ తోడ్పడునవి చరిత్రగ్రంథములె. తన చరిత్రనె దాను విస్మరించినజాతికి మోక్షములేదు. అట్టి జాతికి స్వాతంత్ర్యసౌఖ్యము గగనకుసుమము మనపూర్వరాజ్య

వైభవమును, కళాసంపదను, వాఙ్మయశోభను భారతవీరులు ప్రాచీన రణరంగములఁ బ్రదర్శించిన అసమాన సమరప్రావీణ్యమును స్మరించి పులకాంకితులైనగాని భారతప్రజాళిదృష్టిపథము అధోముఖమునుండి ఊర్ధ్వముఖమునకు మరలజాలదు. వందే మాతరం అను మహోన్నత భావము మన హృదయాంతరాళములఁ బ్రకటింపనేరదు మనల బంధించిన దాస్యశృంఖలములు విడిపోవజాలవు. స్వాతంత్ర్య ఝంఝానిలము మరల భారతభూమిని యథేచ్ఛగము సంచలింపనేరదు. స్వాతంత్ర్యదేవిపాదములకడ తమ యసువుల బలిదానమొసగ రణరంగమున నురుకగల స్వాతంత్ర్యయోధులు దేశమున నుద్భవింపజాలరు. ఆర్యావర్తమున నార్యవిజ్ఞానవాహిని మరల తరంగితమై ప్రవహింపనేరదు. ఆర్యుల సహజపవిమలస్వరూపము భూతలమున విస్మృతమైపోవకుండ నిలువనేరదు భారతరాజ్యలక్ష్మికి కల్యాణము చేకురజాలదు. ఇట్టి మహాకార్యముల సాధింపగల చరిత్రగ్రంథముల వ్రాయుభారము ఆంధ్రయువకులపై నున్నది తద్గ్రంథముల నాదరింపవలసిన భారము ఆంధ్రమహాజనులపై నున్నది. ఇట్టిలోపమును గొంతవఱకైన దీర్పగలదేమోయను నాశచే నే నీగ్రంథమును వ్రాయ సాహసించితిని

మఱియు నేమికతమునకోగాని ఆంగ్లచరిత్రకారులెవ్వరును మన ప్రాచీనౌన్నత్యమును యథార్థముగ చిత్రింపనైరెరి. అసూయయో, అజ్ఞానమో, నిరంకుశమో తెలియదు. మన చరిత్రాంశములు వీరి హస్తములలో విరూపము జెందినవి. కాలనిర్ణయముల మాట వేరె జెప్పనేల? కాని మనవారలు వాని యథార్థమును పరికించుటకై యణుమాత్రమైన ప్రయ

త్నించినపాపమున బోవలేదు. మనస్వాతంత్ర్యముతోడనే మన పరిశీలనాశక్తికూడ యంతరించినది. మనకు నంబి పెట్టినది ప్రసాదమైనది ఏ డంకన్ ద్వారయో, ఏ డిలఫాసిపండితుడో మనచరిత్రల వ్రాయవలసిన గతిబట్టినది. మన వేదాంతముఇతిహాస జ్యోతిష శాస్త్రగ్రంథముల మనము విస్మరించితిమి. ఏజర్మను ద్వారయో ఆంగ్లమున వ్రాసినగాని మనవేదములలో నేమి గలదో మనకు దెలియదు. కాళిదాసుని శకుంతలయందలి కవితాచమత్కృతి, పాత్రపోషణము, పదగుంభన, ఏ టెయిలరు ద్వారయో మనకు జూపవలసిన దుస్థితి సంభవించినది. ఈగ్రంథమున ఆంగ్లచరిత్రకారుల గ్రంథములందు గన్పించు చరిత్రాంశముల, కాలనిర్ణయముల సవరించి యథార్థముగ వ్రాయ బ్రయత్నించితిని ఇంకను సవరింపవలసిన విషయములెన్ని యేని యుండవచ్చును. తీవ్రచరిత్రపరిశోధనలవలనగాని ఇది సాధ్యము కానేరదు.

మన తెనుగుభాషయందు హిందూ, మహమ్మదీయ మహాయుగము లున్నవిగాని ఇతిహాసమున ప్రఖ్యాతినొందిన బౌద్ధమహాయుగచరిత్రము లేదు ఇదియొక లోపమేగదా! ఈ లోపము గొంతవరకు తీరునను ఊహతోకూడ నేనీగ్రంథ మును వ్రాయసాగితిని.

## గ్రంథనామము

ఈగ్రంథమునకు బౌద్ధమహాయుగమని పేరిడితిని. క్రీ.పూ.575 సంవత్సరము మొదలు క్రీ.శ.650 వరకును సుమారు వెయ్యేవత్సరముల భారతవర్షచారిత్రము నిందు చిత్రిం

చితిని. ఈకాలమునే బౌద్ధమహాయుగమని బిలచితిని. బౌద్ధ మతము క్రీ. పూ 575 సంవత్సర ప్రాంతమున నుద్భవమై క్రీ శ. 650 వరకును భారతవర్షమున ప్రచండముగ ప్రబలి రాజ్యాంగ శిల్పవాఙ్మయములకు ప్రత్యేకస్వరూపముల నొసగినది. బౌద్ధరాజ్యాంగ, బౌద్ధశిల్ప, బౌద్ధవాఙ్మయములు లోకమున ప్రఖ్యాతములైపోయినవి. ఈకాలమునాటి శిల్పసంపదకు చిత్రకళావైదగ్ధ్యమునకు, వాణిజ్యవైభవమునకు, ప్రజాసౌఖ్యమునకు, రాజ్యాంగసౌష్టవమునకు, విద్యాపాటవమునకు, జనుల విమలగుణవర్తనములకు కారణభూతమైనది. ప్రాచ్య పాశ్చాత్యఖండములలో భారతవర్షనామమును మారుమ్రోయించినది. బౌద్ధలోకమునకు ఆర్యావర్తమును పుణ్యక్షేత్రముగ జేసినది. అందువలననే యీకాలమును బౌద్ధమహాయుగ మంటిని. భారతవర్షచరిత్రకాలము నిట్లు విభాగించుటయే యుక్తమని నాయుద్దేశము. ఈకాలమున నప్పుడప్పుడు బౌద్ధ మత మహా తరంగములు వెనుకకు మరలినను 650 సంవత్సరము వరకును మాటుమణగి పోవలేదు. గుప్తసామ్రాజ్యకాలమున నైనను ఈమహామతము సంపూర్ణముగ రూపుమాసిపోవలేదు; వైదికమత జీమూతపటలిచే నాచ్ఛాదితమైనది. అయినను మబ్బులచాటుననుండి ఇది మతసాంఘిక రాజకీయ క్షేత్రముల కలవరపరచుచునే యున్నది. 650 సంవత్సరప్రాంతమునగాని యస్తమింపలేదు. కాన నీకాలమును బౌద్ధమహాయుగమని బిలుచుటలో నాకెట్టి యాక్షేపణము గన్పింపలేదు.

## కాలనిర్ణయములు

పాశ్చాత్య చరిత్రకారుల కాలనిర్ణయములు లోపభూయిష్టము లైనవగుటచే వానిని సవరింపవలసి వచ్చినది కాలమే చరిత్రకు ప్రాణము. ఏకాలమున నేమిజరిగినదో, ఏకాలమున నేరాజులు పరిపాలించిరో దెలియనియెడల చరిత్రయే లేదు. అశోకు డేకాలమునాటివాడో దెలియనియెడల అతనిగూర్చి గంపెడు చరిత్రాంశములు దెలిసియు ప్రయోజనము లేదు. హైందవ చరిత్రాంశముల కాలముల తమయిచ్చవచ్చినరీతిని నిర్ణయించి పాశ్చాత్య చరిత్రకారులు మన యితిహాసరంగమున గందరగోళము దెచ్చిపెట్టిరి. కొందరిరాజుల వెనుకబడవైచిరి. కొందరి మతకర్తల ముందునకు దోసిరి శంకరుని క్రీ. పూ. రెండవ శతాబ్దమునుండి క్రీ శ 7, 8 శతాబ్దములకు విసరిరి. కొంత అజ్ఞానము వలనను కొంత మన చరిత్రాంశములకు ప్రాచీనత నొసంగుట కిష్టము లేకను వీర లిట్లు మనచరిత్రకాలముల తారుమారు గావించిరి.

ఇంకొకయద్భుతము: మన సాంప్రదాయముల నెరుగకపోయినను, మనసారస్వముతో నించుకంతయు పరిచయము లేకపోయినను పాశ్చాత్యచరిత్రకారులు మనచరిత్రకాలముల నిర్ణయింపసాగించిరి సాహసము! సంస్కృతసారస్వతమున యుత్కృష్టపరిశోధనల గావించెనని పొగడ్తలగాంచిన విల్సను అనునాతడుశంకరునికాలము నిర్ణయించుచు, భోజప్రబంధమున శంకరకవినామము గాన్పించుటచే శంకరాచార్యుడు భోజునకు సమకాలీనుడనియు, నీతడు క్రీ. శ. 8,9 శతాబ్దములలో మనియుండవలెననియు నొక్కిపెట్టున నిర్ణయించినాడు. భోజ

ప్రబంధమున పేర్కొనబడిన శంకరకవి, అద్వైతమతస్థాపకుడగు శంకరాచార్యుడు గాదని ఇతడెరుంగడు. పాపము! శబ్దసాదృశ్యమునుబట్టి ఆతడే యాతడనుకొనినాడు. ఎట్టి మిడిమిడి జ్ఞానముతో వీరలు మనచరిత్రపరిశోధనలకు గడంగిరో చూడుడు

అజ్ఞానమువలననేగాక అసూయాప్రేరణమువలన పక్షపాతమువలనకూడ వీరలిట్టి విపరీతపు కాలనిర్ణయముల జేయసాగిరి. తమ బైబిలుగ్రంథమున నెచ్చటనో ఈప్రపంచము సృష్టింపబడి ఆరువేలసంవత్సరములే అయినదని జెప్పబడినదట! అందుచే వీరలీప్రపంచమున నేచరిత్రాంశమునకును ఇంతకంటె ప్రాచీనత నొసంగుట కిచ్చగింపరు. అన్నియు నిటీవలివే యని వాదింతురు. తమ బైబిలుసిద్ధాంతమున కెచ్చట భంగముగల్గునోయని మన చరిత్రకాలములగూడ సరిగ నిర్ణయింపరైరి అందుచే వీరికాలనిర్ణయములన్నియు అసూయాజనితములై కళంకితములైనవి.

ఇదిగాక ప్రపంచమున వేదాంతజ్ఞానము క్రైస్తుతోడనే యుద్భవమైనదని వీరితలంపు లోకమున రచింపబడిన వేదాంత, శాస్త్రగ్రంథములన్నియు క్రీస్తుశకారంభము తరువాతనే వ్రాయబడినవని, ఇంతయేల, లోకముననాగరకతయే క్రీస్తుశకముతోడ నారంభమైనదని అంతకుపూర్వము లోకమంతయు అజ్ఞానాంధకారమున మున్గియున్నదని వీరియభిప్రాయము. అందుచే వీరలు మనవేదశాస్త్రముల కాలములు ముందునకునెట్టి, అన్నియు క్రీస్తుశకము ఆరంభమైన తరువాతనే వ్రాయబడియుండవలెనను వెఱ్ఱిసిద్ధాంతముల వ్యాప్తిజేసిరి.

మన ఐతిహ్యమును మంటగలిపి మనవిద్వాంసుల యభిప్రా యముల తృణీకరించి తదనుగుణ్యముగనే మన గ్రంథముల కాలములకూడ నిర్ణయించిరి. మన భారతరామాయణములు భగవద్గీతలు మున్నగు ప్రాచీన గ్రంథములన్నియు నిటీవలివే యనిరి. మన గ్రంథము లన్నియు క్రీస్తుశకము తరువాతనే వ్రాయబడిన వట క్రీస్తుకు పూర్వము మన దేశమున నాగరికతయే లేదట. క్రైస్తవమతమే లోకమునకు నాగరికతాభిక్ష పెట్టినదట! హైందవ, ఐగుప్త, చీనాదేశ చరిత్రల నెరింగిన వారెవ్వరును ఇట్టి వితండవాదనల జేయ సాహసింపరు. ఈదేశముల నాగ రికతలు, అత్యంత ప్రాచీనము లైనవని చరిత్ర పరిశోధనలు ఘోషించుచున్నవి. ఇంగ్లాండువంటి దేశములన్నియు అజ్ఞాన తిమిరములచే నావరింపబడి యుండినకాలమున నీదేశములు మహోత్కృష్టదశ ననుభవించినవి ఈదేశచరిత్రల ప్రాచీనత వీరలు కాదనిన పోవునా? మన ఋగ్వేదము క్రీ. పూ॥ ఏడువేల సంవత్సరముల క్రిందట రచియింపబడినదని చరిత్ర పరిశోధనలు దెల్పుచున్నవి.

ఒక్కరిచే పెక్కు గ్రంథములు వ్రాయబడినప్పుడు అట్లు వ్రాయబడిన వనుటకు బ్రబలనిదర్శనములు గన్పించు చున్నను, కారణము లేకయె వివిధగ్రంథకర్తల సృష్టించుట, పాశ్చాత్య చరిత్రకారుల కాచారమైనది ఇట్లు వీరు ఇరువురు పతంజలుల నిరువురు బాదరాయణుల ముర్వురు వరరుచుల గనుగొనిరి. మహాభాష్యమును వ్రాసిన పతంజలియే యోగ సూత్రములకూడ వ్రాసెనని సంస్కృత భాషాప్రపంచములును జనశ్రుతియు ఘోషిల్లుచుండ వీరట్లు కాదందురు. యోగ

సూత్రముల వ్రాసినపతంజలి వేరనియు మహాభాష్యమును వ్రాసిన పతంజలి వేరనియు వాదింతురు. ఇట్టి విపరీతపుటూహాలతో వితండవాదనలతో వీరలు మనవాఙ్మయ ఇతిహాసరంగముల లేనిపోనిసందియములు గల్పించుచున్నారు ఎంతకాలమని యిది సహింపగలము.

పైవివరించిన కారణములవలన పాశ్చాత్య చరిత్రకారుల కాలనిర్ణయములు విశ్వసనీయములు గాకున్నవి అందుచే వానియాథార్థ్యమును పరిశీలించి సరియగు కాలనిర్ణయముల జేయవలసియున్నది ఇదిగాక ఇటీవలగన్పించిన ఖారవేల శాసనమునుబట్టి శిశునాగనృపుల రాజ్యకాలములు ఏబదేళ్ సంవత్సరములు వెనుకకుబోయినవి వీనిని సవరింపవలసియున్నది. ఈయమూల్యశాసనమునుబట్టి వీరికాలముల సవరించితిని. సవరించినకాలముల వేరొకచోట వివరించితిని గౌతమ మహావీర శంకరుల కాలములకూడ ఇందు సవరించితిని అందులకు ప్రమాణములజూపుచు ఈవిషయములగూర్చి యిచ్చట గొంత ప్రస్తావించెదను

## బుద్ధనిర్వాణకాలము

బ్రహ్మ, సింహళ ఆర్యావర్తములందలి బౌద్ధగ్రంథములన్నియు గౌతముడు క్రీ పూ 543 సంవత్సరమున దివికేగెనని నుడువుచున్నవి ఆసంవత్సరముననే బౌద్ధశకము ప్రారంభమైనది బౌద్ధప్రపంచమున నీశకము ఇప్పటికిని వాడుకలోనున్నది అనగ బుద్ధభగవానుడు నిర్వాణమునొంది యిప్పటికి 2468 సంవత్సరములైనది. క్రీ పూ 543 బుద్ధుని సరియగు

నిర్వాణకాలము. ఇది బౌద్ధగ్రంధకర్తలందరును నైకకంఠ్యమున నొప్పుకున్నది. జనశ్రుతి ఘోషించుచున్నది.

కాని బౌద్ధగ్రంధములందు గాన్పించు నిదర్శనముల నావల ద్రోసి, బౌద్ధగ్రంధకారుల వాదనల తృణీకరించి జనశ్రుతిని మంటగలిపి కన్నింగుహాము× బుద్ధభగవానునినిర్వాణ కాలము క్రీ. పూ 477 అని నిర్ణయించినాడు. మాక్సుముల్లరు, స్మిత్తుమున్నగు చరిత్రకారులందరుసుదీనినేస్వీకరించిరి. మన్నవారలును వ్యాసపరంపరగ దీని నంగీకరించిరి. మనమిప్పు డేగ్రంథమును జూచినను బుద్ధనిర్వాణకాలము 477 అనియే గాన్పించును. కాని యెక్కరును, మనసాంప్రదాయముల నెరుగని మనసారస్వతముతో నించుకంతయు పరిచయములేని కన్నింగుహాము వ్రాతలు యథార్థమగునా? అత్యంత ప్రాచీనమగు జనశ్రుతి, బౌద్ధగ్రంధములు అసంగతములేనాయని పరిశీలించిన పాపమున బోవలేదు. మనకు విప్పనజెప్పినదే వేదము గదా! పరిశోధింపగ కన్నింగుహాము గావించిన కాలనిర్ణయము యథార్థము గాదనియు, ఆకాలమున ఆర్యావర్తమున వ్యవహరింపబడుచుండిన కాలమానముల నాతడర్థము జేసికొనలేక, తప్పుగ గుణించుటవలన నీదుస్థితి సంభవించినదనియు బౌద్ధగ్రంధములందు పేర్కొనబడిన 543 సంవత్సరమే గౌతమముని యథార్థమగు నిర్వాణకాలమనియు దేలుచున్నది

కన్నింగుహాము, బౌద్ధగ్రంధములందు విస్పష్టముగ నుదహరింపబడిన 543 వ సంవత్సరము బుద్ధుని యథార్థమగు

---

× మనదేశమున గొన్ని చరిత్రపరిశోధనల గావించిన యొక ప్రఖ్యాతపాశ్చాత్య చరిత్రపరిశోధకుడు.

నిర్వాణకాలము గాదని నిర్ణయించి, గ్రంథకారుల సంప్రదాయ తప్పుత్రోవల బట్టించినది. గయాక్షేత్రమున గాన్పించిన అశోకానోక శాసనమునుబట్టి, సరిగ పరిశీలించినచో ఈశాసనము బౌద్ధగ్రంథకారుల కాలనిర్ణయము మిథ్యయని ఋజువు జేయుటకు బదులు కన్నింగుహాము వ్రాతలే నిరాధారము లైనవని రుజువుచేయుచున్నది. పాపము, కన్నింగుహాము హైందవ కాలమానముల నెరుగక, గయాశాసనమును సరిగ సమన్వయింపలేక పప్పులో నడుగువైచి మనయితిహాసరంగమున నింతటి సంక్షోభమును దెచ్చిపెట్టినాడు. మీదుమిక్కిలి మన చారిత్రమున నేదియో ఒకఘనకార్యమును సాధించితినని సంతసించినాడు.

ఈ గయాశాసనము బుద్ధుడు నిర్వాణము నొందిన పిదప లిఖియింపబడినది అందు "భగవతిపరినిర్వృత్తే సమవత్ 1819 కార్తికే పాడ్యబుధ" అనియున్నది. అనగ భగవంతుడు (బౌద్ధభగవానుడు) దివంగతుడైన సమవత్ 1819 సంవత్సర కార్తిక బహుళ ౧బుధవారము అనియర్థము. కన్నింగుహాము ఈశిలాశాసనము నీక్రిందివిధమున విమర్శించినాడు. "బ్రహ్మ సింహళదేశముల బౌద్ధగ్రంథములలో బుద్ధుడు క్రీ. పూ. 543 న దివిజేరెనని యున్నది. గాన యీశాసనము క్రీ శ. 1276 (1819-543) సంవత్సరమున లిఖియింపబడి యుండవలెను. కాని 1276 సంవత్సర కార్తిక బహుళపాడ్యమి బుధవారము సమవత్ 1819 సంవత్సర కార్తిక బహుళ పాడ్యమీ బుధ వారమునకు సరిపోలేదు. క్రీ శ. 1276 సంవత్సర కార్తిక బహుళ పాడ్యమి, బుధవారముగాదు. కాన ఇందేదియో

పొరబాటున్నది. వెనుకకు లెక్కించిచూడగ ఈశాసనమున నుదహరింపబడిన కార్తిక బహుళ పాడ్యమీ బుధవారము క్రీ. శ. 1342 సంవత్సరము సెప్టెంబరు 17 తేదీ బుధవారము నకు సరిపోయినది. అందుచే నీశాసనము క్రీ శ 1342 సంవత్సర ము సెప్టెంబరు 17 తేదీ బుధవారమునాడు వ్రాయబడి యుండవలెను దీనివలన బుద్ధనిర్వాణకాలము క్రీ పూ. 477 (1819—1342) సంవత్సరముగాని 543 గాదని విస్పష్టమగు చున్నది. కాన 477 సంవత్సరమె సరియగు బుద్ధనిర్వాణకాల మని యూహింపనగును ”

కన్నింగుహాము ఇచ్చట గావించిన పొరబాటు బౌద్ధ శకవర్షముల హూణశకవర్షములవలెనే లెక్కించినాడు. ఈ రెండింటికినిగల భేదమును పరికింపలేదు. హూణశక వత్సర ముల కెన్ని రోజులుండునో, బౌద్ధశకవత్సరమునకుగూడ నన్ని రోజులే యుండునని భావించినాడు యథార్థముగ నీరెంటి కిని జాల తారతమ్యమున్నది. అందుచే నీతనికి లెక్క సరి పోవలేదు ఎట్లు సరిపోవును? ఏదియో కాకులలెక్కవేసి యొక్క కలముగీటుతో బౌద్ధగ్రంథముల చిరకాలానుగత మైన జనశ్రుతిని అవిశ్వసనీయములని కొట్టిపారవైచినాడు. ఆకాలమున ఆర్యావర్తమున సౌరమాన,చాంద్రమాన, బార్హ స్పత్యమానము లనబడు మూడువిధములగు కాలమానములు వాడుకలో నుండెను ఈశాసనము వ్రాయబడినది బార్హస్పత్య మానముననుసరించియె ఇందుదహరింపబడిన వత్సరములు బార్హస్పత్యమాన వత్సరములె. ఈశాసనము వ్రాయబడిన కాలమున మగధరాజ్యమున వాడుకలోనున్నది బార్హస్పత్య

మానమె. శాసనకాలమే యననేల నేటికిని ఉత్తరహిందూస్థానమున వాడుకలోనున్న దీబార్హస్పత్యమానమె. శాసనమును సుపయోగింపబడిన వత్సరములు బార్హస్పత్యమాన వత్సరములై యుండ, కన్నింగుహాము వానిని సౌరమాన వత్సరములకుబలె లెక్కచూచినాడు. బార్హస్పత్యమానవత్సరములకును సౌరచాంద్రమానవత్సరములకును జాల తారతమ్యమున్నది. హైందవ జ్యోతిషగ్రంథముల ననుసరించి సౌరమానవత్సరమునకు 365 దినముల 15 గడియల 31 విగడియలు, చాంద్రమాన వత్సరమునకు 360 రోజులు. బార్హస్పత్యమాన వత్సరమునకు 361 దినముల 11 గడియలు* పాపము కన్నింగుహాము ఈ మానముల సంగతియే నెరుగడు! ఇట్టి మహావిషయమును నిర్ణయించునపుడు బౌద్ధగ్రంథకారు లేమానము నుపయోగించిరో, గయాశాసనము వ్రాయబడినకాలమున మగధలో నేమానము ప్రచారములో నుండెనో, ఇంచుక విచారించియుండవలసినది బార్హస్పత్యమానమునుబట్టి లెక్కచూచిన లెక్క సరిపోవును. 543 సరియగు బుద్ధనిర్వాణకాలమని నిర్ధారణ యగును.

బార్హస్పత్యమానము ననుసరించి లెక్కవైచి దీనియథార్థము నించుక పరిశీలించి చూతము.

543 బార్హస్పత్యమాన వత్సరములు 536¾ సౌరమాన వత్సరములకు సరియగును

---

* ఈ అంకెలు కీ॥ శే॥ శ్రీ స్వామి తల్లాప్రగడ సుబ్బారావు గారి 'ఇసాటరిక్ రైటింగ్సు' అను గ్రంథమునుండి గ్రహింపబడినవి.

అట్లే 1819 బార్హస్పత్యమాన సంవత్సరముల 1798 సౌరమానసంవత్సరము లగును.

క్రీస్తుశకము కలియుగాబ్దములు 3102 యేట (సౌరమానపు లెక్క ప్రకారము) ప్రారంభమగుటచే కలియుగాబ్దము 2565 సంవత్సరమున (3102-536½) ప్రవృత్తినొందినాడు. గయాశాసనము కలియుగాబ్దము 4362 సంవత్సరమున (2565-1298) వ్రాయబడియుండవలెను ఇప్పుడు మనము కలియుగాబ్దము 4362 సంవత్సర కార్తీక బహుళ పాడ్యమి, బుధవారమగునా కాదా అనుని పరిశీలింపవలసియున్నది బుధవారమే యగుచో బౌద్ధ గ్రంథములందు వివరింపబడిన కాలనిర్ణయము యథార్థమగును. లేనిచో అన్యథాయగును. సూర్యసిద్ధాంతము ననుసరించి కలియుగాదినుండి కలియుగాబ్దము 4362వ సంవత్సర ఆశ్వీజ శుద్ధ పౌర్ణమివరకును 1593072 (1608 అధికమాసములను 25523 క్షయతిథులను గలిపికొని) దినములు గలవు దీనిని 7 చే (వారమున కేడుదినములగుటచే) భాగింపగా 5 మిగులును. కలియుగము శుక్రవారముతో ప్రారంభమైనది గాన పైన వివరించినకాలము (కలియుగాబ్దము 4362 ఆశ్వీజ శుద్ధ పౌర్ణమి) మంగళవారముతో నంత్యమగును (శుక్రవారము నుండి అయిదవదినము మంగళవార మగును). కాన 4362 కార్తీక బహుళ పాడ్యమి బుధవారమే అయినది. గయాశాసనమున వివరింపబడిన వారమునకు సరిపోయినది అనగా శాసనము కలియుగాబ్దము 4362 సంవత్సర కార్తీక బహుళ బుధవారముననే (క్రీ. శ. 1261, బౌద్ధశకము 1819) వ్రాయబడి

నది. కాన బౌద్ధగ్రంథకారుల నిర్ణయమే యథార్థమైనది. 543 సంవత్సరమే సరియగు బుద్ధనిర్వాణ కాలమని తేలినది.

ఖారవేల శాసనముకూడ బుద్ధనిర్వాణకాలము 543 అనియే నిర్ధారణజేయుచున్నది. మహావీర గౌతములు శిశునాగ వంశజులగు బింబసార అజాతశత్రుల సమకాలీనులనియు, ఈ నృపాలురు పలుమారు ఈమహాపురుషుల సందర్శించి వారివలన ఉపదేశముల నందిరనియు జనశ్రుతి తెల్పుచున్నది. బౌద్ధ జైనగ్రంథము లుద్ఘోషించుచున్నవి. 477 బుద్ధుని నిర్వాణకాలమని విశ్వసించితిమేని బౌద్ధగ్రంథములు జనశ్రుతి మిథ్యలగును. ఖారవేలశాసనమునుబట్టి బింబిసారుడు క్రీ. పూ. 582 మొదల్కు 554 వరకును, అజాతశత్రుడు 554 మొదలు 527 వరకు మగధరాజ్యము నేలిరి. బుద్ధుడు 477 సంవత్సరమున మృతినొందినయెడల ఆతడు బింబిసారునికి సమకాలీనుడు కాజాలడు. ఆతడు అజాతశత్రుని కాలమున దివిజేరుటయు సంభవింపదు. 577 యథార్థమగుచో బింబసారుడు దివంగతుడగు నప్పటికి (554 నకు) గౌతముడు మూడేండ్ల పసిపాపడై యుండును. (కన్నింగుహాము మున్నగువారలు గౌతముని జననకాలము 557 అని నిర్ణయించిరి). అజాతశత్రుడు మృతినొందినపిమ్మట (527) ఏబది వత్సరముల వరకును గౌతముడు జీవించియుండును. కాన క్రీ. పూ 477 సంవత్సరము బుద్ధనిర్వాణకాలము గానేరదని ఖారవేల శాసనముకూడ నుడువుచున్నది.

### మహావీరుని నిర్వాణకాలము

మహావీరుని నిర్వాణకాలముగూడ పాశ్చాత్య చరిత్ర

కాఢులు సరిగ నిర్ణయింపలేదు ఇచ్చటగూడ జనశ్రుతియు గ్రంథప్రమాణములు నొకతీరుననుండ వీరలు వేరొకతీరున నిర్ణయించిరి. జైనగ్రంథములు మహావీరుడు క్రీ. పూ. 527 సంవత్సరమున నిర్వాణము నొందెనని దెల్పుచున్నవి మహావీరశకము ఈ యేటనే ప్రారంభమైనది. జైనప్రపంచమున జనశ్రుతిగూడ నిట్లేయున్నది. ఇది యిట్లుండ పాశ్చాత్య చరిత్రకారులు, కొందరు (జాకోబీమున్నగువారు) 477 సంవత్సరమునను కొందరు (స్మిత్తుమున్నగువారు) 460 సంవత్సరముననను ఇతని దివంగతుని జేసిరి ఇందేది మహావీరుని సరియగు నిర్వాణకాలమో పరిశీలింపవలసియున్నది.

ఇచ్చటకూడ ఖారవేలశాసనము పాశ్చాత్య చరిత్ర పరిశోధకుల కాలనిర్ణయములు యథార్థములుగావని ఋజువు చేయుచున్నది మహావీరుడు బింబిసార అజాతశత్రులకు సమకాలీనుడైనట్లు జైనగ్రంథములు నడువుచున్నవని వేరొక సందర్భమున జెప్పితిమి. వీరనునట్లు మహావీరుడు 477 సంవత్సరముననో, 460 సంవత్సరముననో దివంగతుడైయుండినయెడల ఈతడు బింబిసార అజాతశత్రులకు సమకాలికుడగుట తటస్థింపదు. జైనగ్రంథములు అనృతములగును విన్సెంటుస్మిత్తు జెప్పునట్లు ఈతడు 555 సంవత్సరమున జన్మించినయెడల బింబిసారుని యవసానకాలమునాటి కీతడు పండ్రెండునెలల పసిపాపడైయుండును బింబిసారునకు సమకాలికుడెట్లు కాగల్గును? జాకోబీ యూహించినట్లీతడు 477 సంవత్సరమున మృతినొందెననుకొన్నను బింబిసారునకు సమకాలీనుడు కాజాలడు. ఈతని నిర్ణయము ప్రకారము బింబిసారుడు గతించునప్పటికి మహావీరుడు

ఏడేండ్లబాలుడై యుండవలయును. ఆనృపునకు సమకాలీనుడై యుండజాలడుగదా: బింబిసారుడు మహావీరుని దర్శించి యాతనివలన నుపదేశములబొంది జైనమతమునుగూడ స్వీకరించెనని చరిత్రలుద్ఘోషించుచున్నవిగదా! అదెట్లుపొసగును? మహావీరుడు నలుబదియేండ్లు నిండినవెనుకగాని జైనమతప్రచారమునకు గడంగలేదు మహావీరుడు + ఏడేండ్లబాలుడై యుండినపుడు ఆర్యావర్తమున నింకను జైనమతమే యుద్భవమందియుండదుగదా! బింబిసారుడు తాను బ్రతికియుండగ జైనమతము నెట్లుస్వీకరింపగల్గును నిక్కువముగ బింబిసారుడు గతింపకమున్నె మహావీరుడు 40 ఏండ్లు నిండినవాడై యుండవలెను. దీనివలన 460, 477 సంవత్సరములలో నేదియు మహావీరుని నిర్వాణకాలమై యుండనేరదని విస్పష్టమగుచున్నది. ఇంక 527 మిగిలినది. దీనినిగూడ నిట్లేపరిశీలించిచూతము. దీనిననుసరించి బింబిసారుడు మృతినొందునప్పటికి మహావీరుడు నలుబదిమూడేండ్ల* ప్రాయమువాడై యుండును. కాన నాతనికి సమకాలీనుడేగదా! బింబిసారుడు బ్రతికియుండగ జైనమతము గూడ స్థాపింపబడినట్లు దీనివలన విదితమగుచున్నది. బింబిసారుడు జైనమతమును స్వీకరించెనను నుడులకుగూడ వైరుధ్యము గన్పింపదు 527 సంవత్సరమే మహావీరుని నిర్వాణకాలమని జెప్పుటకింకను నిదర్శనము లేమికావలయు?

---

+ మహావీరుడు 70 సంవత్సరములు జీవించెనని వ్రాయబడియుండుట జాకోబీ లెక్కప్రకారము 547 (477 + 70) యాతని జన్మకాలమై యుండవలెను

* 597 (527 + 70) యాతని జన్మకాలమగును.

## శంకరుని కాలము.

ఇంక శంకరు డే కాలమునాటి వాడు అను విషయము నిర్ణయింపవలసి యున్నది. బార్తు, వెబరు, మోనియర్ విలియమ్స్, బుకానన్, కోల్బ్రూకు, వీల్సను మున్నగు చరిత్రపరిశోధకు లందరును ఈతడు క్రీ శ. 7,8 శతాబ్దములనాటి వాడనియు బౌద్ధ రణమునడిపి వారిని పలుహింసల బెట్టి, బౌద్ధమత విధ్వంసమును గావించెననియు వ్రాయుదురు పాశ్చాత్య చరిత్రకారుల కాలనిర్ణయము యదార్థముగాదనియు, ఈతడు బౌద్ధులపై దాడిసల్పినమాట యసత్యమనియు, ఈత డట్టి పాపకర్మ మేమియు నెరుంగడనియు, ఈతడు యోగసూత్ర మహాభాష్యముల వ్రాసిన పతంజలి శిష్యుడనియు క్రీ. పూ. రెండవశతాబ్ద ప్రాంతమున పుష్యమిత్రునికి పూర్వమో, తరువాతనో వరలినవాడనియు వేరొకసందర్భమున నుడివితిమి. అందులకు చరిత్ర ప్రమాణముల నిచ్చుటజూపెదము మొదట శంకరుడు పతంజలి శిష్యుడనిజూపి, పిమ్మట పతంజలి క్రీ. పూ. రెండవ శతాబ్దమునాటి వాడనుటకు నిదర్శనముల జూపెదము

### శంకరుడు పతంజలి శిష్యుడనుటకు చరిత్రాధారములు.

శంకరుని గురువు గోవింద యోగియని జనశ్రుతి ఇది నిర్వివాదాంశము. దీనిని కాదనువారు లేరు కాని యీ గోవిందయోగియే మహాభాష్యమును వ్రాసిన పతంజలియని పెక్కండెరుంగరు. గోవిందయోగి, పతంజలి ఆశ్రమస్వీకారము జేసినపిదప దాల్చిననామము. పూర్వాశ్రమమున పతం

జలియె సన్న్యాసియైనపిదప గోవిందయోగియయ్యెను. ఇదియే యిందలిరహస్యము. దీనికి ప్రమాణము విద్యారణ్యుని శంకర విజయము. ఈగ్రంథమునందలి ఐదవ అధ్యాయములోని 94, 95, 96, 97 శ్లోకములు గోవిందయోగియు పతంజలియు నొక్కరేయని వివరించుచున్నవి. శంకరుని జీవితమునుగూర్చి వ్రాయబడిన గ్రంథములలోనికెల్ల విద్యారణ్యుని శంకరవిజ యమ్ము విశ్వాసపాత్రమైనదని చరిత్రకారు లందరు నొప్పుకొం దురు. విద్యారణ్యుడు శృంగేరీమఠమున కధిపతియైయుండిన కాలమున శంకరుని ప్రాచీనజీవిత చరిత్రలనన్నిటిని పరిశో ధించి (ఇప్పుడన్నియు విస్మృతములైపోయినవి) తనశంకర విజయమును వ్రాసెను. ఇది విద్యారణ్యుడు కల్పించిన విష యమై యుండనోపునని కొందరు వాదింపవచ్చును. కానిఅట్లు కల్పించుట కాతనికేదియో యొకయుద్దేశ ముండవలయును గదా? శంకరుని యశస్వంతుని జేయుటకై యిట్లుకల్పించి యుండవలెను ఇట్టిభావముతో విద్యారణ్యుడు శంకరుని పతం జలి శిష్యుని జేసియుండునని యూహించుట హాస్యాస్పదము. పతంజలికంటె శంకరుడే భారతవర్షచారిత్రమున వేయిమడుం గుల ప్రాముఖ్యత బడసినవాడు పతంజలి నెరుగనిహిందు వులుగలరు గాని శంకరునెరుగని హైందవుడుండడు ఇప్పటి కిని యాతని నాపార్వతీవల్లభుని అపరావతారముగ భావిం తురు. విద్యారణ్యుని కట్టి యుద్దేశమే యుండినయెడల శంక రుని పతంజలి శిష్యునిజేయనేల? ఆవ్యాసునికే శిష్యునిచేసి యుండును. మఱియు పతంజలియభిప్రాయములకును శంకరుని యభిప్రాయములకును పరస్పరవైరుధ్య మున్నది. పతంజలి

హఠయోగమును గోరంతలు కొండంతలుగ జేసి పొగిడినాడు. శంకరుడు హఠయోగచర్యల కంతగ ప్రాముఖ్యత నొసంగక నిరసించినాడు. అందుచే విద్యారణ్యుడు శంకరునిపతంజలి శిష్యునిగ జేసి యుండునను వాదము నిలువనేరదు.

ఇదిగాక, శంకర విజయధ్వజయముగూడ పతంజలియె శంకరుని గురువని యుద్ఘోషించుచున్నది. ఈగ్రంథమున శంకరుడు తనగురువగు పతంజలి నీవిధముగ ధ్యానించినట్లు జెప్పబడినది * అట్టి పతంజలివైన నీకు నమస్కరించుచున్నాను. ఎవ్వడు తానె ఈభూబిలమును బ్రవేశించి, ఆ యనంతుని ముఖముననే యోగమును గ్రహించి, యోగసూత్ర గ్రంథమును రచించి లోకోపకారము గావించెనో ఆయోగాచార్యుడవును నీవె గాన యో పతంజలిమహర్షీ! నీకు పరమభక్తియుక్తుడనై ప్రణమిల్లుచున్నాను.

పైయాధారములవలనను పతంజలి శంకరుని శిష్యుడని నిర్ధారణయగుచున్నది ఇంక పతంజలి యేకాలమునాటివాడో పరిశీలింతము. ఈవిషయమునుగూర్చి పలువురు పలువిధముల తలంచుచున్నారు. మేమీతడు క్రీ. పూ రెండవశతాబ్దము నాటివాడని క్రీ పూ 178 సంవత్సరప్రాంతమున మనినవాడని సుంగమతస్థాపకుడగు పుష్యమిత్రునికి సమకాలీనుడని యూహించుచున్నాము. ప్రఖ్యాతగీర్వాణ భాషావిశారదుడగు భాండార్కరుగూడ యిట్లే యభిప్రాయపడుచున్నాడు ఇట్లూహించుటకు ప్రబలనిదర్శనములున్నవి. పతంజలి తనమహాభా

---

* శంకర విజయధ్వజము, గోవిందపర్వము.

ష్యమున పుష్యమిత్రునికాలమున జరిగిన కొన్ని చరిత్రాంశ ముల వర్ణించినాడు. కాన నితడాకాలమున తప్పక మని యుండవలెనని దోచుచున్నది. ఇదియునుగాక,

(1) మహాభాష్యమున మౌర్యవంశమును గూర్చియు తద్వంశస్థాపకుడగు చంద్రగుప్త చక్రవర్తినిగూర్చియు ఉల్లేఖ నలుగలవు కాన ఇతడు మౌర్యవంశస్థాపనకు పూర్వము వాడై యుండజాలడు.

(2) ఈగ్రంథముననే యవనులు అయోధ్యమాధ్యమిక దేశములపై గావించిన దండయాత్ర పేర్కొనబడినది. ఇది మిళిందుడు క్రీ. పూ. 140 సంవత్సరప్రాంతమున ఆర్యావర్తముపై సల్పినదాడి కాన మహాభాష్యము క్రీ. పూ 140 ప్రాంత మున వ్రాయబడియుండవలెను పతంజలియు ఈకాలము ననే మనియుండవలయును పతంజలి పేర్కొనినది సగరుని తండ్రికాలమున యవను లయోధపై కావించిన దండయాత్ర యేలగాకూడదని కొందరు వితర్కింతురు ఈవాదన మాకంత సమంజసముగ గన్పింపలేదు పతంజలి సగరునికాలమునాటి వాడుగాడని యందరును అంగీకరింతురు కానియెడల ఈతడు సగరునికాలమునాటిదండయాత్ర నేలవర్ణింపవలెనో మా కర్థ మగుటలేదు. క్రొత్త యొకవింత. తమకాలమున జరిగిన యుత్కృష్టవిషయముల తమగ్రంథమున వర్ణింపనభిలషింతురుగాని యెప్పుడో తాతలనాడు జరిగి వాని అపురూపమంతయు మాసిపోయిన ప్రాతవిషయముల వర్ణింప నేరును. అభిలషిం పరు ఇదియొక్కటియే పతంజలికాలమును నిర్ణయింపజాలక పోయినను తక్కినవనిదర్శనముల కిది బలమొసగుచున్నది. తక్కిన

ప్రిమాణములబట్టి ఈతడీకాలమున జీవించియుండినట్లు గన్పించుచుండుటచేతను ఈకాలమున జరిగిన దండయాత్రి ఇదియొక్కటియేయగుటచేతను, పతంజలి దీనినిగూర్చియే ప్రిశంసించియుండవలెనని యూహింపవలసి వచ్చుచున్నది

(3) పుష్యమిత్రుని రాజప్రిసాదమును గూర్చియు ఆతనిచేగావింపబడిన అశ్వమేధయాగమునుగూర్చియు మహాభాష్యమున వర్ణనలు గలవు. పతంజలి పుష్యమిత్రుని సమ్కాలికుడని జెప్పుటకింతకంటె ప్రిమాణమేమికావలయును? పతంజలిపేర్కొనిన పుష్యమిత్రుడు, సుంగవంశస్థాపకుడగు పుష్యమిత్రుడయి యుండడనియు నితడెవ్వరో మరియొక పుష్యమిత్రుడనియు కొందరు తమవాదమును సమర్థించుకొనజూచిరి. ఇట్టివాదన లంతగ పరిగణింపదగినవి గావు. ఈతడు మఱియొకడేల కాకూడదను వితండవాదనల కర్థములేదు. ఇట్టి ప్రిబలనిదర్శనము లున్నను "ఈతడాతడుగాడు మఱియొకడు" అనివాదించుట మనవారలు పాశ్చాత్యులకడ నేర్చుకొనిన విద్య. అట్లు సంశయించుట కిచ్చట తావులేదు. ఇన్నియు నొక్కచోట సమకూడుట సంభవింపదు పుష్యమిత్రి నామధారుడగు రాజింకొకడుండిన నుండవచ్చును. కాని ఆతడుగూడ అశ్వమేధయాగమును సల్పియుండవచ్చుననుకొనుట యెట్లు?

(4) అభిమన్యుడు కాశ్మీరము నేలినకాలమున చంద్రాచార్యుడను వైయాకరణి మహాభాష్యమును కాశ్మీరమున వ్యాప్తిజేసెనని రాజతరంగిణి* నుడువుచున్నది. అభిమన్యుడు

* కల్హణపండితునిచే క్రీ శ. 12 వ శతాబ్దప్రాంతమున వ్రాయబడిన కాస్మీరదేశ చరిత్ర.

క్రీ. శ. 40 సంవత్సర ప్రాంతమున కాశ్మీరమునేలెను. దీనివలన పతంజలి సరిగ నేకాలమున జీవించెనో జెప్పజాలక పోయినను ఈతడు క్రీ. శ. 40 సంవత్సరమునకు పూర్వము వాడుగాని తరువాతివాడుకాడని జెప్పుటకు వీలగుచున్నది

(5) పతంజలి యోగసూత్రగ్రంథమున, నిర్వాణము మున్నగు బౌద్ధపారిభాషిక పదములెన్నియో గాన్పించును. గాన పతంజలి బౌద్ధమతకాలమున జీవించియుండవలెను.

ఈనిదర్శనమువలన పతంజలి క్రీ. పూ. రెండశతాబ్దము నాటివాడని విస్పష్టమగుచున్నది. శంకరుడు పతంజలి శిష్యుడు గాన ఆతడును ఈకాలముననే మనియుండవలెనుగద. శంకరుడు క్రీ పూ రెండవశతాబ్దమున వరలినవాడని దెల్పుట కెంకను ప్రమాణములున్నవి. శృంగేరి, కూడలి, కుంభకోణ మఠములందలి కాగితములు శంకరుడు ఇప్పటికి రెండువేల సంవత్సరములకంటె పూర్వమువాడని నుడువుచున్నవి అనగ క్రీ పూ రెండవశతాబ్ద ప్రాంతమువాడని యర్థమేకదా! కుంభకోణమున శంకరునికాలమునుండి నేటివరకును అరువదియారుగురు మఠాధిపతులు చనిరని మఠమునగల ప్రమాణములు జూపుచున్నవి వీరి జీవితకాలములుగూడ అందు వివరింపబడినవి వీని నన్నిటిని లెక్కించిచూచిన శంకరుడు రెండువేల సంవత్సరముల క్రిందటవాడనియే తేలుచున్నది. శృంగేరి, కూడలి మఠములందలి నిదర్శనములుకూడ ఇట్లే యున్నవి శృంగేరిలో తన్మఠాధిపతుల సమాధులున్నవి. వీనిపై వారలు దివంగతులైన కాలములు లిఖింపబడినవి వీని లెక్కజూచినచో పైకాలనిర్ణయమునకు సరిపోవుచున్నది.

శృంగేరి, కూడలి, కుంభకోణములందు గాన్పించు గురుపరంపర కాలములు ప్రబలములగు నిదర్శనములు. వీని నెవ్వరును అవి శ్వసనీయము లనజాలరు.

ఈనిదర్శనములబట్టి నిస్సంశయముగ శంకరుడు క్రీ శ. రెండవశతాబ్దమున నెప్పుడో జీవించియుండవలెనని విస్పష్ట మగుచున్నది.

ఇంతకంటె విపులముగ నిచ్చట నీవిషయములగూర్చి చర్చించుటకు తావులేదు. ఎవ్వరేని కాదనువారున్నచో మా కాలనిర్ణయములే యథార్థములని నిర్ధారణచేయగల నిదర్శన ముల నింకెన్నియేని జూపగలము. స్థలము సంకుచితమగుటచే నిచ్చటనన్నియు వివరింపజాలము.

ఇవిగాక యింకను సవరింపవలసిన యంశము లనేకము లున్నవి. ఇటీవల దొరకిన ఖారవేలశాసనమునుబట్టి మనచరి త్రకాలముల గొన్నిటి సవరించుటకు వీలయినది ఇట్లేప్రమా ణములు దొరకినక్రొలదియు యథార్థము బయటపడుచుండును. మీరే మాకింకదిక్కని పాశ్చాత్య చరిత్రకారులపై నాధార పడియుండక, తీవ్రచరిత్ర పరిశోధనలకు గడంగినగాని మన వాఙ్మయ ఇతిహాస రంగములకు దాపరించిన ఈదుస్స్థితి తొలగి పోజాలదు ఆంధ్రయువకు లీ విషయమును గమనిం తురు గాక.

ఈ గ్రంథవిషయమున నాకెన్నియో సలహాల నొసగి, కాల నిర్ణయములలో నాకమితముగ తోడ్పడి సోదరవాత్సల్య మున నాపరోక్షమున అచ్చుచిత్తుల నోపికతో దిద్ది ఈగ్రంథ

రచనయందు నాకెంతయో సాయమొనర్చిన నామిత్రులు దిగవల్లి వేంకటశివరావుగారికి నేనెంతయు కృతజ్ఞుడను.

కాలనిర్ణయముల జేయుటలో కీ శే. స్వామి కన్నాపగడ సుబ్బరావుగారి ఇసాటరిక్ రైటింగ్సు నాకమితముగ తోడ్పడినవి. వారికినేను కృతజ్ఞతాబద్ధుడను.

అప్పుడప్పుడు నాగ్రంథమును జూచిపోవుచు నాకపరిమితమగు ప్రోత్సాహమును గల్గించుచువచ్చిన ఆంధ్రభాషాభిమానులును, సరస్వతీపత్రికాసంపాదకులును జయంతిపుర సంస్థానాధీశులునగు శ్రీవాసిరెడ్డి దుర్గాసదాశివేశ్వర ప్రసాదరావు బహద్దరు జమీందారుగారికి నాకృతజ్ఞతాభివందనములు.

వారి సహజ మధురస్వభావముతో నీగ్రంథమును విజ్ఞానచంద్రికా గ్రంథమండలిలో నొకకుసుమముగ గైకొని ఆదరణలేక పేటికాంతర్గర్భమున నెచ్చటనో మణగి జీర్ణమై పోవకుండ గాపాడి దీని నాంధ్రలోకమునకు సమర్పింపగల యదృష్టమును నాకు కలుగజేసినందులకు, తన్మండలి సంపాదకులును అత్యంత ఉదారస్వభావులును, ఫ్రెంచిస్వాతంత్ర్య విజయ అమెరికా సంయుక్తరాష్ట్ర ప్రఖ్యాత గ్రంధకారులును, ఆంధ్రభాషాభిమానులును స్వాతంత్ర్యయోధులును త్యాగధనులు నగు శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు పంతులుగారికి కృతజ్ఞతాపూర్వక వందనములు

భ్రమప్రమాదములవలన కలిగినదోషము లెన్నియేని ఇందుండవచ్చును ప్రాజ్ఞులువాని నెల్ల మన్నింతురుగాక.

చెన్నపురి,
క్రోధనసంవత్సర పుష్యమి. } వేలూరి సత్యనారాయణ

# నాకీ గ్రంథరచనయందు తోడ్పడిన గ్రంథములు.

| | |
|---|---|
| బౌద్ధభారతము (బుడిస్టుఇండియా) | రైసుడేవిడ్సు |
| జాతకకథలు | కోవెల్ యీడెస్ |
| బౌద్ధమత సంగ్రహము | హార్డి |
| ఫాహియాన్ యాత్రలు | లెగ్గి |
| ,, ,, | జైల్సు |
| ప్రాచీనభారతవర్షచారిత్రము | రమేశచంద్రుడు |
| బుద్ధచరిత్రము | అశ్వఘోషుడు |
| ,, | తిరుపతి వేంకటేశ్వరకవులు |
| లలితవిస్తర | |
| భారతవర్షమందలి ఆర్యపరిపాలన | హావెలు |
| ప్రాచీన భారతవర్షచారిత్రము | విన్సెంటుస్మిత్తు |
| మనుధర్మశాస్త్రము | |
| కౌటిల్యుని అర్థశాస్త్రము | |
| ప్రాచీన విద్యాపీఠములు | శ్రీకాళ్లకూరి నారాయణరావుకవులు |
| ప్రాచీనభారతవర్షమునందలి విద్యావిధానములు | మజుందారు |
| భారత శిల్పచారిత్రము | ఫెర్గూసన్ |
| హ్యూయెన్త్సాంగు యాత్రలు | బీలు |
| ఇసొటెరిక్ రైటింగ్సు | కీ శే స్వామి తల్లాప్రగడ సుబ్బారావుగారు |
| హిందూమహాయుగము | కీ. శే. కో. లక్ష్మణరావుగారు |
| పతంజలికాలము | పండిత భాష్యకాచార్యులు గారు |
| మెగస్తనీసు | మాక్రిండిలు |
| ప్రాచీన హైందవ నౌకాజీవనము | ముఖర్జీ |

మహావంశము

ఆంధ్రుల చరిత్ర — శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు

ప్రాచీన హైందవశస్త్రసాధనములు — జి. ఎన్. ముఖోపాధ్యాయ.

ఖారవేల శాసనమును బట్టి సవరించిన కాలములు.

| | | |
|---|---|---|
| శిశునాగ వంశస్థాపనము | క్రీ. పూ. | 642 |
| బింబసార నృపాలుడు | ,, | 582 —.551 |
| అజాతశత్రుడు (కుణికుడు) | ,, | 554 — 527 |
| దర్శకుడు | ,, | 527 —503 |
| ఉదయనుడు | ,, | 504 |
| మహాపద్మనందుడు | ,, | 413 |
| చంద్రగుప్తుడు | ,, | 322 |

---



హరిణవన సమీపమున నిర్మింపబడిన

బౌద్ధస్తూపము.

వారణాసికి అయిదుమైళ్ళ దూరముననున్న సార్నాతువద్దనున్నది.

# బౌద్ధమహాయుగము.

## (క్రీ పూ. 575__క్రీ. శ. 650)

## I

### బౌద్ధమహాయుగము - బుద్ధుడు.

"సీ. చాణక్య నీతి తోరణముగా జంద్రగుప్తాది
మౌర్యులు దేశమరయునాడు
పరహింసపలని దేవత్వమేని త్యజించు
ఘను డశోకుడు ప్రజల మనుపునాడు
జాతికవిత్వ విద్యాతత్త్వ వర్ధనుం డిల
హర్షవర్ధనుం డేలునాడు
"సాతవాహనాది" సత్క్షాత్రవంశప్రభుల్
నియతి దేశంబు పాలించునాడు

గీ॥ కృషియు నానాపరిశ్రమల్ వృద్ధి
జెంది నావికావర్తకము మహోన్నతి
వహించి భవ్యభవానుభవమున
భరతభూమి నాగరికతకు ప్రధమగణ్యము గాదె॥"

(బ లక్ష్మీకాంతరావు)

### బౌద్ధమహాయుగ వైభవము.

క్రీ పూ 575 వ సంవత్సర ప్రాంతమున భారతవర్షమున అహింసాప్రధానమై సర్వభూతదయామృతబోధకమైన మహా మతమొకటి బయలుదేరినది. ఇదియే జగద్విఖ్యాతమగు బౌద్ధ మతము. ఇది క్రీ. పూ 575 సంవత్సరప్రాంతమున గౌతమ

బుద్ధుడను నొకప్రసిద్ధ రాచతపస్విచే స్థాపింపబడినది. బుద్ధునిచే స్థాపింపబడినదగుటచే దీనికి బౌద్ధమతమని పేరుగల్గినది. ఈ మహామతము క్రీ పూ 575 వ సంవత్సరమున నుద్భవిల్లి క్రీ శ ఏడవశతాబ్దము వరకును భారతవర్షమున ప్రబలి వైదికమతప్రాభవమును మరుగుపరచి ప్రాచ్య ప్రపంచమునంతను కదలించి యీపృథ్వీతలమునందంతటను ప్రేమవాహినుల ప్రవహింపజేసినది. అశేషజనసంఖ్యాకులచే నాదరింపబడి భూమండలమున నొక నూత్నయుగమును ప్రారంభింపజేసినది ఆకాలమునాటి మానవకోటి శీలవర్తనములలో నపూర్వపరివర్తనమును గల్పించినది ఈ మహామతమిట్లు వేయివత్సరములు భారతఖండమున నిరాఘాటముగ ప్రబలి ఆ కాలమున ఆర్యావర్తము నేలిన పృథ్వీపతుల యభిమానమతమై భారతవర్షము నకఖండవైభవమునుగూర్చి ప్రాచ్యలోకమం దెల్లెడల భారతవర్షనామమును మారు మ్రోయించుటచేతనే భారతవర్ష యితిహాసక్షేత్రమున నీకాలము బౌద్ధయుగమని పేరువడసినది. ఈ యుగమున చిత్రకళలు, పరిశ్రమలు, సారస్వతము, రాజ్యాంగసంస్థలు అపారముగ వృద్ధినొందినవి. ప్రజలు అఖండసౌఖ్యమున దేలి యాడిరి. ప్రాణిహింసలమాని శాంతశీలురై ధర్మమార్గాను వర్తులై మనిరి. జైనఅద్వైత మతస్థాపకులు, మహాప్రవక్తలు, మహావీరశంకరులు ఈయుగముననే యుద్భవిల్లిరి. అందువలననే యీయుగము భారతవర్షచారిత్రమున స్వర్ణయుగ మనిపించుకొన్నది. ఈకాలమునాటి పరిశ్రమాభివృద్ధులు చిత్రకళాసంపద, శిల్పరచనావైదగ్ధ్యము, వాఙ్మయశోభ, పరిపాలనాసౌష్ఠవము ముందు వాని యథాస్థానమున విపులముగ వర్ణించెదము.

# బుద్ధుడు

ఇట్టి శిల్పకళా సాహిత్య నాగరికతావిభవములకు కారణభూతమగు నీ మహామతమును స్థాపించిన యుత్కృష్టపురుషుడు గౌతముడని నుడివియుంటిమి. ఈతని చరిత్రమిచ్చట సంగ్రహముగ వివరించి యటుపిమ్మట తక్కిన చరిత్రభాగమునకు బోయెదము.

## బుద్ధుని జీవితము*

సీ॥ సరిగంచు నేజేమించు ◆ చల్వవల్వలుదాల్చు
లలితుండు కావిశాటు ◆ లు ధరించె
వెండిపాత్రికలందు ◆ బరమాన్నము భుజించు
రారాజు మాధు ◆ కరంబుగుడిచె
దూదిపాన్పులమీద ◆ దూగుటుయ్యెలనూగు
భోగితృణాంకు ◆ రంబులశయించె
బొలుపారు క్రొత్తపూ ◆ బొదరిండ్లవిహరించు
భాగ్యశాలి యరణ్య ◆ పటలిదిరిగె
గీ॥ నెండకన్నును వానకన్నెలు ◆ గకతుల
రత్నసౌధంబుల ◆ జరించు రాచగున్న
శీతవాతాతపంబుల వాత ◆ బడుచు
ఒడుగుజడదారిరాయని ◆ పగిదిదిరిగె.

(బుద్ధచరిత్ర తి వెం...కవులు)

---

* బుద్ధుని యొక యవతారపురుషునిజేసి, యాతనికి దైవత్వమాపాదించి యాతని చారిత్రమున పెక్కుగాధలల్లిరి. ఇట్టిగాధ లనేకము పాహియాను వర్ణించినాడు. అవియంతగ విశ్వాసనీయములుగావు. ఈతని చరిత్రకాధారగ్రంధము అశ్వఘోషునిచే రచియింపబడిన బుద్ధచరిత్రము.

భారతవర్షచారిత్రమున క్రీ పూ 623 సంవత్సరము మిగుల నుత్కృష్టమైనది. ప్రేమరసపూరితమగు బౌద్ధమతమును లోకమున బ్రతిష్ఠించిన మహాపురుషుడు గౌతమబుద్ధు డీ వత్సరముననే ఆర్యావర్తమున నవతరించెను

క్రీ పూ. ఆరవశతాబ్దప్రాంతమున మగధరాజ్యమునకు వాయవ్యభాగమున గంగాతరంగిణి కుపనదియగు రోహిణీ నదీకూలమున శాక్యులను నొకక్షత్రియజాతి నివసించుచుండెడిది. బుద్ధు డీశాక్యవంశముననే బుట్టెను దీనికి గౌతమసంతతి యనికూడ పేరుగలదు. అందుచేతనే యాతనికి శాక్యసింహుడనియు, శాక్యుడనియు, గౌతముడనియు నామాంతరములుగల్గినవి బుద్ధుడు శాక్యరాజ్యమును పాలించిన శుద్ధోదనమహీపాలుని తనయుడు శాక్యరాజ్యమీకాలమున పరలిన నొకనాయకసత్తాకరాజ్యము. ఈతడు క్రీ పూ 623 సంవత్సరమున శాక్యవంశజుల రాజధానియగు కపిలవస్తునగరమున జన్మించెను ఈతనితల్లియగు మాయాదేవి ప్రసవించిన ఏడవనాటనే ఆనందపారవశ్యమున మృతినొందుటచే యీపసిపాపని పెంచుభారము శుద్ధోదననృపాలుని ద్వితీయ భార్యయగు గౌతమిపైబడెను మాయాదేవి పూర్ణగర్భవతియై ప్రసవించుటకు పుట్టినింటికి బోవుచుండగా నామెకు మార్గమధ్యమున లంబినియను పూలదోటయందు ప్రసవవేదన యారంభమై మగశిశువుగల్గెను ఈపవిత్రక్షేత్రమున గురుతుగ అశోకుడొక సుందరమగు శిలాస్తంభమును నిర్మించి దానిపై శాసనము వ్రాయించెను ఈ స్తంభము నేటికిని యిచ్చోట నున్నది.

పసితనమున బుద్ధునకు "సర్వార్థసిద్ధుడు" అని నామకరణముజేసిరి. చిన్ననాటనే బాలసిద్ధార్థునియందు వైరాగ్యలక్షణములు బొడగట్టినవి. ఈతని పాదమందలి సహస్రార చక్రరేఖలుమున్నగు సాముద్రికలక్షణముల బరికించి అసితముని "యీతడు తప్పక సన్యాసియై లోకరక్షకుడగు" ననిజెప్పెను. అత్యంత బాల్యమునుండియు సిద్ధార్థుడు ప్రాపంచిక సుఖముల యందు విరక్తుడై రాజ్యభోగముల నొల్లక క్షత్రియోచితములగు రణవిద్యల నిరసించుచు ఏదియో మనమున జింతించు కొనువాడు. అతనివదనసీమ నెప్పుడును విషాదచ్ఛాయ లావరించి యుండెడివి.

ఈబాలుని విరక్తిమార్గమునుజూచి శుద్ధోదనుడు దిగులుపడి, ఈతనికి సంసారసుఖములందు వెగటుగల్గకుండ మరపించుటకై వినోదముల గల్పించుచు తగుప్రయత్నములు చేయసాగెను. వికలాంగులు, రోగార్తులు అతనికంటబడకుండ కట్టడిజేసెను. అతని కానందముగూర్చుటకై మనోహరములగు విలాసమందిరముల కేళీవనముల నిర్మించెను. పరిణయమొనర్చిన సంసారసుఖములబడగి, వైరాగ్యవృత్తిని మరచి యుండునేమోయని యూహించి లావణ్యవతియగు నొక రాకొమరితను పెండ్లిజేసెను. ఈమెపేరు యశోధర. సర్వాంగసుందరి. సుగుణరాశి. కాని యిట్టితుచ్ఛ విషయభోగములు సిద్ధార్థుని వైరాగ్యతృష్ణను జల్లార్పలేకపోయెను.

ఒకనాడు సిద్ధార్థుడు పురవైభవమును జూచువేడుకలో కపిలవస్తునగరవీధులలో సంచరించుచుండగ నొకచోట

ప్రాణాపకృష్టుఁడై బాధనొందుచున్న రోగార్తుఁడును వేరొక తావున జరాభరమున క్రుంగి కృశించి వివర్ణుఁడై ఉండీలుబద్దవలె వంగి ముడుతలువారిన బడుగుదేహముతో ముగ్గుబుట్టవలె నెరసిన శిరోజములతో యడుగుదీసి యడుగువైవలేక అంగలార్చుచున్న యొకముదుసలియు, మఱికొంతదూరమేగినవెనుక శోకపరితప్తులై కన్నీరుగార్చుచున్న బంధుమిత్రులచే పరివేష్టింపబడి, పాడెపై స్మశానవాటికకు గొనిపోబడు మృతదేహమును వానికంటబడెను ఈహృదయవిదారక దృశ్యముల గాంచి బాలసిద్ధార్థునిగుండెలు ఝల్లుమనెను అట్టివిషాదముల నాతఁడు మున్నెన్నఁడును జూచియెఱుఁగఁడు మానవజీవితము దుఃఖభాజనమని కాయమస్థిరమని సంసారసుఖములుక్షణభంగురములని రోగజరామరణములు మనుజుని కనివార్యక్లేశములని యాతని కవగతమయ్యెను అతనివైరాగ్యమినుమడించెను. జరామరణరహితమగు నిర్వాణపదమునకు మార్గమునరసి లోకమునకుకళ్యాణము గూర్పవలెనను సంకల్పమాతనిమనమున దీటుకొనెను సిద్ధార్థుఁడు గిరుక్కున రథమును వెనుకకు మరలించెను. సౌధమునుజేరి చింతాక్రాంతుఁడై మానవాళి దుఃఖములనుపశమింప జేయగలమార్గము నన్వేషింపదొడఁగెను. కానిసంసార మోహముల తగిలి నిర్వాణపథము నరయుట దుస్సాధ్యమని తలపోసి సంసారమును త్యజించి, విరాగియై మోక్షమార్గమును జింతింపనిశ్చయించుకొనెను మానవాళి నాక్రమించినదుఃఖముఁ జూచి యాతనిసంతాపము హెచ్చెను వానిని వారింప యీతని డెందము వేగిరపడజొచ్చెను రాజసౌధమున నుండుట యాతనికి క్షణమొక యుగముగ నుండెను

ఒకనాఁటిరేయి అర్ధరాత్రమగుచుండెను. పురమంతయు మాటుమణఁగిపోయెను అంతఃపురమెల్ల నిశ్శబ్దముగనుండెను. ఎల్లెడల చిమ్మచీకటులు గ్రమ్ముకొనియుండెను కుసుమకోమలగాత్రి యశోధరసాధ్వి పర్యంకముపై గాఢనిద్ర జెందుచుండెను ముద్దుగుఱ్ఱఁడు పసిపాపఁడు రాహులుఁడు ఉయ్యాలలో నిద్రపోవుచుండెను సిద్ధార్థుఁడు మెల్లనలేచి మోహపాశముల ద్రెంచుకొని గుండె రాయి జేసికొని విశ్వాసపాత్రుఁడగు ఛన్నుని (రథసారథిని) లేపి తేరునాయత్తమొనర్చి దెప్పించి సౌధమును విడచెను గౌతముఁడు జగత్కల్యాణమునకై సంసారమును త్యజించెను ఆయర్ధరాత్రమున సిద్ధార్థుఁడు కొంతదూరమేగి తెల్లవారినంతనే ఛన్నుని తనయుత్తమాశ్వమును వెనుకకుబంపి తనమేననలంకరించిన కలధౌతాంబరముల దీసివైచి శిరఃముండన మొనర్చుకొని కావిగుడ్డ ధరించి తత్త్వాన్వేషణమునకు బయలుదేరెను ఆహా, ఆమహామహుని కారుణ్యదీక్ష, వైరాగ్యగరిమ, జగద్రక్షణపారీణత, ప్రశంసనీయములు గదా! అప్పటికి గౌతముఁడు ఇరువదేండ్ల ప్రాయమువాఁడు ఇట్లాతఁడు నడియౌవనమున తన మనోహారిని ముద్దుబిడ్డని రాజ్యవైభవముల తృణప్రాయముగ విసర్జించి కాషాయాంబరధారియై సత్యాన్వేషణకై బయలుదేరి పలుప్రాంతముల దిరిగెను వేదగ్రంథముల నామూలాగ్రముగ పరిశోధించి చూచెను ప్రాణాయామాదియోగచర్యల నభ్యసించి దీర్ఘకాలము కఠోరతపోనిష్ఠల మునిగితేలెను. నిద్రాహారముల విసర్జించెను కాని యాతనికి నిర్వాణతీరమునకు త్రోవ కన్పింపలేదు. అంతట

గౌతముడు విసిగి వేసారి *గయాక్షేత్రమునకుబోయి ఫల్గునీ నదీతీరమున నొక యశ్వత్థ పాదపచ్ఛాయనుగూర్చుండి నిశ్చలమనస్కుడై యిరువదియేనిమి దహోరాత్రములు ధ్యానించెను. ఎట్టకేలకాతని యన్వేషణము ఫలించెను ఆతనికి నిర్వాణ మార్గముదొరకెను పవిత్రజీవనము, నీతివర్తనము, సకలజీవరాసులయెడప్రేమ యిందియే నిర్వాణమునకు త్రోవయని గౌతముడు కన్గొనెను. ఇదియె బౌద్ధమతసారము.

అట్లు జన్మరాహిత్యమునకు దివ్యపథమును గనుగొని గౌతముడు తపము చాలించి తన నూతనసందేశమును మానవాళికి బోధింప మొదలుపెట్టెను

గౌతముడు తొలిసారి తన ధర్మచక్రమును త్రిప్పినది వారణాసీపట్టణమున. అచ్చట నరువదిమంది జనులాతనినూతన మతమును స్వీకరించిరి. ఈ కొలదిమంది శిష్యులతో బుద్ధుడు "బౌద్ధసంఘమును" నిర్మాణమొనర్చి వారిని బౌద్ధధర్మముల నుపదేశించిరమ్మని నలుదిశలకు బంపసాగెను వీరు పలుప్రాంతములకు బోయి యీ నూతనమతమును బోధింప జొచ్చిరి. బౌద్ధమతమిట్లు మెల్లమెల్లగా వ్యాపింపసాగినది. ఈతీరున ఉపదేశకులనంపి మతవ్యాప్తి యొనర్చుట ఈభూతలమున కిదియె ప్రథమము.

---

* అప్పటినుండియు గయాపట్టణము బౌద్ధులకు పుణ్యక్షేత్రమయ్యెను. వేలకొలది బౌద్ధయాత్రికు లిప్పటికిని యీపావనక్షేత్రమును దర్శించి అశ్వత్థమునకు ప్రదక్షిణము లొనర్చి పోవుచుందురు.

వారణాశినుండి గౌతముడు మగధకుబోయెను. మగధ రాజ్యమిత్తరుణమున బింబిసారుడను నృపాలునిచే పాలింపబడుచుండెను ఈతడు సుగుణశీలుడు. గౌతముని తన రాజ్యమున బౌద్ధమతమును బోధించుకొనుటకనుజ్ఞనిచ్చెను ఈతని వైరాగ్యముగ కచ్చెరువంది తానును బౌద్ధమతమును స్వీకరించెను బుద్ధుడును నాతని శిష్యగణమును నివసించుటకై తన రాజధానియగు రాజగృహపట్టణ పరిసరములందు వేణువనమనునొక రమణీయమగు ఆరామమును బుద్ధునకు దానమొసగెను. బుద్ధుడు చాలాకాలమిందే నివసించెను ఎనిమిది నెలలు దేశాటనమొనర్చి గౌతముడును నాతని యనుచరులును వర్షఋతువు సమీపించినంతనే యిచ్చటికు తిరిగివచ్చి వర్షకాలమంతయునిచ్చట గడుపువారు.

బింబిసారనృపాలుడు బౌద్ధమతమును స్వీకరించినతోడనే యీమతమునకు మిక్కుటమగు బలము చేకూరెను మగధ రాజ్యమంతటను బౌద్ధమతము వ్యాప్తియయ్యెను. ఇంటింటికిని బోయి భిక్షాటనమొనర్చుకొనుచు లోకకళ్యాణమునకై శ్రమలనొందు యీరాజఋషి పవిత్రజీవన, వైరాగ్యత్యాగశీలతలచే నాకర్షింపబడి తండోపతండములుగ జనులాతని మతమును స్వీకరింపదొడగిరి ఆతని నామమును కర్ణాకర్ణిగవిని అజతుడను మునిపతంనుడు (ని)నగరమునుండి పరుగిడివచ్చియీతని నిశ్చల వైరాగ్యమునుజూచి సమ్మోహితుడై యాతనికి దాసుడయ్యెను పరివ్రాజకసంఘీతుడగు మౌద్గల్యాయన, శారిపుత్ర, మహాకాశ్యపులు ఆతనియనుచరులైరి శ్రావస్తీపురవాసియు మహాధని

దటనుండి కపిలవస్తునగరమునకు బోయి యచ్చట తనకై విలపించుచున్న శాక్యరాజకులము నోదార్చి సన్యాసింపజేసి వారికి బౌద్ధదీక్ష యొసఁగెను. ఆతని యర్ధాంగియగు యశోధర యాతని బోధల విని విరాగినియై సన్యాసినియయ్యెను. బౌద్ధమతమున స్త్రీలకు సన్యాసము లేదు. అట్టి సన్యాసము గొనిన సాధ్వీమణులలో యశోధరయే మొదటి యామె. పిమ్మట సిద్ధార్థుని దాదియగు గౌతమియు, ఆతని పినతల్లియగు మహాప్రజాపతియు, బింబిసారుని దేవేరియగు క్షేమయు నింకను యెందరెందరో అంతఃపురకాంతలు భిక్షుణులైరి. శుద్ధోదనమహీపాలుడు రాహులుడు ఆనందుడు మున్నగు శాక్యరాజనందనులుగూడ బౌద్ధదీక్ష గైకొనిరి.

ఈతెరగున బుద్ధుఁడు పట్టణములు పల్లెలు గ్రామముల దిరిగి కోసల, కాశి, మగధ రాజ్యములలో బౌద్ధమతమును వ్యాపింపజేసెను. పెక్కండ్రు రాజకుమారులు బౌద్ధమతము నాశ్రయించిరి. అసంఖ్యాకులగు జనులు సంసారభోగములరోసి కామ్యసుఖములవీడి సన్యాసమును గైకొనిరి. బౌద్ధమతవ్యాప్తికై కృషిసల్పు బౌద్ధసంఘములు దేశమెల్ల ప్రాంతములందు నెలకొనెను

ఇట్లు నలుబదియైదు సంవత్సరములు విరామములేక వాడవాడలదిరిగి శాక్యముని తన దివ్యమతమును బోధించెను. నీతిసత్ప్రవర్తనమే మోక్షమునకు ముఖ్యమని పరిశుద్ధమనస్సు, పరిశుద్ధవాక్కు, పరిశుద్ధకర్మము, ఇవియే నిర్వాణసాధనములని, పరోపకారక్షమాదయలు ధర్మమునకు ప్రధానాంగములని,

ఇవి జాతిమతభేదములులేక నందరకును సాధ్యములని, బ్రాహ్మణశూద్రులను భేదములేక సత్ప్రవర్తనగల వారందరును పూజనీయులేయని యాతడెల్లచోట్ల నుపదేశించెను అసత్యము, చౌర్యము, మద్యపానము, పరదారాగమనము కలుషితములని దేహమస్థిరమని జనుల కుపన్యసించి వారిని సత్పథమున నడిపించెను. అతని బోధల విని చోరులు దుండగీడులు తమ దురాచారములనువీడి సన్మార్గవర్తనులైరి.

అంతట గౌతమునకు వృద్ధాప్యమంకురించెను. ఈసరి కాతనికి ఎనుబదేండ్లునిండెను దేహపటుత్వము క్షీణింపజొచ్చెను దయాశీలుడగు బింబిసారనృపాలు డతనికి మున్నే దివికేగెను అజాతశత్రుడను నొకచండవిక్రముడు మగధరాజ్యసింహాసన మధిష్టించెను. ఈతడైనను గౌతమునియెడ వైరమును కాంక్షింపలేదు.

గౌతమునకు మరణకాలమాసన్నమయ్యెను అతడొక నాడు తనప్రియశిష్యుడగు ఆనందుని చెంతకుబిలచి "ఆనందా! నాకెనుబదియేండ్లు నిండినవి నాజీవితయాత్ర యింతటితో ముగిసినది. నాకవసానము సమీపించినది. నేబోవుచుంటిని మీరు ధైర్యముతో కార్యముల నిర్వహింపుడు సత్పథమును విడనాడకుడు" అని కనుగవలనుండి యానందాశ్రువుల విడచెను. పిమ్మట యొకటి రెండు దినములకు బుద్ధుడు వ్యాధిగ్రస్తుడయ్యెను. రోగము బలమై తుదకాతడు కుశీనగరమున యొక నాటి వైశాఖపూర్ణిమను అతని శిష్యులందరును చుట్టుజేరి కన్నీరు విడుచుచుండ నిర్వాణమునకేగెను. ఎనుబది దీర్ఘవత్సరములు

జ్వాజ్వల్యమానముగ లోకమున వెలిగి అజ్ఞానాంధకారములబారఁ ద్రోలిన దివ్యజ్యోతి నాఁటితో యస్తమించెను. బుద్ధుఁడు ఈశాన శతాబ్దము 148 సంవత్సరమున వైశాఖశుద్ధపూర్ణిమా మంగళవారమునాఁడు దివిజేరెనని చెప్పెదరు.

బుద్ధనిర్వాణమును గూర్చి భిన్నాభిప్రాయములు జాలఁగ ప్రబలియున్నవి. కాని ఇటీవల గావింపఁబడిన చరిత్ర పరిశోధనలవలన గౌతముఁడు సరిగ క్రీ. పూ 543 సంవత్సరమున నిర్వాణముఁబొందినట్లు నిర్ధారణయగుచున్నది. ఈవిషయము తొలిసలుకున విపులముగ చర్చించితిని

బుద్ధుఁడు మరణింపక మున్నుఒక పేదకమ్మరివానియింట విందుగుడిచెను. ఇదియె ఆతని కడసారికృత్యము. అంతటితో ఆతనికి ఆయుష్షు తీరిపోయెను. ఆతని ప్రాణవాయువు లెగసిపోవుచుండ తరుణతాదు ఒకాలమున పుష్పించెనట. ఆతని శరీరముపై కుసుమవృష్టులు గురిసెను. ఆంతరాకాశమున మృదుమధురగానములు వినిపించెను. ఆసంహారమున బుద్ధుఁడు మెల్లన దరమోమును ఆనందునివైపునకుఁ ద్రిప్పి "తథాగతుని గౌరవించుటిటులఁగాదు. భిక్షుక భిక్షుకీసంఘములు ధర్మపథమున చరించుచు పవిత్రజీవనముల గడపుచు, తమ తమ ధర్మముల నిర్వర్తించుటకన్న తథాగతుని కొనియాడయకము వేరొండులేదు," అని పరిస్ఫుటస్వరముతో బల్కి యూపిరివిడచెను. బుద్ధునకు బొందిలో ప్రాణముండఁగను ప్రాణములు బాయునపుడును యిదియే పరితాపము. ఆహా! యాతని దయాశీలత, పరోపకారపారీణత, జగద్రక్షణాకాంక్ష యెంతప్రశంసాపాత్రములు!

బుద్ధుని మరణవార్త విని భారతభూమి సంక్షుభితమయ్యెను. వల్లులకు నగ్గిన హృదయవేదనకు మేరలేదు. వీరాతని మృతదేహమును పుష్పమాలికలతో నలంకరించి బంగరుపల్లకీయందుంచి హిరణ్యవతీతరంగిణి దాటి, ఆవలియొడ్డున నిర్యాణమొందు బుద్ధుల దహన సంస్కారాదికములకై గట్టబడిన చైత్యమున సుగంధకాష్టములతో నొకచితిపేర్చి దానిపై నాతని దేహమును బరుండబెట్టి అగ్నిసంస్కారమును గావించిరి. దహనశేషమగు నాతని అస్థులను బౌద్ధులు పలుప్రాంతములకు గొనిపోయి వానికొరకై, రమణీయమగు స్తూపములగట్టి యారాధింపదొడగిరి. బుద్ధశల్య సంగ్రహణార్థమై భారతవర్షమున ఘోరయుద్ధములు జరిగినవి. బుద్ధునిదంతమొకటి సింహళద్వీపమునకు గొనిపోవబడుచు మోక్షమార్గమున కృష్ణాతరంగిణీముఖద్వారమున నున్న పజ్రాలతిన్నెకడ నొడ్డుచేర్చబడెననియు అందునా యస్థికలము మహావైభవముతో నాంధ్రదేశమంతయు నూరేగింపబడెననియు ప్రతీతి. ఆంధ్రసామ్రాజ్యాధిపతులగు శాతవాహనులు బుద్ధుని శల్యఖండములను గొనితెచ్చి వానినుంచుటకై గుంటూరుసీమయందలి భట్టిప్రోలు అమరావతి [illegible] ప్రాంతములందు స్తూపము నిర్మించిరి. వీనిశిథిలములు [illegible] ఈస్తూపశిథిలములు ప్రపంచ[illegible] [illegible] నిత్యమొసగ్గు [illegible] అమూల్యవజ్రపేటి కల [illegible] యిప్పటికిని చెన్నపురి వస్తుప్రదర్శనశాలలో [illegible] [illegible] నగరము జేరనవో

## బుద్ధుని గుణశీలములు

బుద్ధుడాజానుబాహుడు స్ఫురద్రూపి. మహోజ్జ్వల తేజోరాశి. అద్వితీయశరీర సౌష్ఠవముగలవాడు. సువర్ణచ్ఛాయను మరపించు దేహకాంతితో ఆకర్ణాంతములగు నయనములతో, విశాల వక్షస్థలముతో, తేనెలొలికించు మధురస్వరముతో నాతనిమూర్తి యెంతయు ఆకర్షణీయముగ నుండును. శాంతవైరాగ్య లక్షణములాతని విశాలఫాలభాగమున తాండవించుచుండెడివి. ఎట్టి మానవుడైనను ఆతనిజూచిన వినమ్రుడై పాదాభివందన మాచరింపవలెనను బుద్ధిపొడమును. ఎంతటి క్రోధాంధుడైనను అతని ముఖలక్షణముల వీక్షించినపట్టు ప్రశాంతుడగును. ద్వేషపూరితులై యాతని బరిమార్పవలెనని నిశ్చయముగొనినవారు సైతము ఆమూర్తినిసాక్షాత్కరించినంతనే శస్త్రాస్త్రహస్తులయ్యునై దిగ్గుపడి వెడలువారు. గౌతముడొకమారు మగధరాజ్యమందలి శాలియాగ్రామ పరిసరారణ్యప్రాంతముల సంచరింపుచుండగ నాచెంగటనే దిరుగుచు ఆదారినిపోవు బాటసారులగొట్టి జీవించు అంగులీమాలుడను చోరుడాతని కంటబడెను. శాంతగంభీరద్యుతుల విరజిమ్ము బుద్ధునిమోము జూచినంతనే ఆచోరుడు భయవిహ్వలుడై వణికెడిగాత్రముతో తనతప్పిదము నొప్పుకొని శరణు వేడి బౌద్ధభిక్షు వయ్యెను.

మఱియొకమారు గౌతము డొక అరణ్యమార్గమున బోవుచుండ బోయని వలలో జిక్కుకొని ప్రాణముల దక్కించుకొనుటకై బెదరి జెదరి జూచుచు పరితపించుచున్న యొక్క

జింకను జూచి జాలిగొని తత్క్షణమె దాని విడిపించెను ఆచెంతనే దాని సంహారింప వేచియున్న కిరాతుఁడందుల కాగ్రహించి పండ్లు పట పట గొరుకుచు క్రోధారుణిత లోచనుఁడై ఖడ్గము దూసి బుద్ధుని కంఠము నుత్తరింప విస విస యాతని పంకకు నడచెను. బుద్ధుఁడు సమాధినిశ్చలుఁడై దూరమున నొక మహీరుహచ్ఛాయ నాసీనుఁడై యుండెను బోయఁడు బుద్ధుని సమీపించి నిశ్చేష్టితుఁడై చేతనున్న ఖడ్గమును విసరి పాఱవైచి యాతని పాదములపైఁబడి "నేను పాపిని నన్ను క్షమింపుము" అని విలపించెను బుద్ధుఁడు మందస్మితవదనముతో నాతని లేవదీసి యాతనికి ధర్మోపదేశము జేసెను. బోయఁడు బౌద్ధదీక్ష గైకొని నాఁటినుండియు పవిత్రజీవి యయ్యెను

బుద్ధుఁడు శాంతశీలుఁడు అత్యంత భూతదయాళుఁడు. ఆతని హృదయము నవనీతసదృశమైనది. అంతటి కారుణ్యమూర్తి యీవఱకెన్నఁడును యీ ప్రపంచమున నుద్భవించినట్లు గానిపింపదు. ప్రాణులు హింసనొందుచుండ యాతని హృదయము కరిగిపోవును మేను కంపమొందుచు తనప్రాణమునైన నొసఁగి యాతఁడు జీవరాసుల ప్రాణములు గాపాడనుద్యుక్తుఁడగువాఁడు మృగపక్షిపశు రక్షణములు పూన్పుటకీ దయాశీలుఁడు తనజీవితమంతయు ధారవోసెను. హింసాత్మకములగు నాఁటి యజ్ఞయాగాది క్రతువుల నీతఁడు ఖండించెను వీనిరూపుమాపుటకు తనజీవితమంతయు పోరాడెను ఈతనిమతము అహింసాప్రధానమైనది అహింసయే పరమధర్మమను మహోత్కృష్టధర్మమును లోకమున ప్రసాదించిన మహామహుఁడితఁడే. చిన్ననాఁటనుండియు యీతని హృదంతరాళము

నుండి ప్రేమవాహిని పొంగి ప్రవహిల్లెడిది. చిన్నతనమున నొకనాడు సిద్ధార్థుడు దేవదత్తుడుమున్నగుమిత్రులతో గలసి కపిలవస్తు పట్టణ సమీపముననున్న ఉపవనప్రాంతముల విహరించుచు మింటనెగురు చిత్రవిచిత్రములగు విహంగసంతతుల నవలోకించి యానందించుచుండిరి. ఇంతలో దేవదత్తుడు కఠినహృదయుడై నిశితమగు ములుగు నొకదానిదీసి మింటసంధించి ఆకాశపథమున నెగిరిపోవు నొకరాయంచగ్గోవమను గురిజూచి విడచెను. ఆశలభమునుదాకి యాపక్షికూన రక్తముదొరగి గిలగిల దన్నుకొనుచు క్రిందబడెను. దానినిజూచి సిద్ధార్థుని హృదయము విదారితమైపోయెను ఎడలేనిజాలితో నాతడాపులుగును తొడపై నిడుకొని దానిమేన లోతుగనాటిన శరము మెల్లన నూడబెరికి ఱెక్కల నిమిరి యుపచారములొనర్చి యాప్రాణిజీవముల గాపాడెను. చెంతనున్న పరిచారకు లాతని కారుణ్యభావమునకు రిచ్చపడిపోయిరి.

బుద్ధుడు రాజగృహపట్టణము చెంతనున్న రత్నగిరి సానువులందు నివసించుచుండ మేకలమందల దోలుకొని పోవుచు కొందరు గోపకులాతని దృష్టిపథమునబడిరి అప్పటికి చండకిరణు డింకను అస్తాద్రిజేరలేదు ఎండ మండుకొని పోవుచుండెను. ఆమేకలగుంపులో నొకకూన పాదమునకు శిలాహతిచే గాయమై నడువలేక వెనుకబడుచు గోపకు లదరలించుచుండ గష్టముమీద కుంటుచు మందలో గలియుచు ఆమిట్టమధ్యాహ్నపుటెండలో రొజుచు ముకుపుటంబు లెగరవేయుచు బోవుచుండెను. ఆమేకకూన యవస్థజూచి బుద్ధుడను మిక్కుటమగు జాలిగల్గెను ఏప్రాణియైన బాధ నొందు

చుండ గౌతముడు జూచి సహింపనోపడు చరచర నాతడు సానువునుండి క్రిందికి దిగి యింకను ప్రొద్దు గ్రుంకకముందే మేకల నింటికి దోలుకొని పోవుట కాశ్చర్యమందుచు దానికి హేతువేమని యాగోపాలకుల నడిగెను. అందులకు గోపకులు "బాబూ మా ఱేడు బింబిసారనృపాలు డొక బలియాగమును తలపెట్టెను. ఈయజ్ఞవధకై నూరుమేకలుగావలయునని మాకు వర్తమానమంపెను ఆయాగపూర్తికై మేకలదోలుకొని పోవుచున్నాము. రాజాజ్ఞ అనుల్లంఘనీయముకదా! ఇదియునుగాక యజ్ఞకార్యము మహత్తరమైనది" అని నుడివిరి. ఆమేకలన్నియు జన్నమున వధింపబడుటకై గొనిపోవబడుచుండెనని వినినతోడనే గౌతముని హృదయమున పిడుగుపడినట్లయ్యెను. వెంటనే గౌతముడు నడువలేక యలసటజెందుచున్న అజకిశోరమును భుజముపై కెక్కించుకొని యాగోపకుల వెంట బయలుదేరెను. కాషాయములకట్టుకొని మేకకూనను భుజయుగళి నిడికొని పోవుచున్న ఆ వింతజడదారినిజూచి మార్గమునజనులందరు నివ్వెరపడి చూడసాగిరి. ఆమేకలగుంపుతో నాతడు దిన్నగ బింబిసారుని పాలికరిగెను. బింబిసారుడు అట్టహాసముగ బలియాగమును గావించుచు యజ్ఞశాలయందుపవిష్టుడైయుండెను. ఆజన్నమునుజూచుటకై వచ్చినజనసంతతులతో యజ్ఞశాలాపరిసరములన్నియు గ్రిక్కిరిసిపోయెను. ఆజ్యధారలచే ప్రజ్వలితమై అగ్నిజ్వాలలు హోమకుండమునుండి భయోత్పాతముగ మింటికెగయుచుండెను. ఋత్విజులు గంభీరస్వరములతో మంత్రములు పఠించుచుండిరి. యజ్ఞపశువొకటి వధింపబడుటకు సిద్ధముగ యూపస్తంభము

నకు గట్టబడియుండెను. ఆఘోరదృశ్యమును తిలకించినంతనే గౌతముని మేనుకంపించిపోయెను. చెంగున నాతడు యజ్ఞవేదికపై కురికి "ప్రాణిహింస, మహాపాపము యూరకచూచెద రేల? ఈజీవమును గాపాడుడు." అని యొక్క కేకపెట్టెను. అచ్చటజేరియున్న ప్రజాసంతతుల చూడ్కులన్నియు నొక్కసారి యీతనిపై వ్రాలెను. అందరును స్తంభితులైపోయిరి. అంతట మరల బింబిసారునుద్దేశించి బుద్ధుడు, "జీవయాత్ర సంపూర్తిగావింపకుండప్రాణములదీయువారికి పాపముజుట్టుకొనును. అహింసయే ధర్మములన్నిటిలోన నుత్కృష్టమైనది. హింసవలన మోక్షముచేకూరనేరదు. ఇట్లు లంచమువెట్టి దేవతల మెప్పువడయజూచుటయవివేకము" అని అశ్రుపూరితనయనములతో పశువధమాన్పుమని యాతనివేడుకొనెను. ఆతని పలుకుల విని చూపరులెల్లరును కన్నీరుగార్చిరి. వారిహృదయసీమలందు ప్రేమవాహిని తరంగితమయ్యెను. ఒక్కసారి అందరకును పశువధయనిన వెగటుగల్గెను. అందరును జీవహింస వలదని హాహాకారములుచేసిరి. ఋత్విజులు పశ్చాత్తప్తహృదయులై పశువధార్థమైతెచ్చిన మారణోపకరణముల విసరిపారవైచి హోమకుండములనార్పి బలియాగమును విరమించిరి. బింబిసారునిహృదయపరివేదనకు మేరలేదు. ఆతడు తత్క్షణమె జీవహింస వలదని తనరాజ్యమున జాటబంచి భూతలమునగల ధర్మములన్నిటిలో భూతదయ ప్రధానమైనదని శిలాఫలకములపై వ్రాయించి తనరాష్ట్రమున పలుప్రాంతముల నిల్పెను.

బుద్ధునకు అద్భుతమగు బోధనాశక్తిగలదు. యుక్తియుక్తముగ బల్కనేర్చినవాడు. వాదప్రతివాదములం దసమాన ప్రావీణ్యుడు. "కాయమస్థిరము, సత్కర్మాచరణమే

మోక్షముసకుత్రోవ, సర్వదుఃఖములకునుతృష్ణయేకారణము” మున్నగు ఉత్తమధర్మముల నాతడు అత్యంతనిపుణముగ జనుల కు బోధించి యొప్పించువాడు ఒకమారు బుద్ధుడు రాజగృహ పట్టణమునకుదాపున రత్నగిరి కందరమున నివసించుచుండ నొకయువతీమణి ఏడ్చుచు సర్పదష్టుడైన తనప్రియసుతుని మృతకళేబరమును చేతులపై నిడికొని “కొడుకా, కొడుకా” యని యడలుచు బుద్ధుని వెదకికొనుచువచ్చి మృతదేహమును పదిలముగ నాతనిముంగిటనుంచి యాతని చరణములపై వ్రాలి “జడదారీ! నాముద్దులపట్టిని కాలసర్పము మ్రింగినది. వీనినిబ్రతి కించి పున్నెముగట్టుకొమ్ము. నీయొద్దకుబోయిన నాయాపద గడచుననియు, నీవు మృతకాయముల కాయువొసంగగల సమర్థుడవనియు యిచ్చటివారలునాకుజెప్పిరి. దయాళూ! దయ గొని నాసుతుని బ్రతికింపుము. నీకెంతేని పున్నె ముండును” అని ఆయబల కన్నీరుగార్చెను. భూతదయాసం పూర్ణుడగు బుద్ధుడాదీనురాలిచూచి జాలినొంది, “యువతీ! భయముపలదు నీతనయుని బ్రతికింతును కాని నీవీపురమునకు బోయి జననీ, జనక, పతీసుతాదుల మరణమువలన నెప్పుడును ఆపన్నులుగాని గృహస్థులయింటికిబోయి పిడికెడు యవల గొని రావలయు ఆటుపిమ్మట నీసుతుని త్రుటిలో పునర్జీవితునిగాజేం తు. వేగమెపోయిరమ్ము అంతదాక నీపుత్రుని మృతశరీరమును గాపాడుచుండును” అనిచెప్పి యామెను బంపివైచెను. ఆసతీ మణి పదములతొట్రిల వేవేగ పురమునకుపోయి గన్నీరు గార్చుచు యవలను యాచింపదొడగెను పాప మామె రాజ గృహపట్టణమంతయు గలయదిరిగినది కాని యెచ్చటను మృతి

కలన దుఃఖమునొందని గృహమామెకు గానరాదయ్యెను. ఎచ్చటికిపోయినను "అమ్మా! నేటికేడాదియైనది. నానాథుడు నన్నిట్లు మూలబడవైచి పోయినాడు దిక్కుమాలిన పత్నినైతి" నని కంటతడిబెట్టువారును; "అయ్యో నేనెవ్వరితో జెప్పుకొందును. చెట్టంతకూతురును మ్రింగి మొండినై యిట్లుజీవించుచుంటి" నని విలపించువారును, "ఇసీ, పాడుదైవమునకు జేతులెట్లువచ్చినవో నవ్వుమోముతో ముద్దులొల్కెడు నాపసికూన నెత్తుకొనిపోయినాడు" అని తలమోదుకొనువారెకాని, ఒక్కయింటనైనను మృత్యుదేవత మాగృహమున తలసూపలేదని సంతోషముగ బల్కువారులేరైరి. పట్టణమంతయు దిరిగితిరిగి వసిగి వేసారి ఆనారీరత్నము విఫలమనోరథయై విచారముతో బుద్ధునికడ కరిగెను బుద్ధుడామెనుగాంచి మందస్మితవదనముతో "సాధ్వీమణీ! యవలగొనివచ్చితివా" అనియడిగెను అబలనిరుత్తరయై కన్నీరుగార్చెను "బిడ్డా జననమరణములు ప్రాణులకెల్ల స్వాభావికములు దుఃఖముచే వార్తినొందని జను లీలోకమున లేరు దీనికై యేకలుట యవివేకము. ఇది నీయంతటనీకు గోచరమగునట్లుకై యీయుక్తి బన్నితిని" అనెను ఆపల్కులవినినంతనే యువిదతలపైనుండి యొకభారము దింపినట్లయ్యెను ఆమెకు జ్ఞానోదయమయ్యెను పుత్రశోకము మటుమాయమయ్యెను. "తండ్రీ భవదీయమహనీయ భాగ్యముచే నేను ధన్యురాలనైతిని నా యజ్ఞానము వాసినది" అనిపల్కి యాయోగిని వెడలిపోయెను.

గౌతముడు నిరుపమానవచోనైపుణ్యముగలవాడు. చిత్రవిచిత్రములగు సాదృశ్యములతో సత్యమును ప్రస్ఫుటమొనర్చి శ్రోతల నుల్లాసపరచువాడు ఒకనాడొకడు కపిల

వస్తునగరమునుండి రాజగృహపట్టణమునకు బోవుచు మార్గమున భారద్వాజుడను ఒకానొక కృషీవలునియింట విడిదిజేసెను. అప్పుడు ప్రసంగవశమున భారద్వాజుడు, "సన్యాసీ విరాగివై నీవేలభిక్షాటన మొనర్చుకొనుచు ఋణములబడెదవు. నావలె సేద్యముజేసికొనరాదా? సుఖముగజీవింపవచ్చు" ననెను. బుద్ధుడందులకు చిరునగవుతో, "నేనును కృషియేజేయుచుంటిని. నాకుసౌఖ్యమున కావంతయు కొదువలేదు" అనెను "అయినచో, నీయెద్దులేవి, నాగలెక్కడ?"

"నేనుధర్మశాస్త్రమనుపొలమునుదున్నుదును. ధర్మమే నానాగలి. నిరంతరప్రయత్నము నాదుక్కిటెద్దులు మనస్సు నావృషభముల నడుపు ముక్కుత్రాడు. సత్యము మునికోల. సత్కార్యమే వర్షధార. మోహామదమాత్సర్యములు కలుపు మొక్కలు ఈవ్యవసాయమున ఫలించుసస్యము నిర్వాణము."

భారద్వాజునిమోము హర్షప్రఫుల్లమయ్యెను. బుద్ధుడసంఖ్యాకములగు నీతికథలచే అహింసా ప్రేమ సిద్ధాంతముల యుక్తియుక్తముగ తన యనుచరులకు బోధించువాడు అందొక కథనుమాత్రమిచ్చట నుదహరించి విశదచెదను:—

"బ్రహ్మదత్తుడను రాజు కాశీఖండమునకు ప్రభువై వైభవోపేతముగ రాజ్యపాలన మొనర్చుచుండెను ఈతని రాజ్యమతివిశాలమైనది ఈతనికి లెక్కలేని సైన్యములున్నవి భాండారమునిండ అపారధనరాసులున్నవి. దీనికిదాపున కోసల రాజ్యము గలదు ఈరాజ్యమును దీఘితియను నృపాలుడు పరిపాలించుచుండెను ఈత డంతబలియుడుగాడు. ఈతని

కన్ని సైన్యములు లేవు. ఈతనిరాజ్యమును అంత విస్తీర్ణమైనది కాదు. బలిష్ఠములగు రాజ్యముల చెంత దుర్బలరాజ్యము లుంట యెప్పటికైనను ముప్పేగదా? బలవంతులు బలహీనుల హింసించుచుండుట యీలోకమున సహజము. బ్రహ్మదత్తుడు రాజ్యతృష్ణాపరుడై కోసలరాష్ట్రముపై దాడివెడలి యారాజ్యమును సంహరించెను దిఘీతి రిపుసైన్యముల గెల్వజాలక రాజ్యమును వీడి పలాయనుడై ప్రాణముల దక్కించుకొనెను. ఈతనికి "దిఘావు" అను పసితనయుడుండెను. ఈ పసివాని శత్రుహస్తముల జిక్కెను.

కొంతకాలమునకు పలాయనుడైన రాజు పట్టువడి బ్రహ్మదత్తునిచే యురిదీయింపబడెను. ఈ నిరపరాధి జీవముల బాయుచు తనచిన్ని కుమారునిపై చూడ్కులుసారించి క్షమాప్రజ్వలిత నయనములతో, "కుమారా! పగవలన పగయడగ నేరదు ! ప్రేమవలననే పగజల్లారును," అనిపల్కి యురిస్తంభము నెక్కెను

పితృవిహీనుడై బాలకుడు విచారభరమున అరణ్యభూములకు తెగించిపోయి జనకుని ఘోరమరణమునకై అహోరాత్రములు విలపించెను. తుదకు అతని విచారము క్రోధముగ మారెను. జేవురించిన వదనముతో నాతడు హస్తములు పిడికిటపట్టి, "ఎంతవిచారించినను కార్యములేదు నా తండ్రిని బలిమార్చి నా కీయాపదను సంఘటింపజేసిన యా దుర్మార్గుని దునిమి నాపితృఋణమును దీర్చుకొనెద" నని ఘోరశపథము జేసెను.

ఆబాలుడు చెంగున లేచి యేదో యొకయాలోచన మదికిస్ఫురింప ప్రచ్ఛన్న వేషమును ధరించి దిన్నగ బ్రహ్మ దత్తుని రాజ్యమును బ్రవేశించి ఆతనియశ్వశాలలో నొక యుద్యోగమునకు గుదిరెను. ఒకనా డాతడు ఉషస్సతి తన దివ్యస్పర్శచే లోకమునకు చైతన్యముగొలుపువేళ మృదుమధుర స్వనముతో నొకగీతమును బాడెను. నృపు డాబాలకుని అవ్యక్తమధురగానమును గ్రోలి ప్రమత్తుడై యాతని పుట్టు పూర్వోత్తరముల నించుకయు విచారింపకయె అతని తనయంగ రక్షకులలోనొక్కనిగ గైకొనెను.

ఇట్లు కొంతకాలము గడచెను. అచిరకాలముననే దిఘావు తనవినయసౌశీల్యములచే బ్రహ్మదత్తుని మెప్పించి నాతని కెంతయో విశ్వాసపాత్రుడగు సేవకుడయ్యెను. నృపుడు తానెచ్చటికి బోయిన నాబాలకుని తనవెంటగొనిపోవుచు నాతని నెంతయో ప్రేముడితో జూచుకొనుచుండెను. ఒక నాడు దిఘావును వెంటనిడికొని బ్రహ్మదత్తు డరణ్యసీమలకు వేటాడబోయెను. దిఘావు రథసారథియై నృపునిస్యందనమును దోలుచుండెను బ్రహ్మదత్తమారణ పిపాసయత్తుడగు బాలుడు తనయభీష్టము నెరవేర్చుకొనుటకు మంచియదనువొరకెనని లోలోపల సంతసించుచుండెను. వేటమృగమును దరిమినట్లో నటించి బాలకుడు నృపుని పరిచారకగణము పోయిన మార్గమును దప్పించి రథమును వేరొకమార్గమును పట్టించెను స్యంద నము నిర్జనారణ్యభాగముల బ్రవేశించెను కొంతవడికి రాజు వేటతమకము సడలి బాలకుని యూరువులపై శిరమువాల్చి నిదురించెను బాలకు డెంతకాలమునుండియో వేచియుండిన

సంతోషతరుణ మేతెంచెను. ఆతనిహృదయ మొక్కతృటిలో శిలాసదృశమై పోయెను.. ఇంతకాలమును లోలోపల మడగి యుండిన క్రోధము అగ్నిపర్వతాంతరాళమునుండి వెడలివచ్చు అనలశిఖ వలె యొక్కపెట్టున పెల్లుబుకెను. "క్రూరపిశాచీ నేటికి దొరికితివి. నాతండ్రిరాజ్యమును సైన్యముల సర్వసంప దల హరించి నాప్రియజనకుని ప్రాణముల దీసినకిరాతుడవు నిన్నుజంపి నాకసితీర్చికొందును" అని క్రోధారుణితలోచనుడై పండ్లు పటపటగొరుకుచు యొరనుండి ఖడ్గమునుదీసి నిద్రిం చుచున్న రాజుకంఠమునకు గురిజూచెను. ఒక్కవేటుతో కంఠము తునియలగును. ఇంతలో మేఘావృతమగు నాకాశ మార్గమున తళుక్కుమను మించుతీవవలె నొక్కయాలోచన యాతని మానసవీధుల సంచరించెను ఆనాడు తన ప్రియజన కుడు ప్రాణములవీడుచు పల్కినపల్కులు స్ఫురణకు దగి లెను. "పగవలన పగ యడగనేరదు" ఆతనిమానసము వికా వికలమ్మెను. క్రోధము చల్లారిపోయెను మేనుకంపించెను హస్తమునుండి ఖడ్గముజారిపోయెను ఆచప్పుడువిని రాజు యులికిపడి లేచెను బాలకుడు కన్నీరునింపుచు సర్వమును జెప్పివైచెను. బ్రహ్మదత్తుడు బాలుని క్షమాశీలమునకు నిభ్రాంతుడై హర్షప్రఫుల్లవదనముతో నాతని కౌగలించు కొనెను. కోసలరాజ్యమున కాతని నభిషిక్తునిజేసి తన తనయ నాతనికిచ్చి పరిణయము గావించెను."

బుద్ధు పిట్టి ప్రశాంతగుణరాశి అఖండమేధావి. ఆతని నిర్మాణకౌశలముకూడ అపారమైనది తన మతవ్యాప్తికై

యాతడునిర్మించిన బౌద్ధసంఘము అతని అద్వితీయ ప్రతిభా విశేషమును వేనోళ్ల జాటుచున్నది.

బుద్ధుడు ప్రపంచమున నుద్భవిల్లిన మహాప్రవక్తలలో నగ్రగణ్యుడు. ఈమహామహుని నామము సూర్యచంద్రు లుండుదనుక యీలోకమున స్మరింపబడుచుండును. ఈతని మతము ప్రపంచమునందలి మతము లన్నిటికంటె నెక్కుడు జనుల నాకర్షించి యిప్పటికిని భూతలమున నత్యున్నతస్థాన మలంకరించుచున్నది ఈ భూప్రపంచమున నివసించు ప్రజాళిలో మూడవవంతు బౌద్ధమతావలంబులు.

---

# బౌద్ధమహాయుగము.

## II

### బౌద్ధమతవ్యాప్తి

శ్లో॥ దయాసిద్ధిరేవా స్త్యహింసాస్తులోకే
సదాన్తి స్సశాంతి స్సనీతి స్సదాపి
స్వరాదివ్రిసక్తిః పునర్జన్మహేతు
ర్భజధ్వం నిరాకార నిర్వాణమేకమ్.

బుద్ధుని కాలముననే యాతని నిరంతర పరిశ్రమ వలన బౌద్ధమతము ఆర్యావర్తమంతయు బ్రాకినదని నుడివితిమి. గౌతముడు కుశినగరమున దివికేగిన నాటనుండి అశోకసార్వభౌముడు మగధసామ్రాజ్య సింహాసనమ ధిష్ఠించు దనుక భారతవర్షమున బౌద్ధమత మెట్టియభివృద్ధి గాంచినదో మన మెఱుగము. ఈకాలపుచరిత్ర అంధకారమున మునిగియున్నది. అశోకునికాలమున బౌద్ధమతము ఉచ్చదశ ననుభవించినది. ఈతడు సింహాసనాసీనుడై బౌద్ధమతమును దనయభీష్టమతముగ గైకొని దానిని దనవిశాల సామ్రాజ్యముననే గాక భూవలయమంతటను బ్రసరింపజేసెను. ఈతని రాజ్యపాలనమున నీమతము ఐరోపా ఆఫ్రికా ఖండములకు గూడ బ్రాకెను. అంతటితో బౌద్ధమతప్రాభవ మంతరించినది. అంతటినుండియు బౌద్ధమతము భారతవర్షమున క్షీణగతి నొందసాగినది. కనిష్క హర్షవర్ధనులు యెంతప్రయత్నించినను దానిని పూర్వవైభవస్థితికి దీసికొని రాజాలకపోయిరి.

అశోకుని తరువాత బౌద్ధమతము ఆర్యావర్తమున క్షీణింపసాగినను, ప్రాచ్యఖండమున తక్కటి ప్రాంతములందు విజృంభింపసాగినది. క్రీ. శ. రెండుమూడు శతాబ్దములలో నీమతము ఆసియాఖండ మంతటను బ్రాకినది. నాల్గవశతాబ్దము నాటికే బౌద్ధమతము చీనా మొదలు భారతవర్ష సరిహద్దులవరకును గల, ఫార్మోజా, సైబీరియా, మంగోలియా, టిబెట్టు, తార్తార, అఫ్గనిస్తానము, బెలుచిస్తానము మున్నగు దేశములన్నిటియందును, ప్రబలియున్నట్లు ఫాహియాను నుడివియున్నాడు. యవ, సుమిత్ర, జపాను దీవులందును, బ్రహ్మ, సయాం దేశములందును ఈమహామతము కొంచెమాలస్యముగ ఆరవశతాబ్దప్రాంతమున వ్యాపించినట్లు గాన్పించుచున్నది.

ఈమత మిట్లు అత్యద్భుతముగ వ్యాప్తినొందుటకు కారణభూతములు బౌద్ధగ్రంథ, బౌద్ధసంఘ, బౌద్ధపరిషత్సభలు. ఈమూటినిగూర్చి యిచ్చటకొంత ప్రస్తావించుట యవసరము.

## బౌద్ధగ్రంథములు.

బుద్ధుని సిద్ధాంతములను సంభాషణములను నొక్కచోట ప్రోవుచేసి, సూత్ర, వినయ, అభిధర్మ పీటిక లనబడు మూడు భాగములుగ విభజించిరి. వీనికే పిటకత్రయమనిపేరు ఇవియే బౌద్ధులకు ప్రమాణగ్రంథములు.

## బౌద్ధమతవ్యాప్తి.

### సూత్రపిటక * (పాళీభాషలో సుత్తపిటక)

ఇది బౌద్ధమతమునకు మూలగ్రంథము. ఇందు బుద్ధుని జీవితచర్యలు, సంభాషణములు చేర్పబడినవి. ఇందు బుద్ధుడే కథకుడు. శిష్యులు శ్రోతలు. గౌతముని మతసిద్ధాంతములు నీతివాక్యములు ఆతనివచనములలోనె యథాతథముగ లిఖింపబడినవి.

వినయపీటికలో బౌద్ధసన్యాసుల జీవితపద్ధతి శాసించు నియమములు వివరింపబడియున్నవి. గౌతముడు తన యద్వితీయ మతమును స్థాపించిన పిమ్మట నలుబదియైదు వత్సరములు జీవించి బౌద్ధసంఘమును నిర్మాణమొనర్చె గావున నిందు వర్ణింపబడిన నియమములలో పెక్కింటిని యాతడే కల్పించియుండును.

అభిధర్మ పీటికయందు జీవితరహస్యములు, జన్మకారణము మున్నగు పరమార్థవిషయములపై వ్యాసములుగలవు. ఇవి గౌతముని నిర్యాణానంతరము వ్రాయబడినట్లు గాన్పించుచున్నది.

ఇవిగాక జాతకకథలు, ధర్మపథము, లలితవిస్తరము మున్నగు పెక్కు మతగ్రంథములు బయలుదేరినవి. వీని నన్నింటిని గూర్చి యిచ్చట వ్రాయుటకు తావులేదు. వీనిలో ధర్మపథము మిగుల సుగ్రంథమని బౌద్ధులచే కొనియాడబడుచుండును చదువరులకు చవిజూపించుటకై ధర్మపథములోని సుభాషితముల గొన్నింటి నిచ్చట నుదాహరించెదను:—

---

* విశేషార్థమును కొలదిమాటలలో సూచించు వాక్యమునకు సూత్రమని పేరు. ఇట్టిసూత్రముల సముదయముగుటచేత నే యీగ్రంథమున కీ నామము గల్గినది.

౫. పగవలన పగ యడగనేరదు. ప్రేమయె పగ నడగింప గలదు.

౫౧. చెప్పినట్లాచరింపలేని మనుజుని మధుర వాక్యములు చిత్రవర్ణశోభితమై పరిమళశూన్యమగు పుష్పమువలె నుండును.

౫౫. సుకర్మలతావి కమల సుగంధముకంటె మలయచందన సువాసనల కంటె మధురము.

౧౪౧. విషయవాంఛల జయింపలేని మానవుని వస్త్రవిసర్జన జటామండల ధారణ, ఉపవాసదీక్షలు, ధూళిధూసరిత దేహము, నిశ్చలసమాధి, కఠినశయ్యలు పవిత్రమొనర్పజాలవు.

౨౨౩. ప్రేమచే క్రోధమును, మంచిచే దోసగును, పేరాసను దాతృత్వముచేతను, అనృతమును సత్యముచేతను జయింపవలయును.

౨౫౨. ఇతరుల దోసము లెన్నుట సులభము. తన తప్పిదమును తెలిసికొనుట కష్టము.

బౌద్ధసంఘము.

బౌద్ధమతవ్యాప్తికై బుద్ధుడు బౌద్ధసంఘమును నిర్మించెను ప్రపంచమున కిట్టిసంఘములు క్రొత్తలు. బౌద్ధమతము సన్యాసపరమైనది. బుద్ధుని యుపదేశముల విని అసంఖ్యాకులగు జనులు సంసారముల త్యజించి సన్యాసమును బుచ్చికొనిరి. బౌద్ధసన్యాసులకు భిక్షువులని పేరు. ఈభిక్షువులు నివసించు

మతములకు విహారములందురు. అశోకుడు, కనిష్కుడు, హర్షుడు, బింబిసారుడు మున్నగు బౌద్ధమతావలంబులగు రాజులు యిట్టి విహారముల నెక్కింటిని గట్టించి అందు నివసించుసన్యాసుల పోషణాదికములకై భూదాన సువర్ణదానముల జేసిరి. ఇట్టి విహారములు పైనుదాహరించిన నృపాలుర రాజ్యకాలమున ఆర్యావర్తమునందెల్లచోట్లను తామరతంపరలుగ వెలసినవి. ఫాహియాను యీవిహారముల యందమునుజూచి చకితుడైనాడు. వీనియందు ప్రదర్శింపబడిన శిల్పకళాచాతుర్యమును వేరొకచోట వర్ణించితిమి.

బౌద్ధసన్యాసు లెట్టి నియమముల పాటింపవలెనో యెట్టి జీవనమును గడపవలయునో గౌతముడే నిర్ణయించినాడు. వినయ పిఠికలో వివరింపబడిన యీనియమముల పరికించిన బుద్ధుని కెంతటి యద్భుతనిర్మాణకౌశలముగలదో తెలియనగును. వీరివర్తనమును శాసించునియమములు యీకాలమునాటి జర్మనీ, తురుష్కరాజ్యములందలి సైనికశిబిరములలో నివసించు సైనికుల రణశిక్షణకై గావింపబడు నియమముల పరిహసించును ఇందు శిక్షనందిన సన్యాసుల ధైర్యసాహసములు, శాంతశీలములు నిరుపమానములు. వీరెంతటి దూరదేశములకైన పాదచారులై తెగించిపోయెడువారు. ఎంతటి సముద్రములైన తరించువారు. ఎట్టినిర్జనారణ్యభూములనైన సంచరించువారు. అశోక కనిష్క సార్వభౌముల కాలమున వీరు తిరుగని దేశములులేవు. మహాసముద్రములదాటి వీరు సింహళ, యవ, సుమిత్ర, జపాను ద్వీపములకు పోయి యచ్చట మతవ్యాప్తి యొనర్చిరి. అమెరికా ఖండమునగూడ బౌద్ధ

శిల్ప శిథిలములు ఇటీవల గన్పించుటచే మన బౌద్ధసన్యాసులచ్చటికిగూడ పోయియుండురని యూహింపవలసి వచ్చుచున్నది.

బౌద్ధ భిక్షువు లిట్లు దూరదేశములకుబోయి వాడవాడలకును పల్లెపల్లెలకును దిరిగి సందుగొందులలో ఆపణవీథులలో కూడలిప్రదేశములలో విశ్రాంతిగృహములలో రాజప్రాసాదములలో ధర్మశాలలలో యీ యా ప్రదేశమననేల యెల్లతావులందును బౌద్ధధర్మముల నుపదేశించి వేలకొలది జనులకు బౌద్ధదీక్ష యొసంగి బౌద్ధమతము నత్యద్భుతముగ వ్యాపినొందించిరి. ఇట్టినిర్మాణపద్ధతులనే యీ కాలమున ప్రబలిన జైనసంఘములు గూడ ననుకరించినవి. నవీనకాలమున క్రైస్తవమత ప్రచారకులగు మిషనరీలవలంబించు పద్ధతులును వీనియనుకరణములె. బౌద్ధమత మిట్లు మతప్రచారమున కొక నూతన మార్గమును గనిపెట్టి లోకమునకు ప్రసాదించినది.

## బౌద్ధపరిషత్సభలు.

బౌద్ధమతాభివృద్ధికిని బౌద్ధమత సిద్ధాంతముల సహజ ప్రపంచస్వరూపము సంకరముగాకుండ గాపాడుటకును నూరు సంవత్సరముల కొకమారు పరిషత్సభలు గావింపబడెడివి. ఈ సభలు మహావైభవముగ జరిగెడివి. అసంఖ్యాకులగు జనులీ సభాకార్యముల వీక్షింపబోయెడివారు. పలుప్రాంతములనుండి ప్రసిద్ధులగు బౌద్ధసన్యాసు లీ సభల కాహ్వానింప బడువారు. బౌద్ధయుగమున నిట్టి మహాసభలు నాల్గుజర్గినట్లు చరిత్ర పరిశోధనల వలన దేలుచున్నవి.

ప్రథమ పరిషన్మహాసభ గౌతముడు గతించిన యేటనే 543 సంవత్సరమున మగధరాజధానియగు రాజగృహాపట్టణమున సమావేశమైనది. ఈ సభాసమక్షమున బుద్ధుని సద్బోధలన్నియు పఠింపబడినవి. ఆతీరువనే నాకాలమున సద్గ్రంథములు కాలవాహినిలో గలసి విస్మృతమై పోకుండ గాపాడ ఒడెపిపి బుద్ధుని సంభాషణముల త్రిపీఠికలుగ సంగ్రహింపబడిన ధీతరుణముననే.

పిమ్మట నొక శతాబ్దమునకు క్రీ.పూ 443 సంవత్సరమున ద్వితీయ పరిషన్మహాసభ జరిగినది ఈ కాలమున బౌద్ధులలో అభిప్రాయభేదములు గల్గి అంతఃకలహములు జనించినవి. వీని నివారించుటకే యీ మహాసభ యాహ్వానింపబడినది. కాని ఇంతటితో నీభేదభావములు సమసిపోవలేదు. ఈ యభిప్రాయభేదములవలన బౌద్ధులు ఉత్తర బౌద్ధులనియు దక్షిణబౌద్ధులనియు రెండు శాఖలుగ జీలిపోయిరి. ఇప్పటికిని యీ మతభేదములు నిలచిపోయినవి. నేపాళ, త్రివిష్టప, జపాను దేశములలో నివసించు బౌద్ధులుత్తరబౌద్ధులైరి. సయాం, సింహళ బ్రహ్మ దేశముల యందలి బౌద్ధులు దక్షిణ బౌద్ధులైరి.

మరి రెండుశతాబ్దములుగడచినవెనుక క్రీ పూ 243 సంవత్సర ప్రాంతమున అశోకచక్రవర్తి తన రాజధానియగు పాటలీపుత్రనగరమున తృతీయ పరిషన్మహాసభ జరిగించెను. ఈసమయముననే అశోకుని తనయుడగు మహేంద్రుడు సింహళద్వీపమునకుబోయి త్రిపీఠికల నచ్చట వ్యాపింపజేసెను. అప్పటినుండియు నీపీఠికత్రయమీ ద్వీపమున కంఠస్థమై వరలె

క్రీ:పూ 88 సంవత్సరమున గ్రంథస్థమైనవి బౌద్ధమతచారిత్రమున నిదియొక గొప్పవిషయము. బౌద్ధుల పవిత్రగ్రంథములగు త్రిపిటకలు గ్రంథస్థమగుట కిదియె ప్రథమము నేడుగాన్పించు పిటకగ్రంథములకిదియె మాతృక.

దీనివెనుక క్రీ. శ. ప్రథమ శతాబ్దమున (40 సంవత్సరమున) కనిష్కుని రాజ్యకాలమున చతుర్థసంఘసమ్మేళనము జరిగినది. ఈసమయముననే మూడు పిటకలకును మూడు భాష్యములు వ్రాయబడినవి.

---

# బౌద్ధమహాయుగము

## III

### బౌద్ధమతసిద్ధాంతములు బౌద్ధవేదమతములకుగల సాదృశవైసదృశము బౌద్ధమతక్షీణత.

### బౌద్ధమత సిద్ధాంతములు.

---

బౌద్ధమతమున నాల్గు ముఖ్యసిద్ధాంతములు గలవు. మానవజన్మము దుఃఖభాజనము. తృష్ణయె సకలదుఃఖములకును గారణము, తృష్ణావిరహితుడైన మానవునకు దుఃఖములంటవు. అష్టమార్గముల ననుసరించుటవలన మనుజుడు తృష్ణావిరహితుడగును, అనునవి. ప్రాణిహింస, మద్యపానము, అనృతము, పరుష భాషణములు, మృదుతల్పశయనము, సువర్ణము మున్నగువాని వర్జించుటయె అష్టమార్గావలంబన యనబడును.

బౌద్ధమతస్థులెల్లరు వాంఛించునది సంసారదుఃఖముల నుండి విముక్తి. నిర్వాణపదము. నిర్వాణలాభమే బౌద్ధులపరమ లక్ష్యము నిర్వాణమే యన్నిటికంటె దేవతలకంటెను యుత్కృష్టమైనది. బుద్ధుడు నిర్వాణపదము నొందుటవలననే యట్టి ప్రాముఖ్యతనిపించుకొనెను. నిర్వాణము లభింపని యెడల మానవుడు పుట్టుచు గిట్టుచు జన్మములెత్తుచుండును. బౌద్ధులు మానవుడొనర్చినకర్మ నశింపనేరదని వాదింతురు. వీరసిద్ధాంతము గూడ పూర్వజన్మకర్మ ననుసరించి ఉత్తరజన్మ నిర్ణీతమగునని యె.

## బౌద్ధ వైదిక మతములకుగల సాదృశ్య వైదృశ్యములు.

ఇంతవఱకున్న గౌతముడు యజ్ఞయాగాది క్రతువుల నిరసించెనని వ్రాసితిని. దీనిబట్టి బుద్ధుడు వేదమతమును సంపూర్ణముగ నాపలద్రోసి యొకనూతనమతమును సృజించెనని దలంచుట పొరపాటు అదిపాషండమతమనియు నాస్తిక మతమనియు వేదమతమునకు అత్యంతము విరుద్ధమనియు బౌద్ధ మతమునుగూర్చి పెక్కుఅపోహలు ప్రబలియున్నవి. కాని ఈ యుభయమతముల సాదృశ్యవైదృశ్యములనించుక పరిశీలించిన బౌద్ధమతము నెడ యిట్టి వైరభావమునకు గారణము లేదని స్పష్టమగును. ప్రాచీన వేదమతమునుండియే బౌద్ధమత ముత్పన్నమైనది వైదికమత సాంప్రదాయకుడ్యములపైననే బౌద్ధమత మహాసౌధము నిర్మింపబడినది. బౌద్ధమతమె ప్రాచీన ఆర్ష మతమునకెక్కుడు చేరువమైనదనియు ఆర్షమత ప్రాచీనతను గాపాడుటకే తన బౌద్ధమును బోధించితిననియు బుద్ధుడు వాకుృచ్చియున్నాడు. బౌద్ధమతసిద్ధాంతముల నవికొంత విపులముగ బరీక్షించిన యింపలి సత్యాసత్యములు తెల్లమగును. "జైన బౌద్ధమతములు తండ్రికడనుండి గావలసిన యాస్తిని పంచుకొని కాలక్రమాంతరములచే వేరున్న కొమారుల - వలె నున్నవి అనగా నివి పరకీయములుగావు. పూర్వమునుండి యున్న బ్రాహ్మణధర్మముల యందే యుత్పన్నమైనవి." అని తిలకమహాశయుడు తన గీతారహస్యమున వ్రాసినాడు. వేద మతమునందలి జ్ఞానకర్మకాండలు— సన్యాసగృహస్థధర్మములు సంపూర్ణముగ రూఢములైన పిదప వీనిలో కొన్ని విషయముల

సిద్ధారణజేయుటకును కొన్నిటిమార్చుటకును బౌద్ధమతము వెలువడినట్లు గాన్పించుచున్నది.

బౌద్ధమతము చాలయంశములలో వైదికమతమును బోలియున్నది వైదికమతమునందలి కర్మసిద్ధాంతమును బౌద్ధులును విశ్వసింతురని యిదివరకే చెప్పియుంటిమి.

"కమ్మనావత్తతీలోకో కమ్మనావత్తతీ పజా (ప్రజా) కమ్మనిబంధనా సత్తా (సత్వాని) రథస్యాఽణీవయాఽయతో (సుత్తనిపాతసుత్త ౬౧)"

"కర్మవలననే లోకములయొక్కయు అందలి ప్రజలయొక్కయు ప్రవృత్తి జరుగుచున్నది. బండి యిరుసు ననుసరించిపోవునట్లు ప్రతిజీవియు కర్మజాలముచే బంధింపబడియున్నది" అని బౌద్ధసూత్రములందు జెప్పబడినది. ఇదియె వైదికమతమందలి కర్మసిద్ధాంతము. ఇదిగాక జననమరణ ప్రవాహము, మహేశ్వర, బ్రహ్మ, యింద్రాదిదేవతలు, యముడు, మారుడు, స్వర్గపాతాళలోకములు గౌతముడొప్పుకొనెను నామరూపములు, కర్మవిపాకము, అవిద్య, ఉపాదానము మున్నగు వేదాంతశబ్దములు దేవతలగూర్చిన గాథలు బౌద్ధగ్రంథములందు పెక్కుచోట్ల గాన్పించును.

కాని, సర్వవ్యాపకమై, నామరూప వివర్జితమై, ఆత్మస్వరూపమై, నిత్యమగు నొకవస్తువుకలదను వైదికమతసిద్ధాంతమును గౌతముడు నిరాకరించెను ఇదియె బ్రాహ్మణ వైదికమతములకుగల గొప్పవ్యత్యాసము గౌతము డనాత్మవాది. ఆత్మ (లేక బ్రహ్మము) వాస్తవముకాదనియు అయ్యది కేవ

లము మిథ్యయనియు, ఆత్మానాత్మ విచారమున బ్రహ్మచింతనమునబడి, శ్లేష్మములోని యీగవలె కొట్టుకొనుచు మనుజుడు తమకాలమును వ్యర్థముచేసికొనరాదని గౌతముడు ఘంటాపథముగ బోధజేసెను. అందుచేతనే యీతని మతమునకు నిరీశ్వరవాదమనియు శూన్యవాదమనియు పేరుగల్గెను.

ఆత్మయున్నని యొప్పుకొనకపోయినను పురాకృత సుకృత దుష్కృతములంబట్టి కర్మవిపాకమునుబట్టి నామరూపాత్మకమగు దేహమీ యశ్వరజగత్తునందు పలుమారు లుద్భవింపవలసివచ్చుచుండుననియుజన్మరాహిత్యమునొందిస్థిరమగు శాంతినిబొందుటయావశ్యకమనియు బుద్ధుడొప్పుకొనినాడు.

సంసార దుఃఖములనుండి దప్పించుకొని శాశ్వత సౌఖ్యమును బడయుటకై నిరూపింపబడినమార్గములీయుభయ మతములందు నొక్కటియే. సర్వసంసారిక దుఃఖములకును తృష్ణయే కారణభూతముగావున, ఇంద్రియనిగ్రహధ్యాన వైరాగ్యములచే నీతృష్ణను రూపుమాపి, భైక్షుకవృత్తి నవలంబించుటయె పునర్జన్మదుఃఖమునుండి బయలు పడుటకు త్రోవయని గౌతముడు నిరూపించెను. సన్యాసమువలననే శాశ్వతమగు శాంతి సుఖము చేకురునని బుద్ధుని యభిప్రాయము. మోక్షప్రాప్తికై యుపనిషత్తులందు చెప్పబడినమార్గము గూడ నిట్టిదే.

వైదికమను మతమున బ్రహ్మైక్య సంధానమునకు బౌద్ధులు నిర్వాణమందురు. నిర్వాణమన విరామము బొందుట. దీపమారిపోవునట్లు వాసనలు నశించుట.

బౌద్ధమతమున సన్యాసదీక్ష మిగుల ప్రాముఖ్యమైనది. బౌద్ధమతము సన్యాసపరమైనది. సన్యాసప్రవృత్తివలననే సంసార బంధనములనుండి విముక్తిగలిగి నరుడు నిర్వాణపదముచేరగలడని బుద్ధునిమూలసిద్ధాంతము. సంసారసుఖముల త్యజింపక విషయలంపటుడై గృహస్థాశ్రమమునందే మునిగియుండు మనుజుడు పరమపదము అర్హతావస్థ సిద్ధింపదని బుద్ధుడు స్పష్టీకరించెను.

అయినను బౌద్ధమతము గార్హస్థ్యధర్మముల బొత్తిగ నిరసింపలేదు. బౌద్ధమతమునగూడ గృహస్థులుగలరు. సన్యాసము స్వీకరింపకుండగనే బుద్ధుడు, బౌద్ధధర్మము, బౌద్ధసంఘము అనునీ త్రిరత్నములయందును విశ్వాసముంచి 'బుద్ధం శరణం గచ్ఛామి' 'ధర్మంశరణం గచ్ఛామి' సంఘం శరణం గచ్ఛామి' అని సంకల్పము జెప్పకొని యీ మణిత్రయమును శరణుజొచ్చువారు బౌద్ధమతమునందుపాసకులనిపేరు వీరే బౌద్ధులలో గృహస్థులు. వీరుతమ గార్హస్థ్యము నెట్లు నెరపవలయునో బుద్ధుడు నిర్ణయించి యున్నాడు. * వైదికమతమున జెప్పబడిన గృహస్థధర్మములలో యజ్ఞయాగాది క్రతువులను చాతుర్వర్ణ్యవిధానములను గౌతముడు నిరసించెను. తక్కినస్మార్త పంచమహాయజ్ఞములు పరోపకారధర్మములు బౌద్ధగృహస్థులెల్లరు నాచరించి తీరవలయునని బుద్ధుడు శాసించెను. అహింస, సత్యము అస్తేయము, భూతదయాపరత్వము శౌచము, సత్పాత్రదానము మున్నగునవి బౌద్ధగృహస్థు లాచరింపవలసిన ధర్మములని యతడు నిర్ణయించెను

---

* "మహాపరినిబ్బాణసుత్త" చూడుడు.

యజ్ఞయాగాది క్రతువులందును చాతుర్వర్ణవిభేద ములందుమదక్క వైదిక గృహస్థ ధర్మములకును బౌద్ధగృ హస్థ ధర్మములకును అణుమాత్రమైన తారతమ్యము గాన్పిం పదు. వైదికమతనియమములనే బుద్ధు డనుకరించెను.

పై యుదాహరణములవలన వైదిక బౌద్ధమతముల కంతగ భేదములేదని స్పష్టమగుచున్నది.

## హీనయానమహాయాన విభేదములు

గౌతముని జీవితకాలమున బౌద్ధమత మిట్టి సులక్షణము లతో వెలువారెను. అశోకుని మరణానంతరము బౌద్ధమతము అద్భుతముగ మార్పునొందినది. క్రీ. పూ ప్రథమశతాబ్ద మున నెప్పుడో యీ మహామతము ద్వివిధశాఖలుగ జీలిపో యినది. ఈమతము జనసామాన్యము నాకర్షించి విశేషముగ వ్యాప్తినొందుటకై యిందు మెల్లగనిరీశ్వర నివృత్తిచొప్పింప బడినది. వైదికభక్తిమార్గముననుసరించి బుద్ధునియుపాసన ప్రారంభమయ్యెను. బుద్ధభక్తులు బయలుదేరిరి బుద్ధుడు స్వయంభువనియు, ఆద్యంతరహితుఁడగు పురుషోత్తముని యవతారమనియు, బుద్ధునినిర్వాణము లీలామాత్రమనియు ఉపదేశింపసాగిరి. ధర్మగ్లానియగునెడల ధర్మప్రతిష్ఠాపనకై బుద్ధుడే మరల మరల లోకమున నవతరించుననిదేవాది దేవుడగు బుద్ధుని భజించుటవలన, నాతని విగ్రహము నారా ధించుటవలన స్వర్గలిప్రాప్తించునని బౌద్ధగ్రంథములందు ప్రతి పాదింపబడజొచ్చెను ఇట్లు ప్రవృత్తిపరమగు భక్తిమార్గము

బౌద్ధమతమున స్వీకరింపబడసాగినది. కాని సంసారజలధిని దాటుటకు భిక్షుకమార్గమే శరణ్యమను బౌద్ధమతమూల సిద్ధాంతమును మాత్రము వీరు మార్పునొందింపజాలరైరి. అట్లొనర్చుటవలన బుద్ధుని ప్రథమోపదేశమునే తారుమారు గావించుటయగును. కాని భిక్షువైనను ఖడ్గమృగమువలె నిర్జనారణ్యభూముల నేకాకియై సంచరించుటకంటె లోకహిత కార్యముల నిరీప్సితముగ నిర్వర్తించుటయే మేలని వచింప జొచ్చిరి. గృహస్థాశ్రమమునుండి నిర్వాణపదము నొందుట బొత్తిగ నసంగతముకాదని వీరు వాదింపదొడగిరి. ఇట్టి నూతన ధర్మములతో నుద్దీపితమగు అంతశ్శాఖ యొకటి క్రీ. పూ. ప్రథమశతాబ్దిప్రాంతమున బౌద్ధమతమున బయలువెడలినది. దీనికే మహాయాన మతమనిపేరు. ఈ నూతనమత ప్రవక్త ప్రఖ్యాతయశుడగు నాగార్జునయతి* బుద్ధుని మొదట యుప దేశము ననుసరించుట హీనయాన మనబడెను. హీనయానము సన్యాసపరము. నివృత్తిపరము. మహాయానము ప్రవృత్తిపరము. భక్తిపరము.

ఇట్లు బౌద్ధమతము అశోకునితరువాత హీనయాన మహాయానములనబడు రెండుశాఖలయ్యెను. ప్రకృతము చీనా, జపాను త్రివిష్టపము మున్నగు రాజ్యములలో ప్రబలెడు మతము మహాయానము. ఇదియే ప్రాచ్యఖండమంతయు

* ఈతడు ఆంధ్రుడు యొక పతిత ఇదియే నిజరకునిజమో తెలియదు. శాతవాహనుల రాజధానియగు అమరావతియందు కొంతకాల మితడు నివసించెను. ఈవిషయమై చరిత్రపరిశోధనలింకను కావలసియున్నవి.

వ్యాపించినది. బౌద్ధమతము ఆసియాఖండ మంతటను ప్రాకుటకు కారణము మహాయాన బౌద్ధభిక్షువుల నిరంతరదీక్షయే.

## బౌద్ధమతక్షీణత.

ఎందువలననో గాని బౌద్ధమత సిద్ధాంతముల విశిష్టత భారతవర్ష మతక్షేత్రమున శాశ్వతముగ నిలువజాలక విస్మృతములై పోయినది. అశోకుడు దివికేగిననాటనుండియు బౌద్ధమతము క్షీణింపసాగినదని వ్రాసియుంటిమి అట్లు క్షీణగతినొంది యిది భారతవర్షమున పేరైనలేకుండ యంతర్హితమై పోయినది. ఫాహియాను దర్శించిన కాలమునాటికే బౌద్ధమతప్రాభవ ముడిగిపోవ సాగినది. బుద్ధుడు బ్రతికియుండిన కాలమున అశోకసార్వభౌముడు రాజ్యమేలిన కాలమున జనసంకీర్ణమై కలకలలాడుచుండిన బౌద్ధక్షేత్రములు విహారములు, ఆరామములు పాడువడి జనశూన్యమై కళావిహీనమై వెలవెలలాడుచున్నవని ఫాహియాను విలపించినాడు.

ఇట్లు క్రమక్రమముగ క్షీణించి, కనిష్క, హర్షవర్ధనుల కాలమున మరల నొక్కవెలుగువెలిగి, నెట్లో పండ్రెండవ శతాబ్దమువరకు నీమతము కొనయూపిరితో నున్నది. ఈనాటికే భారతవర్షమునందలి మఠములన్నియు కాలవాహినిలో గలసి పోయినవి. ఒక్కబీహారమునమాత్రము కొన్ని నిలచినవి. మహమ్మదీయుల దాడులతో నివియు అంతరించి భారతఖండము బౌద్ధమతశూన్యమై పోయినది. బౌద్ధమతము భారతవర్షమున మటుమాయమై పోయినది. బౌద్ధ

మతవైభవ చిహ్నములగు స్తూపములు విహారములు, మఠములు, ఆరామములు, జీర్ణించి కాలగర్భమున మాసి పోయినవి.

భారతవర్షమున నంతరించినను తక్కటిచోట్ల మాత్రమీమహామతము నిలచిపోయినది. చీనా, త్రివిష్టప, శ్యామ (సయ్యాం), బ్రహ్మ దేశములందును జపాను, సింహళ, యవ, సుమిత్ర ద్వీపములందును బౌద్ధమతము నేటికిని ప్రబలియున్నది. ఈ పృథ్వీతలమున గల మతములన్నిటిలో నిదియె నేటికిని యుత్తమస్థాన మాక్రమించియున్నది

ప్రపంచము నంతటను నాకర్షింపగల్గిన మహామతము దానిబుట్టినిల్లగు భారతవర్షమున రూపుమాసిపోవుటకు గారణ మేమి? బ్రాహ్మణమతవైరమని కొందరు పాశ్చాత్య చరిత్రకారులు వ్రాయుదురు. ఇదియసంగతము. ఏలన బౌద్ధన తావలంబుడగు హర్షుని కాలమునగూడ నీమతమునకంత ప్రాబల్యములేదు అశోకుడు పరమపదించిన నాటనుండియు యీమతము క్షీణింపసాగినదని వ్రాసితిమి. కనిష్కహర్షవర్ధనులు దీని పలుతెరంగుల పోషించిరి. కాని యీమతము పూర్వపువైభవముల నందజాలకపోయినది. భారతవర్షము నేలిన మహాసామ్రాజ్యాధిపులచే పోషింపబడుచున్నను క్షీణించుటచే నీమతక్షీణతకుగారణము వేరుగనుండియుండునని యొప్పుకొనక తప్పదు. ఇదిగాక పూర్వకాలమున భారతవర్షమున నెప్పుడును అన్యమతసహనమె ప్రబలినదిగాని, మతవైరములు మతకల్లోలములు పొడసూపినట్లు గన్పింపదు. బౌద్ధమతము పెక్కుశింపము

లందు వ్యాపించినది. జైనమతము ఆర్యావర్తమెల్ల పరిసరించి నది. కాని యెన్నడును, తద్ మతకర్తలు ప్రోద్బలముచే,ఖడ్గబల ప్రయోగముచే, మాయోపాయములచే రాజ్యాధికారమును వినియోగించి భూముల, ధనముల, ఉద్యోగముల, నాసవెట్టి తమ మతముల వ్యాపింపజేసినట్లు యేగ్రంధమునను లేదు. నాల్గవ శతాబ్దమునాటికే బ్రాహ్మణమత విజృంభణముప్రారంభమైనను యీయుభయ మతావలంబులును యెందురులు కలహించు కొనుచుండినట్లు ఫాహియాను వ్రాసియుండలేదు. బ్రాహ్మణ బౌద్ధమతావలంబులు పరస్పరానురాగముతో ఒకయింటి బిడ్డలవలె సోదరభావమున మెలగుచుండుటగాంచి ఫాహి యాను ఆశ్చర్యమొందినాడు ఇదిగాక బ్రాహ్మణమతాభి మానులగు గుప్తసంతతిరాజులు బౌద్ధులయెడ నెట్టివైరమును బాటింపక బౌద్ధబ్రాహ్మణయతుల సమదృష్టితో జూచుచు యుభయులకు సమముగ పారితోషికముల నొసగుచుండిరని చరిత్రలుఘోషించుచున్నవి మఱియు కాశ్మీర, కళింగ, మహా రాష్ట్ర దేశములనేలు నృపులు వైష్ణవ, శైవమతముల స్వీక రింపుచు శివవిష్ణువుల నారాధించుచుండ వారి పట్టంపురాణులు బుద్ధదేవునకు స్తూపములు, విహారములు గట్టించెదు వారని తెల్పు శిలాశాసనములు పెక్కులిటీకల గాన్పించినవి

ఇదియునుగాక హింసవలన,ప్రోద్బలమువలన, మారణ ప్రయత్నములవలన యేమతమును ఏజాతియు నశింప నేరదు. ప్రపంచ చారిత్రయందిట్లు నశించిన శాస్త్రాణములు గానరావు ప్రొటెస్టెంటుమతమును హతమార్పవలెనని అఖండప్రయత్నము లొనర్చిన రాథలిక్కుమతమున కేపాటి

విజయముం గల్గినది? ఒకమారు వేలకొలది ప్రొటెస్టాంటు స్త్రీ పురుషుల కంఠములదునిమి రుధిరప్రవాహముల పొర్లాడించినను శతసహస్ర సంఖ్యాకుల దారుణాగ్నికీలల కాహుతి యొనర్చినను యీమతము నశించిపోయినదా? మహమ్మదీయ మత నిశితఖడ్గధారలకు గురియై హిందూమత మంతరించినదా? అట్లెన్నడును గానేరదు.

బౌద్ధమతవినాశమునకు గారణము వైదికమతపీడనము గాదు. బౌద్ధమతము నశింపనే లేదు. ఎందుండి యుద్భవమైనదో అందే లీనమై పోయినది అది వైదికమత మహాప్రవాహమున గలిసిపోయినది. వైదికమతమునుండి విడివడి వేరింటి కాపురము జేయ నుంకించిన బౌద్ధమతము మరల నామతమున సంక్రమించిపోయినది. బౌద్ధమతము హైందవ సాంప్రదాయముల నెరువు దెచ్చుకొన్నది. క్రమక్రమముగ వైదిక బౌద్ధమతములకుగల తారతమ్యములు రూపుమాసి రెండును ఐక్యమై పోయినవి.

శంకరుడుదయించి బౌద్ధమతమునందలి ప్రధానాంశముల నెల్ల తన మతమున గైకొని వైదిక బౌద్ధమతముల విభేదమును రూపు మాపెను. బౌద్ధమతమునకు ఈశ్వరాలంబన మిచ్చి వేదములపై నిలువబెట్టి శంకరుడు అద్వైతముగ మార్చి వేసెను. అందువలననే అద్వైతమునకు ప్రచ్ఛన్న బౌద్ధమని పేరు గల్గెను. అందుచేతనే బౌద్ధ మత మార్యావర్తమున నిజముగ నస్తమించిపోయినదని చెప్పుటకు వీలులేదు. ఈ మహామత మిచ్చట చిరస్థాయిగ నిలిచి పోయిన

కనియె చెప్పవలయును. ఇది బ్రాహ్మణ మతమున విలీనమై అందుండియే తన ప్రభావపుంజముల వెదజల్లుచున్నది.

బౌద్ధమతము వైదికమతమునానే అంతర్లీనమగుటకు గారణము. యజ్ఞయాగాదిక్రతునిషేధకమగు బౌద్ధమతము వైదిక మతమువలె జనులనాకర్షింపజాలకపోవుట. ఇదియె బౌద్ధమత క్షీణతకు ముఖ్యహేతువు. ఇదిగాక బౌద్ధమతమహాదుర్గమునకు రక్షకసైనికులనిపించుకొనిన బౌద్ధభిక్షువులు కొంతకాలమునకు వైరాగ్యహీనులై విషయసుఖముల మరగి తమ ధర్మములు విడనాడుటవలన గూడ నీమతమునకు హానివాటిల్లెను. మరియు వేదమతము మహావిశాలమైనది. అందెన్నియో మతములు లీనమైపోయినవి. ఎన్నియిక్కట్టులు సంభవించినను ఎన్నిపరమతక్రోధానలములకు గురియైనను నిది చెదరక చిరస్థాయిగ నిలచియుండుటకు గారణమిదియె.

## బౌద్ధమతము చేసినమేలు.

భారతవర్షమున నస్తమించినను యీమహామతము ఆర్యావర్తమునకు చిరస్మరణీయమగుమేలు జేసినది. ఆర్యానార్య భేదముల సంపూర్ణముగ రూపుమాపినది. వర్ణవిభేదముల కాఠిన్యత నుపశమింపజేసి యొకవిధమగు ఐక్యభావమును సమకూర్చి మౌర్యసామ్రాజ్యసంస్థాపనకు తోడ్పడినది. మహోత్కృష్టమగు అహింసాధర్మమును ప్రతిష్ఠించి లోకకల్యాణమునకు దారిజూపినది. సర్వసమత్వ సర్వసౌభ్రాతృత్వ స్వాతంత్ర్య ధర్మములబోధించి ప్రజాస్వామికప్రభుత్వ పద్ధ

తుల నెంపొందజేసినది. పశువధల మాన్పించినది. మానవ హృదయాంతరాళములందు కారుణ్యరసమును జిల్కినది. ప్రజల సౌశీల్యముల చక్కపరచి వాని సత్యాంతమృదులములుగ నొనర్చి వైచినది. సత్యసంధులుగను ధర్మనిరతులుగను జేసి వారిని నైతిక పథమున నడిపించినది. శిల్ప చిత్రకళల నపారముగ వృద్ధినొందించి కళాప్రపంచమున భారతవర్షమున కగ్రస్థానమిచ్చినది. హైందవకళాజగత్తునందు నూతన శిల్పరీతుల గల్పించినది. శివాలయగోపురములపై నెత్తబడు త్రిశూల కలశములు బౌద్ధస్తూపముల యనుకరణములని హావెలు పండితుడు నుడివియున్నాడు. వైదికమతమున విగ్రహపూజారాధనల బౌద్ధమతమే యంకురింపజేసినట్లుగూడ యనుమానము తోచుచున్నది. బౌద్ధమతము భారతవర్షమున సాంఘిక మానసిక స్థితులందెట్టి విప్లవమును గల్పించినదో ఫాహియాను వర్ణనలవలన విదితమగుచున్నది.



# బౌద్ధమహాయుగము.

## IV

### మహావీరశంకరులు.

బౌద్ధమహాయుగమున బౌద్ధమతమేగాక యింకను యితర మతములు ప్రబలినవి. వానినిగూర్చికూడ నిచ్చట నొక మాట జెప్పవలయును. ఈ యుగము సుపరిపాలనకు శిల్ప చిత్రకళాప్రావీణ్యములకు నౌకావాణిజ్యసంపదలకు ప్రజల సుగుణశీలములకు నాగరికతా వైభవములకెట్లు ప్రసిద్ధినొందినదో మహాప్రవక్తల జననమునకుగూడ నట్లే ప్రఖ్యాతిగడసినది. లోకమున మహామతముల స్థాపించి చిరస్మరణీయులైన మతకర్తలందరును యీ యుగముననే యుద్భవిల్లిరి. గౌతమబుద్ధునిమాట నుడివితిమి. ఈతడుగాక మహావీరశంకర క్రైస్తవ కన్ఫ్యూషియసులు చిత్రముగ నీకాలముననే యుదయించిరి. క్రైస్తవకన్ఫ్యూషియసులుఅన్యదేశముల బుట్టి అన్యదేశముల చెరిగినవారగుటచే వారినిగూర్చి యిట నంతగా ప్రస్తావింపబనిలేదు మహావీరశంకరులు భారతవర్షమున నవతరించిన మహాపురుషులగుటచే వారినిగూర్చియు వారి మతముల గూర్చియు యీసందర్భమున కొండుమాటలు నుడువవలసియున్నది.

### మహావీరుడు

భారతవర్షమున నుద్భవించిన ప్రఖ్యాతమతకర్తలలో మహావీరవర్ధమానుడు జైనమతమని జెప్పుకొను చుండుట

వినుచుందుము. భూతదయాప్రధానమగు నీజైనమతమును స్థాపించిన దీ మహావీరుడే. ఈతడు గౌతమబుద్ధునకు సమకాలీనుడు. క్రీ పూ. 597 సంవత్సర ప్రాంతమున నుద్భవించినాడు. ఈతని పూర్తియగు నామము మహావీరవర్ధమానుడు. చరిత్రలలో నీతడు మహావీరుడని మాత్రము పేర్కొనబడు చుండును. ఈతనిచరిత్రనుగూర్చి మనకంతగా తెలియదు. ఆధారములు ఖిలమైపోయినవి.

ఇతిహాసప్రసిద్ధమై లిచ్ఛవీ వంశనాయకవీరులకు రాజధానియగు వైశాలీనగర మీతడు పుట్టినచోటు. ఆకాలమున లిచ్ఛవీ వీరసంతతికి జెందిన క్షత్రియకుటుంబము లెన్నియో యీనగరమున నివసించెడివి. అట్టి క్షత్రియకుటుంబములలో నొకదానియం దీతడు జన్మించెను. లిచ్ఛవీవంశము ప్రాచీనభారతవర్షయితిహాసరంగమున మిగుల ప్రతిష్ఠగాంచిన వంశము. వీరవంశము. నిర్మలక్షాత్రతేజమునకు ప్రసిద్ధిగాంచినది. మనకు చిరస్మరణీయమైనది. దీనిచరిత్ర సువర్ణాక్షరములతో లిఖింపదగినది. విశ్వవిఖ్యాతమగు మహామతముల స్థాపించిన మతకర్తలు, మహాసామ్రాజ్యనిర్మాతలగు యోధులు, వీరాగ్రేసరులు, యీవంశమున నుద్భవించిరి. జైనమతస్థాపకుడగు మహావీరు డిందుపుట్టెను. ప్రాచ్యప్రపంచమంతయు బ్రాకి వెయ్యిసంవత్సరము లఖండవైభవము ననుభవించి నేటికిని యీభూవలయమునగల మూడవవంతు మానవాళిచే నవలంబింపబడుచు మహామతమని పేరుగాంచిన బౌద్ధమతమును ప్రతిష్ఠించిన మేధావి, పరమదయాళువు, గౌతము డిందే జనించెను. స్వాతంత్ర్య పహరులబారినుండి భారతస్వాతంత్ర్యమును

# బౌద్ధమహాయుగము

గాపాడి ఆర్యావర్తమునంతటను వలముకొనిన దుష్పరిపాలన
మును తెగటార్చి ప్రపంచమందలి మహాసామ్రాజ్యములలో
నగ్రస్థానమువహింపదగు మౌర్యమహాసామ్రాజ్యమును నిర్మిం
చిన రణప్రవీణ్యుడు, అఖండరాజనీతి విశారదుడు, చంద్ర
గుప్తుడీలిచ్ఛవీ వంశపురాచకన్నియనే వివాహమాడెను.

ఆకాలమున నిచ్చట రాజప్రభుత్వములేదు. పలువురు
క్షత్రియనాయకులును జేరి సమిష్టిగా రాజ్యపాలనము నెరపు
వారు. ఇట్టి రాజ్యపరిపాలనాపద్ధతికి నాయక సత్తాక రాజ్యాం
గమని పేరు. ఈరాజ్యవిధానమున నొకపాలనకర్తగనుండిన
ఒకానొక క్షత్రియనాయకుని చిన్నికుమారుడు మన మహా
వీరుడు. ఈతడు ముప్పదేండ్ల ప్రాయమప్పుడు విరాగియై,
రాజ్యభోగముల విడచి సంసారమును త్యజించి పారసనాథు
లను సన్యాసులలో గలసి రెండువత్సరములు వారిమఠమున
నివసించెను. కాని వారిమతవ్యాపారములతో నీతనికి సరిపడ
లేదు. వారి మతసిద్ధాంతము లీతనికి సంతృప్తి కలిగింపలేదు.
ఈతనిహృదయమున ప్రజ్వలించుచున్న వైరాగ్య తృష్ణాన
లము జల్లారలేదు. అంత నీత డొక నూతనమతమును యో
జించి ప్రజలకు బోధింపదొడగెను. దీనికే జైనమతమని పేరు.
అన్యమతస్థాపకుల నిమతావలంబులు జినులనుటచే యీ మత
మున కీపేరువచ్చినది. అప్పటి కీతనికి నలువదేండ్లప్రాయము.
అప్పటినుండియు మహావీరుడు అంగ, విదేహ, మగధరాజ్యము
లెల్ల తిరిగి తనమతమును వ్యాపింపజేసెను ఆకాలమున నీదే
శముల పాలించురాజు లీ నూతనమతమును స్వీకరించి దానిని
తమయభిమానమతముగజేకొనిరి. ఈతనికాలమున మగధనేలిన

బింబిసార అజాత శత్రులు యీతని జననివంక పీతనికి సమీపబంధుగులగుటచే వీరు జైనమతావలంబకులై యీతని కెంతయు బ్రోత్సాహము గల్గించిరి. ఇట్టీతడు ముప్పదియేండ్లు మతప్రచారమొనర్చి మగధ, విదేహముల్లను రాజ్యములలో జైనమతమును వ్యాపింపజేసి క్రీ. పూ. 527* సంవత్సరమున పాటలీపుత్ర సమీపమున నున్న 'పావా' యను గ్రామమున మృతినొందెను. ఈతడు పరమపదించు సరికి ఆర్యావర్తమున పదునాలుగువేల జైనమతావలంబు లుండిరని ప్రతీతి.

క్రీ. శ. రెండవశతాబ్దారంభమున జైనమతము శ్వేతాంబర దిగంబరయను ద్వివిధశాఖలుగ చీలిపోయినది.

ఈమతము క్రమముగ దక్షిణాపథమునకు గూడ బ్రాకి ఎనిమిది తొమ్మిది శతాబ్దముల నాటికి ఆంధ్రతమిళ రాజ్యములెల్ల బ్రసరించినవి. ఆంధ్రదేశమున అమలాపుర సమీపమున "తాటిపాక జేనుదేవుని"ను సామెత తరుచుగ వినుచుందుము. జైనమతమున విగ్రహారాధన గలదు. జైన విగ్రహము లాజాను లంబితములై యత్యంత గంభీరముగ నిర్మింపబడెడివి. అందువే తాటిపాకప్రాంతమందు దీర్ఘకాయులను జైనవిగ్రహములతో బోల్చుట యాచార

* ఈతని నిర్వాణకాలము చరిత్రకారులెవ్వరును సరిగ నిర్ణయింపలేదు. పలువురు పలువిధముల తమయూహకు దోచినట్లు వ్రాసిరి. పరిశీలింపగ క్రీ. పూ. 527 సంవత్సరమే యీతని సరియగు నిర్వాణకాలమని దేలినది. ఈ నా నిర్ధారణకు గల ప్రమాణముల నెల్ల నాతొలిపలుకున వివరించితిని.

మయ్యెను. దీనినిబట్టి ప్రస్తుతగోదావరిజిల్లాలోని తాటిపాక సీమలో ఒకప్పుడు (ఎనిమిదితొమ్మిది శతాబ్దములలో అయి యుండును.) జైనమతము గాఢముగ ప్రబలియుండినట్లు గాన్పించుచున్నది. ఆంధ్రదేశమున పెక్కుచోట్ల జైనమత దేవాలయ శిధిలములు విగ్రహశకలము లింకను గాన్పించు చుండును. గణపతియారాధన జైనులతోడనే ప్రారంభమైన దని చాలమంది చరిత్రకారుల యభిప్రాయము. విజయ వాడలో బందరుకాలువ త్రవ్వుచుండగా దొరికిన గణపతివిగ్రహము జైనులచే జెక్కింపబడినదై యుండునని దోచుచున్నది. ఈవిగ్రహ మిప్పుడు బెజవాడయానకట్టకు సమీపముననున్నది. దానికి పునః ప్రతిష్ఠజేయబడి పూజాపునస్కారములు జరుప బడుచున్నవి. ఈవిగ్రహము బ్రహ్మాండమగు రాతిబండలో జెక్కబడి కడుమనోహరముగ నున్నది.

తొమ్మిదవశతాబ్దమున నీమతము పశ్చిమసముద్రతీరమున మధుర, మైసూరుప్రాంతములందు కూడ వ్యాపించినట్లు నిద ర్శనములు కనబడుచున్నవి. కాంచీపురమున అకలంకుడను నొకజైనాచార్యుడు వాక్ప్రారంభమున బౌద్ధుల నోడించి వెడల నడిపించెనని జైనగ్రంథములలో వర్ణింపబడినది. తమిళ కన్నడ భాషలలో పెక్కుజైనగ్రంథములు వ్రాయబడియున్నవి. కాని జైనమతము బౌద్ధమతమువలె హిందూదేశసరిహద్దులుదాటి పోవలేదు.

ఏమైననేమి యీమతప్రాభవము ఆర్యావర్తమున చిర కాలము నిలువలేదు. శైవ వైష్ణవమత ప్రాబల్యములచే నీ

మతము మరుగువడి పండ్రెండవశతాబ్దమునాటికి క్షీణించిపోయి నది. క్షీణించినను బౌద్ధమతమువలె నీమతము భారతవర్షమున సంపూర్ణముగ అంతర్హితమై పోవలేదు ఇప్పటికిని, కొంకణ, మైసూరు,గుజరాతు, కతియవాడ,రాజపుత్రస్థానము మున్నగు ప్రాంతములందు సజీవముతో నున్నది. గుజరాతురాష్ట్రమున స్ఫటికపుశిలలతో నిర్మింపబడి వెండిబంగారపు నగిషీలతో శిల్పపు పనులతో కనులపండువజేయు అత్యంతమనోహరములగు జైన దేవాలయము లెన్నియో గలవు. పూర్వకాలమున నెప్పుడో నిర్మింపబడిన ఏబదిఏడడుగుల నిడివిగల బ్రహ్మాండమగు జైన విగ్రహమొకటి మైసూరులోని శ్రావణ బెల్గోలాలో నున్నది. ప్రపంచమున నెచ్చటను ఇంతటి గంభీరమగువిగ్రహము లేదు. ఉడిపిసమీపముననున్న కార్కల్లులో ముప్పది యారడుగుల పొడవుగల్గిన యత్యంతసుందరమగు విగ్రహ మింకొకటిగలదు. పదియేండ్లకొకసారి యీవిగ్రహములకు మహావైభవముతో అభిషేక మహోత్సవములు జరుగును. అప్పుడు యావద్భా రతవర్షమున నివసించెడు జైనులందరును యీయభిషేక మహోత్సవముల నవలోకింప నచ్చటికిబోయెదరు. మైసూరు నందలి 'శాలిఖానా'యను గ్రామమున భద్రబాహుడను జైన యతి నివసించిన పర్వతగుహ యింకనుగలదు అందుచే శాలి ఖానా జైనులకు మహాపుణ్యక్షేత్రమయ్యెను. జను లెల్ల తెరపిలేక యీప్రదేశమును నేటికిని దర్శించిపోవుచుందురు

## జైనమత సిద్ధాంతములు

జైన బౌద్ధమతము లొకదానినొకటి బోలి, కవలపిల్లల వలె నున్నవి ఈ యుభయమతముల సిద్ధాంతముల పోలి

కనుజూచి కొందరు పాశ్చాత్యచరిత్రకారులు, జైనమతము బౌద్ధమతములోని యంతశ్శాఖ యేమోయని భ్రమపడినారు. కాని యిది సరికాదు. జైనమతము బౌద్ధమతములోని యుపశాఖకాదు. ఇది యొక ప్రత్యేకమతము. జైనమతము కొందఱనుకొనునటు హిందూమతమునకు విరుద్ధమతమును గాదు. అందుండియే యుద్భవమైనది. ఇది హిందూమత మహీరుహ శాఖపై గట్టబడిన నొక పిచ్చుకగూడు. హైందవ జైనమతములకు యావన్మాత్రభేదము. ఆర్యమత సిద్ధాంతముల బౌద్ధమతమువలె నిదియు నెరవు చేసుకొన్నది. జైనులు హైందవ దేవతలనే యారాధింతురు. హైందవ మతమునందువలె జైనమతమునందును చాతుర్వర్ణ్య విభేదములు గలవు. నేటికిని జైనులందరును హిందువులమని జెప్పుకొనెదరు నేడుగూడ జైనులు తమ గృహములందు నామకరణ, చౌల, అక్షరకర్మల, దేవాలయములలోని దేవతారాధనల బ్రాహ్మణపురోహితులచేతనే చేయించుకొనెదరు.

జైనమతమునకు ముఖ్య సిద్ధాంతము, ప్రాణబీజము అహింసాధర్మము. జైనమతమున జంతుజాలములు నెంత క్షుద్రకీటకములైన హింసింపరాదు మనుష్య పశు పక్ష్యాదులలోనె గాక మనము చైతన్య విహీనములను, జడములను, వృక్ష, వాయు, శిల, లోహ, ఉదక, అగ్ని మున్నగు పదార్థములందుకూడ జీవ మున్నదనియు వానికిని వృద్ధిక్షీతిలయము లున్నవనియు హానిగలిగిన నవియు బాధనొందుననియు జైనులు వాదింతురు. రాత్రిపడినవెనుక భోజనము చేసినచో చీకటిలో ప్రాణికోటి కేదేని హానిగలుగునని వీరు

సాయంసమయముననే భోజనాదికృత్యముల ముగింతురు. కంటికి దృగ్గోచరములగు జీవములు నీటిలో గలిసి లోనికి పోవునని ఉదకమును వడియబోయకుండ త్రాగరు. జైన రాజులు జీవహింస మహాపరాధముగ శాసించి దోషుల కఠినముగ దండించువారు. వారిశిక్షాస్మృతిలో జీవహింస కెక్కువ దండనగలదు. ఈకాలమునాటి ప్రవర్తకులందరును గౌతమమహావీరశంకరులు అహింసా. తంత్రినే మాటిమాటికిని మీటుటవలన అప్పటికి ఆర్యమతము జీర్ణమై పశువధాభూయిష్ఠమై యుండెనని యూహింపవలసివచ్చుచున్నది.

భగవానుడు విశ్వప్రపంచనిర్మాత, సర్వశక్తియుతుడు, సర్వాంతర్యామియని వీరు విశ్వసింపరు. భగవంతునినొకసుగుణ రాశిగ వీరు భావింతురు సృష్టియు, జీవులును, అకల్పితములు, అనాదులు, అవినాశులని వీరివాదన. మఱియు భగవంతుడు మనుజుల శిక్షింపడు. రక్షింపడు మనుజుల సదాచార దురాచారములే వారిని రక్షించును,శిక్షించును సర్వేశ్వరుడు శక్తిమంతుడయ్యును తటస్థునివలె మనుజకర్మల నవలోకించుచుండును జైనమతమునకూడ స్వర్గ నరకలోకములు గలవు. మర్త్యలోకమున కధోభాగమున నేడు నరకములును ఊర్ధ్వభాగమున పదునారు దేవలోకములును వీనికి పైన ఆగమీంద్రలోకమును గలవు. ఆగమీంద్రలోకమున సర్వేశ్వరుడు నివసించును. మరణానంతరము పుణ్యాత్ములందరును యిచ్చటికే పోయెదరు. పాపాత్ములు అధోలోకమున బడెదరు. జైనమతగురువులకు తీర్థంకరులని పేరు. ఇంతవరకును యిరువదినలుగురు తీర్థంకరులు భూతలమున

నుదయించిరని జైనమతగ్రంథములలో వ్రాయబడినది. వీరిప్రతిమలు ప్రతిజైనదేవాలయమునందును గాన్పించును. దేవతలకంటె నెక్కుడుగ భావించి జైనులు వీరి నారాధింతురు. భౌతిక ఆధ్యాత్మిక పదార్థసమ్మేళనమువలన మనుజుడుద్భవమయ్యెనని వేదము లపౌరుషేయములు కావనికూడ వీరు జెప్పుచుందురు.

జైనమతము అహింసావ్రత ప్రాబల్యమునకు శిల్పకళాభివృద్ధికి మిగుల తోడ్పడినది. జైనవిగ్రహము లత్యంత గంభీరములైనవని నుడివియుంటిమి వీనికంటె నెత్తగు శిలా విగ్రహములు ప్రపంచమున లేవు. జైనదేవాలయములు అతి సుందరము లైనవి. సౌందర్యమున వీని మఱపించు దేవాలయములు భారతవర్షమున మరెచ్చటను గానరావు. ఆబుపర్వత శిఖరముపైనున్న జైనదేవాలయము ప్రపంచ శిల్పచిత్రములలో నొకటి అంతటి సొబగులీనెడు దేవాలయము భూలోకమున నెక్కడను లేదు.

## శంకరుడు.

శంకరుని నామమిచ్చట పేర్కొనుట పలువురు చరిత్రకారుల కాశ్చర్యము గల్గింపవచ్చును. కాని యీతడు నిజముగ బౌద్ధయుగమున క్రీస్తుకుపూర్వము ఉద్భవించినట్లు పెక్కు నిదర్శనము లున్నవి బౌద్ధయుగమున నెప్పుడు బుట్టెనో నిర్ధారణగ జెప్పలేకున్నను బౌద్ధయుగమున క్రీస్తుకు పూర్వముమాత్రము బుట్టినట్లు నిస్సందేహముగ జెప్పవచ్చును. అట్లు నుడువుటకు ప్రబలమగు ఆధారములున్నవి. ఈతని

కాలమును గూర్చి పలువురు పలువిధములుగ వ్రాసిరి. త్రివిధ ప్రపచరిత్రకారు లీతడు బుద్ధుడు నిర్వాణముజెందిన ఏబది సంవత్సరములకు అనగా క్రీ. పూ. 492 సంవత్సర ప్రాంత మున నుద్భవించెనని వ్రాసిరి. కాని యిటీవల గావింపబడిన చరిత్ర పరిశోధనలవలన నీతడు క్రీ పూ. రెండవశతాబ్దమున పుష్యమిత్రునికి పూర్వమో పుష్యమిత్రుని కాలముననో నరలిపట్లు దేలుచున్నది. పతంజలి పుష్యమిత్రుని కాలమున మనినట్లు నిదర్శనములు గన్పించినవి.శంకరుడు పతంజలి శిష్యు డగుటచే శంకరుడును యీకాలము నాటివాడేయని యూహిం పవచ్చును. ఈవిషయము నాతొలిపలుకునసాంతముగ చర్చిం చితిని. పాశ్చాత్యచరిత్రకారులీతడు క్రీ. శ 8-9శతాబ్దముల లోనెప్పుడో యుదయించెననియు బౌద్ధుల హింసించి వారిని హతమార్చెననియు అతనికి హత్యాకాండ మాపాదించి ఏవే వో తప్పుడువ్రాతలు అజ్ఞానమువలననో, పక్షపాతమువలననో వ్రాసిరి. ఇంచుకైనను విమర్శింపక మనవారు రోషం...పాట గా యీవ్రాతల ననుకరించిరి. సంతాపకరము. మనభాష, మనవిజ్ఞానమును, మన మతమును మననాగరికత, నెఱుంగని మనసారస్వతముతో నించుకంతయు పరిచయములేని అన్యదే శీయులు, మతాంతరులు మనమతకర్తలగూర్చి వ్రాయుట యు, మన మావ్రాతల వేదసూత్రములుగ వ్యాసప్రోక్తమో లుగ స్వీకరించుటయు-ఎంతటిగలి పట్టినది! మనపరాధీనత ఎంతవరకు బోయినది?

శంకరుని నామమును స్మరింపని హిందువుడుండడు. ఇప్పుడు భారతవర్షమున ప్రబలుచున్న మతములలోని కెల్ల

నగ్రస్థానమును వహించి, యిచ్చట నివసించు హిందువులలో నూటికెనుబదిమంది చే నవలంబింపబడుచున్న అద్వైతమతమను మహామతమును స్థాపించిన దీతడే. హిందువులీతని శివుని యపరావతారముగ భావింతురు. ఈతని చరిత్రమును గూర్చిన యాధారములు మనకంతగా లేవు. శంకరుడు మళయాళదేశమున నొక కుగ్రామమునందొకానొక బ్రాహ్మణ గృహస్థునియింట బుట్టెనని ప్రతీతి. కొందరీతడు చిదంబరమున బుట్టెనని జెప్పుదురు మరికొందరు కాశ్మీరమునయని వాదింతురు ఏగ్రామమున బుట్టెనో నిర్ధారణగ జెప్పుటకు వీలులేకున్నను, మొత్తము మీద నీతడు దక్షిణహిందూస్థానమున మాత్రము జన్మించెనని జెప్పుటకు జాల ప్రమాణములున్నవి.

శంకరుడు యోగసూత్రరచయితయగు పతంజలి యొద్ద* యోగశాస్త్ర సంస్కృతవిద్య లభ్యసించెను. ఈతడు కాశీక్షేత్రమున గూడ కొన్నేండ్లు వేదశాస్త్రముల పఠించి యపారపాండిత్యమును గడించెను.

శంకరుడు గృహస్థాశ్రమమును స్వీకరింపకుండగనే సన్యసించి ఆసేతుశీతనగపర్యంతమధ్య భారతభూమినంతయు దిరిగి తనయద్వైతమతమును బోధించెను బౌద్ధమతధర్మముల

శంకర విజయములలో (శంకరుని జీవిత చరిత్రముల వర్ణించు గ్రంథములు) ఈతడు గోవిందయోగియని చెప్పబడుచుండును. పతంజలి సన్యాసమును స్వీకరించినంతనే గోవిందయోగియను సన్యాసనామమును ధరించెననియు పతంజలియు గోవిందయోగియు నొకరేయనియు, విద్యారణ్యులు తన శంకరవిజయమున అయిదవ అధ్యాయమందలి 95, 96, 97 శ్లోకములలో స్పష్టీకరించినాడు.

పెక్కింటి నీతడు తనమతమున గైకొని బౌద్ధవైదిక మతములకు గల తారతమ్యము నడుగంటజేసెను. అహింసయే పరమధర్మమని యీతడును బోధించెను. అందువలననే యితని మతమునకు బ్రచ్ఛన్నబౌద్ధమని పేరుగల్గినది. తనమతప్రాబల్యమునకై శంకరుడు భారతవర్షమునకు నాలుగుమూలలను నాలుగు సన్యాసిమఠములను స్థాపించెను. ఉత్తరహిందూస్థానమునకు బదరీ కేదారమునను దక్షిణదేశమునకు శృంగేరియందును పశ్చిమఖండమునకు ద్వారకయందును పూర్వహిందూస్థానమునకై జగన్నాథమునను నాల్గు మఠములు నిర్మించెను. అద్వైతమత మహాదుర్గమునకివి నాలుగును నాల్గు బురుజులుగ నున్నవి. ఈమఠాధిపతులు చిరకాలము కడుసమర్థతతో అద్వైతమతమును సంరక్షించిరి. ఈబురుజులు, శిథిలములుగానంతవరకును అద్వైతమతమహాదుర్గము సురక్షితముగ అవిజేయముగ నున్నది. ఇవి శిథిలములగుట ప్రారంభించుటతోడనే యీమతమును శిథిలమగుచున్నది క్రైస్తవమహమ్మదీయ మతముట్టడులలో ఈ బురుజులీ మతదుర్గమును బలీయముగ గాపాడినవి. కాని కాలవశమున బురుజులు ఖిలమైపోయినవి. దుర్గమున శత్రువులు ప్రవేశించుచున్నారు.

శంకరుడు ముప్పదియారేండ్లుమాత్రమే లోకమున జీవించెను. ఇతడు పదియేండ్లకంటె నెక్కుడుకాలము తన మతప్రచారము చేసినట్లు గన్పించదు ఇంత స్వల్పకాలముననే ఇతడు తనయఖండ ప్రతిభావిశేషముచే అద్వితీయవచనాకౌశలముచే శరవేగమున తనమతమును వ్యాపింపజేసెను.

ఇరువదేండ్ల పసిప్రాయముననే మతవ్యాపనకు గడగి యనేక మతవాదముల నెరపి విజయముల గొనుటచూడ నీతడు అనన్యసామాన్య ప్రతిభాశాలియని స్పష్టమగుచున్నది.

ఈతడు అద్వితీయ వాగ్ధాటి గలవాడు. వాగ్వ్యక్షమున నీతని జయింపగలవక్తలెవ్వరును ఆకాలమున లేరైరి. పెక్కు రాజులచే నీతడు గౌరవములందెను

ఈబాలయోగి, వ్యాసునిచే రచియింపబడిన వేదాంత సూత్రములకును ఉపనిషత్తులకును భగవద్గీతలకును భాష్యములు వ్రాసెను వీనికే ప్రస్థానత్రయమని పేరు యుక్తివాదమున వీనినిమించినగ్రంథములు సంస్కృత సారస్వతమున లేవు.

శంకరుడు బదరీకేదారములో ముప్పది యెనమిదవ యేట దేహము చాలించెను ఈతడు బౌద్ధులతో ఘోర రణము నెరపి, వారిని చిత్రవధల గావించి, వారి విహారముల చైత్యముల, స్తూపముల బడగొట్టించి యామతమును విధ్వంప మొనర్చెనని యీతనిపై నొకయపవాద గల్పించిరి ఈనుడులు సత్యవిరుద్ధములు వీరికెవరు కారకులో జెప్పలేము కాని శంకరుడు యిట్టికిల్బిషములచే తనహస్తముల కళంకితముల జేసికొనలేదు. ఈతడట్టి ఘోరహత్యల గావించునంతటి కిరాతుడుగాడు చరిత్రపరిశోధనవలన నీయపవాద కేవల కల్పితమని తేలుచున్నది. వేదాంతగ్రంథములలో శంకర విజయము లో నీతడు అత్యంత శాంతస్వభావుడనియు, సహనశీలుడనియు నీ తనసంకీర్తి గండదలసిన సులక్షణము

లన్నియు సీతనికడ మూర్తీభవించినవనియు వర్ణింపబడినాడు. బ్రహ్మసమాజ మతస్థాపకుడగు రామమోహనుడు గూడ శంకరుడిట్టి సుగుణపుంజమేయని వర్ణించినాడు. ఇదిగాక యీతడు తనజీవితకాలమున బౌద్ధులతో నెప్పుడును మత వాదములగూడ సలిపియుండలేదు. అట్లు నుడువుటకాధారము లెవ్వియు లేవు. శంకరుడు బౌద్ధులలో మతయుద్ధమునకు గడంగి వారిని పలుబాధలపెట్టి, తన జీవితకాలమంతయు నామత విధ్వంసమందే మునిగియుండు నెడల, ఆమతవినాశమే తనపరమధర్మముగ నెంచినయెడల, తన యుపదేశము లన్నియు ఆమతమునందలి లోపముల విమర్శించుటకే జేసి నచో, ఆమతమునుగూర్చి యెక్కడపలుకైనను ఆడడా? ఆమత సిద్ధాంతముల తనగ్రంథములందు విమర్శింపడా? ఆతని గ్రంథ ములన్నియు నేబదియారు మారులు తిరగవేసినను, బౌద్ధమత మునుగూర్చి యుల్లేఖన యెక్కడనియు గాన్పింపదు. ఆమత సిద్ధాంతములను తనగ్రంథములందు స్మరింపడు వానిఖండనకు గడగడు.

మఱియు శంకరుడు ఏనిమిది తొమ్మిది శతాబ్దము లలో నుద్భవించెననియు ఈశతాబ్దములలోనె యీతడిట్టి మతయుద్ధమును నడిపెననియు వ్రాయుదురు. ఇది యెంతయు అసందర్భముగ నున్నది. ఏలన బౌద్ధమత మీయుగములనాటికి అత్యంత క్షీణదశలో నున్నది కొనయూపిరితో నున్నది ఇంతటి ఘోరయుద్ధము నడిపి యోడింపవలసినంత బలీయ ముగ లేదు. నాల్గవశతాబ్దమునాటికే యీమతము తైల విహీనమగు దీపకళికవలె వెలవెలబారుచున్నదని పాహి

యూచు వచించియున్నాడు అందుచే యింతటి హత్యాకాండలు నడుపుట కవశ్యము గన్పింపదు. మరియు శంకరుడు చచ్చిన పామును గొట్టునంతటి మందమతిగాడు. ఏమతకర్తయు అది వరకే పాడువడియున్న మతసౌధమును గూల్చుచు కాలము వ్యర్థము జేసికొనడు. శంకరుని యింతటి ప్రతిభాశాలి యద్వితీయనిర్మాణ కుశలుడు యట్టివ్యర్థపుకార్యములతో కాలము బుచ్చెననుట విశ్వాసనీయము గాకున్నది.

శంకరమఠాధిపతులందరును శంకరాచార్యులే యని పిలువబడుచుండుటచేతను అట్టి మఠాధిపతులలో పెక్కండ్రు తమపాండిత్యప్రకర్షకు, వాగ్వైభవమునకు అచంచల వైరాగ్యమునకు ప్రఖ్యాతివడసియుండుటచేతను యొకరికొకరికి భేదము తెలియక ఆతడే యీతడని పాశ్చాత్య చరిత్రకారులు పొరబడి ఆహత్యాకాండ మీాతని తలకు రుద్దియుండనోపు. ఈతడే యిట్టి హింసలగావించెనని తెల్పుటకు చరిత్రాధారము లెవ్వియు గాన్పింపవు. ఇదిగాక ఎనిమిది తొమ్మిది శతాబ్దములలో నట్టి మతకలహములు మతహింస లున్నవని నమ్మజాలము బౌద్ధమతక్షీణతకు గారణము హైందవమతపీడ నగాదని మున్నె నుడివియుంటిమి బౌద్ధమతము నెవరును విధ్వంసమొనర్ప లేదనియు, ఎందుండి యుద్భవమైనదో అందే విలీనమై పోయినదనియు బౌద్ధమతము భారతవర్షమున వినాశమే యొందలేదనియు, హిందూమతమునుండియే యది తనప్రభావపుంజములు వెదజల్లుచున్నదనియుకూడ వచించియుంటిమి. బౌద్ధులవిహారములు, స్తూపములు, చైత్యములు మహాత్మ

దేయులు నిర్మూలమొనర్చినట్లు ప్రబలముగు చరిత్రాధారములు గలవు. బౌద్ధస్తూపచైత్యవిహారవినాశకులు ముసల్మానులుగాని హిందువులుగారు. హిందువులు శిల్పసౌభాగ్యములతో మురిపెముల గొల్పెడు నీకట్టడముల చేతులార ధ్వంసమొనర్చుకొనునంతటి మూర్ఖులుగారు.

---

# బౌద్ధ మహా యుగము.

## V

### ఈకాలమున విలసిల్లినరాజ్యములు.

బౌద్ధయుగారంభకాలమున భారతవర్షము పెక్కు రాజ్యములుగ జీలియుండెను. ఇందు బలీయమగు రాజ్యములు దుర్బలరాజ్యములపై దాడిసల్పి వానిని గబళించుచు ఏకచ్ఛత్రాధిపత్యమునకై పెనగులాడుచుండెడివి. అట్లు పోరి కొంతకాలమున కొకరాజ్యము దానిప్రాభవ ముడిగినంతనే మరికొంతకాలమున కింకొకరాజ్యమును సామ్రాజ్యాధిపత్యమును వహించుచు పడుచు లేచుచు నుండెను. నిరంతర రణవ్యాపారములవలన వీనిలో చాలభాగము పాహియాను కాలమునాటికే జీర్ణించి నామమాత్రావశిష్టములైనవి. కొన్ని విస్మృతములైపోయినవి ఇట్టి రాజ్యము లేడవశతాబ్దారంభమున పదునారుండెడివి. అంగ, మగధ, కాశి, కోసల, కౌశాంబి, కురు, పాంచాల, మత్స్య, శూరసేన, అశ్మక, అవంతి, గాంధార, కాంభోజ, శాక్య, వజ్జి, మల్ల, రాజ్యములు. సంగ్రహముగ వీని చరిత్రనిచ్చుట దెల్పెదము.

అంగ:—మగధరాజ్యమునకు తూర్పుదెసగా నుండు నొకచిన్న రాజ్యము. వాణిజ్యలోకమున ప్రసిద్ధిగాంచిన చంపానగరము దీనికి రాజధాని. బుద్ధునికాలమున నిది మగధకు సామంతరాజ్యముగ నుండెను.


బౌద్ధయుగారంభమునందలి
హిందూదేశము.
(క్రీ.పూ. ౬౦౦)
....ఈగీటు వర్తకమార్గములను జూపు
గాంధారదే
తక్షశిలా.
సింధు
సింధునది
సరస్వతి.
ఇంద్రప్రస్థము.
(ఢిల్లీ)
మధుర
గంగ
శ్రావస్తి.
కపిలవస్తు
హిమాలయపర్వతము.
బ్రహ్మపుత్ర.
కాంపిల్య
కోసల.
సాకేత.
మిథిలానగరము
విదేహ
కౌశాంబి
వంశ
ప్రయాగ.
యమున
చంప.
అంగ
గంగ
అవంతి
ఉజ్జయిని
వింధ్య
రోరుక
పాటల
మగధదేశము.
తామ్రలిప్తి
గంగాసాగర
సంగమము.

మగధ:—ఆర్యావర్తమున నుద్భవిల్లిన రాజ్యము లన్నిటిలోన నిదియె చిరకాలము సామ్రాజ్యాధిపత్యము వహించి పేరుపడసినది తొలుత నీరాజ్యము ఉత్తరమున గంగాతరంగిణియు దక్షిణమున వింధ్యపర్వతములును, తూర్పున చంపానదియు, పశ్చిమమున శోణయు ఎల్లలుగల్గి క్రమముగ విస్తరిల్లి ఉత్తరభారతమంతయు నాక్రమించినది. దీని చరిత్ర ముందు విపులముగ వర్ణింతుము.

కాశీరాజ్యము:—వారణాశి దీని రాజధానినగరము. దీనిచరిత్ర మనకంతగా తెలియదు బుద్ధుని కాలమున నిది కోసలరాజ్యమున నొక యంతర్భాగమై యుండెను.

కోసలము:—త్రేతాయుగమునుండియు మిగుల ప్రసిద్ధి గాంచిన రాజ్యము దీనికి శ్రావస్తి రాజధానిగనుండెను. ఈ రాజ్యము ఉత్తరమున హిమవత్పర్వతమునుండి దక్షిణమున గంగాతటమువరకును పశ్చిమమున గంగానదిమొదలు తూర్పున గండకీనదీకూలమువరకును వ్యాపించియుండెను బుద్ధుని కాలమున మగధ, కోసలరాజ్యములకు ప్రబలయుద్ధములు జరిగెను ఈసమయమున నీరాజ్యమును ప్రసేనజియను రాజు పాలించువాడు. ఇతడు సుగుణశాలి. విద్యాసంపన్నుడు. తక్షశిలావిశ్వవిద్యాలయమున పెక్కేండ్లు విద్యాభ్యాసమొనర్చినవాడు పండితపోషకుడని పేరు గడించెను విద్యాగోష్ఠియందె సర్వదా కాలము గడపినాడు సర్వమతముల సమదృష్టిని జూచిన విశాలహృదయుడు ఇతడు బుద్ధునివలన ధర్మోపదేశమంది బౌద్ధమతమును స్వీకరించెను. ఇతనిమేనత్తయగు మహాకోసలాదేవి బౌద్ధసన్యాసిని యయ్యెను.

మగధరాజ్యముతోడనే గాక, శాక్యరాజ్యముతో గూడ నీరాజ్యము పోరాటములు సల్పినట్లు నివర్ణనములు గానవచ్చుచున్నవి. శాక్యవంశజులతో బాంధవ్యము నెరప గోరి ప్రసన్నధీ శాక్యవంశమున బుట్టిన నొకక్షత్రియకన్యను దనకిచ్చిపరిణయముగావింపుడని, శాక్యనాయకులకు సమాచార మంపెను శాక్యులు కోసలదేశాధిపునికంటె తామె ఉత్తమ వంశసంజాతులమని గర్వోన్నతులై, వానిని వంచింప నొక దాసీపుత్రికను యాతనికడకంపి యీపెయె శాక్యవంశసంభూత యగు రాచకన్నియయని గప్పిపుచ్చిరి తెలియక ప్రసన్నధీ యామెను వివాహమాడెను ఈయుభయులకును విరూఢకు డను పుత్రుడు గల్గెను ఈపాపడు పట్టాభిషిక్తుడైనపిమ్మట యీమోసమును దెలిసికొని, క్రోధోద్దీపితుడై శాక్యులపై వైరమునుబాటించి ప్రచండసైన్యములతో శ్రావస్తినగరముపై దాడిసల్పి యాపట్టణమును భస్మీభూత మొనర్చెను ఈయుద్ధ కాండమును పాహియాను తనగ్రంథమున జక్కగ వర్ణించి నాడు.

కౌ శాం బీ రా జ్య ము,—దీనిరాజధాని కౌశాంబి నగరము ఈరాజ్యము అవంతిదేశమున కుత్తరముగ యమునానదీతీరమున నున్నది బుద్ధునకుపూర్వ మీరాజ్యమును పరంతపుడనురాజు పాలించెను. ఈతనితరువాత యీతని తనయు డగు ఉదయనుడు సింహాసనమెక్కించెను ఈతడు బుద్ధునకు సమకాలీనుడు ఇతడు అవంతిరాజగు ప్రద్యోతుని కొమార్తె వాసవదత్తను పెండ్లియాడెను.

కురురాజ్యము:— క్షాత్రయుగమున నీరాజ్యము మహోన్నతదశయందుండెను. బుద్ధునికాలమునాటికి దీని వైభవ మంతరించినది. ఈకాలమున దీనిని రాష్ట్రపాలుడను రాజు పాలించుచుండెను. ఢిల్లీపట్టణమునకు సమీపమునందుండు యింద్రప్రస్థము దీనికి రాజధాని. బుద్ధు డీ కురురాజ్యమున సంచారమొనర్చి వేలకొలదిజనులకు బౌద్ధదీక్షనొసంగెను.

పాంచాలము:— కురురాజ్యమునకు దూర్పుదెస గానుండునది. మొదటినుండియు నిది వీరభూమియై పేరొందినది.

మత్స్యదేశము:— కురురాజ్యమునకు దక్షిణముగ యమునానదీతటము నంటియుండునది.

శూరసేనము:— మత్స్యరాజ్యమునకు నైరుతి భాగమున నెలకొల్పినది. మధురానగరము దీని రాజధాని.

అశ్మకరాజ్యము.— బౌద్ధగ్రంథములలో నుదహరింపబడుచున్నదేగాని యిది యెచ్చట నెలకొన్నదో తెలియుట లేదు.

అవంతి:— తరువాతి కాలమున దీనికి మాళవయని పేరుగల్గెను. దీనిరాజధాని ఉజ్జయిని బుద్ధునికాలమున నిచ్చట ప్రద్యోతుడు రాజ్యపాలన మొనర్చుచుండెను. ఈతడు మిగుల యోధాగ్రేసరుడు అందుచేతనే యితనికి చండవిక్రముడని పేరు ప్రసిద్ధముగల్గెను.

గాంధారము:— ప్రఖ్యాతిగాంచిన ప్రాచీనరాజ్యములలో నిది యొకటి భారతవర్షమునకు పశ్చిమోత్తరమున నిల

సిల్లినది ఏవ్యాలతల్లి యని పేరుమోసిగిన తక్షశిల దీనికి రాజ ధాని. బుద్ధునికాలమున 'పుక్కుసాతి' యనువాడు దీని పాలిం చెను. ఈతడు బింబిసారుని యొద్దకు రాయబారులనంపి యా తనితో స్నేహమును పాటించెను.

కాంభోజరాజ్యము:—దీనిచరిత్రము మన కంతగ దెలి యదు ద్వారకానగరము దీనికి రాజధానిగ నుండెనట

శాక్యరాజ్యము;—ఇది యొక నాయకసత్తాక రాజ్య ము. ఈకాలమున నార్యావర్తమున ప్రజాపరిపాలనాపద్ధతులు వ్యాప్తినొందినవి ఈపద్ధతు లెట్టివో ముందుదెల్పెదము అట్టి ప్రజాస్వామిక పద్ధతులు పెంపొందిన రాజ్యములలో శాక్య రాజ్యమొక్కటి శాక్యవంశజులచే నివసింపబడునది గావున దీని కీ పేరుగల్గినది. శాక్యవంశనాయకులందరును గలసి రాజ్య వ్యవహారముల నిర్వహించెడివారు ఈరాజ్యము నేపాళ సరి హద్దులలోనుండెడిది. దీని రాజధాని కపిలవస్తు గౌతము డిచ్చటనే జననమొందెను. ఈతని తండ్రియగు శుద్ధోదన మహీపాలుడు రాజ్యపాలన మొనర్చిన తావుకూడ నిదియె. ఫాహియాను వర్ణించినకాలమునాటికే యీపట్టణము జీర్ణమై పోయెను దీని పూర్వవైభవముల స్మరించి యీతడు కన్నీరు విడచెను ఇప్పుడీనగరము నామరూపములులేకుండ కాలవా హినిలో గలసిపోయినది. దీని శిథిలములు మాత్రమీ ప్రాంత మున గన్పించును

మల్లరాజ్యము:—మల్లనాయకులచే పరిపాలింప బడునది శాక్యరాజ్యమువలెనే నిదియు నొకనాయకరాజ్యము.

ఇది శాక్యదేశమునకు తూర్పుదెసను పర్వతప్రాంతమున నెచ్చటనో విలసిల్లెను.

వజ్జి దేశము:—ఇందు లిచ్ఛవీ విదేహరాజ్యములను రెండు ప్రఖ్యాతరాజ్యము లిమిడియున్నవి. ఆయా నాయకులచే పరిపాలింపబడుటచే నీరాజ్యముల కీనామములు గల్గెను "విదేహ"కు రాజధాని మిధిలానగరము. ప్రాచీనకాలమున జనకునిచే పవిత్రీభూతమొనర్పబడిన నగరమిదియె. ఆకాలమున నిది యేబదిమైళ్ల వైశాల్యముగల్గిన మహానగరమై యుండెను.

లిచ్ఛవీల రాష్ట్రము గూడ నాకాలమున బలిష్ఠరాష్ట్రమై యుండెను మౌర్య సామ్రాజ్య స్థాపకుడగు చంద్రగుప్తుడీ లిచ్ఛవీక్షత్రియబాలనే వివాహమాడెను. లిచ్ఛవీరాజ్యమునకు రాజధాని వైశాలి. ఇతిహాసప్రసిద్ధమగు పట్టణము. ఇది రాజగృహనగరమునకు ముప్పదిమైళ్లదూరమున నుండెను. ఈపట్టణ సామీప్యముననే జైనమత కర్తయగు మహావీరు డుద్భవించెను దీని ఉత్తరపువైపున 'మహావన' మను అరణ్యవాటిక హిమవత్పర్వతప్రాంతమువరకును వ్యాపించి యుండెడిది గౌతము డీయరణ్యసీమయందు పెక్కేండ్లు నివసించి తత్పరిసరప్రాంతములలో బౌద్ధధర్మము నుపదేశించెను

బుద్ధునికాలమున మగధరాజ్యాధీశ్వరుడగు అజాతశత్రుడు లిచ్ఛవీరాష్ట్రముపై దండెత్తి లిచ్ఛవీయోధుల నందరిని గడతేర్చెను ఈ విషాదకథనమును పాహియాను

కూడ వర్ణించినాడు. వజ్జియనులలో విదేహ లిచ్ఛవీలెగాక యింకను పెక్కు అంతశ్శాఖలు గలవు వీరిచరిత్రల గూర్చి మనకంతగ తెలియదు



# బౌద్ధమహాయుగ

## VI

## మగధరాజ్య విజృంభణము—అలెగ్జాండరు దండయాత్ర.



### మగధరాజ్యవిజృంభణము

ఏడవశతాబ్దప్రాంతమున భారతఖండమున పెక్కు రాజ్యములు విలసిల్లినవని వెనుకటి ప్రకరణమున జెప్పియుంటిమి. వానిలో బలీయమగు రాజ్యములు విజృంభించి తక్కుటి రాజ్యములజయించి సామ్రాజ్యాధిపత్యమునకై పెనగులాడు చుండెడివనికూడ వివరించితిమి. ఏడవశతాబ్ద మధ్యమున యిట్లావర్తమున విజృంభించి తక్కుటిరాజ్యముల నాక్రమించి ప్రఖ్యాతిగాంచి మించిన రాజ్యము కోసలము. ఈ రాజ్యము ప్రసేనజిత్తుని తండ్రియగు మహాకోసలుని రాజ్యకాలమున మహోత్కృష్టదశయందుండెను. ఈరాష్ట్రము తూర్పున గండకీనదిమొదలు పశ్చిమమున రామగంగానదివరకును, ఉత్తరమున శీతనగము మొదలు దక్షిణమున గంగాతరంగిణి వరకును వ్యాపించియుండెను. దీనికి నడుమను దక్షిణమునను పెక్కుస్వాతంత్ర్యరాజ్యము లుండినవి. తూర్పునున్న శాక్యుల జయించి వారి రాజ్యమును లోబరచుకొనగల్గెను గాని మహాబలిష్ఠమై అవిలంఘ్యమగు లిచ్ఛవి సంయుక్త రాష్ట్రముల మాత్రము మహాకోసలుడు జయింపలేక పోయెను. ఈరాజ్యమునకు దక్షిణభాగమున విస్తరిల్లిన మగధ చంపక రాజ్యము లీకాలమున నొకదానిపై నొకటి కవిసి యతి ఘోరముగ

పోరాడ జొచ్చినవి. ఈ పోరాటమున తుదకు మగధరాజ్యమునకే విజయము కల్గెను. చంపకరాష్ట్రము మగధరాజ్యమునకు దోసిలొగ్గెను. ఇదియె మగధరాజ్య వైభవమునకు ప్రారంభము. అంతటనుండియు కోసలము జీర్ణించినది మగధ మేటి రాజ్యమై విజృంభించినది ఎక్కడనో నివురుగప్పిన నిప్పువలె పడియుండిన యీ రాజ్యమున కిట్టి యఖండవిజయమును గూర్చినది శిశునాగనృపాలుడు

శిశునాగనందవంశములు

ఈతడే శిశునాగవంశమును స్థాపించెను (క్రీ. పూ. 642) ఈతడు గిరివ్రజపురమును రాజధానిగజేసికొని మగధరాజ్యమును పాలించెను.

శిశునాగుని తరువాత నీవంశమున ప్రఖ్యాతివహించిన రాజు బింబిసారుడు. సుగుణరాశి. గౌతముడు తన దివ్యమతమును బోధించిన దీతని రాజ్యకాలముననే. అందు చేతనే యీతని నామము భారతవర్షచారిత్రమున చిరస్మరణీయమైనది. ఈతడు నూతన రాజగృహపట్టణమును నిర్మించి అంగరాజ్యముపై దాడివెడలి యా రాజ్యమును జయించెను. తొలుత నీతడు జైనమతావలంబుడు పిమ్మట బౌద్ధదీక్షగొనెను ఈతడు క్రీ పూ 582 మొదలు 554 వరకును యిరువదియెనిమిది వత్సరములు రాజ్యమేలెను.

అజాతశత్రుడు

ఈతనిపిమ్మట యితని తనయుడగు అజాతశత్రుడు మగధరాజ్యమునకు పట్టాభిషిక్తుడయ్యెను. ఈతడు చండ

శాసనుడు. బలశాలి. తనతండ్రిని బరిమార్చి యీతడు సిం హాసన మధిష్ఠించెనని భారతవర్షచారిత్రమున సీతనిపై నొక యపవాదముగలదు బుద్ధుని పినతండ్రికుమారుడగు దేవదత్తుని ప్రేరేపణచే యీతడిట్టి పితృఘాత యొనర్చెనని చెప్పబడినది. ఇది కేవల యపవాదము ఇందణుమాత్రమును సత్యము గాన్పింపదు. బౌద్ధజైన మతముల నితడు సమదృష్టిని పాలించెను. ఈతడు జైనమతమునుగూడ నేల యాదరింప వలెనను యీర్ష్యచే బౌద్ధు లీతనిపై నిట్టియపవాద గల్పించిరట్లు దోచు చున్నది. జైనగ్రంథము లీనృపాలుని వినుత గుణశీలుడనియు మహాభక్తిపరుడనియు వర్ణించినవి.

తన బలచాతుర్యముల చే నజాతశత్రుడు పెక్కురాజ్య ముల జయించి మగధరాజ్యమును నలుముఖముల విస్తరింప జేసెను ఈతడు రాజ్యమేలుచుండగనే తురేనియనుమూకలు సముద్రతరంగములవలె పొంగి హిమవత్పర్వత ప్రాంతముల నుండి మగధరాజ్యముపై బ్రవహింప దొడగినవి ఈప్రవాహ మును మరలించుటకు అజాతుడు శోణనదీతటమున పాటలీ పుత్రమను నొకమహానగరమును నిర్మించెను ఈ నగర రాజము పెక్కుశతాబ్దములు మగధ సామ్రాజ్యమునకు రాజ ధానియై, వైభవసీమయై తనరారినది. పెక్కేండ్లిచ్చట మగధ సామ్రాజ్యలక్ష్మి విభవగీతముల బాడినది ఆసేతు హిమాచల మధ్య భారతభూమినంతయు నుఱ్ఱూత లూగించిన మగధ సామ్రాజ్య పతాక మిచ్చట నిరాఘాటముగ శతసహస్ర వర్షము లెగిరినది.

అజాతశత్రునితల్లి లిచ్ఛవీరాజపుత్రిక. కోసలరాజే శ్వరుని తనయ నీతడు వివాహమాడెను. ఇరువది యేడేండ్లు రాజ్యమేలి యీతడు మృతినొందెను.

## పారశీకులదాడి.

ఈతనితరువాత శిశునాగసంతతిరాజులు నల్వురు మగధనేలిరి అంతటితో శిశునాగవంశ మంతరించినది. అజాత శత్రుని తనయుడగు దర్శకుడు రాజ్యమేలుచుండగగాబోలు క్రీ. పూ 516 సంవత్సర ప్రాంతమున పెరిష్యాచక్రవర్తియగు డెరయసు సింధునదీముఖద్వారమునుండి పారశీకరాష్ట్రము నకు సముద్రమార్గ మేర్పరచుటకు వీలగునేమో యరసి రమ్మని తనసేనానియగుస్కైలాక్సును హిందూదేశ సరిహద్దుల కంపెను. స్కైలాక్సు సైనికబలుడై పారశీకమునుండి బయలు వెడలి, సింధునదిప్రాంతభూములనన్నిటి జయించి పారశీక సామ్రాజ్యమునకు గలిపెను. అట్లు సింధునది కావలివైపున నున్న భూభాగమంతయు పారశీకసామ్రాజ్యములో నొక యంతర్భాగమయ్యెను డెరయసు సార్వభౌముని యిరువది పరగణాలలో నిదియె భాగ్యసీమయనిపేరొందినది అన్నిటికంటె నిదియె యెక్కువ కప్పమును జెల్లించెడిది ఇది యెంతకాలము పారశీక సార్వభౌముల యేలుబడిలో నుండెనో తెలియదు. కాని అలెగ్జాండరు చక్రవర్తి దండయాత్రవెడలిన కాలము నాటికింకను, హిందూపారశీక రాజ్యములకు సింధునదియే సరి హద్దుగనుండెనని జెప్పఁబడుచుండినట్లు నిదర్శనములు

గలవు. అయిన నీప్రాంతమున పారసీకుల యధికార మీసరికి జీర్ణించి నామమాత్రావశిష్టమైపోయినట్లు గాన్పించుచున్నది. ఏలన, అలెగ్జాండరునకు సింధునదీ ప్రదేశములందు పారశీక రక్షకసైన్యము లెచ్చటను గన్పింపలేదు. దీనినిబట్టి యీసమీప భూములందు పారశీకులప్రాభవ మిదివరకే యంతరించి పోయి నట్లూహింపవలసివచ్చుచున్నది. పారశీకులు తమ పరిపాలనా కాలమున "ఖరోష్ఠి" లిపిని సింధునదీప్రాంతవాసులకు నేర్పినట్లు తెలియుచున్నది. ఈలిపి, క్రీ. శ. నాల్గవశతాబ్దమువరకు నీప్రాంతమున ప్రబలెను.

## నందవంశము.

శిశునాగవంశము మహానందుని పిమ్మట క్రీ. పూ. 422 సంవత్సర ప్రాంతమున, మహాపద్మనందుడను రాజు మగధసింహాసన మాక్రమించి నందవంశమును స్థాపించెను. ఈతడును, యాతని యెనమండ్రుగురు తనయులును నించుమించొక శతాబ్దము కాలము మగధరాజ్యమును పాలించిరి. పిమ్మట నీవంశమును అంతమొందించి క్రీ. పూ. 322 సంవత్సర ప్రాంతమున చంద్రగుప్తుడను నందరాజులో కడపటివానిని పారదోలి మౌర్యవంశమును స్థాపించెను. ఈకడపటి నందుని రాజ్యకాలముననే, అలెగ్జాండరు ఆక్రమణము జరిగెను.

## అలెగ్జాండరు దండయాత్ర.

ఈ యవనచక్రవర్తిగావించిన దండయాత్ర భారతదేశ చారిత్రమున జాల ప్రసిద్ధవిషయము కావున జగద్విఖ్యాతమగు

మౌర్యసామ్రాజ్యస్థాపనకు కారణభూతమైనది. ఈ దండ యాత్రతో భారతవర్ష శౌర్యరంగమును గప్పిన యవనిక తొలగును. ఆర్యావర్త స్వాతంత్ర్యమును గాపాడ దీక్ష గొని, మహాయోధుడగు చంద్రగుప్తుడు తనయసమాన రణ ప్రౌఢిని నలుకెలంకుల చవిచూపించుచు యితిహాసరంగమున బ్రవేశించును ఆవీరమౌళి పదస్పర్శచే భారతవర్ష గగనతలము నావరించిన పారతంత్ర్యజీమూత పటలి సడలి విడిపోవును. అలెగ్జాండరు దండయాత్రాకల్లోలమహాసముద్రతరంగముల నుండి మౌర్యసామ్రాజ్యలక్ష్మి విజయగీతల నాలపించుచు ప్రత్యక్షమగును.

అలెగ్జాండరు యవనదేశపు చక్రవర్తి ఈతడు చంద్ర గుప్తుడు మగధరాజ్య సింహాసన మధిష్ఠించుటకు పూర్వ మైదు వత్సరములకు క్రీ పూ. 326 సంవత్సరమున బహుళ సైన్య ముల వెంటగొని ఆర్యావర్తముపై నెత్తివచ్చెను. ఈతడు సైరసు, డెరయసు మున్నగు పారశీక సార్వభౌములవలె తన రణప్రావీణ్యమును ప్రదర్శించి బహుదేశముల జయించి కీర్తి సొందుచు ఆసియాఖండమున కంతకును యేకచ్ఛత్రాధి పత్యమును వహించి పాలింపవలెనను పేరాశతో ఆర్యావర్త ముపై దాడివెడలెను భారతవర్ష సౌభాగ్యమునుగూర్చి కర్ణా కర్ణిగ విని యీతని యొడలు పులకరించెను పేరాశ యిను మడించెను ఇదివరకు ఆర్యావర్తపుణ్యభూముల నేపరదేశీయు డును వొక్కియుండలేదు. ఇదియె తొలిసారి.

పెక్కుసైన్యములు గూర్చుకొని అలెగ్జాండరు యవన దేశమునుండి బయలుదేరి మార్గమధ్యమున తన పాలబడిన

రాజ్యములన్నిఁ జయించి విజయపతాకంబుల బాతుచు నెట్టకేలకు 327 సంవత్సరమున హిందూకుష్ పర్వతపంక్తుల దాటి భారతవర్షమును సమీపించెను. ఆపర్వతప్రాంతముల నివసించు యడవిజాతుల నుక్కడగించి వసంతర్తు సంవత్సరము వృక్షజాలములు నూతనజొంపములు తొడగుచుండ, కోయిలలు మందపవనాంకురముల శ్రుతిజేసికొని మధుర స్వరములతో వసంతాగమనమునకు చేయుచు శ్రీస్వాగతముల బాడుచుండ, నిరాఘాటముగ సింధునదీజలముల దాటి యాతడు తక్షశిలానగరమును ప్రవేశించెను తక్షశిలానగరమును రాజధానిగా గొని జీలము సింధునదుల మధ్యస్థ పాంచాలమును ఆకాలమున అంభి యనురాజు పాలించుచుండెను. అంభి దుర్జనుడు, ధర్మాధర్మ వివేచనాశూన్యుడు, కలుషాత్ముడు. ఆప్రాంతమును పాలించు తక్కిటి రాజన్యులపై నీతడు వైరమూని డురహంకార ప్రేరితుడై వారిపై పగసాధించుటకు గాబోలు, భారత స్వాతంత్ర్యమును హరించుటకై అపారసైన్యముల గొనివచ్చుచున్న అలేగ్జాండరును ఆర్యావర్త పుణ్యభూమిని నడుగు పెట్టకుండ నడ్డుసేయుట కొప్పుటచేగా - వీడు మిక్కిలి ద్రోహియై అతని నగరమునకాహ్వానించి మహాతిథ్యములకు వలయు భోజనాదికముల నొసగి అయిదువేల సైనికుల నిచ్చి భారత స్వాతంత్ర్యాపహరణమునకును ఆత్మవినాశమునకు చేతులార సాయమొనర్చెను. ఈకాలమున పాంచాలదేశము నెక్కు చిన్నరాజ్యములుగ చీలియుండెను అందు జీలము చీనాబు నదులమధ్య విలసిల్లిన చిన్నరాష్ట్రమునకు పురుషోత్తముడు ఏలికగనుండెను ఈతడనన్యసాహస పరాక్రమోపే

తుఁడు, దేశసేవాపరాయణుఁడు, నిజదేశ స్వాతంత్ర్య రక్షణ దీక్షాపరుఁడు. గాబోవృనాపవను గుర్తించి యీవీరవతంసము తన క్షుద్రసైన్యములతో రిపువాహిని నడ్డగింప సాహసించెను. ఈతనిసైన్యమున ముప్పదివేల కాల్బలములును నాల్గువేల హయములును ఐదునూర్ల రథములను రెండునూర్ల మత్తేభములు మాత్రముండెను. వీనిలో ప్రత్యంగమునునిపుణులగు పెక్కండ్ర క్షత్రియయోధులచే నడిపింపబడెను ఇంతటి క్షుద్రసైన్యముతో పురుషోత్తముడు ఒంటిరియై అనేకదేశముల జయించి పెక్కురణక్షేత్రములందు తమ సమరప్రతిమనుజాటి రణశిక్షలందారితేరిన యవనసైనికబలముల డీకొన తలపడెను ఆహా యీతని సాహసమెంత ప్రశంసాపాత్రమైనది!

## జీలము నదీతీరమున సంగ్రామము.

అలెగ్జాండరు సార్వభౌముఁడు స్వసైన్యములతో తక్షశిలానగరమున ఆంభినృపాలుని యతిథియై కొంతకాలము విశ్రమించి, మార్గశ్రమంబుడిపికొని మెల్లగ బయలుదేరి వచ్చి జీలమునదీతీరమున విడిసియున్న పురుషోత్తముని సైన్యముల గాంచెను. ఈప్రసిద్ధ నదీతటమున సిర్వాల్, ప్రికాల్ గ్రామముల [illegible]మున నీయుభయసైన్యములకును ఘోరసంగ్రామము జరిగెను. క్షత్రియయోధులు తమయసమానరణప్రావీణ్యమును శౌర్యతేజమును యవనసేనలకు ప్రదర్శించుచు పెద్దకాలము [illegible] కాని కార్యము లేకపోయెను గట్టుతెగిపారి వచ్చు మహాప్రవాహమునకై వారలు యవనసైనికమూకల

నాయల్పసైన్యము లెంతకాలమని నిలిచియుండగలవు. తుదకు యవనులకే జయముకల్గెను సంభవించువేళ పాంచాల వీరులు స్వాతంత్ర్యదేవి పాదములకడ తమ యసువుల బలిదాన మొసగిరి. తొమ్మిదివేలమంది శత్రుహస్తముల జిక్కిరి. రథములు భగ్నమయ్యెను. గజములు పడిసెను. పురుషోత్తముడు ఆరున్నర యడుగుల నిడివిగల పొడగరి. ఆజానుబాహుడు ఖడ్గహస్తుడై, శత్రువీరులు దిగ్భ్రమ జెందునట్లు సింగపు గోపమువలె యని యొఱల్చి శత్రువుల శరఘాతములచే తొమ్మిది గాయములుబడిని రక్తస్రవంతిచే బలహీనత జెంది రణమధ్యమున స్మృతితప్పి నేల కొరగెను. యవనసైన్యములు విజయధ్వానము లొనర్చుచు నీతనిని బందీగా గొనెను.

మొదటనుండియు పాంచాల దళములకు అశుభసూచనములే గన్పించెను. వర్షపాతముచే రణభూమియంతయు తడిసి రొంపియయ్యెను. గజయూథములు తీవ్రించుచుండమున శరరోధము గల్గి బురదలో కూరుకొనిపోయెను. మహోజస సత్వములు గల్గిన యవనాశ్వములు రణభూమిని శరవేగమున బరువులెత్తి పాంచాల సైనికవ్యూహముల కలచివైచెను. ఈసందడిలో మహాత్రొక్కిడిలో క్షత్రియవీరులకు తమ ధనుర్విద్యా ప్రావీణ్యమును ప్రదర్శించుటకే యదను దొరకకపోయెను. ఏమైన నేమి పాంచాలురకే యోటమిగల్గెను.

అలెగ్జాండరు శత్రువీరుల శౌర్యపటిమను జూచి యానందింపగల ఔదార్యశీలుడు ఉత్తమసమర ధర్మముల నెఱిగిన రణవిశారదుడు. సమరశూరుడగు శత్రువు చేజిక్కినదే యత

నని పరిమార్చునంతటి తుచ్ఛమానిసిగాడు పురుషోత్తముని యుద్ధకౌశలమును దిలకించి యాతడు విస్మయుడై మెచ్చి యాతనిరాజ్యమునకు మరల నాతని పట్టాభిషిక్తుని గావించు టయేగాక, తాను జయించిన రాజ్యభాగములో గొంతభాగ మునుగూడ యాతనికిచ్చి బహూకరించెను. అంతియేగాని యాతని అగ్నికీలలకాహుతి యొనర్చి చిత్రవధ గావింపలేదు. దారుణనిర్జన ద్వీపభూముల బంధించి యుసురుల దీయలేదు.

పాంచాల దేశమున నిట్లు విజయపతాకముల బాతి అలెగ్జాండరు తక్కటి భారతభూమిని గూడ జయింప బయలు వెడలి బియాస్ నదీతీరమువరకును గదలిపోయెను. అప్పుడే వర్షకాలము ప్రారంభమయ్యెను. జోరున వర్షము గురియు చుండెను

అంతట ఆతని సైనికబలములు సంతతరణ పరిశ్రమలచే నలసియు భారతయోధుల పరాక్రమ ప్రదర్శనములజూచి వెరగందియు యికముందునకు సాగిపోజాలమని నిరాకరిం చెను అనేకసమరాంగణములందు తమ రణకౌశలమును వెల్లడించి జయపరంపరల జూరగొని ప్రాచ్యపాశ్చాత్యలోక ముల దస్సరిల్లజేసిన అలెగ్జాండరుసార్వభౌముని సైనికనివహ ముల సమరోత్సాహము భారతవీరులశౌర్యధాటిని చవిచూచి నంతనే యంతర్ధానమయ్యెను కొండంతయాశతో యీభూతల మున కంతకును పట్టాభిషేకముగట్టుకొనవలెనను దురాకాంక్షతో బయలువెడలిన అలెగ్జాండరు, చేయునదిలేక భగ్నమనోర థుడై సైన్యముల మరల్చుకొని యింటిదారి బట్టవలసివచ్చెను.

ఘాతముచే స్మృతితప్పి యాతడు నేలకొరిగెను. యవనసైన్యముల నుండి హా హా కారములు జనించెను. కాని పాప మాతనికి ప్రాణభయము గలుగలేదు. అత్యంత నిపుణులగు భిషజ్మ ణుల ఔషధచికిత్సచే నాతడు తెప్పిరిల్లెను గండము దప్పెను.

అట్లు సముద్రమును జేరి అగమ్యమార్గముల బడిపోయి. పోయి ఎట్టకేలకు క్రీ పూ 324 సంవత్సరమున వైశాఖమాసము సమీపించుచుండ విజయధ్వానములతో అలెగ్జాండరు సుసా (పారశీకములోనిది) పట్టణమును జేరెను. మార్గమున దారుణ వాతాతపశీతలములకు గురిరై యీతని సైన్యములు జాలభాగ ము నశించెను ఆతడును నిజరాజ్యమును జేరి యొకవత్సరమైన గతింపకమున్నె క్రీ పూ. 323 సంవత్సరమున దీర్ఘప్రయాణ ములచే సంతత రణ వ్యాయామములచే బడలి, శుష్కించి, జీర్ణశరీరుడై నడియౌవనముననే ముప్పదిమూడవయేట దివి కేగెను. ఈతడు ప్రపంచమున నుద్భవిల్లిన మహారణవిశారదు లలో నొక్కడని వచించుట కెంతమాత్రమును సందియము లేదు

అలెగ్జాండరు ఆర్యావర్తమును విడిచిపోవునపుడు పాం చాలమున నొక యవనప్రతినిధినుంచి ఆతని సహాయార్థమై కొంత సైన్యమును దిగవిడచి పోయెను. పాంచాల సింధు దేశములు ఆతనికి వశమయ్యెను.

కాని యవనుల ఏలుబడి ఆర్యావర్తమున చిరకాలము నిలువలేదు అలెగ్జాండరుని యకాలమరణము దీనికొక కార

ణము. ఇదిగాక స్వాతంత్ర్యప్రియులును, స్వదేశాభిమానులును నగు పాంచాలప్రజలకు పరిపాలనమున కేలు మోడ్చి వనుట దుస్తరమయ్యెను అందుచే యవనప్రభుత్వము అలెగ్జాండరుని యవసానముతోడనే భారతవర్షమున క్షీణింపమొదలిడి క్రీ. పూ 317 సంవత్సరప్రాంతమునాటికి సంపూర్ణముగ నంతరించిపోయినది. యవన పరిపాలనావసానమును గూర్చి ముందు మరికొంత విపులముగ నుడివెదము.

## యవనదండయాత్రాఫలితములు

యవనదండయాత్రాఫలితముల విన్సెంటుస్మిత్తుమున్నగు పాశ్చాత్యచరిత్రకారులు గోరంతలు కొండంతలుజేసి విపరీతముగవర్ణించిరి. ప్రాచ్య పాశ్చాత్యదేశములకు రాకపోకలు గల్గుట కిదియె కారణమనిరి భారతశిల్పమునకు క్రొత్తయందములఁ గల్పించినదని కొందఱువ్రాసిరి కాని యవనదండయాత్ర హైందవసభ్యత కెట్టినూతనవికాసమును గల్పింపలేదు ఇది పశ్చిమోత్తరప్రాంతమున నొకవిప్లవమును దెచ్చిపెట్టినది. ఈరాజ్యాంగకల్లోలమే, మౌర్యసామ్రాజ్యస్థాపన కుపకారి యయ్యెను. ఇదితప్ప యవనదండయాత్రవలన భారతవర్షమున కెట్టియుపకారమును గలుగలేదు పైపెచ్చు యీదండయాత్ర పెక్కండ్ర భారతవీరుల ప్రాణముల బలిగొనినది ఎట్టిమార్పును గల్పించుటకైనను యవనుల పరిపాలనము భారతక్షేత్రమున జిరకాలము నిలువలేదు సుడిగాలివలె నొక్కమారు వీచిపోయినది

అలెగ్జాండరుని యాగమనముతోడనే ప్రాచ్యపాశ్చాత్యఖండములకు రాకపోక లేర్పడిన వనువారలలో నెంత

మాత్రమును సత్యముగాన్పింపదు క్రీ. పూ. ఆరేడు శతాబ్దములకిందటనే భారతపశ్చిమదేశములకు విరివిగ రాకపోకలు గలవని జెప్పుటకెన్నియో నిదర్శనములున్నవి ఇచ్చటనుండి యచ్చటకు బాహాటమగు మార్గములుండెడివి ఆకాలమున భారతవర్షమున ప్రబలిన ఆర్షమతధర్మములకును, గ్రీసు ఐరానియా మున్నగు ప్రాంతములందు వ్యాపించిన వేదాంతభావములకును అత్యంతసాదృశ్యముగలదు భారతభూమిని సముద్భూతమైన వేదాంత భావములు సముద్రముల దాటి అవిరళముగ పశ్చిమదేశములందు సంచరించినవి గౌతమమహావీరులార్యావర్తమున నూతనసిద్ధాంతముల ప్రతిష్ఠించుచుండ హిరాక్లిటసు, పైతాగరసు, మున్నగు యవనవేదాంతులు పునర్జన్మ, పరమాణు*, అహింసా సిద్ధాంతములను గూర్చి వాదములు నెరపుచుండిరి పైతాగరసు, మాంసాహారనిషేధము మొదలగు నియమములతో గ్రీసుదేశమున బౌద్ధసంఘమువంటిసంఘము నొకదానినిర్మించెనట దీనినిబట్టి ప్రాచ్యదేశములనుండిపశ్చిమభూములకుభావప్రచారమెంతవేగముగయవిచ్ఛిన్నముగజరిగెడిదో స్పష్టమగుచున్నది యవన, రోమ, ఎతియోపియా లోనగు పాశ్చాత్యదేశములనుండి వర్తకసంఘములు, యాత్రికాగణములు, అలెగ్జాండరునకు పూర్వమునుండియు, ఆర్యావర్తమునకు తీర్థప్రజవలె గుంపుగుంపులుగ వచ్చుచు బోవుచుండినవి. యవనభారతీయుల పరిచయ మనాదిసిద్ధమైనదని నుడువుట కిం కెను పెక్కునిదర్శనములున్నవి అలెగ్జాండరు దండయాత్రకు మున్ను హెరొడోటసు భారతవర్షమును వర్ణించెను అట్లు చరిత్ర ప్రమాణములు లేవు హైందవ జ్యోతిష గ్రంథములలోనీతడు

---

* పరమాణువుల సంయోగమువలననే ప్రపంచముద్భవమైనదనుసిద్ధాంతము.

యవనాచార్యుడని పేర్కొనబడినాడు. ఇదిగాక అలెగ్జాండరు హిందూదేశముపై దాడి వెడలకపూర్వము యవనులు ఆర్యావర్తముపై రెండుమూడుమార్లు దండెత్తినట్లు వ్యాసరచితమగు హరివంశము నుడువుచున్నది. సగరచక్రవర్తి, జనకుడు రాజ్యమేలుచుండ యవను లయోధ్యపై దాడివెడలిరి. ఇది శ్రీరాముడయోధ్యకు పట్టాభిషిక్తుడుగాకపూర్వము జరిగినమాట. తరువాత కృష్ణుడు ద్వారకను పాలించుచుండ మరియొకమారు కాలయవనుడను నొకయవనవీరుడు భారతభూమిపై దాడివెడలెను.

పశ్చిమోత్తరప్రాంతమున శిల్పము కొంతవరకు యవన వైఖరుల ననుకరించినమాటనిజము. భారత యవనశిల్పములిచ్చట సమ్మేళనమంది యొకవిధమగు నూతనశిల్పసాంప్రదాయము లుత్పన్నమైనవి. ఈ సంయోగముచే బయలుదేరిన శిల్పమునకే కళాభిజ్ఞులు గాంధార శిల్పమని పేరిడిరి. భారతకళాప్రపంచమున అలెగ్జాండరు దండయాత్రవలన నూతనశిల్ప రీతులు బయలువెడలినవి.

ఇది యటుండ హైందవసభ్యతాపరిచయమువలన పాశ్చాత్యదేశములలోని మత నాగరికతాక్షేత్రము లత్యద్భుతముగ పరివర్తనము నొందినటుల గన్పించుచున్నది. హైందవ వేదాంతభావములు, మతసిద్ధాంతములు మరింత ధారాళముగ యవన, రోమక సామ్రాజ్యములకు బ్రవహించినవి. క్రైస్తవ మత పరిణామమునకే బౌద్ధమతము కారణభూతమైనదని పెక్కండ్రు తలంచుచున్నారు. క్రైస్తవమతము, బౌద్ధమత బోధనాపద్ధతుల నెరవుదెచ్చుకొన్నది. ఇదిగాక పెక్కుచోట్ల క్రైస్తవసిద్ధాంతములు బౌద్ధసిద్ధాంతముల బురుడించుచున్నవి.

# బౌద్ధ మహాయుగము

## VII

## మౌర్యసామ్రాజ్యస్థాపనము - చంద్రగుప్తసార్వభౌముని పరిపాలనము.

### పాంచాల విప్లవము.

అలెగ్జాండరు భారతవర్షమును వీడిచనినంతనే పాంచాలమున కల్లోలములు జనించెను. ఆతనిచే నియమింపబడిన ప్రతినిధిపాలకులు దుర్బలులై రాజ్యపాలనము సరిగ నిర్వర్తింపజాలకపోయిరి. అశక్తతచే దుర్జనత్వముకూడ గల్గెను. రణవిక్రములును, స్వాతంత్ర్యప్రియులు నగు పాంచాలదేశ ప్రజలకు పరపాలనము జాలకంటకముగ నుండెను. యవనదుష్పరిపాలనము నెపుడు తుదముట్టింతుమాయని వారు వేగిరపడుచుండిరి. ఇంతలో ఒరసినపుండుపై కారముచల్లినట్లు భారతస్వాతంత్ర్యరక్షణకై యవనసైన్యములతో పోరుసల్పి మేనిరక్తముల ధారవోసిన ధీరుడు పురుషోత్తముడు, ఒకానొక యవనక్షాత్రపునిచే హత్యగావింపబడెననువార్త వ్యాపించెను. పాంచాలము సంక్షుభితమై పోయెను. ప్రజల హృదయసీమలందు రోషానలము ప్రజ్వరిల్లెను. మూకలు చెలరేగి యవనరక్షకసైన్యములపై గవియసాగిరి. జనులు యవనులపై కసితీర్చుకొనుటకై యుడికిపోవుచుండిరి. కాని వారిని రణరంగమున నడిపింపగల యోధుడు గానరాకుండెను. ఇంతలో అలె

గ్జాండరు వరణించె ననువార్తలేతెంచెను. మత్తగజముపై లంఘింప నిరీక్షించు సింగమువలె వేచియుండిన చంద్రగుప్తు డను నొకవీరుడు ఇదె యదనని పాంచాలరణరంగమున నురికెను. స్వాతంత్ర్యసంరంభము ప్రాసగెను.

చంద్రగుప్తుడు నందరాజ వంశపు కుదుటిలోనివాడు. ఈతని తండ్రి నందరాజుల యాస్థానమున నుద్యోగిగా నుండెను. యౌవనమునుండియు నీతడు మహాసాహసియని పేరుమోసెను. మగధరాజ్యనృపునిపదచ్యుతుని గావింప మంతనము సల్పుచుండిన ట్లనుమానింపబడి దేశమునుండి వెడలనడిపింపబడుటచే నీతడు మగధరాజ్యమున నిలువనేరక తక్షశిలానగరమునకు బారిపోయి యచ్చట తలదాచుకొనెను. అలెగ్జాండరు సైనిక బలముతో యీనగరమును ప్రవేశించినప్పుడు చంద్రగుప్తు డచ్చటనేయుండెను. ఈతడు యవనవీరుల సమరప్రావీణ్యమును క్షత్రియయోధుల రణక్రీడయు సమగ్రముగ నవలోకింప నుత్సాహి యయ్యెను. రాజ్యకాంక్ష యీతని యంతరంగమున ప్రవేశించెను. సైన్యముల కూర్చుకొనుచు మొదలొ వ్యూహముల బన్నుకొనుచు తరికై వేచివేచి యెట్టకేలకు క్రోధానలము రగుల్కొనుచున్న తరుణమున నీతడు తన స్వల్పసైన్యములతో పాంచాలయుద్ధరంగమున ప్రవేశించెను. పాంచాలవీరులు హర్షముతో బిలబిల చంద్రగుప్తునిచుట్టును జేరిరి. తృటిలో నాతనిసైన్యములు పెరిగిపోయెను. చంద్రగుప్తుడు పాంచాలస్వాతంత్ర్యసమరమునకు నాయకవీరు డయ్యెను. అంతట మహాపటుత్వతతో నీతడు సైన్యముల గవ

లించుకొనిపోయి యవనులపైబడి వారి నవలీల నుగ్గుజేసెను.
పాంచాల మాతనిపాలబడెను

చంద్రగుప్తుడు మగధ సింహాసనమాక్రమించెను.

కాని చంద్రగుప్తు డంతటితో తనివి నొందలేదు. ఆతని దృష్టి మగధమీదనే యుండెను తద్రాజ్యసింహాసన మాక్రమించుటకే యాత డీరణవ్యాపారముల నవలంబించెను మగధ సింహాసనమధిష్ఠించుటకై యాతడు చిరకాలమునుండియు వ్యూహములు పన్నుచుండెను ఆతని రణప్రయత్నముల గుర్తించి తద్రాజ్యాధీశ్వరుడగు మహాపద్మనందు డాతని మగధరాజ్యమునుండి వెడలగొట్టించెను ఒక్క యుద్ధరంగముతో మగధ తనకు వశమగునని యాత డెరుగును. పాంచాలమున వ్యవహారములు జక్కబరచుకొని చంద్రగుప్తు డతివేగముగ సైన్యములు నడిపించుకొనుచు మగధపై దాడివెడలెను. ఈసమయమున ప్రజాకంటకుడగు నందరాజు మహాపద్మనందుడు మగధను పాలించు చుండెను ఆతని పాలనమున సౌఖ్యమెట్టిదో యెరుగక ప్రజలు సంక్షోభిల్లుచుండిరి. చంద్రగుప్తుడు సైన్యముల గొని మగధపై నెత్తివచ్చుచుండెనని వినినంతనే ప్రజ లాబాలగోపాలమును సంతసించిరి. మగధ నృపాలుని సైన్యములు మంచువలె కరగిపోయెను. జను లెవ్వరును యాపత్సమయమున నాతని యండ నిలువనైరి రెక్కలు దెగినపక్షివలె యాతడు అసహాయుడయ్యెను చంద్రగుప్తుడు సులభముగ నందవంశమును తుదముట్టించి మగధసింహాసనముచు (క్రీ పూ. 322) ఆక్రమించెను.

ఈరణవ్యాపారములందెల్ల, నాతని చేదోడై విజయమును గూర్చినది నిరుపమాన ప్రజ్ఞాసంపన్నుడును, అఖండ ప్రతిభాశాలియు అనన్య రాజకీయపరిజ్ఞాతయునగు చాణక్య మంత్రి* ఈతడు తన యద్వితీయ శేముషీ ప్రభావముచే చంద్రగుప్తుని మగధసింహాసనమునకు పట్టాభిషిక్తుని జేసి, యఖండ వైభవముగ నాతనిచే మగధరాజ్యము నేలించెను.

అట్లు క్రీ పూ. 322 సంవత్సరమున చంద్రగుప్తుడు మగధసింహాసనమధిష్ఠించి, మౌర్యవంశమును♦ స్థాపించెను. ఈవంశమున వీరాతివీరు లుదయించి, మహాప్రతిభతో భారత వర్షము నేలిరి.

మగధరాజ్యమును దిట్టపరచి, చంద్రగుప్తుడు తక్కుటి రాజ్యముల జయింప మొదలిడెను. చంద్రగుప్తుడు సమరశూరుడు. తనరణకౌశల్యముచే ఉత్తరభారతమునగల రాజ్యములనెల్ల జయించి మగధరాజ్యమును నలుముఖముల విస్తరింపజేసెను. కొలదికాలముననె మగధ మహాసామ్రాజ్యమయ్యెను. ఆతని సైన్యములు పాదగాంచినంతనే అవంతి

---

* ఈతనికి విష్ణుగుప్తుడనియు, కౌటిల్యుడనియు నామాంతరములు గలవు. భారత యితిహాససారస్వతమున ప్రఖ్యాతిగాంచిన, "అర్థశాస్త్ర" మను దండనీతిశాస్త్రమును రచించిన దితడే.

♦ ఈతనితల్లిపేరు మురయగుటచే నీతని వంశమునకు మౌర్యవంశమని పేరుగల్గినదని కొందరును, యీతనితల్లి మగధరాజుల యాస్థానమున కొలువుచేయుచుండిన యొకానొక "మయూరపోషకుని" తనయయగుటచే యీతనివంశమునకా పేరుగల్గినదని కొందరును తలంచుచున్నారు.

సౌరాష్ట్రములాతనికి వశమయ్యెను. ఆర్యావర్తమున నాతని నెదిరింపగల రాజులెవ్వరును లేరైరి

ఇట్లు పదునేడువత్సరములు చంద్రగుప్తుడు మగధ సామ్రాజ్య మహాసౌధ నిర్మాణమునందు మునిగియుండెను.

ఇంతటితో గ్రీకులతో పోరు మరల సంఘటిల్లెను. అలెగ్జాండరుని మరణానంతరము ఆతని విశాలసామ్రాజ్యమంతయు తుత్తునియలయ్యెను ఆతని తనయులెవ్వరును సామ్రాజ్యాధిపత్యమును వహించి సమర్థతతో రాచకార్యముల నిర్వహింపగలవారుగారైరి ఆతడు ఊపిరివిడిచినంతనే యాతని సేనానులు విజృంభించి అతని సామ్రాజ్యమును తునియలు గావించి పంచుకొనిరి. ఈవిభాజ్యములలో సెల్యూకసు అను సేనాని పశ్చిమాశియాఖండమునకెల్ల రాజయ్యెను. సెల్యూకసు నిపుణమతియగు సేనాని. కడుసమర్థుడు అలెగ్జాండరు చక్రవర్తివలెనే ఆర్యావర్తమునకు దిగ్విజయయాత్ర సలిపి అస్తమించిన గ్రీకురాజ్యముల మరల జయింపవలెనను ఉబలాటముతో నతడు ప్రబలసైన్యముల వెంటగొని భారత వర్షముపై దాడివెడలెను క్రీ పూ 305 సంవత్సరప్రాంతమున సింధునదిని దాటి ఆర్యావర్తమును ప్రవేశించెను కాని పాపము భారతవర్షమును త్రొక్కినంతనే ఆతనిసంకల్పమంతయు భగ్నమయ్యెను. ఆతని యూహాలన్నియు ఆకాశహర్మ్యములయ్యెను మునుపటివలె నీతడు హైందవసైన్యముల సులభముగ జయింపగలననుయాశ తరలిపోయెను ఆకాలమున ఆర్యావర్తమునేలుచుండిన రాజులు ఐకమత్యము చెడి తమలోతాము తగవులాడుకొనుచుండుటచే నలె

గ్జాండరు వారి రాజ్యముల నొక్కటొక్కటిగ కబళింప గల్గెను. కాని యప్పటిపరిస్థితులు మారిపోయెను. తమలో తాము పోరాడుకొనురాజ్యము లస్తమించినవి. వానిస్థానమున బలీయమై, శత్రురాజుల కభేద్యమగు విశాల మగధసామ్రాజ్యము విస్తరించియుండెను సెల్యూకసువంటి సేనానుల రణరంగమున చిందులుత్రొక్కించి యాటలాడింపగల చంద్రగుప్తయోధాగ్రేసరుడు రణకుశలుడు ఈసామ్రాజ్యమున కధిపతిగనుండెను అందుచే సెల్యూకసుని యాశలన్నియు నడియాశలయ్యెను. ఆతనిసైన్యములు చంద్రగుప్తునిచే సంపూర్ణముగ నోడింపబడి చిందరవందరయయ్యెను. అలెగ్జాండరుచే జయింపబడిన రాజ్యముల కోల్పోవుటయె గాక మీదుమిక్కిలి సెల్యూకసు విజయుడగు చంద్రగుప్తునకు సింధునదీ పటమునకావలివైపునన్న గెడ్రోషియా (నవీన బెలుచిస్తానము) కాబూలు,హీరట్ కాందహారములు రాజధానులుగాగల్గినప్రోపనిసదియా ఏరియా అరకోషియా రాజ్యములను కానుక నసర్పించి తన తనయ నాతనికి పరిణయముగావించి 'బ్రతుకుజీవుడా'యని నిజరాజ్యమునకు మరలిపోవలసివచ్చెను.

ఈ యుద్ధానంతరమే క్రీ పూ. 302 సంవత్సరమున సెల్యూకసు మెగస్తనీసును పాటలీపుత్రమునకు రాయబారిగ నంపెను సెల్యూకసునృపాలుని తనయయు చంద్రగుప్తసార్వభౌమునియర్ధాంగియునగు రాకొమరితతోడను నామె పరిజనముతోడను యీతడార్యావర్తమున కరుదెంచెను మెగస్తనీసురాయబారి చంద్రగుప్తుని యాస్థానమున నైదు సంవత్సరములుండి తీరికగల్గినపుడెల్ల చంద్రగుప్తునిపరిపాలనా వైఖ

వమునుగూర్చియు పాటలీపుత్ర సౌభాగ్యమునుగూర్చియు ఆకాలమునాటి ప్రజల గుణశీలములఁగూర్చియు పాడిపంటల గూర్చియు మనోహరముగ వర్ణించినాడు ఈ కాలమునాటి చరిత్రనిర్మాణమున కిదియే ముఖ్యమగు నాధారగ్రంథము. కాని దౌర్భాగ్యవశమున నీగ్రంథములో చాలభాగము విస్మృతమైపోయినది.

## చంద్రగుప్తుని పరిపాలనము

చంద్రగుప్తుని పరిపాలనను గూర్చిన వివరములు మెగస్తనీసు చరిత్రగ్రంథమందును కౌటిల్యుని అర్థశాస్త్రమందును సవిస్తరముగ వర్ణింపబడినవి మౌర్యసార్వభౌముని రాజ్యపాలనము సర్వాంగసౌష్టవమై, వైభవోపేతమై, ప్రజారంజకమై, సౌఖ్యప్రదమై యలరారినదని పైగ్రంథములు నుడువుచున్నవి ఆకాలమున నాసియాఖండమందలి పారసీకము మున్నగు రాజ్యముపాలించిన డెరయసు సైరసులవలె చంద్రగుప్తుడు నిరంకుశప్రభువుగాడు అతని రాజ్యమున ప్రజలు క్రూరదండనలకుపాలయి స్వాతంత్ర్యమెట్టిదో నెరుగక పరితపించువారని విన్సెంటు స్మిత్తు మున్నగు చరిత్రకారులు వ్రాసియున్నారు కాని వీరివిపరీతపు వ్రాతలలో సత్యమణుమాత్రమును గన్పింపదు అతని పరిపాలనమున అపరాధులకు కఠినశిక్షలు విధింపబడుచుండినమాట సత్యము అంతమాత్రమున అతనిరాజ్యపాలనము నిరంకుశభూయిష్టమైనదని వ్రాయుటయా! అట్టిశిక్షలుప్రజాక్షేమమునకైఆకాలమునతరుచుగవిధింపబడుచుండెను చంద్రగుప్తుడు ప్రజల కన్నబిడ్డలవలె నాదరిం

చంద్రగుప్తుడు మౌర్యసామ్రాజ్యనౌకకు కర్ణధారియై దానినిమహాకౌశలముతో నడిపించెను ఆతనిరాజ్యపద్ధతులు సర్వోత్కృష్టమై ఆతని పరిపాలనానైపుణ్యమును వెనోళ్ళజా టుచున్నవి. ఆతని సైనిక ఆర్థిక పురపాలనములు అత్యంత ప్రశంసాపాత్రములై నవీనరాజ్యాంగపద్ధతుల పరిహసించు చున్నవి. అక్బరుపరిపాలనముకన్న నీతని పరిపాలనము వేయి మడుంగు లుత్కృష్టమైనదనిచరిత్రకారులు నుడివియున్నారు.

## రాజ్యనిర్వహణము.

మౌర్యసామ్రాజ్యమంతయు నాలుగు రాష్ట్రములుగ విభజింపబడి ఒక్కొకరాష్ట్రమున కొక్కకప్రతినిధిపాలకుడు నియమింపబడువాడు పరిపాలనాకార్యములందారితేరి విశ్వా సపాత్రులగువారలె యిట్టి ప్రతినిధిపదవి కర్హులగుచుండిరి సాధారణముగ రాజతనయులే ప్రతినిధులుగ బంపబడువారు. బింధుసారుడు రాజ్యమేలుచుండ యాతనితనయుడగు నశో కుడు తక్షశిలాప్రాంతమునకు రాజప్రతినిధిగ నుండెను

## మంత్రిసభ

సామ్రాజ్యపాలనమంతయు చంద్రగుప్తుడు తనమంత్రి మండలి సహాయ్యమున నిర్వర్తించువాడు చంద్రగుప్తుని మంత్రిమండలియం దెనమండ్రు సభ్యులుండిరి వీరికందర కును ప్రధానమంత్రి చాణక్యుడు ఆర్థిక, విదేశాంగ ముఖ్యవ్యవహారములన్ని యునీసభయేనిర్వహించును. ప్రాం తపాలకుల నిదియే నియమించును. ఇదియ ముఖ్యమగు శాసన

ముల గావించును. రాజ్యవ్యవహారములు చర్చింపబడునపుడు సభకు రాజురాని సభ్యులు తమ యభిప్రాయమును లిఖితపూర్వకముగ సభాస్థలికి బంపవచ్చును. చంద్రగుప్తుని మంత్రిమండలి యందలి సభ్యుల కార్యదక్షతా పరిపాలనా కౌశలముల మెగస్తనీసు ప్రశంసించియున్నాడు. దీనివలన చంద్రగుప్తుని రాజ్యపాలన సాంకుశపాలనముగాని నిరంకుశముగాదని పసిబాలునికైన గోచరించుచుండ పాశ్చాత్యచరిత్రకారు లీతని ప్రభుత్వము నిరంకుశభూయిష్ఠమైనదని యెట్లువచింపగల్గిరో తెలియకున్నది ఇదియునుగాక "రాజ్యాధికారము ప్రజాదత్త" మను ఆర్షరాజధర్మముపైననే యీకాలమునాటి రాజప్రభుత్వములన్నియు నిర్మింపబడినవి. నృపుని పట్టాభిషేకకాలమున రాజదండము నాతడు ప్రజలహస్తములనుండి గైకొనువేళ "నేను ప్రజల హింసింతునేని ప్రాణములకును, స్వర్గమునకును, నా యనుంగుబిడ్డలకును దూరమై పోదునుగాక" యని ప్రమాణముజేయును

చంద్రగుప్తునివంటి నిరంకుశపాలకుడు మంత్రి పురోహితులవచనముల పాటించి యుండడని యేమేమో విన్సెంటు స్మిత్తుగారు వ్రాసినారు. ఈతని వ్రాతలన్నియు ఊహాజనితములుగాని యదార్థములు గాకపోవుటచే వానిని మనమంతగా పాటింపవలసిన పనిలేదు చాణక్యుడు తన అర్థశాస్త్రమున రాజులుపాటింపవలసిన నియమములని బేర్కొనిన రాజ్యపద్ధతులన్నియు నతడు చంద్రగుప్తునిచే నవలంబింపబడినట్లూహించి వ్రాయుచున్నాడు. ఈతని యూహల కాధారములు గన్పింపవు

## పరిపాలనాశాఖలు.

పరిపాలనా సౌలభ్యముకొరకు, చంద్రగుప్తుడు పెక్కు శాఖల నేర్పరచి యొక్కొక్క శాఖకొక్కొక్క యధికారిని నియమించెను. ఇట్లు అపణవీధులపై, సైన్యములపై, నీరు సమముగ నన్నికాలువలకును, పారుచున్నదో లేదో పరీక్షించుటకు, భూములకొలిచి విస్తీర్ణము కనుగొనుటకు, పన్నులు వసూలుపరచి, బొక్కసమున జేర్చుటకు, అడవుల కాపాడుటకు బాటలనిర్మించుటకు, మార్గమున దూరముచు దెల్పుటకై శిలల బాతించుటకు, విశ్రాంతి గృహముల నిర్మించుటకు ప్రత్యేక యధికారు లుండిరి. ఇవిగాక యింకనెన్నియో శాఖ లుండెడివి కౌటిల్యుని యర్థశాస్త్రమున ముప్పదివరకును పేర్కొన బడినవి. వారి వర్తనము గనిపెట్టి చూచుటకు వేగులవాండ్ర నంపుచు తాను ప్రచ్ఛన్నవేషమున వారిచర్యల నవలోకించుచు చంద్రగుప్తుడీయుద్యోగులు లంచగొండులై ప్రజల పీడింపకుండ మిగులజాగ్రత్తపుచ్చుకొనువాడు ఎవ్వరైనను తమ ధర్మమునుదప్పి ప్రజాకంటకులై వర్తిలుచుండినట్లు దెలిసిన వారిని నిర్దాక్షిణ్యముగ దండించువాడు అట్టివారిని గనిపెట్టి దెల్పినవారికి బహుమానముల నిచ్చువాడు కాని వారి దోష మిదమిత్థమని ఋజువుచేయజాలక నిష్కారణముగనీర్ష్యచే కల్లబొల్లినేరారోపణల జేయువారిని గూడ దారుణముగ శిక్షించువాడు.

## వేగులు

చంద్రగుప్తుని రాజ్యపాలనమున వేగులవాండ్రు విశేషముగ నుపయోగింపబడిరి ఈతని పరిపాలనా చక్రమున

వీరొకముఖ్యాంగముగ నుండిరి. వేలకొలది వేగులు ప్రచ్ఛన్న వేషధారులై రాజ్యమెల్ల దిరుగువారు నవీనజర్మనీరాజ్యమునందువలె మౌర్యసామ్రాజ్యమున వేగులవాండ్రకై యొకప్రత్యేకశాఖయుండెను వీరు పరులకు దురవగాహమగు రహస్యభాషతో సమాచారములు కేంద్రస్థానమునకు జేర్చుచుందురు పావురములు, పిచ్చుకలు మున్నగు శకుంతములుగూడ సమాచారముల గొనిపోవుటకై యుపయోగింపబడెడివి. పూర్వకాలమున వేగులవాండ్రు అద్భుతకార్యముల నిర్వహించెడివారు మారువేషముతో దుర్గరక్షకుల కనుగప్పి పోతుటీగకైన చొరశక్యముగాని దుర్భేద్యమగు శత్రుదుర్గములప్రవేశించి శత్రుసేనల రణప్రయత్నములనెరిగివచ్చి ఱేనికి దెల్పువారు వీరివలన క్ష్మాపాలురకు పరిపాలనా లోపముల దెలిసికొనుట సుసాధ్యమగుచుండెను వీరలు పోయి యెల్లతావులదిరిగి ఱేనిపాలనమునుగూర్చి ప్రజలేమిచెప్పుకొనునదియు, ప్రాంతపాలకులు,ఉద్యోగులు ప్రజలహింసింపకుండ తమతమ కృత్యముల సరిగ నిర్వర్తించునదియు కనిపెట్టివచ్చి నృపునికి జెప్పుచుందువారు చోరుల, నరహంతకుల బట్టుకొనుటలో గూడ వీరు చాలనేర్పరులుగనుండువారు "రాజనువాడుతన పరిపాలనమును గూర్చి ప్రజలేమనుకొనునదియు వారికెట్టికష్టము లొదవునదియు చారులవలననెరిగి తన పరిపాలనా పద్ధతుల విమర్శించువారిపై కినుకదాల్పక తనరాజ్యమందలి లోపముల సవరించుకొని ప్రజలకు క్షేమము గూర్పవలయును" అని శుక్రనీతిసారమున వచింపబడియున్నది చంద్రగుప్తుని రాజ్యపాలనమున వేగు లత్యంతలాఘవముగ సమా

చారముల గొనివచ్చువా రనియు వారి తోడ్పాటువలన నాతని పరిపాలనము మిగుల ప్రజారంజకముగ నిర్వహింప బడినదనియు, యవనచరిత్రకారులు వేగులవారి చక్కదనము మిగుల శ్లాఘించియున్నారు దురాచారులై, లంచగొండులై దుష్ప్రవర్తనులగు నుద్యోగులపాలిటి యమదూతలై మెల గుచు యీ వేగులు చంద్రగుప్తుని పరిపాలనానిర్వహణమున మిగుల తోడ్పడుచుండువారు

## చంద్రగుప్తుని కరగ్రహణపద్ధతులు.

చంద్రగుప్తుడు పలుభంగుల ప్రజలయొద్దనుండి ధనము నాకర్షించి తనభాండారమున జేర్చువాడు మనుధర్మము శుక్రనీతిసారము మున్నగు రాజనీతిగ్రంథములందు వివరింప బడినరీతిని చంద్రగుప్తుడు కర్షకులనుండి పండినపంటలో షష్ఠాంశమును మాత్రము పన్నుగా బుచ్చుకొనువాడు ఇదిగాక కృషీవలులింకెట్టి సుంకమును జెల్లింపనక్కరలేదు చంద్రగుప్తుని పరిపాలనమున కరభారము గృహస్థుల సమర్థతాసమర్థతలబట్టి నిర్ణయింపబడుచుండెడిది అంతియగాని పండినను, ఎండినను ఉన్నను, లేకున్నను, పుష్టిపూరల నమ్మించి పన్నుఁ గొనిపోవు పద్ధతు లాకాలమున లేవు

రాజమాన్యములనుండియు, గనులనుండియు, ఉప్పుకొటారుల నుండియు, ముత్యములువారకు సముద్రభాగములనుండియు చంద్రగుప్తునకు అశేషధనములు చేకూరెడివి. ఇవిగాక రాజనౌకలను వాణిజ్యార్థము బాడిగకు నిచ్చుటవలనను సరకు

లపై, మద్యకుటీరములపై, ద్యూతశాలలపై, విధింపబడుసుంకము లవలననుగూడ చాలధనము లభించెడిది చంద్రగుప్తుని కర గ్రహణపద్ధతు లాతనికల్పనాశక్తిని ఆతని పరిపాలనా నైపుణ్య మును ప్రదర్శించుచున్నవి చంద్రగుప్తుడు కరగ్రహణసౌలభ్య మునకై తనసామ్రాజ్యమునగల గ్రామములన్నియు నైదుతర గతులుగ విభజించెను అందు మొదటితరగతి గ్రామములు పన్నులు చెల్లింపనక్కరలేనివి విద్యా మత ప్రచారముచేయు విద్వాంసులచే నివసింపబడు గ్రామము లీరకములోజేరుచు

ప్రభుసైన్యములకు సైనికులనంపు గ్రామములు రెండవ తరగతిలోనివి. వీనిపైగూడ పన్నులులేవు. మూడవతరగతి గ్రామములు ధనధాన్య పశురూపమున నృపునిచే విధింపబడు పన్నుల జెల్లించునవి

తటాకములు, బాటలు, విశ్రాంతిగృహములు మున్నగు వాని నిర్మించుటకై సహాయముజేయు గ్రామములు నాల్గవ తరగతిలోనివి వీనిపైగూడ పన్నులు విధింపబడవు ఐదవతరగతి గ్రామములురాజప్రాసాదమునకు క్షీరములు, పెరుగు మున్నగు వానినంపు పశుసంపదగల్గి కృషికళలచే జీవించు గ్రామములు.

ప్రతిగ్రామాధికారియు (వీనికి గోపకుడనిపేరు) తనగ్రా మమునుండి చెల్లవలసిన భూసుంకముల వసూలుపరచి భాండా రమున కంపవలెను ఈతడు తనగ్రామమున నివసించెడు గ్రామ వాసులనామములు, వారికులగోత్రములు, రాబడుల, భూవస తుల, పశుసంపదల చెల్లింపవలసిన పన్నులవివరించు నొకపుస్తక

మునుకూడ లిఖించి నృపుని కంపవలయును. రాజోద్యోగులు దీనినిబట్టి గ్రామాధికారులు సరిగ పన్నులను వసూలొనర్చి నదియు లేనిదియు పరిశీలించుచుందురు పెద్దపట్టణములలో నిట్టి కార్యమునే నిర్వహించుట కొకయుద్యోగి ప్రత్యేకముగ నియమింపబడును ఈతనికి స్థానికుడని పేరు ఇట్లే మండలరాజధానులగు నగరములందు పన్నులు వసూలుచేయుట కధికారులు గలరు వీరు తమమండలములలోని గ్రామపట్టణములందలి కరవ్యవహారములను గమనించుచుందురు.

ఇదిగాక నగరములందు సరకులపై విధింపబడు సుంకముల ప్రోవుజేయుటకు వేరే యధికారులుగలరు వీరు పురద్వారములకడ కావలియుండి లోనికిగొనిరాబడు వస్తువులు లెక్కగొని సుంకముల విధింపవలెను ఆకాలమున బజారులన్నియు పట్టణాంతర్భాగముననే నెలకొనియుండెడివి సుంకములు విక్రయింపబడిన వస్తువులమీాదనే విధింపబడెను కృపాణ, తనుత్రాణ శిరస్త్రాణాదియుద్ధపరికరములు లోహములు, రధములు, అశ్వ, వృషభగజశకటములు, ధాన్యములు గజతురగాది జీవజంతువులు, సువర్ణములు, మణులు మున్నగు వానిపై సుంకమువిధింపరాదు అందుచే వీనిలో క్రయవిక్రయములు పురబాహ్యప్రదేశముననే జరుగుచుండెడివి ఇవిగాక చందనాగరు మున్నగు పూజాద్రవ్యములు పరిణయమహోత్సవముల కొరకైగొనిపోబడు సంబారములు, వస్త్రాదికములు, నృపునికొరకై దీసికొని పోబడు కానుకలు, బాలెంతరాండ్రయుపయోగార్థమై తెచ్చువస్తుచయము వీనిపైకూడ సుంకముల గ్రహింపరాదని చంద్రగుప్తుడు శాసించెను.

సాధారణముగ చంద్రగుప్తుని ప్రభుత్వమున వీనిపై నుండి వచ్చురాబడి పరిపాలనావ్యయములకు సరిపోయెడిది కాదు. అతని రాజ్యపాలనమున పెక్కు యుద్ధములు సంఘటిల్లి నవి. మగధరాజ్య విస్తీర్ణతకై చంద్రగుప్తుడు పెక్కు రాజ్యములతో పోరుసల్పెను. ఈరణవ్యాపారములకు అమితమగు ధనము వ్యయమగుచుండెను అట్టిసమయములందు రాజు ధనసహాయమునకై ప్రజల నర్థించువాడు

## న్యాయపరిశీలన

చంద్రగుప్తునిపరిపాలనమున గ్రామాధికారియు గ్రామ పంచాయితీసభయు గ్రామమున నుద్భవించెడువివాదల పరిష్కరించెడివారు పెద్దపట్టణములందును నగరములందును రెండేసి న్యాయస్థానములుండెను న్యాయశాస్త్ర పరిచయముకల్గిన ముగ్గురువిద్వాంసులును స్థానికవ్యవహార ఆచారాదినియమముల నెరిగినపెద్దలును వీనికి తీర్పుకర్తలుగ నుండిరి వీనిలో ప్రథమన్యాయస్థానమున చౌర్యము, ఋణములు, ప్రతిష్ఠాభంగము, గృహచ్ఛిద్రములు, కొట్లాటలు, గృహద్దుతగవులు, పచ్చికభూములు, పూగశ్రేణులు మున్నగువానికి సంబంధించిన అపచారములు విచారింపబడును. ద్వితీయన్యాయస్థానమున బందిపోటు, నరహత్య, రాజద్రోహములు పరిశీలింపబడును వీని యన్నిటికన్న పైనవేరొకయుత్తమన్యాయస్థానము కలదు ఇచ్చట నృపుడును అతని యమాత్యులును వేదశాస్త్రపారంగతులగు బ్రాహ్మణవిద్వాంసులును, తీర్పుకర్తలుగనుండి న్యాయవిచారణజేయుదురు క్రింది న్యాయస్థానములలో న్యాయములభింపనియెడల కక్షిదారులు తమస్వత

హారముల నిచ్చుటికిఁగొనివచ్చి పునర్విచారణ జేయించుకొన వచ్చును. సామ్రాజ్యమందలి న్యాయస్థానములన్నిటిపై దీని కధికారముగలదు అన్నిటినుండిగొనిరాబడు దోషముల నిదియే పునర్విచారణగావించును ఇచ్చటగావింపబడు తీర్పునకు తిరుగులేదు ఈకాలమున అపరాధులకు, జరిమానాలు, కారాగృహవాసము, బాహువిచ్ఛేదనము, శిరచ్ఛేదనము మున్నగు శిక్షలు విధింపబడుచుండెను

చంద్రగుప్తుడు నిష్పక్షపాతముగ న్యాయము నెరపువాడు ఎంతటి యగ్రజన్ముడైనను, తప్పుజేసెనేని శిక్షింపక విడుచువాడు కాడు బ్రాహ్మణులైనను శిక్షార్హులైనయెడల దండింపబడవలసినదే అపరాధములు, కారాగృహవాసము, లోహపుగనులలోయూడిగము మున్నగు శిక్షలు వారికిని విధింపబడెడివి. చంద్రగుప్తుడు అపరాధుల దండించుటలో నప్రమత్తుడై యుండుటవలన నాతని రాజ్యమున చౌర్యనరహత్యాది నేరములత్యల్పముగ జరుగుచుండెడి వని మెగస్తనీసు వ్రాసినాడు

చంద్రగుప్తుడు నిర్దయుడై అపరాధులకు ఘోరదండనల విధించువాడనియు చౌర్యము మున్నగు అల్పనేరములకుగూడ శిరచ్ఛేదము, బాహువిచ్ఛేదము లోనగు కఠోరశిక్షల విధించువాడనియు, అపరాధులు నిర్దోషత్వమును నిర్ణయించుటకు అగ్నిజలపరీక్షల నవలంబించువాడనియు విన్సెంటుస్మిత్తు ఆతని న్యాయవిచారణా పద్ధతులు హేళనచేసినాడు

కాని యాతని పరిపాలనమును న్యాయమైకదృష్టితో విమర్శింపవలెను దేశకాలపరిస్థితుల యోజింపవలెను ఆకాలమున

అట్టిశిక్షలు సర్వసాధారణముగ విధింపబడెడివి. ఆకాలమున విధింపబడుచుండినను చంద్రగుప్తు డిట్టిశిక్షల విధించినట్లు గానరాదు. ఆతడు జైనమతావలంబుడు. జైన మతావలంబు డగు రాజిట్టి కఠోరదండనల విధించెనని తలంపజాలము. ఒకవేళ విధించె ననుకొన్నను న్యాయమువీసము దప్పకుండ నెరపెడి రవియస్తమింపని బ్రిటిషుమహాసామ్రాజ్యమునను ప్రజాస్వాతంత్ర్యమునకు నిలయమని దంభోక్తులుపల్కు అమెరికా ఖండమందును నేడింతకంటె మృదుతరమగుశిక్షలు విధింపబడుచున్నవా? వీని ముందివియేపాటివి దివిటీముంజరి దీపములుగదా? నిన్న మొన్ననేకదా అమెరికాఖండమున నతిఘోరముగ నీగ్రోజాతుల పెనుమంటలలోబడవైచి నతిఘోరముగ కాల్చిచంపినది? పాశ్చాత్యదేశములు మనభారతదేశమున విధింపబడు శిక్షలు క్రూరములనవలయునా?

## వ్యవసాయసౌకర్యములు

మొదటినుండియు ఆర్యావర్తమున నివసించు ప్రజలకు కృషియే జీవనాధారము అనాదినుండియు భారతభూమి కృషిసంపద కీప్రపంచమున ప్రఖ్యాతివడసినది తటాకములు, కాలువలు, కూపములు మున్నగు వ్యవసాయాభివృద్ధికుపకరించు పరికరముల నిర్మించుటలో భారతీయు లత్యంతప్రావీణ్యులు. వీరికెనవచ్చువారీప్రపంచమున లేరు. కృషికళాభివృద్ధికి వలయు సౌకర్యముల నన్నిటిని ఆకాలమున ఆర్యావర్తము నేలినరాజులు కల్పించిరి రాజు ప్రజలకడనుండి అప్పనములు గొనిపోవుటలోగాక తటాక నిర్మాణాదికార్య

ములలో నెక్కుడు శ్రద్ధవహించువాడు చంద్రగుప్తుని రాజ్యకాలమున వ్యవసాయకృషి యపారముగ వృద్ధినొందినది. ఆతడు వేలకొలది యకరముల భూమిని సేద్యమొనర్చుట కుపకరించు తటాకముల నెన్నిటినో నిర్మించెను పెక్కుకాలువలు త్రవ్వించి వానికి తూములు గట్టించెను చంద్రగుప్తుని ప్రతినిధిపాలకులలో నొకడగు పుష్యగుప్తుడు పర్వతముల నుండి ప్రవహించు నొకసెలయేటిధార కడ్డుగట్టి గిరినారునొద్ద నొకమనోహరమగు తటాకమును కల్పించెను ఇదియె సుదర్శన తటాకమని ఆర్యావర్తమున ప్రసిద్ధినొందినది. ఇది మౌర్యగుప్త వంశరాజులచే నెనిమిదివందలేండ్లవరకును మంచిస్థితిలో నుంచబడినది తదుపరి సంభవించిన హూణ, యవన, మహమ్మదీయ దండయాత్రలలో దీనిజూచు దిక్కులేక శిథిలమై పూడి చెట్లు మొలచి విస్మృతమైపోయినది

తటాకములుమున్నగు వ్యవసాయసాధనములను గ్రామములు తమంతటదాము నిర్మించుకొనుట కష్టసాధ్యమగుటచే నిట్టిపనుల చంద్రగుప్తుడే తన యుద్యోగుల నంపి చేయించుచుండును తటాక నిర్మాణాది కృత్యము లొనర్చి నీటివసతుల కల్పించుటకు చంద్రగుప్తు డొకప్రత్యేకశాఖ నేర్పరచెనని వేరొకసందర్భమున నుడివియుంటిమి అది యీకాలమునాటి యిరిగేషను శాఖను బోలియుండును అందలియుద్యోగులు తూముల పరీక్షించుచు అన్నిపొలములకును నీరు సమముగ బారుచున్నదియు లేనిదియు పరిశీలించుచుందురు సేద్యము గావింపబడిన భూములగొలచి విస్తీర్ణములరయుచుందురు నదులనుండి, కాలువలనుండి, నూతులనుండి నీరున్నతప్రదేశము

షకు గొనిపోవుటకు ఆకాలమున ఎద్దులను, యంత్రము లను గూడనుపయోగించెడివారు

వివిధప్రాంతములందుబడిన వర్షపరిమితిని కనుగొనుట కీకాలమున సాధనములు గనిపెట్టబడినవి మేఘసంచలనమును బట్టియు సూర్య చంద్ర గ్రహ నక్షత్రాదుల సంచారమును బట్టియు వర్షపాత మెప్పుడు గల్గునో జెప్పవచ్చునని కౌటిల్యుడు చెప్పియున్నాడు.

## బాటలు, వాణిజ్యము.

ప్రాచీన భారతవర్షమున బాటల నిర్మించుట రాజధర్మములలో నొకటియై యుండెను శాంతిరక్షణకును వాణిజ్యాభివృద్ధికిని బాట లత్యావశ్యములని కౌటిల్యుడు వివరించినాడు. బాటలయుపయోగమును గూర్చి యీతడు చాలదూరము జెప్పియున్నాడు. రాజపథము లెంత వెడల్పుండవలయునో ఎట్లు నిర్మింపబడవలయునో గూడ నీతడు వర్ణించినాడు చంద్రగుప్తుని కాలమున ప్రతియూరిమీదుగను ఉత్తరదక్షిణములుగ నొకటియు, తూర్పుపడమరలగ నొకటియు రెండేసి బాటలు పోయెడివి ఆతని కాలమున దేశమంతయు చక్కని బాటలతో నల్లుకొనియుండెను వీనిమూలమున ఒకగ్రామమునుండి మరియొకగ్రామమునకు రాకపోకలు నిరాఘాటముగ జరిగినవి. పైనవివరించిన బాటలలో మొదటిది 'మహాకాల' యనియు రెండవది 'రాజపథ'మనియు పిలువబడెడివి. మహాకాల వాణిజ్యసౌకర్యమున కనియు రాజపథము సైనికరాజసంచారముల కని యు నిర్దేశింపబడినవి చంద్రగుప్తుని సామ్రాజ్యమున రాజపథ ము

# బౌద్ధమహాయుగము

పాటలీపుత్రమునుండి తిన్నగ పశ్చిమసరిహద్దులకు, తక్షశిలా నగరప్రాంతములకు బోయినది. ఈమార్గ మత్యంతసుందరముగ నుండెను. దీనిపై ప్రయాణ మొనర్చుట బాటసారుల కానంద దాయకముగ నుండెడిది. చంద్రగుప్తునిచే యీ మార్గమున ఇరుకెలకులందును చల్లనినీడనిచ్చు వృక్షములు పాతింపబడినవి. దూరదూరమున నిర్మలోదకముల నొసగు బావులు తీయింప బడినవి పథికులు విశ్రాంతిగొనుటకై పలుచోట్ల ధర్మశాలలు, విశ్రాంతిగృహములు నిర్మింపబడినవి దూరమును తెల్పుటకై అర్ధక్రోశమున కొకటివంతున క్రోసురాళ్ళు పాతింప బడినవి.

చంద్రగుప్తుని పాలనమున బాటలునిర్మించుటకు పాడు వడిన బాటల బాగుచేయించుటకు ప్రత్యేకముగ నుద్యోగులు గలరని నుడివియుంటిమి ఈబాట లేయేగ్రామముల మీదుగ బోవునో ఆయాగ్రామవాసులు తమ గ్రామ సరిహద్దులలో గల బాటల బాగుచేయుటకు వలయు మనుజుల సహాయ మంప వలయును. రాకపోకల కాటంకములు గల్పించువారికిని, బాటల బాడుచేయువారికిని శిక్షలు విధింపబడుచుండెను

ఇవిగాక పట్టణములందును,దుర్గములందును రథగమనమునకు వేరుగను (యివి రాతితో చప్టాచేయబడును) అశ్వములు, ఖరములు, ఒంటెలు, గజములు మున్నగు జంతువులు సంచరించుటకు వేరుగను, బండ్లు నడుచుటకు వేరుగను,మృతకళేబరముల శ్మశానమునకు గొనిపోవుటకు వేరుగను ప్రత్యేక ప్రత్యేకబాటలుండెను వీనికొలతలలో భేదములుగలవు.

చంద్రగుప్తుని కాలమున జలమార్గములుగూడ మిక్కుటముగ గల్పింపబడినవి. వీనిమూలమున గూడ వాణిజ్యము విరివిగ జరిగెడిది. సైన్యములనొక చోటనుండి యొకచోటికి గదలించుకొని పోవుటకు సులభమార్గములుగ నివి తరుచుగ నుపయోగింపబడెను.

## నౌకా వ్యాపారము

చంద్రగుప్తుడు నౌకాసంబంధమగు పనుల నిర్వర్తించుటకు గూడ నొక ప్రత్యేకశాఖ నేర్పరచెను సముద్రనదీ జలముల ప్రయాణమొనర్చు పాంథులకు నీటిదొంగలవలన హానికలుగకుండ కాపాడుటయు, వంతెనలను, రేవుపడవలను నౌకాశ్రయముల నిర్మించుటయు నౌకావ్యాపారమును పోషించుటయు దీనిపని ఆకాలమున సముద్రములపై, నదీప్రవాహములపై సరకుల గొనిపోవుట కుపయుక్తములగు నోడల పరిపాలకులె నిర్మించి యుంచువారు. తెడ్లు, త్రాళ్లు, కొయ్యలు, తెరచాపలు మున్నగు పరికరముల నౌకా శాఖాధికారులు సమకూర్చెదరు. వీరితప్పిదమువలన నౌక కేహాని వాటిల్లినను, నౌక భగ్నమైనను వణిజులకు గల్గిన నష్టము దివాణమే భరించుచుండెను. చంద్రగుప్తు డిట్లు నౌకలనిర్మించుచు పాంథులనొకచోట నుండి మరియొకచోటికి గొనిపోవుచు నౌకాయానమును మిగుల ప్రోత్సహించెను ఇదిగాక యీతడు వణిజులకు నౌకాయానమునకై వలయు ధనము సమకూర్చియు అన్యదేశవణిజులకు రాయబారముల నంపి రప్పించియు పలుతెరంగుల సముద్రవాణిజ్యమును పెంపొందజేసెను

## పాటలీపుత్ర వైభవము

చంద్రగుప్తుని రాజధానియగు పాటలీపుత్రనగరవైభవ మును మెగస్తనీసు మనోహరముగ వర్ణించినాడు దీనిసౌంద ర్యమును గాంచి యీతడు విస్మయుడయ్యెను పాటలీపుత్రము ఆకాలమున భారతవర్షమున విలసిల్లిన నగరరాజములన్నిటి కంటె రమణీయమైయుండెనని యీరాయబారి సంస్తుతించి నాడు. ఈపట్టణము గంగా హిరణ్యవతీనదులు గలయు పావనక్షేత్రమున నిర్మింపబడినది శత్రుసేనల కవిలంఘ్యముగ నొనర్పగల సహజ నైసర్గికలక్షణములు దీనికి గలవు నురగల గ్రక్కుచు గంగాతరంగిణి దీని ముంగిటనే ప్రవహించుచు చూపరుల కానందము గొల్పుచుండెడిది. ఇది యిరువదిక్రో సుల వైశాల్యముగల్గిన మహానగరము దీనిపొడవు పదిక్రోశ ములుండును వెడల్పు రెండుక్రోశములు ప్రస్తుతపాట్నా, బంకీపురములును, ఆ పరిసరగ్రామములను వ్యాపించియుండు ప్రదేశమందంతటను యీపట్టణము విస్తరిల్లియుండెను ఇది మహోన్నతమగు ప్రాకారములచే పరిరక్షింపబడెను ఈ ప్రాకారము అరువదినాలుగుద్వారములతోడను, ఐదు వందలడెబ్బదిబురుజులతోడను ఒప్పారుచు శత్రుభీకర ముగ నుండెను ఈప్రాకారకుడ్యముల కావల ఆరువందల యడుగుల వెడల్పును, ముప్పది యడుగుల లోతును గల్గిన మహాకీలవగు పరిఖాజలములు ప్రవహించుచుండెడివి

చంద్రగుప్తుని రాజప్రాసాదము పురమధ్యమున నుండెను ఇది మాండలేపురమందలి మనోహర హర్మ్యములవలె

దారునిర్మితమైనది. వివిధకుసుమ ఫలశోభితములగు తరులతావళులతో, నిర్మల జలపూరితములగు పద్మాకరములతో రమణీయముగ గిరగిర దిరుగుచు పొంగి యూర్ధ్వముఖమునకు ప్రవహించు పెక్కు జలయంత్రధారలతో నేత్రపర్వమొనర్చు నొక సుందరోద్యానవనమున నిర్మింపబడినది ఈభవనము ఎగ్బటానా, సుసా నగరములందలి రాజహర్మ్యములకంటె వైభవోపేతముగ నుండెనని మెగస్తనీసు దీనియందమును కొనియాడినాడు ఈప్రాసాదమందలి కంబములు పసిడిపూతలతో మెరుగులీనుచుండెను. వీనిపై పిందెలు, లతలు, శకుంతములు ముద్దులు మూటగట్టునట్లు నగిషీ చెక్కబడినవి. ఈ భవనమునయెక్కడజూచినను బంగరుసింహాసనములు, మురిపెముల గొల్పు తల్పములు, ఆసనములు, మణులు పొదిగిన తామ్ర రజత సువర్ణపాత్రములు కనులపండువు జేయుచుండును

రాజప్రాసాదమున కుత్తరపువైపున చంద్రగుప్త సార్వభౌమునిచే నారాధింపబడు యిష్టదేవతామందిరముండెను. ఇదిగాక పురమున పలుచోట్ల ఆకాశపథమున మెరయు నక్షత్రగణములవలె పెక్కు దేవాలయములుగలవు

ఈపట్టణమున నుత్తరభాగమున బ్రాహ్మణులును శిరస్త్రాణ, కవచ, కరవాలములుమున్నగు రణోపకరణములజేయు లోహకారులును మణుల సానబట్టువారును నివసించువారు. వాయువ్యభాగమున బజారులు, ఔషధశాలలుండెను తూర్పు కొనను క్షత్రియులు, శిల్పకారులు, సుగంధద్రవ్యములు, కుసుమమాలికలు, ధాన్యములు మున్నగు వస్తువులనమ్ము వైశ్యులునునివసించువారు శిల్పులు యుద్ధపరికరములజేయు లోహ

కారులు బ్రహ్మక్షత్రియులుండు చోటనివసించుటంబట్టి పూర్వకాలమున నిట్టియుత్తమకళల కెట్టిగౌరవస్థానమివ్వబడినదో విదితమగుచున్నది. పశ్చిమప్రాంతమున శూద్రులును వస్త్రములనేయు సాలివాండ్రును, చర్మకారులుండిరి. పట్టణమునకు నాల్గుకోనలందును పరపతిసంఘముల యొక్కయు, పూగశ్రేణి శ్రమజీవికాసంఘముల యొక్కయు కార్యాలయములుండెను ప్రాచీనకాలమున హైందవసాంఘిక జీవనమంతయు సహకారపద్ధతులపై నడచుటచే శ్రమజీవులకు ప్రత్యేకసహకారసంఘములున్నవనిన నాశ్చర్యముగన్పింపదు పూర్వదక్షిణ పశ్చిమఉత్తరపురద్వారములు నాల్గును వరుసక్రమమున బ్రహ్మ యింద్ర మృత్యు (యమ) రణదేవతల నామములచే బిల్వబడుచుండెను నగరప్రాకారమున కావల, అగడ్తకు నూరుబారల దూరమున పధికుల విశ్రాంతిగృహములును కేళీవనములును గలవు.

## పాటలీపుత్రనగర పరిపాలన.

చంద్రగుప్తుని పాలనమున పురపాలనాపద్ధతులు పరిపూర్ణతగాంచినవి. మెగస్తనీసు పాటలీపుత్ర పరిపాలనావిధానమును సవిస్తరముగ వివరించినాడు యాతనిసామ్రాజ్యమున తక్కటిపట్టణములందుగూడ నీరీతినే పురపాలనమత్యంత చాకచక్యముగ నిర్వర్తింపబడుచుండెను పాటలీపుత్రము ముప్పదిమందిసభ్యులుగల్గిన నొకమహాసంఘముచే పరిపాలింపబడెడిది ఈమహాసంఘమే పురజనుల యోగక్షేమముల నారయును విశ్రాంతిమందిరములు, బాటలు, తటాకములు, దేవాలయములు, ఔషధశాలలు, ఆపణములు

మున్నగువాని నిర్మాణపోషణాదికృత్యముల నిర్వర్తించును. పురమునకు సంబంధించిన ఆర్థికవ్యవహారముల చక్కజూచును. తటాకజలముల నపరిశుభ్రము నొనర్చి బాటలపాడుజేయు కుటిలవర్తనుల దండించును. ఈకాలమున పాటలీపుత్రనగరమున గమనింపబడుచుండిన శౌచవిధు లత్యంతప్రశంసనీయములైనవి. పురపాలకులు ఆరోగ్యరక్షణము నప్రమత్తులై యుండువారు. మృతకళేబరములను జనసమ్మర్దమగు నగర వీధులవెంట గొనిపోరాదు. ప్రేతముల గొంపోవుటకు ప్రత్యేకమగు బాటలుగలవు. శ్మశానవాటికలందుదప్ప తక్కిటి చోట్ల ప్రేతములకు దహన, సమాధి సంస్కారవిధులొనర్ప రాదు. దుర్గంధపూరితములగు శునకమార్జాలాది క్షుద్రజంతువుల మృతశరీరములు వీధులలో బడవేయువారు శిక్షింపబడుచుండిరి. చంద్రగుప్తుని పాలనమున పట్టణము లిట్టి సర్వోత్కృష్టమగు శౌచధర్మములచే పాలింపబడి ఆరోగ్యభాగ్యముతో తులతూగుచుండెను.

ఇదిగాక, ఈపురపాలకసంఘము, ఐదైదుగురుసభ్యులు గల్గిన, నారుపంచాయితులుగ విభజింపబడి, ఒక్కొకపంచాయితి యొక్కొక ప్రత్యేకశాఖపై యధికారమును వహించెను. అందు మొదటి పంచాయితి పరిశ్రమాభివృద్ధికై పాటుబడుచు పరిశ్రమజీవుల వేతనముల నిర్ణయించుచు పరిశ్రమాలయములలో నుపయోగించెడి వస్తువుల పరీక్షించుచు అందు స్వచ్ఛంబమగు వస్తుసామాగ్రినే యుపయోగించునట్లు కట్టడిచేయును.

రెండవపంచాయితి విదేశములనుండివచ్చు పాంథజనులకు సౌకర్యములగూర్చునది. ఈపంచాయితి సభ్యులు

పరదేశీయులకు తగినవసతిగృహములజూపి విడిది సేయింతురు. వారనుమానాస్పదులై శత్రురాజ్యముల నుండి వచ్చిన వేగులవారైనచో, వారివెంట నరిగి వారిచర్యల గనిపెట్టి చూతురు వ్యాధిగ్రస్తులకు, పాంథులకుఔషధచికిత్స చేయింతురు మృతులైనచో వారిదేహములకు దహనసమాధి సంస్కారముల గావింతురు. వారి యాస్తిని భద్రపరచి వారి బంధుజనుల కందజేతురు దీనిబట్టి చంద్రగుప్తుని కాలమున పరదేశములకును భారతదేశమునకు మిక్కుటముగ రాకపోక లుండెడివనియు, అన్యదేశములనుండి రాజధాని నగరమునకు పెక్కండ్రు పాంథులు రాజ్య వ్యవహారములపై రాయబారులుగ వాణిజ్యమునకై దర్శనార్థమై వచ్చుచు పోవుచుండువారనియు తెలియుచున్నది

మూడవ పంచాయితి

పౌరుల జననమరణముల లెక్కలగొనును చంద్రగుప్తుడీ లెక్కలు జనవిస్తీర్ణత కనుగొనుటకును, ఆరోగ్యాభివృద్ధులు పరిశీలించుటకును కరగ్రహణ సౌలభ్యము కొరకును వ్రాయించువాడు

నాల్గవ పంచాయితి

వాణిజ్య మేగతి నడచుచున్నదో విచారించును ఈ పంచాయితి సభ్యులు వర్తకు లుపయోగించు కొలపాత్రముల, తూనికల, త్రాసుల పరీక్షించుచు పౌరులకు క్రయ విక్రయములందు మోసము జరుగకుండ కాపాడుచుందురు

ఐదవ పంచాయతి

వాణిజ్యార్థమైవిపణవీధులకు కొనిరాబడు వస్తుసామగ్రుల మంచిచెడ్డల నరయును.

ఆరవది.

అమ్మబడిన వస్తుజాలములపై విధింపబడు సుంకము నూ వసూలు జేయును.

చంద్రగుప్తుని సైన్యములు.

రాజ్యరక్షణకై చంద్రగుప్తుడు ప్రచండ సైన్యముల నిల్పెనని యిదివరకే నుడివియుంటిమి. చంద్రగుప్తుని సైనికదళములు అంత్యంత బలీయములైనవి. సుశిక్షితములైనవి ఈతని యక్షోహిణులు రణశిక్షకును, యుద్ధనైపుణ్యమునకును భారత వర్షమునందెల్ల పేరుమోగినవి. ఆనిసంగరమున మార్కొన జాలు సైన్యములు ఆర్యావర్తమున వేరెచ్చటను గానరావు. ఈ సైన్యములతో చంద్రగుప్తుడు ఆర్యావర్తము నంతయు గెలువ జాలుటయెగాక, సెల్యూకసు భీకర అక్షౌహిణులగూడ యతి శ్లాఘవముగ చిందర వందరజేయగల్గెను.

చంద్రగుప్తుని సైనికవాహిని ప్రాచీన హైందవరణ సాంప్రదాయముల ననుసరించి అశ్వ, గజ, రథ పదాతికము లనబడు చతురంగముల గల్గియుండెను. ఈతని సైన్యమున ముప్పదివేల హయములును, తొమ్మిదివేల గజములును, ఎనిమిదివేల రథములును, ఆరులక్షలకాల్బలమును ఉండెనని మెగ

స్తుతీసు తెల్పియున్నాడు. ఈ చతురంగములలో గజములె యీకాలమున ముఖ్యాంగముగ పరిగణింపబడెను గజముల సంఖ్యనుబట్టియె జయాపజయములు నిర్ణయింపబడెడివి ఏలనే గజములు బారులుగట్టియున్న అశ్వపదాతి సైన్యముల చించి చెండాడ గల్గుటయెగాక యివి యపారజవసత్వములు గల్గిన మృగరాజములగుటచే దుర్గములబట్టుటయం దపారముగ నుపకరించును దుర్గరక్షకులుగురిపించు శరవర్షమును లెక్కసేయక యీటెపోటుల నరకుగొనక దుర్గప్రాకార కుడ్యోపరిభాగములనుండి దొర్లింపబడు గండశిలల నతిలాఘవముగ దప్పించు **కొనుచు రోషావేశముతో ఘీంకారములు జేయుచు, దుర్గపు** తలుపు తమవిశాల ఫాలభాగములచే ఫటిల్లుఫటిల్లున బొడిచి తునియలు గావించి దుర్గములోనికి జొచ్చుకొని పోవుటలో నీమహామృగముల కేవియు సాటిరావు శత్రుశిబిరములపై విజృంభించి త్రొక్కి నాశన మొనర్చుటకు రిపువ్యూహముల కలచివైచుటకు వీనిబంపవలయును మహాపౌరుషముతో విస విస తొండమును విసరి శత్రువీరుల నేలగూల్చుచు రివ్వున బోవు గజయూధము నడ్డగింప నెవరికిని శక్యముగాదు అందుచేతనే ప్రాచీన సైనిక బలములలో గజముల కింత ప్రాముఖ్యమివ్వబడినది గజములకు లోహ కవచము తొడిగి దంతములకు నిశితములగు యీటెలగ్రుచ్చి రణరంగమున విడుతురు. వాని వీపులపై సుశిక్షితులగు యుద్ధవేసి రణ యోధులు కూర్చుండి వానిని శత్రువులపై నడిపించుచుందురు ఈ గజములపై కూర్చుండియె వాహినీపతి (సేనాని) సైన్యముల నడపును. తక్కటి యుపసేనానులు, దండనాయకులు రథముల నెక్కి

యుద్ధభూమి కేగుదురు. హర్షుని సైన్యమున అరువది వేల గజము లుండెనని యూనిత్సాంగు వింతగ వ్రాసినాడు. ప్రాచీన సమరాంగణమున హైందవ అశ్వదళములు గూడ రణకౌశలమునకు ప్రసిద్ధిగాంచినవి జీలము నదీ యుద్ధమున యవనసైన్యములు పురుషోత్తముని అశ్వికసేనల సమరప్రావీణ్యమును జూచి నివ్వెర పడినవి

## చంద్రగుప్తుని సైనిక పరిపాలన.

చంద్రగుప్తుని పురపాలనావ్యవహారముల వలెనే యాతని సైనిక పరిపాలనమును ముప్పదిమంది సభ్యులు గల్గిన నొక యుపసంఘముచే నిర్వహింప బడెడిది.

### సంఘము

దీనికి "సైనిక పరిపాలనాసంఘ"మని పేరు. పాటలీపుత్ర పురపాలనాసంఘమువలెనే నిదియు ఆరు పంచాయతులుగ విభజింపబడి ఒక్కొక్క పంచాయతి యొక్కొక అంగవిభాగమునకు పాలనకర్తగ నుండెను అందు మొదటి పంచాయతి నావికాబలముల పాలించును రెండవది యుద్ధము సంఘటిల్లినపుడు సైనిక వాహినుల ప్రయాణసన్నాహమునకై వలయు నేర్పాట్లు గావించును అశ్వ వృషభ శకటముల నాయత్తమొనర్చి యంత్రసాధనముల రణోపకరణముల భోజనాదికముల సమరభూమికి గొనిపోవును మూడవది పదాతి సైన్యముల రక్షణ పోషణాది కార్యముల నిర్వహించును. నాల్గవది అశ్వదళములపై బాధ్యత వహించును. ఐదవది

రథములను, ఆరవది గజములను గనిపెట్టి జూచుచుండును వీరు ఏశిక్షణమందైనను సైన్యముల యుద్ధమునకు సంసిద్ధము జేయువారు. చంద్రగుప్తుని ప్రతిభావిశేషము ప్రశంసనీయము.

చంద్రగుప్తుని సైన్యమునందలి పదాతివీరులు నిలువెత్తు కార్ముకములను, తూణీరములను, వెడల్పైన ఖడ్గములను ధరించువారు. కరవాలము భుజసీమనుండి జన్నిదమువలె ప్రక్కకు వ్రేలు చర్మపుపట్టలకు వ్రేలగట్టబడి యుండును. వీరు వింటికొన నెడమకాలితో నిపుణముగ త్రొక్కిపట్టి పద మూడు మూరలపొడవుగల్గి అత్యంత నిశితమగు శరముల మహాజవముతో శత్రుమూకలపై విడుచువారు ఈ వాడి తూపుల కడ్డులేదు ఎట్టి దళమగు డాళ్ళనైన నవలీలగ చీల్చి శత్రువీరుల వక్షమును జొచ్చి పోవునవి. ఒడలంతయు నా పాదమస్తకమును గప్పు ఖడ్గమృగ చర్మపు డాళ్లనుగూడ వీరు యుద్ధభూమికి దమవెంటగొనిపోవువారు. కొందరు విల్లమ్ములకు బదులు వాడిమొనలు గల యీటెలను, చిన్న కరారులను ధరించెడివారు అశ్వసైనికులు బల్లెములను, తేలిక యగు లోహపుడాళ్ళను బట్టువారు. చంద్రగుప్తుని గుఱ్ఱపు రౌతులు అశ్వశిక్షణమందారితేరినవారు అతికౌశలముగ వీరు తమ హయముల శత్రుమూకలపై బరుగులెత్తించి శత్రు వ్యూహముల గలంచి భీభత్సము నెరపువారు

చంద్రగుప్తుని సైన్యమందలి అశ్వములకు, గజములకు. యోధులకు గూడ కవచములుగలవు.

ఒక్కొక్క గజముపై మావటీడుగాక, ముగ్గురేసి విలుకాండ్రుందురు. రథములపై యిద్దరేసి యోధులు

గూర్చుండి యుద్ధమునకేగువారు. చంద్రగుప్తుని సైన్యమున రెండుగుఱ్ఱములు బన్నినరథములును, నాల్గుగుఱ్ఱములుబన్నిన రథములునుగూడగలవు.

యుద్ధపరికరముల, శిబిరముల రణభూమికిఁగొనిపోవుటకు అశ్వముల, వృషభముల, గార్దభముల నుపయోగించెడువారు. గాయములుతగిలిన యోధులకు ఔషధసేవలొనర్చుటకు వైద్యులు ఔషధముల, చికిత్ససాధనముల గొని, సైన్యముల వెంటనరుగువారు. వీరు సమరరంగమునకు వెనుకభాగమున గుడారముల నిర్మించుకొని యచ్చటకు యుద్ధమునబడిన సైనికులఁగొనివచ్చి చికిత్సజేయువారు. చికిత్సవిధానమున శిక్షణనొందినస్త్రీలుగూడ వీరికి ఆహారాదికములు సిద్ధముజేయుటకు సమరభూమికిబోవువారు. ఆనాటి రణప్రావీణ్యమంతయు నేడచ్చట మఱగిపోయినది.

ఈ సందర్భమున ఆకాలమునాటి రణధర్మములగూడ గొంచెము వివరింపవలసియున్నది చంద్రగుప్తునికాలమున పాటింపబడుచుండిన రణనియమము లత్యంత కారుణ్యపూరితములైనవని మెగస్తనీసు ప్రశంసించినాడు. "ఈదేశమున శత్రురాజులు యుద్ధసమయములందు నిరపరాధులగు కర్షకుల బాధింపరు. ఐరోపాఖండమందలిదేశములలో యుద్ధముసంభవించెనేని శత్రుసైన్యములుచెలరేగి సస్యముల దగులబెట్టెదరు. గృహములకు జిచ్చువెట్టెదరు దేశమునకు మహాసంక్షోభమును దెచ్చిపెట్టెదరు. దోసతోటవలె పచ్చనిపైరులతో జనసంకీర్ణమగు గృహావళులతో గలకలలాడుదేశము సంగ్రామకీలలబడి దగ్ధమై, కళావిహీనమై, జనశూన్యమగు మహాయెడారిగ

మారిపోవును ఈ భారతవర్షమున నట్లుగాదు కృషీవలుల
నెవ్వరును ముట్టరాదు సంగ్రామసమయములందు వారి కెవ్వ
రును హానియొనర్పరు ఆసమీపమున నతిభీకరముగ యుద్ధము
రేగుచున్నను కర్షకులు నిర్భీతులై పొలముల దున్నుకొను
చుందురు. ఉభయసైన్యములును ఒండొరులపై గవిసి తమ
మగటిమి జూపుకొనుచు రణవిహారమును సల్పుదురే కాని
నిరపరాధులగు హాలికులపై తమప్రతాపమును గనపరుపరు.
రాజ్యముల బాడుసేయరు. గృహముల పరశురామప్రీతి
గావింపరు. వృక్షముల దెగనరుకరు పరిచేల నగ్నికీలల కాహుతి
సేయరు" అని మెగస్తనీసు భారతరణధర్మముల మెచ్చుకొని
నాడు.

చంద్రగుప్త సార్వభౌముని గుణశీలములు.

చంద్రగుప్తుడు అప్రతిమాన రణప్రావీణ్యము గల
వాడు. మహాసాహసి. భారతవర్షము నేలిన మహాసార్వభౌ
ములలో పేరెన్నికగన్నవాడు ఈతని పరిపాలనము సర్వాంగ
సౌష్టవమై వరలినది వాణిజ్య, వ్యవసాయ పరిశ్రమ లీతని
కాలమున నపారముగ వృద్ధినొందినవి ప్రజలు సౌఖ్యాంబుధి
నోలలాడిరి ఈసార్వభౌముని గుణశీలము లత్యంతప్రశంసా
పాత్రములు చంద్రగుప్తుడు పగటికాలమున నెప్పుడును
నిద్రించి యెరుగడు సోమరితనమనున దీతని శబ్దకోశమున
లేదు రాజప్రాసాదమును విడచి బయటకు పోవునపుడు
ధనుర్ధరులగు యువతీమణు లంగరక్షకులై యీతనివెంట
జనుదెంచువారు నగరమును దర్శింపబోవునపుడు చంద్ర
గుప్తుడు ముత్యములుపొదిగిన బంగరుపల్లకి నెక్కి పోవువాడు.

రాజ్యమున పర్యటనము సల్పవలసినప్పుడు అశ్వారూఢుడై గాని, గజారూఢుడైగాని పోవువాడు. ఆత డధిరోహించు గజతురగము లత్యంతశోభాయమానముగ నలంకరింపబడె డివి. పేరోలగమ్మున గూర్చుండునపుడు చంద్రగుప్తుడు అత్యంత మృదులములై, రక్తవర్ణముగల్గిన నారవలువల ధరించువాడు.. ప్రజలకష్టసుఖము లాలించుటకు యుపవిష్టుడై యుండునపు డాతని యొడలు నల్వురు పరిచారకులు గదలతో మర్దించు వారు నృపుని జన్మదినోత్సవ మత్యంతవైభవముగ జరుప బడెడిది నాడు చంద్రగుప్తు డభ్యంగన మొనర్చి దివ్య వసన ముల దాల్చి కొలువుకూటమున సభదీర్చి కూర్చుండును. సామంత మండలాధిపు లానాడు అమూల్యవస్తువుల దెచ్చి యీాతనికి కానుక లొసగిపోవుదురు సాయంసమయమున తేని గౌరవార్థమై వినోదములు జరుగును నాటి వినోద ముల నవలోకించుటకై వేలకొలది జనులు రాజప్రాసాదమున మూగువారు వినోదరంగమున యొదుట క్షత్రియవీరులు కత్తిసాములజేసి తమ ఖడ్గవిద్యానైపుణ్యమును ప్రదర్శించెడి వారు.

వీని తరువాతగజవృషభముల పోరాటములుండును ఖడ్గ మృగముల, గజముల, వృషభముల, గొఱ్ఱెపోతుల డీకొల్పి రోష మెక్కించి చిత్రవిచిత్రముగ నాటలాడించువారు ఇవి గాక అశ్వ గజ, వృషభశకట పరీక్షలుండెడివి. చంద్రగుప్తుడు మృగయావిహారముల గూడ సల్పువాడు నృపుడు వేటాడు టకై విశాలమగు అరణ్యభూములుండెను. వీనిలో నితరులు వేటలాడకూడదని రాజశాసనము

చంద్రగుప్తుడు అద్వితీయ పరిపాలనా కౌశలముగలవాడు. భూతదయాళుడు. ఔషధశాలల నిర్మించుటయందు, నిరుపేదలకుపాధిగల్పించుటయందు చంద్రగుప్తుడు ప్రమత్తుడై యుండువాడు.

ఈతడు జైనమతావలంబుల నెక్కుడుగ నాదరించు వాడని ప్రతీతి కాని చంద్రగుప్తుని కొకమతమునం దభిమాన ము నొకమతమునందు నిరాదరముసు లేదు. సర్వమతముల సమదృష్టి జూచువాడు. సర్వమతస్థులకును సమముగ పారితోషికముల నొసగువాడు.

## చంద్రగుప్తుని దినచర్య.

నృపుని దినచర్యగూడ కౌటిల్యుడు మనోహరముగ వర్ణించినాడు. ప్రథమనాళికమున (దినమునకుపదునారునాళికములు) రాజుఆర్థికవ్యవహారములందును, రాజ్యరక్షణకృత్యములందును మగ్నుడైయుండును ద్వితీయ నాళికమున ప్రజలు జెప్పుకొను కష్టసుఖముల వినును న్యాయవిచారణసల్పును. తృతీయనాళికమున భోజనాదికము లొనర్చుటకై వెడలును. చతుర్థనాళికమున భాండారమునకు గొని రాబడు ధనముల నందికొనును ఉద్యోగుల నియమించును ఐదవనాళికమున రాజసభకుబోయి తనమంత్రులతో రాజ్యాంగ వ్యవహారముల నాలోచించును. వేగులవాండ్రుగొనివచ్చు సమాచారముల నాలకించును. ఆరవనాళికమును దైవప్రార్థనలందుగడపును. ఏడెనిమిది నాళికములలో సైనికశిబిరముల దర్శించి సైనిక వ్యాపారముల జూచికొనును పగలంతయు నిట్లుగడచిపోవును.

మరల రాత్రి ప్రథమనాళికమున వేగులవాండ్రు గొని వచ్చు విశేషముల నారయును. ద్వితీయనాళికమున స్నాన మాచరించి భుజించును. పిమ్మట విద్యాగోష్ఠియందు కాలము బుచ్చును. మూడు నాలుగు; అయిదునాళికములు నిద్రించును. ఆరవనాళికమున మరల లేచి యీశ్వరప్రార్థనలొనర్చి మరు సటిదినకృత్యములకుసిద్ధమగును. ఏడవనాళికమున అవశ్యముగ నిర్వర్తింపవలసిన రాజ్యాంగవ్యవహారములఁగూర్చి యాలో -చించుకొనును. వారివారి కర్తవ్యముల నిర్ణయించి వేగుల వాండ్రఁ పంపివేయును. ఎనిమిదవ నాళికమున అభ్యంతర మందిరమును జొచ్చి పురోహిత బ్రాహ్మణుల యాశీర్వా దముల గొనును. తనకై వేచియుండు సచివులతో కొంత సే పుచ్చటించును. పిమ్మట ఆస్థాన జ్యోతిష్కుని తోడను, భిష గ్మణితోడను కొంతకాలముగడపి భవిష్యదారోగ్యవిషయ ముల నరసి మఱుసటిదినకృత్యముల నిర్వర్తింప వెడలిపోవును. ఆకాలమున ఘటికాయంత్రములుగూడ నుండెడివి. చంద్ర గుప్తుని మనుమడగు అశోకసార్వభౌముని రాజ్యకాలమున నలందావిశ్వవిద్యాలయమందలి నీటిఘటికాయంత్రసహాయ్య మున మగధరాజ్యమందలి ప్రజలెల్లరు కాలము దెలిసికొనెడి వారు.

## చంద్రగుప్తుని యవసానము.

తొలుత పర్వతప్రాంతముల దిరిగెడు నొకకొండ నాయకుడగు చంద్రగుప్తుడు, వీరాతివీరుడై, మహాసామ్రా జ్యమును నిర్మాణమొనర్చి, అత్యంతనిపుణముగ, ప్రజలు సౌఖ్యమున దేలియాడునట్లు రాజ్యపాలనమొనర్చి యితిహాస

రంగమున మహాచక్రవర్తియని పేరుమోగెను. మౌర్యసామ్రాజ్యస్థాపనాకార్యములలో రాజ్యనౌకను మహాకౌశలముతో, పరరాజ్యదండయాత్రాకల్లోల భూయిష్టమగు భారతవర్షయితిహాసమహాసముద్రమున జయప్రదముగ నడిపించుటలో నీతనికి తోడ్పడినది చాణక్యమంత్రియనినుడివితిమి. ఈతడు యితిహాసరంగమునుండి ఎప్పుడు నిష్క్రమించెనో తెలియదు ఈతడు చంద్రగుప్తుని తనయుడగు బిందుసారుని యాస్థానమునగూడ మంత్రిగనుండెనని టిబెట్టు దేశపు చరిత్రకారుడగు తారానాథు డూహించుచున్నాడు. ఈతనియూహలు నిజమై యుండునని దోచుచున్నది చంద్రగుప్తుడు బ్రతికియుండగనే యీతడు తనమంత్రిపదవి త్యజించి, మగధరాజ్యమునువీడి నర్మదానదీతీరమున బ్రోచిపట్టణమునకు సమీపమునవిలసిల్లిన 'శుక్లతీర్థ'మనుగ్రామమునతన నివాసమేర్పరచుకొని యచ్చటనే మృతినొందెనని కొన్నిచోట్ల వ్రాయబడియున్నది. ఏదినిజమో నిర్ధారణగ జెప్పజాలకున్నాము.

ఇట్లిరువదినాలుగేం డ్లఖండవైభవముగ రాజ్యపాలన మొనర్చి చంద్రగుప్తుడు క్రీ. పూ 296 సంవత్సర ప్రాంతమున మృతినొందెను. చంద్రగుప్తుని యవసానము జైన గ్రంథములలో విచిత్రముగ వర్ణింపబడినది ఉత్తరభారతమున అనావృష్టిచే క్షామము సంభవించి పండ్రెండువత్సరములు ప్రజల పీడించునని జైన యతియగు భద్రబాహు అనాగతము జెప్పి పండ్రెండువేల జైనుల వెంటగొని సుభిక్షముగ నుండు ప్రదేశముల వెదకొనుచు దక్షిణదేశములకు బయలు దేరెను. చంద్రగుప్తుడు రాజదండమును తనయుని కొప్పగించి తానును

వారివెంట బయలు దేరెను వీరందరును యిట్లు పోయిపోయి మైసూరు రాజ్యములోని 'శ్రవణబెల్గోల' యనుతటాక పరిసరములు సమీపించి యచ్చట నివసింపదొడగిరి. కొంతకాలమునకు భద్రబాహువు గతించెను. పిమ్మట చంద్రగుప్తుడు, జైను మత సాంప్రదాయానుసారముగ శుష్కోపవాసములచే తనువుకృశింపజేసి ప్రాణత్యాగము జేసెనట. శ్రవణబెల్గోళ యను తటాకమిప్పటికిని యీప్రాంతముననున్నది. ఈతని మరణము నిట్లే వర్ణించుశిలాశాసనములుకూడ కొన్ని దొరికినవి. ఈతనియవసానమును వేరొకరీతిని వర్ణించు శాసనములుగాని, గ్రంథములుగాని లేకపోవుటచే యిదియే యదార్థమైయుండునాయని యాలోచింపవలసివచ్చుచున్నది. రాజ్యపరిత్యాగము చేయునరి కీతనికి ఏబదియేండ్లు పయస్సుండును భద్రబాహువు దివికేగినతరువాత పండ్రెండేండ్లవరకీతడు జీవించి యుండెనని జైనుగ్రంథములుజెప్పుచున్నవి. ఈగ్రంథములందలి వ్రాతలే నిజమైనచో చంద్రగుప్తుడు అరువదియేండ్ల ప్రాయమప్పుడు మరణించియుండవలెను కాని నాకు జూడ జైనుమతమునకు గొంత ప్రాముఖ్యమిచ్చుటకై, చంద్రగుప్తుడు జైనుమతావలంబుడేయని, జాటుటకై జైను లీకథను, యీ శాసనములను, గల్పించిరేమోయని యనుమానము వొడముచున్నది.

## చంద్రగుప్తుని రాజ్యవిస్తీర్ణము

ప్రస్తుత ఆఫ్ఘనిస్థానము, ఏరియాన, పాంచాలములు అయోధ్య, బీహారు, వంగ, సౌరాష్ట్రములును యీతని, సామ్రాజ్యమున నంతర్భాగములై యుండెను. ఆతడు రాజ్య

పరిత్యాగము చేయునాటికి, (298)నర్మదానది కుత్తరపు వైపున నుండు ఆర్యావర్తమెల్ల (అఫ్ఘనిస్థానమును గలుపుకొని) ఆతని యేలుబడిలోనుండెను. ఇప్పు డేప్రాంతమున తమ రాజ్యమునువిస్తరింపజేయుటకు ఆంగ్లేయులు విశ్వప్రయత్నము లొనర్చియు విఫలులగుచున్నారో ఆ ప్రాంతమంతయు (హిందూకుశ పరత్వ పంక్తులకావలిభాగము) చంద్రగుప్తునిచే నవలీలజయింపబడి ఆతనిచే పాలింపబడెను.

---

# బౌద్ధ మహాయుగము

## VIII

## అశోకుడు

### బిందుసారుడు

చంద్రగుప్తుని తరువాత ఆతని తనయుడగు బిందుసారుడు రాజ్యభారమును వహించెను. ఈతడిరువదియైదు వత్సరములు రాజ్యమేలెను ఈతనికి 'అమిత్రఘాత' యను పౌరుషనామముగలదు దీనినిబట్టి యీతడు మహాయోధుడై పెక్కురాజ్యముల జయించినట్లు గాన్పించుచున్నది. బిందుసారుడు బాల్యమునుండియు తండ్రికడ రణవిద్యల నభ్యసించి,అపారమగు రణప్రావీణ్యము నార్జించెను కాని దౌర్భాగ్యవశమున యీతనిపరిపాలన గూర్చిన విశేషములేవియు మనకుదెలియరాకున్నవి కాలగర్భమున మునిగిపోయినవి అశోకునికాలమున మౌర్య సామ్రాజ్యము దక్షిణమున పెన్నానదీతటముపరకును వ్యాపించియుండుటవలనను, ఆతడు కళింగరాష్ట్రమును దప్ప వేరేరాజ్యములను జయింపకుండుటవలనను, నర్మదానదికి దక్షిణప్రాంతమున విస్తరించియుండు విశాలరాజ్య భాగమంతయు బిందుసారుడే జయించియుండవలెనని యూహింపవలసివచ్చుచున్నది చంద్రగుప్తుడే దక్షిణపథమునుగూడ జయించెనని కొందరు చరిత్రకారుల యభిప్రాయము. కాని యీ యూహకెచ్చటనుఆధారములు గన్పించుటలేదు తారనాధుడు

గూడ బిందుసారుడు కొంతరాజ్యమును జయించె వ్రాసి యున్నాడు దక్షిణపథమెల్ల నీతడే జయించియుండును.

బిందుసారుని కీర్తి ఐర్లోపాఖండమెల్ల వ్యాపించెను. ఐగుప్తయవన దేశపురాజులు యీతని చెలిమి కోరి యీతని యాస్థానమునకు రాయబారుల నంపిరి. చంద్రగుప్తునితో రణము సల్పి యోడిపోయిన సెల్యూకసుని తనయుడగు ఆంటి యోకసుకడనుండి 'డెయిమేకసు' అను నాతడును, ఐగుప్తదేశమును బాలించు 'టోలమీఫిలడల్ఫాసు' నరపాలుని యొద్ద నుండి 'డైనీసియసు' ను బిందుసారుని కడకు రాయబారులుగ వేతెంచిరి. 'డైనీసియసు' మెగస్తనీసువలెనె హైందవ నాగరికతా సంపదల నొకగ్రంథమున వర్ణించెను అది మనచరిత్రరచనకు గొంతవరకు నాధారభూతముగ నున్నది ఐగుప్త యవన దేశాధీశ్వరులు బిందుసారుని చెలిమినభిలషించి రాయబారుల నంపుటవలన పూర్వార్ధగోళదిఙ్మండలమున నుదయించిన మౌర్యసామ్రాజ్యభానుని తేజఃపుంజములు యూరపుఖండమేలిన రాజన్యుల నెట్లు మిరిమిట్లు గొల్పెనో విదితమగుచున్నది

ఆంటియోకసు నృపాలుని రాయబారవృత్తాంతమున్ను గూర్చిన గాథ యొకటిగలదు ఆకాలమున యవనదేశము అంజూరఫలములకును, ద్రాక్షరసమునకును ప్రఖ్యాతివడసి యుండుటచే, తనకు గొన్ని అంజూరపండ్లను, ద్రాక్షపాకమును బంపుమనియు, నొక వేదాంతవిదునిబంపుమనియు, వాస్కికై తానెంత ధనమైన యిచ్చెదనని యా బిందుసారుడు ఆంటి యోకసుకు లేఖనంపెనట. అందుల కారాజు వేదాంతులు తన

రాజ్యమున అమ్మకమునకు, సిద్ధముగలేరని ప్రత్యుత్తర మంపెనట. దీనివలన అశోకుని జనకుడగు బిందుసారుడు వేదాంత గోష్ఠియం దభిరుచిగలవాడని తెలియుచున్నది.

## అశోకుడు.

బిందుసారుడు క్రీ పూ 273 సంవత్సరమున కాల ధర్మమునొందెను. పిమ్మట నీతని కుమారుడగు అశోకవర్ధనుడు మౌర్యసామ్రాజ్య సింహాసనమునకు పట్టాభిషిక్తుడయ్యెను. ఈతడే బౌద్ధమతమును దిగంతములకు వ్యాపింపజేసి రక్త పాత విసుమంతయు లేక చిరకాలము ప్రజారంజకముగ రాజ్యపాలన మొనర్చిన మహాచక్రవర్తి. తన పరిపాలనా కౌశ లముచే బౌద్ధమతవ్యాప్తిచే భారతవర్షమున ఆర్యానార్య విభే దముల సంపూర్ణముగ రూపుమాపి హైందవ జాతీయతా మహాసౌధమునకు పునాదులు గల్పించిన చిరస్మరణీయుడు ప్రజలలో నీతివర్తనమును, సత్యసంధతను, అహింసా వ్రత మును సంపాదింపజేసిన మహానుభావుడు

తనతండ్రియగు బిందుసారుని రాజ్యకాలమున నశో కుడు మొలుత తక్షశిలాప్రాంతమునను అటుపిమ్మట ఉజ్జయినీ ప్రాంతమునను రాజప్రతినిధిగ నుండెను

## చరిత్రాధారములు

అశోకుని పరిపాలనమును గూర్చిన వివరములు చాల భాగము ఆతని శిలాశాసనములనుండియే తెలియుచున్నవి. ఇవియే ఆతని చరిత్రకునకు ముఖ్యాధారములు శాసనములం దీతని రాజ్యపాలన మత్యద్భుతముగ వ్రాసగుచ్చినట్లు

వర్ణింపబడినది. ఇట్టి శిలాశాసనములు ప్రపంచమున వేరెచ్చ టను లేవు. అశోకునికాలమునాటి నాణెములు మనకంతగ నుప కరింపవు. వానిపై అశోకసార్వభౌముని నామముగాని, ఆతని బిరుదావళులుగాని చిత్రింపబడి యుండలేదు. ఇవిగాక మహా నాముని చే పాళీభాషలో వ్రాయబడిన "మహావంశము" నందును (యీగ్రంథ మిప్పుడు సింహళద్వీపమున నున్నది.) సంస్కృత భాషలో వ్రాయబడిన "అశోక అవధానము" నందును (ఇది యిప్పుడు నేపాళదేశమందున్నది) పాళీభాషయందున్న "దీపవంశ చరిత్రము"ను (ఈగ్రంథమిప్పుడు బ్రహ్మదేశమందు న్నది) బుద్ధఘోషుని వ్యాఖ్యలందును అశోకునిగూర్చిన యుల్లే ఖనలుగలవు.

అశోకుని రాజ్యకాలమున సంగ్రామ దావాగ్ని కీలలు లేవు.

అశోకుడు సంగ్రామ ప్రియుడుగాడు. ఆతనికాలమున దిగ్విజయయాత్రలు లేవు. ఆతడెల్లెడల శాంతియే నభిలషిం చెను. శాంతివాహిని యాతనిరాజ్యమున తరంగితమై బ్రవ హించినది. రక్తస్రవంతి లేకనే యాతడు నలుబదియైదువత్సర ములు తనవిశాల సామ్రాజ్యమును మహావైభవముగ నేలెను. ఇందే యాతని గొప్పతనము గలదు ఆతనిపరిపాలనా చాతు ర్య మిందే ప్రదర్శితమగుచున్నది ఇదిగాక నొక మూల నణగి పడియున్న బౌద్ధమతమును తన కల్పనాశక్తిచే నిర్మాణకౌశల ముచే ప్రపంచపంచంతటను విస్తరింపజేసి దాని నొక మహామత ముగ నొనర్చెను భారతవర్షము నేలిన మహాచక్రవర్తులలో నీత డగ్రగణ్యుడు

అశోకుడొక్క కళింగరాజ్యముపై మాత్రము దాడి సల్పి దానిజయించెను. హిందూకుశపర్వత శ్రేణులనుండి మైసూరు రాష్ట్రమువరకును వ్యాపించియుండు మహాసామ్రాజ్యమంతయు, ఆతనితండ్రినుండియె నాతనికి సంక్రమించినది.

## అశోకునిబాల్యము పట్టాభిషేకము.

అశోకుని బాల్యమును గూర్చి మనకేమియు దెలియకున్నది. ఈతడు యౌవనమున విషయాసక్తుడై, మృగయావినోదములకాలము గడపువాడని యొకటి రెండు గ్రంథములందు వ్రాయబడినది. ఇదియెంతవరకు యదార్థమో జెప్పజాలము. ఈతడు ఉజ్జయినిలో నుండగా నొక వర్తకుని కుమార్తెను పరిణయమాడి యామెవలన మహేంద్రుడనుతనయుని, సంఘమిత్రయను తనయుని బడసెను ఈమె సత్కులజాతగాకపోవుటచే అశోకుడు సింహాసన మాక్రమింప పాటలీపుత్రమునకు బోయినపు డామె నిచ్చటనే విడచిపోయెనని ప్రతీతిగలదు

బిందుసారుడు చనిపోవునప్పటికి అశోకుడుఉజ్జయినీలోనే యుండెను తండ్రి పరలోకమున కేగెననువార్త వినినతోడనే యాతడు మగధరాజ్య సింహాసనమాక్రమించుటకై సైన్యముల వెంటగొని పరుగుపరుగున పాటలీపుత్రమునకు గదలిపోయెను

కాని అశోకునికి మగధరాజ్య సింహాసన మంతసులభముగ చేజిక్కలేదు ఈతనికంటె పెద్దవాడగు నీతని సోదరుడు సుసీముడనువాడు తక్షశిలానగరమున రాజప్రతినిధిగ నుండి యాతడును రాజ్యకాంక్షాపరుడై యీతనికంటెమున్నుగ నేగి

పాటలీపుత్రమున దండువిడసెను. సోదరు లిరువురకును ఘోరయుద్ధము జరిగెను అశోకుడు పరిపాలనా కార్యములందెంత కుశలుడో సమరవిద్యయందంతప్రావీణ్యుడు. తుదకు ఇతనికే విజయముకల్గెను. సుసీముడు యుద్ధమున మడిసెను అశోకుడు నిరాఘాటముగ మౌర్యసామ్రాజ్యమునకు జక్రవ_ర్తియయ్యెను. ఏమికారణముననోగాని ఇతడు రాజ్య పదవినందిన నాల్గువత్సరములవరకును సింహాసన మధిష్ఠింప లేదు. అశోకుని పట్టాభిషేకమహోత్సవము క్రీ. పూ 269 సంవత్సరమున జరిగినది దీనివలన అశోకునికి ప్రతికక్షివారింకను గలరనియు వారందరును నిశ్శేషమగువరకును అశోకుడు సింహాసన మధిష్ఠింపలేకపోయెననియు నూహింపవలసి వచ్చుచున్నది. ఈసందర్భమున నీతనిపై యొకయపవాద గల్పింపబడినది మగధ రాజ్య సింహాసన మాక్రమించుటకై యీతడు నూర్వురుసోదరుల బరిమార్చెనని సింహళద్వీప బౌద్ధసన్యాసులు గొందరు వ్రాసిరి. కాని యిందణుమాత్రమును సత్యము గాన్పింపదు. అశోకుడు జక్రవ_ర్తియైన పిమ్మటగూడ నాతని సోదరీసోదరుల నత్యంత ప్రేముడితో నాదరించువాడని యాతని శాసనములు ఘోషించుచున్నవి. దుర్మార్గులగూడ సన్మార్గమునకు దిప్పుటలో బౌద్ధమతమున కపారశ_క్తిగలదని సూచించుటకును బౌద్ధమతోత్కృష్టతను బొగడుకొనుటకు అశోకుడు బౌద్ధమతమును స్వీకరింపకపూర్వము మహాకలుషాత్ముడనియు పాతకియనియు, బౌద్ధమతమును స్వీకరించినంతనే అత్యంత దయాశీలుడయ్యెనని ఒక కథను గల్పించి యీ హత్యాకాండ నాతనితలకు రుద్దినట్లు గన్పించుచున్నది.

## కళింగ దండయాత్ర.

అశోకుడు సింహాసనమెక్కిన ఎనిమిదవయేట క్రీ. పూ. **261** సంవత్సరమున కళింగ రాజ్యముపై దాడివెడలెను. కళింగము గోదావరీ మహానదులమధ్య విలసిల్లిన నొక బలిష్ఠ రాజ్యము. ఇది మగధ సామ్రాజ్యమునకు లోబడక తిరస్కరించెను. దాని వశపరచుకొనుటకై అశోకుడు బహుళసైన్యములతో కళింగముపై దాడిసల్పెను. కళింగ మగధరాష్ట్రములకు ఘోర యుద్ధము జరిగెను. అశోకుడు కళింగసైన్యముల చీల్చి చెండాడి తద్రాజ్యము నవలీల జయించెను. కాని కళింగసైన్య సంహారము అశోకుని మనమునం దొక యద్భుతపరివర్తనమును గల్పించెను. కళింగయుద్ధముతో అశోకుని చిత్తవృత్తి సంపూర్ణముగ మారిపోయెను ప్రపంచమున నడచిన ఘోరసంగ్రామములలో కళింగయుద్ధ మొకటి. అశోకుడే తనపదమూడవ శిలాశాసనమున యీయుద్ధమువలన గలిగిన సంక్షోభము నీక్రింది విధమున వర్ణించియున్నాడు:—
"ఈయుద్ధమున నూరువేల కళింగవీరుల కంఠములు దెగినవి. నూటయేబదివేలమంది యోధులు బంధింపబడిరి. ఎందరికో శాశ్వతమగు అంగవైకల్యముగల్గెను లెక్కలేని జనులు యుద్ధమువలన కలిగిన రోగదుర్భిక్షాదులచే నశించిరి."

రుధిరపూరితమై పీనుగుపెంటలచే భీభత్సము గొల్పు కళింగరణభూమిని జూచి యాతనియొడలు జలదరించెను. గుండె ఝల్లుమని పోయెను అంతటి విషాదదృశ్యము నాత డెన్నడును తిలకింపలేదు. కళింగరాజ్యమంతయు యుద్ధమున

వడిసిన సతీసుతలకై విలపించు సాధ్వీమతల్లుల యాక్రందన ధ్వనులతో నిండిపోయెను. ఏమూల జూచినను ఆర్తనాదములే వినిపించెను ఆఘోరసంక్షోభమును జూచి ఆతని హృదయము శోకానలముచే కృంగిపోయెను ఆతనికి గల్గిన హృదయ పరివేదనమునకు మేరలేదు పశ్చాత్తప్తుడై యాతడింతటనుండియు ఖడ్గమును ముట్టనని శపథము గావించుకొని బౌద్ధధర్మముల శరణుజొచ్చెను. బౌద్ధమతమె శరణ్యమని యాతడింక ఖడ్గముచేగాక బౌద్ధధర్మములచే సర్వరాజ్యముల జయింపవలెనని సంకల్పించుకొనెను ఈయుద్ధమువలన నాతనికి గల్గిన హృదయపరితాపము నీతడు తన కళింగశాసనమున నీ విధముగ జెప్పుకొనినాడు:—

'కళింగవిజయము తోడనే, యీనృపాలునకు బౌద్ధ ధర్మములం దభిమానము జనించెను. కళింగరాజ్య విజయమే యీతనికి మిక్కుటమగు హృదయతాపము గల్గించెను ఏలన హత్యకాండలు, చావులు, చెరగొనుటలు మున్నగుఘోరములు జరుగకుండ రాజ్యములు జయింపబడవు ఇట్టిఘోరముల గావించినందుకై యీరాజు మిగుల చింతనొందుచున్నాడు

'కళింగులకు గల్గినబాధలు, వారిలోనిప్పుడు శతాంశమునకు, సహస్రాంశమునకు గల్గినను యీమహీపాలుడు సహింపడు పరులెవ్వరేని తనకు హాని గావించినను యీతడు శాంతముతో సహించునేగాని ప్రతీకారము జేయనొల్లడు తన సామ్రాజ్యమున నివసించు అటవిజాతులపైగూడ నీతడు కరుణగల్గియుండును వారికిని బౌద్ధధర్మముల నుపదేశించును. అట్లుగావింపడేని యీతని కపారమగు దుఃఖముగల్గును.

దుష్పథములనుండి వారిని దప్పించునేగాని దండింపడు. తన సామ్రాజ్యమున నివసించు సర్వప్రాణులును సురక్షితముగ నుండవలయును శాంతిసౌఖ్యముల ననుభవింపవలయును.

అశోకుని మానసికవృత్తి యెట్లుమార్పునొందినదియు యీశాసనమువలననవిదితమగుచున్నది నాటినుండియు అశోకుడు బౌద్ధమతవ్యాప్తికై తనజీవితశేషమంతయు ధారవోసెను. రాజ్యభోగముల విసర్జించి, విరాగియై, కాషాయాంబర ధారియై రాజ్యపరిపాలనమును నిర్వర్తింపసాగెను. బుద్ధభక్తుడై బౌద్ధక్షేత్రములనెల్ల సేవింపదొడగెను. అహింసావ్రతదీక్షా పరుడై మాంసాశనమును విసర్జించెను. మృగయావిహారముల విరమించెను.

అశోకునకు బౌద్ధదీక్ష యొసంగినవాడు మధురా నివాసియగు ఒకానొక బౌద్ధసన్యాసి ఈతడే, అశోకుడు బౌద్ధ క్షేత్రముల దర్శింపబోయినపుడెల్ల అతనివెంట నరుగుచు అతని తీర్థయాత్రల జేయించువాడని శాసనములు నుడువు చున్నవి. ఈతనిపేరగట్టబడిన బౌద్ధమఠమొకటి మధురానగరమున ఏడవశతాబ్దమువరకును నిలచియుండెను.

అశోకుడు రాజ్యపాలన మొనర్చుచు వైరాగ్యపథమున నెట్లు చరియింపగల్గెనని కొందరు పాశ్చాత్య చరిత్రకారుల కాశ్చర్యము వొడముచున్నది భోగలాలసులై, ధనమునె పరమదైవముగ పూజించు పాశ్చాత్యుల కట్టి సందేహాము గల్గుట సహజము. దీనికై మనమంతగ వితర్కింపవలసిన పని లేదు

ఇట్లు అశోకుని హృదయగహ్వరమున నెచ్చటనో మణగి యుండు కారుణ్యవాహినిని వెలికి గొనివచ్చి ప్రపంచమున ప్రవహింపజేసి ఆతని నొక మహాచక్రవర్తిగ నొనర్చిన కళింగ యుద్ధము భారతవర్ష యితిహాసముననేగాక ప్రపంచచారిత్ర మునగూడ చిరస్మరణీయమైనది. కళింగయుద్ధము లేనియెడల అశోకచక్రవర్తి లేడు. కళింగరణక్షేత్రమున నొలికిన రక్తధార లప్పుడే యింకిపోయెను. యుద్ధమువలన గల్గిన సంక్షోభము అప్పుడే విస్మృతమైపోయెను. యుద్ధరంగమున చెరగొనబడిన యోధుల దుఃఖములను కళింగప్రజ లప్పుడే మరచిరి. యుద్ధ మున మడిసిన వీరుల సతీ, సుతుల యార్తనాదము లప్పుడే మాటుమణగిపోయెను కాని ఆయుద్ధమువలన అశోకుని హృదయసీమయందు జనించిన పరితాపాగ్నికీలలింకను యితి హాసరంగమున ప్రజ్వరిల్లుచునే యున్నవి. ప్రజ లీకథనము నెప్పుడును స్మరించుచునే యుందురు. భారతవర్ష మీపృథ్వీ గోళమున నుండువరకు ఈకథ మరపునకురాదు అశోకుని విచా రము కాలవాహినితో ననవరతము ప్రయాణము జేయు చుండును

అశోకుడు బౌద్ధమతమును వ్యాపింపజేయుట.

కళింగయుద్ధమునాటనుండియు అశోకుడు బౌద్ధమత మును తనయభిమానమతముగ గైకొని యీమతవ్యాప్తియె తనపరమధర్మముగ నెంచుకొనెను దానికై తనయావజ్జీవ మును ధారవోసెను తనసామ్రాజ్యమందలి ధనరాసులన్నియు దానికొరకై వినియోగించెను బౌద్ధధర్మముల శిలాఫలకము లపై వ్రాయించి తనరాజ్యమున పెక్కుచోట్లనిల్పెను. అశేష

ధనముల వెచ్చించి మనోహరములగు స్తూపముల, విహారముల గట్టించెను. శిలా స్తంభముల నెత్తించెను.

పరదేశములకు ఉపదేశకులనంపుట.

అశోకుడు తనసామ్రాజ్యమున మాత్రమే బౌద్ధమతమును విస్తరింపజేయుటతో తృప్తినొందక, అన్యదేశములకుగూడ బౌద్ధమతప్రచారకులనంపి పృథ్వీతలమందెల్లెడల యీమహామతమును వ్యాపింపజేయ నడుకట్టెను. ఖడ్గవిజయముకంటె, ధర్మవిజయమె యుత్కృష్టమైనదనియు, ధర్మముచే మానవుల హృదయక్షేత్రముల జయించుటయె తనకెక్కుడు ఆనందమును గూర్చెననియు, తనరాజ్యముననేగాక, తొమ్మిది వేల మైళ్లదూరముననున్న సిరియా, ఐగుప్త, మాసిడోనియా, ఎపిరసు, కైరెని రాజ్యములందును, చోళ, కేరళ, పాండ్య, సింహళ, ఆంధ్ర, పుళింద, నాభిక రాష్ట్రములందును, యోణ, కాంభోజ, (త్రివిష్టప) భోజ, పైరాణిక,* రాష్ట్రిక, గాంధార జాతులు నివసించు దేశములందును తనకట్టి ధర్మవిజయము చేకూరెననియు అశోకుడు తనపదమూడవ శిలాశాసమున జెప్పుకొని యున్నాడు.

దీనిని బట్టి అశోకుడు, ఆసియా, ఆఫ్రికా, యూరపు ఖండములకు గూడ మతప్రచారకుల నంపి బౌద్ధమతమును వ్యాపింప జేసెనని స్పష్టముగ దెలియుచున్నది. వివరముగ పద మూడవశాసనము నుడువుచున్నది ఆతని శాసనములందె గాక అశోకుడు బౌద్ధమత ప్రచారమునకై జేసిన ప్రయత్న

---

* ఈరాష్ట్రములు వింధ్యసహ్యాద్రి పర్వత ప్రాంతములందు విలసిల్లిన రాష్ట్రములు

ములు మహావంశ దీపవంశములలో గూడ వర్ణింపబడినవి. అశోకుడు, హిమాలయము మొదలు పెషావరము దనుక నుండు సప్తహైందవ రాజ్యములందును దక్షిణమున విల సిల్లిన మహిషమండలము (మైసూరు) నందును బౌద్ధమతమును బోధించుటకై తొమ్మిదిజట్లను బంపెనని యీగ్రంథములందు సూచింపబడినది ఇదిగాక ఆర్యావర్తమున కావలనున్న సువర్ణభూమి పెగులేక పైగోవా లంకా ద్వీపములకు గూడ బౌద్ధ మతబోధకులు బంపబడినట్లు వీనియం దుల్లేఖనలు గలవు.

అశోకుడు ఐదైదుగురు పరిచారకులు గలసిన జట్లను బౌద్ధమతమును బోధించుటకై అన్యప్రాంతములకు బంపు చుండువాడు వీరిలో నొకడు ప్రధానోపదేశకుడు, మిగిలిన వారు సహాయోపదేశకులు. వీరు బౌద్ధమతగ్రంథములం దసమానపాండిత్యముగల్గి వచోనైపుణ్యముగల్గి వైరాగ్యజీవనములచే ప్రజల నాకర్షింపగల్గి ఎట్టికష్టములనైన నోర్వ గల మనోధైర్యములుగల్గినవారై యుండిరి ఎట్టికార్యములనైన నవలీల సాధింపగల సాహసులై యుండిరి

ఇట్లు హిమవత్పర్వతప్రాంతభూములకు బంపబడిన వారిలో మధ్యమ, కాశ్యపగోత్రి, దుందుభిస్వర అను ముగ్వురినామములు మాత్రము బయల్పడినవి సాంచికడ నుండు స్థూపశిధిలములు దర్పుచుండగా మధ్యమ, కాశ్యప గోత్రుల అస్థికలు గల్గిన పాత్రలు కనుబడినవి ఈ భరిణల యుపరిభాగమున వీరినామము లుదహరింపబడినవి. సాంచికడ

---

♦ సింహళద్వీప చారిత్రలు వీనిలో దీపవంశము క్రీ. శ నాల్గవ శతాబ్దమున వ్రాయబడినట్లు గాన్పించుచున్నది

నుండు స్తూపమును అశోకుడు వీరిగౌరవార్థమై గట్టించెను. కాశ్మీరగాంధారములకు మధ్యాంతికుని, మహిషమండలమ్మునకు మహాదేవుని వనవాసికకు (ఉత్తరకన్నడములోనిది) రక్షితుని స్వర్ణభూమికి ఉత్తరశోణుల మహారాష్ట్రమునకు మహాధర్మరక్షితుని అశోకుడు ఉపదేశకులుగబంపెనట్లు గ్రంథములందు గలదు. అశోకుని ప్రయత్నములు సింహళమున సంపూర్ణముగ ఫలించినవి ఇచ్చట బౌద్ధమతము నుపదేశించుటకై అశోకుడుతనయుడగు మహేంద్రునంపెను ఈతనితో సంబల, భద్రశాల యను సన్యాసులుగూడ నరిగిరి

ఈవృత్తాంతము సాంచిస్తూపముకడనుండు తూర్పు ద్వారముపై జెక్కబడినది. ఉత్సవముతో బోధివృక్షశాఖను గైకొని మహేంద్రుడు సింహళమునకు బోవుచున్నట్లు యిచ్చట గంభీరముగ చిత్రింపబడినది ఈసమయమున తిస్స నృపాలుడు * సింహళద్వీపము నేలుచుండెను. ఈతడును యీతనిప్రజలును మహేంద్రునిచే ప్రబోధితులై బౌద్ధమతమును స్వీకరించిరి. టిస్సరాజు యీమతవ్యాప్తికై తన నలుబదివత్సరముల రాజ్యకాలమును పాటుబడెను. ఈ మతపోషణమునకై యెన్నియోమనోహరములగు కట్టడముల గట్టించి బౌద్ధప్రపంచమున దానపతియని ప్రఖ్యాతిగాంచెను.

మహేంద్రునివెనుక అశోకునితనయయు పరమసాధ్వియునగు సంఘమిత్ర సింహళమునకేగి తనయన్నతోబాటు

* ఈతడు క్రీ పూ 250 సంవత్సరమున సింహాసనమెక్కి నలుబది వత్సరములు సింహళరాజ్యమును బాలించెను. సౌందర్యమునకు నతికెక్కిన అనూరాధపురము నీతడే గట్టించెను.

బౌద్ధమతప్రచారమును సల్పెను. ఈమె యచ్చటనొక సన్యాసినీ మతమును కల్పించెను. ఇట్లీబుద్ధభక్తులు మహేంద్ర, సంఘమిత్రలు బౌద్ధధర్మముల నుపదేశించుచు తమ జీవితశేషమంతయు నీద్వీపముననేగడపి యచ్చటనే దివికేగిరి. మహేంద్రుని జ్ఞాపకార్థమై యాతనియస్థికలపై మిహింటాలపురమున నొకస్తూపము గట్టింపబడినది. ఇది నేటికిని యీద్వీపమున అనూరాధపురమునకు దాపున గాననగును ఆర్యావర్తమునందువలె సింహళమున బౌద్ధమతము క్షీణింపలేదు. అప్పటినుండి యిప్పటికిని యిచ్చట బౌద్ధమతమె బ్రబలుచున్నది. నేడీ ద్వీపమున **7774** బౌద్ధభిక్షుకు లున్నారు.

అశోకు డిట్లు ఉపదేశికులనంపి భూమండలమున బౌద్ధమతమును వ్యాపింపజేసి దాని నొక మహామతముగ జేసెను. ఈతనిమూలముననే భూతలమున మూడవవంతుభాగము బౌద్ధమతభూయిష్టమైయున్నది. ప్రపంచమున నే మతమును నింత యుచ్ఛదశలో లేదు. క్రైస్తవ మతస్థులు కొట్టుమిట్లాడుచున్నను, ధనరాసులు గుమ్మరించుచున్నను క్రైస్తవమతము దీనితో తులదూగజాలకున్నది.

అశోకుని బౌద్ధమతప్రచారము లోకమున కపారమగు మేలుచేసినది బౌద్ధమతవ్యాపనచే, నాగరికతయెట్టిదో నెరుంగని మొరటుదేశములు అజ్ఞాన కూపమునుండి బయట పడినవి ఆశియా, ఆఫ్రికాఖండములకు నాగరికత భిక్షపెట్టినది. అశోకుని ఉపదేశకులు, అశోకుని మతప్రచారమువలన లోకమున కెట్టియుత్తేజముగల్గినదో ఒకానొక పాశ్చాత్యచరిత్రకారు డిట్లువర్ణించినాడు:—

"ప్రపంచము నాగరికతాదీప్తుల వెదజల్లినవారిలో అశోకుని మతోపదేశకులు ప్రథమగణ్యులు. మూఢవిశ్వాసములు ప్రబలి నాగరికతాగంధమెరుగని మోటుదేశములకె వీరుజాలవరకుపోయిరి. ఆ యాదేశములలో నీబౌద్ధమతవ్యాపనముచే అజ్ఞానతిమిరములు పరుగులెత్తినవి. జ్ఞానసమీరములు విసరినవి.

సింహళ, బర్మా, శ్యామ, త్రివిష్టప, జపాను దేశచరిత్రలు బౌద్ధమతప్రవేశముతోడనే ప్రారంభమయినవి. బౌద్ధమత మీ దేశములలో యతివేగముగ వ్యాపించినది. ఈ దేశములలో నీమతము భూతగణముల యారాధనరూపుమాపి కర్మసిద్ధాంతమును వ్యాప్తినొందించినది. నైతికవర్తనమును పెంపొందజేసినది.

ఇదిగాక బౌద్ధమతోపదేశకులు భారతవర్షమందలి చిత్రకళరీతుల శిల్పవైఖరుల పరిశ్రమల కృషిపద్ధతుల గూడ నిచ్చట వ్యాపింపజేసిరి మహేంద్రుడు, అశోకుని సామ్రాజ్యమునుండి శిల్పపద్ధతుల వ్యవసాయరీతుల సింహళద్వీపమునకు గొనివచ్చి యచ్చటి ప్రజలకు నేర్పించెను. ప్రాచీనసింహళ దేశౌన్నత్యమునకు బౌద్ధమతమే కారణభూతమని యీద్వీపవాసు లిప్పటికిని జెప్పుకొనెదరు."

పర్వత శిఖరములబోలు స్తూపావళులతో, రమణీయమగు బౌద్ధారామములతో, విహారములతో, శోభాయమానమగు రాజప్రాసాదములతో తులతూగుచు సౌందర్యమున రోము నగరమును పరిహసించు అనూరాధపురము అశోకుని

సుప్రయత్నములు లోకమునకు మహావైభవమును గూర్చినవని
జెప్పకయె చెప్పుచున్నవి. ఈపట్టణము అశోకవిజయమునకు
దిగ్జయ స్తంభము. తన ధర్మవ్యాపన ప్రయత్నము లెట్టి విజ
యమును గాంచెనో అశోకుడే ఒకటి, యేడు, పదుమూడు శిలా
శాసనములలో నీతీరున వర్ణించుకొనినాడు :— "నాసదోద్బోధనల
వలన ధర్మపథమున చరియింపవలెననువాంఛ నావిశాలసామ్రా
జ్యమున నెల్లదిశలందును గాఢముగ నాటుకొని దినదినాభివృద్ధి
గాంచినది (1 శాసనము) ప్రజలు మిగుల ధర్మవ్రతులైరి.
జననీ జనకులయెడ వినయము, గురువులయెడ నడకువ, పెద్దల
యెడ నమ్రభావము, దీనులయెడ కారుణ్యము మున్నగు
సుగుణము లద్భుతముగ జనులలో పెంపొందినవి (7 శాస
నము). ప్రజలు మరింత భక్తిపరులైరి ప్రాణిహింస యల్ప
మైనది. నాసామ్రాజ్య బహిర్గతమగు ఐగుప్త మాసిడోనియా,
ఎపిరసు కైరెనీ, చోళ, పాండ్య మున్నగు రాజ్యములలో
గూడ ప్రజ లీధర్మముల నాచరింపసాగిరి (13 శిలా శాసనము).

## బౌద్ధ పరిషత్తు.

బౌద్ధమతాభివృద్ధికై అశోకుడు తనరాజధానియగు పాట
లీపుత్రమున నొకబౌద్ధపరిషత్తు జరిపి పలుప్రాంతములనుండి
ప్రసిద్ధులగు బౌద్ధసన్యాసుల నీ సభ కాహ్వానించెను. పవిత్ర
ములగు బౌద్ధధర్మములు సంకరములుగాకుండ కాపాడి అభి
ప్రాయభేదముల నివారించి బౌద్ధమతము నభివృద్ధిపరచుటకే
అశోకు డీమహాసభను గావించెను. బౌద్ధమతచారిత్రమున

సీపరిషత్తు మిగుల ప్రాముఖ్యత వహించినది అశోకుని పరిపాలన ముగియబోవుచుండు తుదికాలమున 247 వ సంవత్సరమున సీసభ గావింపబడినది

## అశోకుని తీర్థయాత్రలు

తనసామ్రాజ్యమున గల బౌద్ధక్షేత్రములనెల్ల దర్శించుటకై అశోకుడు క్రీ. పూ. 249 సంవత్సరమున తీర్థయాత్ర వెడలెను ఈతడు భక్తిపరుడై బుద్ధక్షేత్రములెల్ల దిరిగి అచ్చటచ్చట ధ్వజస్తంభముల బాతించి వానిపై తనయాగమన వృత్తాంతమును లిఖింపించెను ఈధ్వజస్తంభములు కొన్నిచోట్ల నేటికిని నిలచియున్నవి

అశోకుడు తొలుత దర్శించిన ప్రదేశము బుద్ధభగవానుని జన్మక్షేత్రమగు లుంబినీవనము లుంబినీవనము నేపాళదేశమున నున్నది వృద్ధుడగు ఉపగుప్తుని వెంటగొని అపారసైన్యముతో కుసుమములు చందనాగరు మున్నగు పూజాద్రవ్యములతో తీర్థయాత్రాపరుడై అశోకసార్వభౌముడు మహావైభవముతో పాటలీపుత్రమునుండి బయలుదేరెను లుంబినీవన ప్రాంతముచుజేరినంతనే ఉపగుప్తుడు దిసవిస ముందునకు నడచి యొకానొకస్థలమును జూపుచు తనబడుగు దేహము కంపింప "సార్వభౌమా అల్లదె యా కనపడునదె యా జగత్కల్యాణ దుదయించినచోటు" అని పల్కి యానందాశ్రువులు రాల్చెను అశోకుడు సపరివారముతో భక్తిపూర్వకముగ నీప్రదేశమునకరిగి నూరువేలసువర్ణములు నాపమీప వాసులకు దక్షిణలిచ్చి యచ్చట నొకశిలాస్తంభమును గట్టించి

దానిపై నిట్లువ్రాయించెను. "ఇచ్చటనే లోకారాధ్యు డుద్భవించినది. ప్రియదాసి నృపాలుడు పట్టాభిషిక్తుడైన యిరువదియవయేట నీప్రదేశమును దర్శించెను" ఈస్తంభ మిప్పటికిని యీప్రాంతమున నున్నది. దానియగ్రభాగమున సృజింపబడిన అశ్వవిగ్రహముమాత్రము తునియలై నేలకొరిగిపోయినది పిడుగుపడి యీప్రతిమ చీలి నేలగూలినదని యూనిత్సాంగు వ్రాసినాడు. ఫాహియానుగూడ యీపవిత్రస్థలమునుదర్శించి కన్నీరు వెట్టినాడు. ఇదిగాక అశోకుడు, నేపాళమండలి మరియొకపవిత్రక్షేత్రమగు లలితపట్టణమును దర్శించియచ్చట నైదుస్తూపముల (పట్టణమునకు నాల్గువైపులకును నాల్గును, మధ్యనొకటియు) గట్టించెను.

అశోకుడు లంబినీ ఆరామమునుండి కపిలవస్తునగరమును వీక్షించి, అచ్చటనుండి గయాక్షేత్రమునకు తరలి, అటనుండి సారనాథునకుబోయెను. బుద్ధభగవానుడు తొలుదొల్త ధర్మచక్రమును ద్రిప్పిన కురుంగారామ మీసార్నాధునందే గలదు. సార్నాథమును సేవించి యటుపిమ్మట నాతడు శ్రావస్తి కుసినగరముల దర్శించి రాజధానికి దిరిగిపోయెను. శ్రావస్తిపట్టణమున అశోకుడు ఆనందునిస్తూపమునకు మ్రొక్కి యాసమయమున బ్రాహ్మణ బౌద్ధపరివ్రాజకులకు పదిలక్షల సువర్ణముల దక్షిణలిచ్చెను

అశోకునితో తీర్థయాత్ర వెడలిన యాతనిపుత్రిక చారుమతీదేవి జనకునితో మరల రాజధానికి దిరిగిపోవక నేపాళ

---

* అశోకుడు గైకొనిన బిరుదనామము తనశిలాలేఖనములందెల్లచోట్లను అశోకుడీనామము చేతనే తన్ను బిలుచుకొనినాడు.

మునసే యుండిపోయెను ఈమె భర్తృవిహీనగా గాన్పించు చున్నది. ఈమె విభుని పేరు దేవపాలక్షత్రియుడు. చారుమతి తన మనోహరుని పేర నేపాళమున "దేవపట్టణ" మను నొక పట్టణమును నిర్మించెనట. 'పసుపతీనాధ' యను గ్రామమున సీమె యొక సన్యాసినీ ఆశ్రమమును నిర్మించి అందే తన నివాసమేర్పరచుకొని తుద కందే ప్రాణములు విడచెను. భారతవర్షమున ఇట్టి యువతీమణులకు అనన్య సామాన్యస్వార్థ త్యాగినులకు, సాధ్వీమతల్లులకు, విజ్ఞానవతులకు, ఎప్పుడును కొదువలేదుకదా! సార్వభౌముని ముద్దులపట్టియై, రాజభోగ ముల ననుభవించుచు అంతఃపురసీమలందు సంచరింపవలసిన వనితామణి కెట్టివైరాగ్యము, ఎట్టిభక్తిపరవశత, ఎంతపరో పకారపారీణత!

## అశోకుని శిలాశాసనములు.

'అశోకుని శిలాశాసనముల' ని చరిత్రకారులచే బలు మారులు వచింపబడుచు లోకప్రఖ్యాతిగాంచిన అశోకసార్వ భౌముని శిలాశాసనముల గూర్చి యిచట కొంచెము విచారిం తము ప్రజల ఉపయోగార్థమై ధర్మప్రాబల్యమునకై అశోకు డీశాసనముల జనసమ్మర్దమగు రాజమార్గములలో, ఆపణప్రదే శములలో యాత్రాస్థలములలో రాజ్యమందంతటను వేయిం చెను. ఉత్తరమున హిమాచలము మొదలు దక్షిణమున మహిషమండలమువరకును, తూర్పుసముద్రము మొదలు పశ్చిమ సముద్రమువరకును యీ శాసనములు వ్యాపించి యున్నవి అశోకునిచే చెక్కింపబడిన శాసనము లింతవరకును ముప్పదియైదు కాన్పించినవి అవి రామగ్రామ శ్రావస్తి,

మున్నగు పట్టణ పరిసరములందు నెలకొల్పబడినవి. అందు రెండు శాసనములు అశోకుడు బౌద్ధక్షేత్రములకుగావించిన తీర్థయాత్రలవర్ణించు శాసనములు మూడుశాసనములు అజీకులకు గుహాలయములు మున్నగునవి దానమొసగు సందర్భమున వ్రాయబడిన దానశాసనములు రెండుశాసనములు కళింగయుద్ధము వలన దనకుగల్గిన పరితాపమునువర్ణించు శాసనములు తక్కినవన్నియు బౌద్ధధర్మములు ప్రకటించుటకై నిల్పినవి.

అశోకునిశాసనములు మనదేశమున కనుగొనబడిన శాసనములలోని కెల్ల పురాతనమైనవి ఈశాసనములవలన అశోకుని పరిపాలన పూసగ్రుచ్చినట్లు మనకు దెలియును అశోకునిచరిత్రకివియె ముఖ్యాధారములని నుడివియుంటిమి. చారిత్రికముగనీ శాసనము లమూల్యములు

## శాసనములలోని భాషాలిపులు

అశోకుని శాసనములన్నియు అప్పటిజనులచే మాటలాడుకొనబడుచుండిన పాళీభాషలో వ్రాయబడినవి ఈభాష మనకిప్పుడంత సులభముగ గ్రాహ్యముగాదు ఈశాసనముల భాష యొకటియేయైనను లిపులు వేరుగ నున్నవి అశోకునిశాసనములు, ఖరోష్టి, బ్రహ్మి యనబడు రెండువిధములగు లిపులలో వ్రాయబడినవి పశ్చిమోత్తరప్రాంతమున నెలకొల్పబడిన శాసనములన్నియు ఖరోష్టి లిపిలో వ్రాయబడినవి. ఇది కుడివైపునుండి యెడమవైపునకు వ్రాయబడును అరబ్బీ, పారశీక లిపుల కివియెమూలము. ఈకాలమున పశ్చిమోత్తర ప్రాం

తమున నీ లిపివాడుకలోనుండుటవలన నిచ్చటి శాసనములన్నియు నీలిపిలో వ్రాయబడినట్లు గాన్పించుచున్నవి తక్కటి శాసనములన్నియు బ్రాహ్మీలిపిలో వ్రాయబడినవి ఈలిపి ఖరోష్ఠీ లిపివలెగాక యెడమవైపునుండి కుడివైపునకు వ్రాయబడును ఆంధ్రనాగరలిపుల కిదియె మాతృక

## వి వి ధ శా స న ము లు

వ్రాయబడిన సాధనముల బట్టి శిలాశాసనములనియు, స్తంభశాసనములనియు, అశోకుని శాసనములు ద్వివిధములుగ విభాగింపవచ్చును కొన్ని స్తంభముల పైనను, కొన్ని రాతిఫలకముల పైనను వ్రాయబడినవి. అందుచేతనే యీవిభేదము. శిలాశాసనములు, స్తంభశాసనములకంటె పూర్వము వ్రాయబడినవి. ఇవి సాధారణముగ సామంత పాలిత రాష్ట్రములందును బాటల సౌకర్యములులేని దూరప్రదేశములందును వేయబడినవి. స్తంభశాసనములు అశోకుని యేలుబడిలోనుండు రాజ్యభాగములందును ఏకశిలా స్తంభముల కుపకరించు నిడివిపాటి శిలలు పుష్కలముగ దొరకు ప్రాంతములందును నెలకొల్పబడినవి

వీనిలో శిలాశాసనములె మిక్కిలివిరివిగ గలవు ఇవియె పెక్కుచోట్ల నిల్పబడినవి. ఇవి పాంచాలమునుండి మైసూరు ప్రాంతమువరకును గలవు అరేబియా సముద్ర తీరమందును బంగాళా సముద్రపుటొడ్డు ప్రదేశములందును గూడ నివి గాన్పించినవి నైజాము రాజ్యములో మస్కియను ప్రాంతమున

శోక శాసనము యిటీవలనే (1915) కనుబడినది. ఆఫ్ఘనిస్థానములో పరిశోధించిన యెడల అచ్చట గూడ అశోకుని శాసనములు వందల కొలది బయటపడునను టకు సందియము లేదు. ఇట్లు, అశోకుడు తన విశాల సామ్రాజ్యము నందంతటను, పెక్కుచోట్ల శిలాశాసనములు వేయించెను కొన్ని శాసనము లిప్పుడు అరణ్య ప్రాంతము లందున్నవి. ఈ ప్రదేశములు పూర్వకాలమున జన సంకీర్ణమగు పట్టణములో, పుణ్యస్థలములో అయియుండనోపు.

స్తంభశాసనములసంఖ్య యంతవిరివిగలేదు అశోకునిచే స్థాపింపబడిన శాసనస్తంభములు ముప్పదివరకును గలవని గ్రంథములలో గన్పడుచున్నది. కాని వీనిలో యిప్పటివరకును పది స్తంభములుమాత్రము గన్పించినవి తక్కినవి శిథిలమై కాలవాహినిలోగలసి పోయియుండవలెను. ఈశిలాస్తంభములు ఏకశిలానిర్మితములై ఉన్నతములై శిల్పపుబనులతో నలరారుచు మురిపెములుగొల్పుచుండును.

ఈశాసనములన్నిటిని, అందులిఖింపబడిన కథాంశమునుబట్టి ఎనిమిది తరగతులుగ విభజింపవచ్చును.

౧ లఘుశిలాశాసనములు:—ఇట్టివి రెండుగలవు. వానిలో మొదటిదాని కేడుప్రతులువ్రాయబడి యేడును యేడుప్రదేశములలో బెట్టబడినవి రెండవదానికి ప్రతులు లేవు అది యొక్కచోటనే యున్నది. రెంటియందును కథాంశములువేరు ఈలఘుశాసనములు, రాజపుత్రస్థానములోని

"బెయిరతు" నందును మధ్యపరగణాలలోని "రూపనాథము" నందును, వంగదేశములోని 'సహసా్రము'నొద్దను మహిషు మండలములోని "సిద్ధాపురము"నొద్దనుగలవు. సిద్ధాపురము నందును ఆసమీపమునను మూడుప్రతులు కనుగొనబడినవి. ఈతరగతిశాసనములు క్రీ. పూ. 258, 257 సంవత్సరములలో చెక్కింపబడినవి.

౨. బాభ్రాశాసనము:—ఈశాసనము కొంచెమెరుపు, బూడిద వర్ణములు గలసిన యొక చిన్నరాతిబండపై వ్రాయ బడినది. ఇదియు 258 సంవత్సరప్రాంతముననే వ్రాయబడి యుండవలెను బెయిరతు సమీపముననున్న నొకకొండపై 1887 సంవత్సరముననిది దొరికినది ఇప్పుడిది కలకత్తాలోనున్నది. ఇది బౌద్ధమతాచార్యుల కొఱకై వ్రాయబడినట్లు గాన్పించు చున్నది బుద్ధుని సుభాషితములలో నేడువచనములిం దుదహ రింపబడినవి.

3 పదునాల్గుశిలాశాసనములు:—257, 256 సంవత్సర ములలో లిఖింపబడినవి. బౌద్ధధర్మము లిందు వివరింపబడినవి. వీని కేడుప్రతులువ్రాయబడినవి ఏడును ఏడుప్రదేశములలో నున్నవి. ఇవి పెషావరుకు సమీపముననున్న "షహబాజీగరు" నొద్దనొకటియు పంజాబులోని మన్సీరాయను గ్రామముకడ నొకటియు బొంబాయికుత్తరముగానుండు 'సొపారా' యం దొకటియు కతియవారు ద్వీపకల్పమందలి గిరినగరకొండలపై నొకటియు, కళింగరాజ్యములో భువనేశ్వరపట్టణమునకు సమీపముననున్న ధౌలియనుప్రదేశముననొకటియు, గంజాం

జిల్లాయందలి 'జాగద' నగరసమీపముననొకటియు నున్నవి. ఇవియన్నియు స్ఫటికపుశిలలపైనను, నల్లరాతిబండలపైనను జెక్కబడినవి.

౪. కళింగశాసనములు రెండు:—256 సంవత్సరమున నెలకొల్పబడినవి. కళింగరాజ్యములోనిధౌలి, జౌగడపట్టణ సమీపములందు గన్పించునవి. ఈశాసనములు కళింగదేశ ప్రజలయుపయోగార్థమై వేయబడినవి ఇందు అశోకుడు, ప్రజ లందరును తనబిడ్డలనియు, సరిహద్దులలో నివసించు అడవి జాతుల క్షేమముల విచారించుటకై సుశిక్షితులగు నుద్యో గులనంపెదననియు, ప్రజలపై దనకుగల పితృవాత్సల్యమును గుర్తెరుగక, తనయుద్యోగులుకొందరు, ప్రజలనన్యాయముగ శిక్షించి హింసించినసంగతి దనకు దెలియవచ్చినదనియు, అం దులకు తనకెంతయు విచారముగల్గినదనియు ఈర్ష్య,క్రోధము, తొందరపాటు, నిర్దాక్షిణ్యము, అలుసుతనము, మున్నగుదుర్గు ణములకు లోనుగాకుండ తనయుద్యోగులందర మందలించు చుంటిననియు వ్రాసెను. అశోకుడు సరిహద్దుపరగణాల నెంత జాగరూకతతో పరిపాలించువాడో యీశాసనములవలన తెలియుచున్నది దీనివలన నాతనిపరిపాలనా నైపుణ్యముగూడ విశదమగుచున్న

ఇంతియగాక యీశాసనములు చారిత్రికముగగూడ మిగుల ప్రాముఖ్యమైనవి ఏలన యిందు అశోకునికాలమున ఐరోపా, ఆసియా, ఆఫ్రికాఖండములం దేయేరాజులు పాలిం చుచుండిరో భారతవర్షమున ఏయేరాష్ట్రములు, ఏయేజాతులు

విలసిల్లినవో వివరింపబడియున్నది. గ్రీసు రాజ్యమును పాలించిన "ఆంటి యోకసుధీయసు"ను ఐగుప్తదేశము నేలిన "టోలమీ ఫిలడల్ ఫాసు"నుఐగుప్తదేశమునకుపశ్చిమభాగమునయున్న కైరేనిరాజగు 'మాగసు' నృపాలుడును, "ఎపిరసు" రాజ్యమునకు యేలికయైన అలెగ్జాండరును అశోకునికి సమకాలికులని యీ శాసనములవలన దెలియుచున్నది వీరందరితోడను అశోకుడు సెయ్యమును బాటించెననియు వీరిరాజ్యములలో నీతడు నిరాఘాటముగ బౌద్ధమతప్రచారమును నడపెననియుగూడ తెలియుచున్నది ఈరాజులందరును క్రీ. పూ 258 సంవత్సరము వరకును జీవించియుండిరనియు, అందుచే నీశాసనములు ఈ సంవత్సరమున కీవలనే వ్రాయబడియుండవలయుననియు, చరిత్రపరిశోధకులు నిర్ణయించుచున్నారు ఇదిగాక, ఈశాసనములు దక్షిణాపథమందలి ఆకాలమునాటి రాజ్యాంగవ్యవస్థను గూడ సూచించుచున్నవి దక్షిణమున అశోకునికాలమున చోళ, పాండ్యరాజ్యములున్నవని యీశాసనములు నుడువుచున్నవి అందొకశాసనము కేరళపుత్ర, సత్యపుత్రరాజ్యముల జేర్కొనుచున్నది. ఇవి సహ్యాద్రిపర్వతప్రాంతమున విలసిల్లిన తమిళ రాజ్యములు అంధకారముగప్పిన యీకాలమునాటి యితిహాసరంగమున సంచరించుట కీశాసనము లొక కరదీపికవలె నుపకరించుచున్నవి.

౫ గుహాశాసనములు ( లేక దానశాసనములు ):— ఇట్టివి మూడుగలవు ఈమూడును దానశాసనములు. అశోకుని దానముల వర్ణించుశాసనములు, 257, 250, సంవత్సరములలో

వ్రాయబడినవి. గయాక్షేత్రమునకు దాపుననున్న బరాబరు కొండలలో దొలువబడిన మూడుగుహలను అజీవకులను జైనమతావలంబులకు దాన మొసగుసందర్భమున అశోకు డీశాసనముల వ్రాయించెను ఇవి యీవిహారకుడ్యములపై లిఖింపబడినవి.

౬. టెరాయ్ స్తంభశాసనములు రెండు:—ఈ రెండు శిలాస్తంభములును, అశోకుడు తీర్థయాత్రవెడలినసందర్భమున నేపాళదేశమున లంబినీవనప్రాంతమున, తానాపుణ్యభూముల దర్శించినందులకు గురుతుగ నెత్తించిన స్తంభములు. క్రీ.పూ. 249 సంవత్సరమున నెలకొల్పబడినవి. ఇందొకటి 'నిగ్లివిహా'యనుచోటను రెండవది 'రుమ్మిందె'యను తావుననునున్నవి. నిగ్లివిహారా స్తంభము శిథిలమైపోయినది. శిఖరము కనుపడుటలేదు. మొండెము రెండుతునకలైనది. అశోకుడుకోణకమణిస్థూపమును దర్శించినవృత్తాంతమును దీనిపై వ్రాయబడినది రుమ్మిందెస్తంభము వజ్రపాతముచే చీలిపోయినదని మున్నొకసారి వ్రాసితిమి. అశోకుడు లంబినీవనమును దర్శించిన యుదంతము దీనిపై వర్ణింపబడినది

౭ సప్తస్తంభశాసనములు:—వీనిప్రతులు ఆరుచోట్లనున్నవి. బాఖరా, (బసర్ సమీపమున) 'లారియా'(చాంపరాన్ జిల్లాలో), రాంపర్వా, సాంచి, తోప్రా (అంబాలాసమీపమున), మీరటు, ప్రయాగ, మున్నగుప్రదేశములలో అశోకుడు వీని నెలకొల్పెను వీనిలో, తోప్రా, మీరటుప్రాంతములయందున్న స్తంభముల వెల్లగించి ఫీరోజిషా ఢిల్లీకి

గొనిపోయి యచ్చట పాతించెను ఈ స్తంభశాసనముల నశోకుడు క్రీ. పూ 243, 242 సంవత్సరములలో వ్రాయించినట్లగానుపించుచున్నది. మొదటి పదునాల్గుశిలాశాసనములలో సుచహరింపబడినధర్మములే యీస్తంభములపై మరికొంత విపులముగ వివరింపబడినవి.

౭. లఘుస్తంభశాసనములు:—ఇట్టిశాసనములు నాల్గు గలవు. అందు రెండు ప్రత్యేకస్తంభములపై లిఖింపబడినవి. తక్కటిరెండును అలహాబాదునందున్న స్తంభశాసనమునకు పరిశిష్టములుగా వ్రాయబడినవి ప్రత్యేకస్తంభశాసనములు రెండును ఒకటి సార్నాదునందును మరియొకటి సాంచియందును నిర్మింపబడినవి.

అశోకుని శిలాలేఖనములందలి ముఖ్యాంశములు.

సత్యభాషణము, విధేయత, భూతదయ అను మూడు ధర్మములను అశోకుడు, విధివిరామములేక మరల మరల తనశాసనములలో వ్రాయించి వాని ననుసరింపవలసినదని ప్రజల నహర్నిశములు హెచ్చరించెను కొన్ని శాసనముల (గుహాశాసనముల) యందు తన దానధర్మముల వివరించెను. కొన్నిటి (తరాయిస్థంభశాసనముల) యందు తన తీర్థయాత్రల యుదంతమును వర్ణించెను మరికొన్నిటి (ఆరవశిలాశాసనము) యందు ప్రజాక్షేమమునకై తాజేయుకృషిని జెప్పుకొనెను. కొన్ని శాసనములందు తనయధికారులు నిర్వర్తింపవలసిన విధుల వివరించెను. మరికొన్నిటి (13 వ శిలాశాసనము)

యందు తానేయేదేశములకు ధర్మోపదేశకుల బంపినదియు, అచ్చట తనకెట్టివిజయము కలిగినదియు లిఖించెను. కళింగ యుద్ధమువలన తనకు గలిగిన సంతాపమును కొన్నిటి (కళింగ శాసనముల) యందు వ్రాసికొనెను.

ఈశాసనములందు గనిపించు ముఖ్యవిషయము లివియే.

ఆతని శిలాలేఖనములం దుపహరింపబడిన ధర్మముల కొన్నిటి నిచ్చట క్లుప్తముగ వివరించెదము:—

మొదటి శిలాశాసనము.

1 బలి, యాగములందు, జాతరలందు, మృగముల వధింపరాదు.

2 సాంఘికోత్సవములు సలుపరాదు అట్టి యుత్సవములందనేక దుష్కృత్యములు జరుగుచుండును.

3. తలిదండ్రుల యెడ విధేయత,

4. బంధుమిత్రులయెడ, బ్రాహ్మణ, పరివ్రాజకుల యెడ నౌదార్యము, కనుపరుపవలయును.

మూడవ శిలాశాసనము.

5 అహింస,

6 పొదుపు,

7 వాక్ప్రియత్వము,

మిగుల శ్రేయోదాయకములు.

ద్వితీయలఘుశిలాశాసనము.

8. అనృతమాడకుండుట,

9. భూతదయ,

10. ఆచార్యునియెడ వినయము,
ఆచరణీయములు.

ఏడవ శిలాశాసనము.

11. ఇంద్రియ వశీకరణము, ఆత్మవిజయము.

12. చిత్త శుద్ధి,

13. కృతజ్ఞత,

14. విశ్వాసము,
ఇవి మానవులకు దుస్సాధ్యములు కావు.

పండ్రెండవ శిలాశాసనము

15. పరమతసహిష్ణుత కలిగియుండవలయును మతాంతరుల తృణీకరింపరాదు అన్యమతముల బోధించు పరివ్రాజకులను గూడ గౌరవింపవలయును. స్వమతోత్కర్షకై అన్యమతముల నిరసింపరాదు. ఏమతావలంబుడైనను తనధర్మమును గుర్తించి సరిగ నాచరించుటయే, ప్రియదర్శినృపాలుని యభిలాష

రెండవ స్తంభ శాసనము.

16 సద్ధర్మాచరణ ముత్కృష్టమైనది. ధర్మమననేమి? మన

శ్శుద్ధి, దయాసత్యశౌచములు, పరోపకారపారీణత, ఇవియే ధర్మములు.

మూడవ స్తంభ శాసనము.

17 ఆత్మపరిశోధన:— మనుజుడు తానొనర్చుసత్కార్యములనే లెక్కించుకొనును. దుష్కార్యముల సరకుగొనడు. ఆత్మపరిశోధన దుష్కరము. ఐనను మనుజుడెప్పుడును తన్నుదా పరీక్షించుకొనుచుండవలయును. పశుత్వము, కాఠిర్యము, క్రోధము, గర్వము, దయాశూన్యత యివి వినాశహేతువులని గుర్తెరిగి ప్రవర్తింపవలయును అసూయచే నొరుల నిందింపరాదు ఇట్టిప్రవర్తనము యిహపరసాధనము.

శాసనస్వరూప మిట్లుండునని చూపుటకు ఒకటి రెండు శాసనముల సంపూర్ణముగ నిచ్చట లిఖించెదను.

ద్వితీయ లఘుశిలాశాసనము

(సిద్ధాపురమునందుండు శాసనప్రతి)

ఘనత వహించిన ప్రియదర్శి నృపాలుడిట్లు వచించుచున్నాడు: "తలిదండ్రులకు విధేయులై యుండవలయు అట్లే సకలజీవరాసుల గౌరవింపవలెను సత్యమును వచింపవలెను. శిష్యుడు గురునియెడ నడకువ గల్గియుండవలయును బంధుగులకు మర్యాద నలుపవలయును ఇదిపురాతన ధర్మనియమము. ప్రజలు దీని నాచరింపవలయును"

ఎనిమిదవ శిలాశాసనము

"పూర్వము రాజులు మృగయావినోదముల విలాసముల కొఱకు పువ్వువారు:—

ఘనుడగు ప్రియదర్శిమహారాజు ఎట్లయినను, తాను రాజ్యభారమును వహించిన పదునొకటవ సంవత్సరమున అష్టాంగ * మార్గముల నవలంబించెను. అందుచే తీర్థయాత్రలు చేయుట కల్గెను. ఈ యాత్రలవలన భిక్షువులను బ్రాహ్మణులను దర్శించుటయు, సువర్ణదానముల జేయుటయు, రాజ్యమును ప్రజలను వీక్షించుటయు, బౌద్ధధర్మముల ప్రకటించుటయు, ధర్మమీమాంసల జేయుటయు, ప్రాప్తించుచున్నది. కాన ఘనుడగు ప్రియదర్శిప్రభువు మృగయావినోదములమాని ధర్మయాత్ర లందె కాలముగడపుచు నానందించుచున్నాడు"

అశోకుని రాజ్యపాలనము.

ఆతని రాజ్యవిస్తీర్ణము

అశోకుడు తన రణప్రౌఢిచే అద్వితీయ పరిపాలనాకౌశలముచే నొక యఖండసామ్రాజ్యమున కధిపతియై రాజ్యమేలెనని యాతనిశాసనములు ఘోషించుచున్నవి. ఈతని సామ్రాజ్య మత్యంతవిశాలమై విస్తీర్ణమున ప్రస్తుత బ్రిటీషు హిందూస్థానమంత యుండెను. ఈతడు ఉత్తరమున సీతనగము మొదలు

* పరిశుద్ధ సంకల్పము, పరిశుద్ధానుభవములు, పరిశుద్ధవాక్కు, పరిశుద్ధవర్తనము, పరిశుద్ధజీవనము, పరిశుద్ధకృషి, పరిశుద్ధాంతఃకరణ, పరిశుద్ధ ఆలోచన యివియే అష్టమార్గములు.

దక్షిణమున పినాకినీనదీతటమువరకును, పశ్చిమమున హిందూ కుశపర్వతావళులు మొదలు తూర్పున పూర్వసముద్రమువర కును గల యావద్భారతదేశమును ఏకచ్ఛత్రాధిపతిగ నేలెను. పశ్చిమోత్తరమున కాబూలు, కాందహారు బాక్ట్రియారాజ్య ములు (ప్రస్తుత అఫ్ఘనిస్థాన బెలుచిస్థానములు), సింధు పాంచాల నేపాళ కాశ్మీర కితియవాడ రాజ్యములు, తూర్పున వంగ కళింగ రాజ్యములు, మహిషమండలమువరకును గల దక్షిణాపథము మున్నగు రాజ్యములన్నియు ఆతని యేలు బడిలో నుండెను ప్రస్తుత చీనీతురుష్కస్థానములోనున్న కుస్తా నము (ఖోటను) గూడ యీతనిచే పాలింపబడినట్లు నిదర్శన ములు గాన్పించుచున్నవి ఆంధ్రరాజ్యము అశోకునికి సామంత రాష్ట్రముగనుండి కప్పము జెల్లించుచుండినట్లు దోచుచున్నది. చేర, చోళ, కేరళ, పాండ్య రాజ్యములు మాత్రము స్వా తంత్ర్యరాజ్యములుగ నుండినవి ఇంతటి విశాలసామ్రాజ్యము నీతడు కత్తిముట్టకయె ముప్పదిఏడు దీర్ఘవత్సరములు ఎట్టికల్లో లములును లేక ప్రజారంజకముగ పాలించెను ఈతని పరి పాలనాకౌశల మద్వితీయముగదా!

## అశోకుని పరిపాలనాపద్ధతులు.

### రాజప్రతినిధులు.

పాటలీపుత్రమునుండి మధ్యదేశమును అశోకుడు స్వయముగ పరిపాలించువాడు దూరప్రదేశముల పాలించు టకై రాజప్రతినిధుల నియమించువాడు ఇట్టి రాజప్రతినిధులు అశోకునికాలమున నల్వురుండిరి వీరిలో నొకడు పశ్చిమోత్తర

ప్రాంతమును పాలించెను. ఈతడు తక్షశిలను రాజధానిగ జేసికొని పాంచాల, సింధు, కాశ్మీరములను, హిందూకుశ పర్వతమున కావలివైపునున్న రాజ్యభాగములను పాలించు వాడు. ఇంకొకప్రతినిధి ఉజ్జయినినుండి పశ్చిమదేశమంతయు బరిపాలించెను. మాళవ, కతియవాడ గుజరాతురాష్ట్రము లీతని యేలుబడిలోనుండెను పూర్వప్రాంతమునేలు ప్రతినిధి 'తోశలి'లో నుండువాడు కళింగరాజ్యమునుగూడ నితడే పాలించువాడు. తోశలి యెచ్చటనుండెనో మనకు సరిగ దెలియకున్నది కళింగరాష్ట్రములోనుండియుండవలెను మఱి యొక ప్రతినిధి సువర్ణగిరియందుండి దక్షిణదేశమంతయు నేలు వాడు ఈసువర్ణగిరి యెచ్చటనుండెనో యింతవరకును గుర్తింపబడలేదు. హైదరాబాదుప్రాంతమున సువర్ణపు గనులకు దాపున నుండియుండవలెను.

## అశోకుని యుద్యోగబలము

### రజ్జిక, ప్రాదేశిక, మహామాత్ర, ధర్మమహామాత్రులు

ఈప్రతినిధులగాక అశోకుడు తనపరిపాలనానిర్వహణమునకై యింకను పెక్కండ్రయుద్యోగుల నియమించెను. వారిలో రజ్జిక, ప్రాదేశిక, మహామాత్ర, ధర్మమహామాత్రులు ముఖ్యులు. రజ్జికులు ప్రతినిధులక్రిందియుద్యోగులు వీరు లక్షలకొలదిజనుల పాలించువారు వీరికి దిగువనుండువధికారులకు ప్రాదేశకు (జిల్లాయధికారు) లనిపేరు. మహామాత్రులు దండనాధికారులు. ధర్మమహామాత్రులగురించి ప్రత్యేకముగ జెప్పవలసియున్నది.

## ధర్మమహామాత్రులు లేక ధర్మాధికారులు

ఈధర్మాధికారుల నియామకము అశోకునిపరిపాలన మందొక యపూర్వవిషయము. ఈయుద్యోగిశాఖ అశోకునిచే నూతనముగ నిర్మింపబడినది. మౌర్యసామ్రాజ్యవిచ్ఛిన్నమునకును బౌద్ధమతాస్తమయమునకును ఈయుద్యోగులే కారణమని కొందరిచరిత్రకారుల యభిప్రాయము. ధర్మవ్యాపనకై యీయుద్యోగుల తనపరిపాలనకాలమున పదునాల్గవసంవత్సరమున అశోకుడు నూతనముగ నియమించెను ధర్మప్రాబల్యమునకై అశోకుడుగావించుశాసనముల నమలుజరుపుటవీరిపని. శాసనములననుసరించి ప్రజలు వర్తించుచుండిరోలేదో వీరుపరిశీలింపవలయును. ప్రజలక్షేమముల నరయవలయును. జరాభరమున గుందు దిక్కుమాలిన ముదుసలులకు ఆపదలవగ్ని విలపించు దీనులకు దారిద్ర్యభరమున బాధనొందుమానవులకు వీరు దుఃఖోపశమన మొనర్చి సాహాయ్యము చేయవలయును.

దేశమున పర్యటనలుసల్పి ప్రజలకు ధర్మోపదేశము జేయవలయును. నిర్దోషుల కారాగృహములం దుంచుట అన్యాయమగు శరీరదండనల విధించుట మున్నగు నక్రమముల నివారింపవలయును. ధర్మపథము నావరించి యుండుకంటకముల తొలగింపవలయును బహుకుటుంబభారమును బట్టియు, వయోవృద్ధత్వమును బట్టియు, ఆకస్మికసంఘటనములగు కష్టములబట్టియు క్షమించుట కర్హుడగునేని అట్టి యపరాధుల విడిచిపుచ్చుటకు వీరి కధికారము గలదు. మఱియు వీరు ప్రజలనీతిని గాపాడు చుండవలయును.

అంతఃపురస్త్రీల శీలవర్తనములగూడ కనిపెట్టి చూచుచుండవల యును. ఇంతియగాక నృపాలుడును, ఆతనిరాణులును, రాజ సంతతిలోనివారును జేయుదానధర్మముల వీరు సద్వినియోగ మొనర్చుచుండవలయును వారలిచ్చు ధనరాసులగొనిపోయి అర్థిజనుల కిచ్చుచుండవలయును అన్నదాన వస్త్రదానాదిధర్మ కార్యములు సరిగ నిర్వహింపబడుచున్నదియు లేనిదియు పరీ క్షించుచుండవలయును రాజాజ్ఞలకు వ్యతిరేకముగ జంతు వులజంపుట, చిత్రవధలజేయుట, యేదో యొక యవయవమును గోసి బాధించుట, తలిదండ్రులయెడ నవిధేయులై మెలంగుట మున్నగు నేరముల వీరువిచారించిరి. అంతఃపురస్త్రీల అధర్మ ప్రవర్తనలగూడ వీరె పరిశీలించువారు.

ఈ యధికారుల ధర్మములను అశోకుడు తన అయిదవ శిలాశాసనమున నిట్లు వివరించినాడు:—

' పూర్వకాలమున నెన్నడును ధర్మోపదేశకు లనబడు ఉద్యోగులు నియమింపబడియుండలేదు. నాపరిపాలనాకాల మున పదునాల్గవ సంవత్సరమున నిట్టివారలు నాచే నియ మింపబడిరి ధర్మమును వెంపొంద జేయుటకును, విశ్వాస నీయులగు నాప్రజలయొక్కయు, యవన, కాంభోజ, గాంధార, రాష్ట్రిక, పైటినిక మున్నగు అన్యజాతులయొక్క యు క్షేమ సౌఖ్యముల నరయుటకును, అందరి ఉపయోగ మునకై వీరు నాచే నియమితులైరి

అకృత్రిమ శిక్షల నివారించుటకు, కుటుంబీకులు వయోవృద్ధులు ఆపన్నులు నగు అపరాధుల క్షమించి విడుచుటకును. వీర లేర్పరుపబడిరి.

పాటలీపుత్రమునను తక్కుటి పట్టణములందును గల, నాసోదర, సోదరీజనుల శీలవర్తనముల వీరు పరీక్షింతురు

నా రాజ్యమందలి, బుద్ధధర్మపరాయణులతో సద్ధర్మాచరణయందు దాసక్తిగల ప్రజలతో, దాతలతో నాధర్మాధికారులు కలిసి ప్రవర్తింపవలెను

ఇందుకొరకీ ధర్మశాసనము లిఖింపబడినది. చిరకాలమిది అంతరాయము నొందకుండుగాక! ప్రజలు దీని ననుసరించి నడచుకొనెదరుగాక!'

## స్త్రీ ధర్మాధికారులు

స్త్రీలవర్తనము బరీక్షించుటకును స్త్రీలకు ధర్మముల నుపదేశించుటకును అశోకుడు ప్రత్యేకధర్మాధికారుల నియమించెను

## ఇతర యుద్యోగులు.

వీరలేగాక, యీతనికాలమున వార్తాహరులు, వేగులు, మార్గరక్షకులుగూడ నుండిరి.

## ప్రజాక్షేమము

అశోకునిపరిపాలన సర్వోత్కృష్టమైనది ప్రపంచ చారిత్రమునం దట్టి ధర్మపద్ధతులపై రాజ్యమేలినరాజు వేరొకడు

గానరాడు. ఆతని పరిపాలనమున ప్రజలు సౌఖ్యమున నోలలాడిరి. పిపీలికములుగూడ క్షేమముగ మనినవి. అశోకుడు ప్రజల కన్న బిడ్డలవలె నాదరించెను. ఈతడు సర్వకాలములయందును ప్రజాక్షేమమునకై కలవరించెను ప్రజాక్షేమమె ఈతని పరమలక్ష్యము అశోకునకు ప్రజలయం దెట్టియనురాగముకలదో ఆరవశిలాశాసనమువలన దెలియుచున్నది. ఈశిలాశాసనమునం దశోకుడిట్లు జెప్పుకొనినాడు:

“ప్రజలమేలుకొరకే నేను వ్యవహరింపవలయును. ఇంక దేనికొరకై నేను శ్రమపడవలయును? నేనింతకంటె జేయవలసినదేమి? నాకు వేరొకతరుణోపాయము లేదు. ఈలోకమున గొందరికైన సౌఖ్యముగలుగజేసి తన్మూలమున వారికి ఉత్తమలోకప్రాప్తి కలుగజేసి జీవకోటికి నాఋణము దీర్చుకొందును.

“ప్రజాక్షేమమును గూర్చుట సుకరముగాదు నాపుత్రపౌత్రపారంపర్యముగ నందరును ప్రజాక్షేమమునకై పాటుబడుచుందురుగాక!”

ప్రజల విన్నపముల సర్వకాలములయందును వినువాడు

కొందరనృపులవలె ఎల్లపుడును సౌధాంతరసీమలందే మెలగుచు, శతాబ్దమునకో సహస్రాబ్దమునకో యొకమారు ఆకాశమార్గమున జూపట్టు ధూమకేతువులవలె వాల్మీకముల నుండి వెలువడు పన్నగములవలె సౌధాంతరాళమునుండి చుటముచూపుగ నెప్పుడో యొకమారు వెలికిరాక అశోకుడు

కోరమాలిన రాచతీపుల విడనాడి సర్వదా తనప్రజలకు దర్శన మిచ్చుచు వారి విన్నపముల నాలకించువాడు రాజద్వారము కడకు వచ్చి ప్రజలు సర్వకాలసర్వావస్థలయందును తమ కష్ట సుఖముల తనతో జెప్పుకొనవచ్చునని యశోకుడు తనప్రజల కనుజ్ఞనొసగెను ప్రజల వ్యవహారముల తానెచ్చోటనున్నను, అంతఃపుర సీమయందున్నను, శయనమందిరమున నున్నను, విహారవనములందున్నను, శకటమునెక్కిపోవుచున్నను, నెర వేర్చుటకు సిద్ధముగ నుంటిననని అశోకుడు ఆరవశిలాశాసన మున ప్రకటించుకొనెను ఈతడెంతటి క్షుద్రునికైనను నీచ జన్మునికైనను దర్శనమిచ్చి యాదరించువాడు. ఆహా! యీ నృపాలుని న్యాయైకదృష్టి!

## ప్రజాసౌకర్యములు — బాటలు.

ప్రజాక్షేమమునకై అశోకుడనేక ధర్మకార్యముల నొన ర్చెను. బీదలకన్న మిడుటకై పెక్కుసత్రముల వేయించెను అర్థిజనుల కెన్నియో దానధర్మముల జేసెను. జాతిమత విచ క్షణలేక సర్వజనుల సమముగ నాదరించెను గృహస్థులకును సన్యాసులకును దానధర్మముల జేయుటకై దానును దనపట్టపు రాణులును ఒసగు ధనముల గొనిపోయి బీదల కిచ్చుటకు ఈచక్రవర్తి ప్రత్యేకయుద్యోగుల నియమించుట జూచితిమి.

ఇదిగాక ప్రయాణసౌకర్యమునకై పెక్కుబాటల నిర్మించి దూరమును దెల్పుటకై అచ్చటచ్చట శిలాస్తంభ ములు బాతించి వానిపై క్రోశములసంఖ్య లిఖింపించెను. పాంథజనులకు నీడనిచ్చుటకై త్రోవపొడుగునను వృక్షముల

బాతించెను. మామిడితోపుల వేయించెను. క్రోశమున కొక బావిత్రవ్వించెను. పిపాసగొన్న మనుజులకును పశుపక్ష్యాది జీవజంతువులకును మంచినీటి నిచ్చుటకై మార్గ మధ్యమున అచ్చటచ్చట చలిపందిళ్లు బెట్టించెను. మార్గా యాసముచే బడలిన బాటసారులు శ్రమ దీర్చుకొనుటకై విశ్రాంతిగృహముల, చావడుల గట్టించెను.

## ఔషధశాలలు

రోగార్తులకు ఔషధము లిచ్చుటకై అశోకుడు తన రాజ్యమందంతటను పెక్కు ఔషధశాలల బెట్టించెను. మను జులకేగాక పశుపక్ష్యాదులకు గూడ ఔషధసేవ లొనర్చు పశువైద్యశాలలగూడ నీతడు నిర్మించెను. ఇట్టి ఔషధాల యముల నీతడు తనసామ్రాజ్యముననే గాక, అన్యదేశము లదుంగూడ కల్పించెను. యవన సింహళరాజ్యములందు అశో కుని ఔషధశాలలుండినట్లు ఆతని ద్వితీయ శిలాశాసనమున జెప్పబడినది. ఔషధముల కుపకరించు ఓషధులు లేనితావులం దశోకుడు ఓషధుల దెప్పించి నాటించెను.

## జంతుసంరక్షణము

అశోకుడు తన ప్రజలకేగాక తన సామ్రాజ్యమునం దలి సకలజీవరాసులకును జలచరములకును క్షేమముగూర్చెను. అశోకుడు భూతదయాళుడు. ఈప్రపంచమున నుద్భవించిన చక్రవర్తులలో నింతటి దయాశీలుడు గానరాడు బౌద్ధమత సారమగు అహింసయె తన పరమధర్మముగ స్వీకరించి తదను

గుణ్యముగ రాజ్యమేలెను. ఈతడు తన సామ్రాజ్యమం దెచ్చటను ప్రాణిహింసలు సల్పరాదని శాసించెను. వినోదములకై మృగములజంపుట కిల్బిషమని మృగయావిహారముల విరమించెను యజ్ఞయాగాది క్రతువులందు మృగవధా బలిదానములు వలదని నిషేధించెను తాను మాంసభక్షణమును మాని, తన సౌధమునగూడ భోజనాదికములకై పశుహత్యల మాన్పించెను. ఇదిగాక అశోకుడు సింహాసనమధిష్టించిన యిరువదియేడవయేట తన రాజ్యమునగల పశు, పక్షి, క్రిమి, కీటకాదుల ప్రాణసంరక్షణార్థమై యీక్రింది యద్భుతశాసనమును గావించెను

"శుకపికశారికాదులు, కపోతములు, బాతులు, గబ్బిలములు, హరిణములు, వృషభములు, ఖడ్గమృగములు, ఉడుతలు, బల్లులు, కూర్మములు, టెంకిచేపలు, ఆడు గండు చీమలు†, ఆడుమేకలు, చూలితోనున్న సూకరములు, పిల్లల పందులు, ఆరునెలలైన నిండని మేకకూనలు, మాంసాహారమున కుపకరింపని చతుష్పాదజంతువులు వీని నెవ్వరును ఏకాలమందును జంపరాదు. జంతువులు సంచరించు అరణ్యములను కీటకాదుల కాశ్రియమొసగు పెంటప్రోవుల*తగులబెట్టరాదు. ఒకజంతువును పోషించుటకై మరియొకజంతువునుజంపరాదు♦

---

† పేర్వృద్ధికై వీనిని గుడ్డు తినెదరట

* కీటకముల జంపుటకై యిండ్లయందును, పొలములందును పెంట కుప్పల తగులబెట్టెదరు.

♦ పావురముల రక్తముతో డేగలను బెంచు క్రూరాచార మిప్పటికిని గొన్నిచోట్ల గలదు

"ప్రతిఋతుపునందలికడపటిమాసమున, పుష్యమాసమున, చతుర్దశి, పూర్ణిమ, పాడ్యమిదినములలో, ఉత్సవదినములందు మత్స్యములబట్టిజంపరాదు, విక్రయింపరాదు. పునర్వసు పుష్య మీనక్షత్రయుక్తదినములందు, పున్నమలయందు, శుక్లపక్షములయందు, హయవృషభముల కాల్పరాదు (ఇనుప కోలతో కాల్చుట)."+

అశోకుడు పరమదయాళుడని, అతని రాజ్యపాలనమున పశుపక్షి క్రిమికీటకాదులు సురక్షితముగ మనినవని జెప్పుటకు వేరునిదర్శన మేమికావలయును? ఇంతకంటె యుత్కృష్టపరిపాలన మెందైన నుండునా? ఈతడు పశువుల యారోగ్యమును గాపాడుటకు పశువైద్యశాలల నిర్మించెనని వ్రాసియుంటిమి

## న్యాయవిచారణ

సర్వ జీవరాసులయెడ నమితమగు కారుణ్యభావముతో మెలగినను అశోకుడు అపరాధులయెడ నిసుమంతయు కనికరము జూపియెరుగడు. దోషుల దండించుటకై గావింపబడిన శిక్షాస్మృతుల కాఠిన్యత నీతడణుమాత్రమేని తొలగింపలేదు. దోషుల నశోకుడు వజ్రసన్నిభ హృదయముతో దండించువాడు అశోకునికాలమున మరణదండనలు లేవని బౌద్ధగ్రంథములలో కలదుగాని దానికి చరిత్రాధారములు గన్పింపవు. అశోకుడు శిరచ్ఛేదములు విధించువాడు ఇట్టి శిక్షలు విధింపబడిన దోషులకు బంధుమిత్రుల జూచుటకును, లోకాంతర

---

+ఐదవ స్తంభశాసనము.

గతుడగుటకు సంసిద్ధుడగుటకును అశోకుడు మూడురోజులు గడువొసంగువాడు. కాని అట్టి ఘోరయపరాధముల జేసిన మనుజులు పశ్చాత్తప్తు లగుదురేని అశోకుడు సాధారణముగ వారిని క్షమించి విడుచువాడు. తన పట్టాభిషేక మహోత్సవ కాలములందు అశోకుడు కారాగృహవాసుల నందరకును స్వేచ్ఛ నొసంగువాడు. ఇట్లు అశోకుడు న్యాయపరిశీలన యందప్రమత్తుడై యుండువాడు. స్వయముగ నేరముల విచారించువాడు. అశోకుని పరిపాలనా ప్రావీణ్య మిందేయున్నది. జీవకోటులయెడ నమితమగు కారుణ్యము జూపుచు అపరాధుల నిర్దాక్షిణ్యముగ దండించువాడు లేనిచో అరాచకము ప్రబలును. ప్రజాక్షేమము కలలోనివార్త యగును. అందుచేతనే యాతని పరిపాలనము కల్లోలములు లేకుండ సాగిపోయినది. దుండగీడులవలన హానిలేక ప్రజలు సుఖించిరి. అశోకుడు ప్రజలను ధర్మపథమున నడిపించుటకు 'శిక్షా స్మృతి నొక యంకుశముగ గైకొనినాడు, ప్రజలస్వాతంత్ర్యముల మంటగలుపుటకుగాదు.

## వినయ సత్యభూతదయలు.

ఈమూడు ధర్మములను అశోకుడువిసువులేకుండప్రజలకుబోధించువాడు తల్లిదండ్రులయెడ నడకువ, గురువుల యెడనమ్రత, జీవకోటులయందు కరుణ, సత్యవాక్యపరిపాలన, వీనినుపదేశించుటకై ధర్మోపదేశకుల నంపువాడు శాసనముల వ్రాయించి ప్రకటించువాడు. ఈధర్మముల నుల్లంఘించువారిని కఠినముగ దండించువాడు దీనివలన అశోకుడు ఎంత

ప్రజాశ్రేయోభిలాషియో విదితమగుచున్నది ప్రజల ధర్మమార్గమున నడిపించుట కాతఁడహోరాత్రములు పరితపించువాఁడు.

## అన్యమత సహనము.

అశోకుడు బౌద్ధమతావలంబుఁడైనను ఆత్మపరభేదములు పాటింపక సర్వమతముల సమదృష్టిని పాలించిన విశాలహృదయుఁడు ఈతఁడు అన్యమతముల పీడించి యెరుగఁడు. పరమత సహిష్ణుత కలిగి యుండవలయునని,అన్యమతముల దూషించుట పాడిగాదని, అన్నిమతములందలి ముఖ్యసిద్ధాంతము లొక్కటియే యని భూతదయాపవిత్రాచరణ లన్నిమతములలోను గలవని అశోకుడు శాసనముల వ్రాయించి ప్రకటించెను. బ్రాహ్మణ, జైనమతముల సమగ్రగ నాదరించెను బ్రాహ్మణ-జైనపరివ్రాజకులకు సమముగ పారితోషికముల నిచ్చెను. అజీవకజైనులకీతఁడు, గుహల దొలిపించి దానమొసగెనని వేరొక సందర్భమున దెల్పియుంటిమి

## అశోకుని కట్టడములు—మౌర్యశిల్పము.

అశోకుని రాజ్యకాలము సుపరిపాలన కెట్లు ప్రఖ్యాతి నొందినదో, శిల్పకళాభివృద్ధికికూడ నట్లే ప్రసిద్ధిగాంచినది. ఆతనికాలమున శాంతి ప్రబలెను. వాణిజ్య మభివృద్ధినొందెను ఆతని రాజ్యవైభవమును జూచుటకు అన్యదేశముల నుండి రాయబారు లేతెంచువారు అట్టికాలము కళాసారస్వతము లభివృద్ధిజెందుట కనువగు కాలము. ఇదిగాక అశో

కుడు కళాపోషకుడు. తనరాజ్యకాలమున రమణీయమగు భవనముల, స్తూపముల, శిలా స్తంభముల, విహారముల నెన్నియో నిర్మించి శిల్పులు తమశిల్పరచనాప్రావీణ్యమును ప్రదర్శించుట కవకాశము గల్పించెను అందుచే, అశోకుని కాలమున శిల్పకళ అపారముగ వృద్ధినొందినది. ఆతని రాజ్యమున అత్యంత నిపుణులగు శిల్పులు వరలిరి. కళాకౌశలమున వీరి మరపించు శిల్పకారులు ఆకాలమున వేతెచ్చటను గానరాకుండిరి. శిల్పజగత్తున కలంకారభూషణములగు స్తూపములు, శిల్పరచనలు, శిలా స్తంభములు, యీతనికాలమున కల్పింపబడినవి.

ఈతని తండ్రితాతలకాలమున గూడ శిల్పకళ కొంత వరకు అభివృద్ధి గాంచకపోలేదు చంద్రగుప్త మౌర్యుని కాలమున మనోహరములగు భవనము లెన్నియో నిర్మింపబడినవి. ఆతనిసౌధముముంగిట పారశీక సౌధములు దివిటీలముందరి దీపములని మెగస్తనీసు వర్ణించినాడు. కాని ఆకాలమునాటి శిల్పరచనలన్నియు దారువులపై జేయబడినట్లు దోచుచున్నది ఆతనికాలమున దారుశిల్పము మిగుల వృద్ధినొంది యుండవలయును. శిల్పులు తమ కళాకౌశలమును దారువులపై ప్రదర్శించియుందురు కాని దౌర్భాగ్యవశమున దారువు అశాశ్వతపదార్థమగుటచే అట్టి శిల్పరచనలు కాలభూతమున కతివేగముగ నశనమై విస్మృతములై పోయినవి.

కాని అశోకునిభవనములు శిలానిర్మితములైనను కాలభూతముయొక్క కరాళదంష్ట్రల జిక్కి వీనికిని ఆగతియే బట్టె

నది. కొన్ని మాత్రము ఆసర్వాపహారుని బాహులతల విద లింపగల్గినవి వినివి బట్టి అశోకుని కాలమునాటి శిల్పకళ యెట్టి వికాసము జెందినదో గోచరించుచున్నది అశోకుని కట్టడము లన్నియు శిలానిర్మితములు. శిలాభవనములు ప్రాచీన భారత వర్షమున గానరావనియు, శిలాభవననిర్మాణరీతులు అశోకుని కాలముననే ప్రారంభమైనవనియును కొందరు కళాపరిశోధ కులు నుడివియున్నారు కాని యీయూహల కాధారములు గాన్పింపవు రామాయణమహాభారతములలో శిలాభవనములు జేర్కొనబడినవి ఇదిగాక యిదివరకెన్నడును లేని శాశిశిల్పము ఒక్కపెట్టున గారడీవలె అశోకునికాలమున ప్రారంభమై అట్టి పరిపూర్ణత నెట్లు గాంచగల్గును? అంతకు పూర్వమునుండియు శిలాభవన నిర్మాణపద్ధతులు భారతీయుల కలవడియుండవలెను.

అశోకునిచే కల్పింపబడిన కట్టడములలో భవనములు, స్తూపములు, శిలాస్తంభములు, చైత్యములు, విహారములు పేర్కొనదగినవి

## భవనములు

అశోకునిచే నిర్మింపబడిన భవనము లన్నియు అతి విశాలములై, అత్యంత రమణీయముగ నున్నవని ఫాహి యాను వర్ణించియున్నాడు. అతని రాజసౌధముల జూచి యివి మనుజ నిర్మితము లాయని యీ బాటసారి ఆశ్చర్య మొందినాడు కాని యీతని కట్టడము లన్నియు నేడు కాలవాహినిలో గలిసిపోయినవి హ్యూయనిత్సాంగు దర్శించిన కాలము నాటికే పాటలీ పుత్రము పాడువడిపోయినది.

అందలి రాజభవనములు, ప్రాకారములు, బురుజులు, పవిత్రదేవాలయములు అన్నియు గంగా శోణనదులలో బూడుకొని పోయినవి. అందుచే అశోకునిచే విలాసార్థముగ గట్టింపబడిన భవన మొక్కటియు నేడు గానరాదు. అదృష్ట వశమున నాతనిచే నిర్మింపబడిన స్తూపములును శిలాస్తంభ ములు మాత్రము కాలగర్భమున మణగిపోవక అచ్చటచ్చట కొన్ని నిలిచినవి. వీనినిర్మాణ కౌశలమును గూర్చియు, అందు ప్రదర్శింపబడిన శిల్పకళా ప్రావీణ్యమును గూర్చియు యిచ్చట గొంచెము ప్రస్తావించి విడచెదను.

## అశోకుని స్తూపములు

స్తూపములనునవి బౌద్ధయుగమున నిర్మింపబడిన యొక విధమగు విచిత్ర కట్టడములు ఇవి బుద్ధునిజన్మ, తపోనిష్ఠ నిర్వాణాదికములచే పవిత్రీభూతములైన బౌద్ధ పుణ్యక్షేత్ర ముల సూచించుటకై గట్టబడిన, ఘంటాకృతిగనుండు బ్రహ్మాం డములగు రాతికట్టడములు ఇట్టివి బుద్ధుని దండకమండలాస్థి కలుమున్నగు పవిత్రవస్తుచయముల నుంచుటకైగూడ తొలుత గట్టబడినవి ఈస్తూపములు విశాలములగు కైవారములుగల్గి అత్యున్నతములై మేఘమండలము నొరయుచుండును. ఇవి అర్థగోళాకారముగ యిటుకరాలతో నిర్మింపబడి ఉపరిభాగ మంతయు శిల్పిత శిలతో గప్పబడును. స్తూపఅధో శిరోభాగ ములు అత్యంత మనోహరములగు శిల్పపుబనులతో నలరు చుండును. స్తూపము జుట్టును బుద్ధభక్తులు ప్రదక్షిణము లొనర్చుటకు తావుంచి వలయాకారముగ ప్రాకారములు

నిర్మించుదురు. ప్రాకారమునకు నాల్గుమూలలను నాలుగు తోరణద్వారము లుండును. ఈతోరణద్వారములు నిరుప మానశిల్పరచనలతో కనులపండువ సేయుచుండును.

ఇట్టి స్తూపములను అశోకుడు తనవిశాలసామ్రాజ్య మందంతటను, అశేష ధనరాసులు వోసి వేనవేలు నిర్మిం చెను కాశ్మీర, కళింగ, ద్రావిడ, ఆంధ్ర దేశములలో నీతడు స్తూపములు గట్టించెను కంచి, వెంగీపట్టణములలో నతవి స్తూపములున్నవి. ఆఫ్ఘనిస్థానమున నీతడు మూడుస్తూపముల నిర్మించెను. అవి 'కాపిశ', 'నగరాహార' పట్టణములందున్నవి. అందు నగరాహారమునందలి స్తూపము మూడువందల యడు గుల యెత్తున నున్నదని యూనిత్సాంగు వర్ణించినాడు. దీనిని శిలలదొలిచి అనేక చిత్రరేఖలతో నిర్మించిరట. ఇంతియగాక ఈతడు సింహళ ద్వీపములోగూడ మహోన్నతము లగు స్తూపముల గట్టించెను అందొకటి నాలుగువందల యడుగుల యెత్తున నుండెనట! కాని అశోకునిచే గట్టింపబడిన స్తూపము లన్నియు నిప్పుడుశిథిలమై పోయినవి సాంచి బార్హూతుకడ నుండు స్తూపములు మాత్రము ఎట్లో నిలిచినవి.

## సాంచిస్తూపము

అందు సాంచిస్తూపము జగద్విఖ్యాతమైనది ఇది భారతశిల్పకళావైభవమును వేనోళ్ళ జాటుచున్నది ఆర్యా వర్తమున నిర్మింపబడిన స్తూపావళులలో సౌందర్యమున దీని మఱపించు స్తూపములేదు దీనిని స్తూపరాజమని నుడి విన నుడువవచ్చును. సాంచిపట్టణమున నిర్మింప బడిన

దగుటచే దీనికీ నామము కల్గినది. తొలుత నీపట్టణము నకు చైత్యగిరి యని పేరు సాంచి పట్టణము మధ్య భారతములోని భోపాలురాజ్యములో నున్నది. ఈపట్టణ మునకు చుట్టును అనేకకొండలు గలవు. వాని యగ్రిభాగ మున పెక్కుస్తూపములు నిర్మింపబడినవి. అట్టి స్తూపములు పదనొకండువరకును కనుగొనబడినవి. ఈస్తూపశిథిలములు త్రివ్వుచుండగా గౌతముని ప్రిధానశిష్యులగు మౌద్గల్యాయన సారిపుత్రిల యస్థిశకలములు గన్పించినవి సాంచిపరిసరముల నిర్మింపబడినస్తూపము లన్నిటిలోన సాంచికడనుండు స్తూపమె మిగుల పెద్దది ప్రిఖ్యాతమైనది. దీని నశోకుడు హిమవత్ప ర్వతప్రాంతములందు బౌద్ధమతమును వ్యాపింపజేసిన మధ్యమ కాశ్యపగోత్రిల జ్ఞాపకార్థమై గట్టించెను. వీరి యస్థికల పేటి కలు యీస్తూపాంతరాళమున యిటీవలనే కనుగొనబడినవి.

సాంచిస్తూపము యేబదియారడుగుల యున్నతియు, నూటయిరువదియారడుగుల కైవారమును గల్గిన మహాస్తూ పము దీని యుపరిభాగమంతయు స్నిగ్ధమై శిల్పరచనలతో నలరారు పలకరాలతో గప్పబడినది స్తూపమునకు జుట్టును వలయాకారముగ 140 యడుగుల కైవారము గల్గిన శిలా నిర్మితమగు కంచెయొకటి గలదు ఈకంచె దూరదూరముగ చుట్టును నిర్మింపబడిన పెక్కు శిలాస్తంభములపై నమరి యున్నది కంచెకు నాలుగువైపులను నాలుగు తోరణద్వార ములున్నవి వీనిపై యద్వితీయ శిల్పకళాకౌశలముతో బుద్ధుని జీవితాంశములు, జాతకపురాణకథలు చిత్రింపబడినవి ఈశక

తోరణద్వారమున వెస్సంతరజాతకము సవిస్తరముగ వర్ణింపబడినది ఇవిగాక బుద్ధుని అస్థికలకొరకై గావింపబడిన ఘోరసంగ్రామములు, ముట్టడులు, దండయాత్రలు, కొన్నిచోట్లనతి గంభీరముగ జెక్కబడినవి కొన్నితావులందు విషయాసక్తులగు కాముకులు, విలాసికులు మోహపరవశులై నృత్యగానములు సల్పుచున్నట్లు అత్యంతమనోజ్ఞముగ చిత్రింపబడినవి. ఈప్రతిమల వదనసీమలందు, సింగారము యౌవనోల్లాసము చిందులాడుచున్నది. మోహవాహిని తరంగితమగుచున్నది. ఈస్తూపము అశోకునిచే నిర్మింపబడినను, తోరణద్వారములు క్రీ శ. ప్రథమశతాబ్దమున నిర్మింపబడినట్లు గాన్పించుచున్నది

## బారహాటుస్తూపము

ఈస్తూపము ప్రయాగ జబ్బలపురముల మధ్యనున్న భాగల్‌ఖండు జిల్లాలోని బార్హాతుగ్రామముకడ నున్నది. ఇది ఆకారమున సాంచిస్తూపమును బోలియుండును దానియంత రమణీయముగ నున్నది. దీనికి ఆవరణగా నిర్మింపబడిన రాతి కంచె చాలవరకు శిధిలమై పోయినది. భాగ్యవశమున సగభాగము మాత్రము నిలిచినది తొలుత నీకంచె కైవారము 75 అడుగులుండెడిది దీనికి నాలుగువైపులను నాలుగుతోరణద్వారములున్నవి. వీనిపై గజ, సింహ, మకరోత్సవములు జిత్రింపబడినవి ఇవిగాక, గజ, హరిణ, మర్కట ప్రతిమలు జీవకళలుట్టిపడునట్లు జెక్కబడినవి ఇంతమనోహరముగ జిత్రింపబడిన విగ్రహములు ప్రపంచమున వేరెచ్చటను గానరావని

ఫెర్గూసను అనుపాశ్చాత్య శిల్పకళాభిజ్ఞుడు వ్రాసియున్నాడు. ఇచ్చట గానవగు వృక్షములు లతలు, అత్యంత లలితముగ నున్నవి. మనుష్యవిగ్రహములు ప్రాంకముదీరి, అవయవ సౌష్ఠవము గలిగి భావగర్భితములై మురిపెముగొలుపుచున్నవి. జనసమూహములు అత్యంత లాఘవముతో మిగుల సున్నిత ముగ చిత్రింపబడినవి.

ఈస్తూప ఉపరిభాగమంతయు గచ్చుచేయబడిమున్నూ లలుగల్గిన వంపలకొలది గూళ్ళతోనిండియున్నది ఉత్సవ దినములలో ఈగూళ్ళలో దీపములుంచువారు. ఆదినములలో యీ గూళ్ళన్నిటియందును, దీపములువెట్టి పుష్పహారము లతో నికేతనములతో సిని యలంకరింపబడినప్పుడు ఈస్తూ పమెంత కనులపండువుగ నుండెడిదో భావాతీతము!

ఈతడు కట్టించిన స్తూపము లంతరించిపోయినను వాని చుట్టును నిర్మింపబడిన కంచెల శిథిలము లచ్చటచ్చట చెదరి పడియున్నవి. ఇట్టి శకలములు పాట్నా, గయా, విదిశా నగరములయందు బెక్కులు గాన్పించును ఇవి యన్నియు మౌర్యులకాలమునాటి అద్వితీయ శిల్పరచనలతో నిండి యున్నవి.

## అశోకుని శిలాస్తంభములు

అశోకుని స్తూపములకంటెను అద్భుతనిర్మాణకౌశ లమును ప్రదర్శించునవి ఆతని శిలాస్తంభములు శిలాస్తంభ ములలో ప్రదర్శింపబడిన నిర్మాణ చాతుర్యము, శిల్పరచనా



అశోకుని స్తంభము, అలహాబాదు. (౧౭౮ పుట.)



సముద్రగుప్తు డశ్వమేధము చేసినప్పుడు వేయించిన నాణెము

(౨౭౨ పుట )

వైదగ్ధ్యము వర్ణనాతీతములు. పూర్వకాలమున రాజులు, తమకు గల్గిన సమరవిజయములు తాము సల్పిన దిగ్విజయయాత్రల సూచించుటకై దిగ్జయ స్తంభములు నిల్పెడివారు. కాని అశోకుని స్తంభములన్నియు ధర్మప్రతిష్ఠాపనకై బౌద్ధమతవ్యాపనకై నిర్మింపబడినవి. అశోకుడు వీనిపై శిలాలేఖనములు వ్రాయించి ప్రకటించెను ఏకశిలా స్తంభముల నిర్మించుటయం దశోకుని కత్యంతమగుప్రీతి. అశోకుడు తన రాజ్యకాలమున నిట్టి స్తంభముల తొమ్మిదింటిని జెక్కించెను వీనిలో కొన్ని జీర్ణమైపోయినవి. కొన్ని బాగుగనున్నవి ఈతొమ్మిదింటిని అశోకుడు సార్నాదు, తోప్రా, మీరటు, ప్రయాగ, లౌరి యానందనగృహము, రాంపర్వా, సాంచి, నిగ్లివియా, రుమ్మిందె అను ప్రదేశములలో ఎత్తించెను. ఇవియన్నియు అత్యంత దీర్ఘములై శిల్పరచనలతో ముద్దులుమూటగట్టుచున్నవి. వీనిలో నలువదియైదడుగుల పొడవుగల స్తంభములుగూడ గలవు. స్తంభోపరిభాగమునందు త్రాళ్లు, లతలు, పుష్పములు, పళ్లెరములు, హారములు మనోహరముగ చిత్రింపబడినవి. వీని యగ్రభాగమున సహస్రకమలములు పీఠములుగ నమర్చబడి వానిపై సింహ, గజ, మనుష్య విగ్రహము లతి గంభీరముగ జెక్కబడినవి ఈ స్తంభములబోలు స్తంభములు ప్రపంచమున వేరెచ్చటను లేవని మార్షలు అను పాశ్చాత్య చరిత్రకారుడు నుడివియున్నాడు వీనిలో కొన్ని స్తంభములు అద్దములవలె నునుపు చేయబడి తళతళ మెరయుచున్నవి ఈ స్తంభముల కనుకూలములగు రాలను అశోకుడు వందలకొలది మైళ్ళదూరమునుండి తెప్పించువాడు. ఈ బ్రహ్మాండ శిలల

యొక్క స్థౌల్యమును వానిపై ప్రదర్శింపబడిన శిల్పశృంగారమును జూచిన అశోకునికాలమందలి శిల్పుల, శిలల జెక్కువారల కౌశలము, రచనాశక్తి, ఉపాయము నిరుపమానమని గోచరించును.

## సార్నాదు శిలాస్తంభము

ఇది అన్నిటిలోన నుత్కృష్టమైనది. ఈశిలాస్తంభమిప్పుడు ఖిలమై పోయినను దీనిపై చిత్రింపబడిన సింహవిగ్రహములు మాత్రము నేటికిని నిలిచియున్నవి. ఇవి పొంకముదీరి, అత్యంత సుందరముగ నున్నవి నోళ్లు తెఱచుకొని వీని భంగిమము లతి గంభీరముగనున్నవి ఇంతయందమగు విగ్రహములు పృథ్వీతలమునలేవు. వీనిని జూచుటకు, పాశ్చాత్యులు తీర్థప్రజలవలె వచ్చుచుందురు. వీనికి పీఠముగ నమర్పబడిన సహస్రకమలము గూడ నత్యంత మృదులముగనున్నది.

## తోపా్రి స్తంభము.

ఈ స్తంభము అశోకునిచే 'తోపా్రి' యను గ్రామమున నిర్మింపబడినది. దీనిని జూచి ఆనందపరవశుఁడై ఫిరోజిషా తోగ్లకు క్రీ॥ శ॥ 1356 సంవత్సరమున దీనిని తోపా్రినుండి ఢిల్లీకి గొనిపోయి యచ్చట బాతించెను ఈ మహమ్మదీయ చరిత్రకారి దీనిని గొనిపోయిన విధమును జూచిన యిది యెంతటి భారమగు స్తంభమో తెలియగలదు ఫిరోజిషా దానిని మోసికొనిపోవుటకు నలుబదిరెండు చక్రములుగల్గిన యొక మహాశకటము నాయత్తమొనర్చెనట. అనేకమంది జనులు బట్టి ఆ స్తంభము నతికష్టముపై నీబండమీఁద నెక్కించి

రట. స్తంభమున కపాయము గలుగకుండ దానికి రెల్లును చర్మములును జుట్టిరట. ఈశకటము రెండువందలమంది లాగి ఎట్లో కష్టముమీాఁద యమునానదీతీరమునకు జేర్చిరట. ఆచ్చట ఫిరోజిషా, ఏడువేలమణుగుల బరువుమోయగల నావల సిద్ధముజేసి స్తంభమును యమునానదిని దాటించి ఢిల్లీకి గొని పోయెనట!

ఈ స్తంభము ఢిల్లీనగరమున నిప్పటికిని కనుఁబండువుగ గనబడుచుండును. ఇది అద్దమువలె నునుపుజేయబడి మెరుగు లీనుచున్నది. కొందరు దీనిజూచి ఇనుపస్తంభమని భ్రమ పడిరి. ఏడవశతాబ్దమున నీస్తంభమును దర్శించిన 'టామ్‌కోరి యటు' అను నాతడు దీనిని ఇత్తడిస్తంభమని వర్ణించినాడు. పందొమ్మిదవ శతాబ్దమున హిందూదేశమును దర్శించిన బిషపు హెబరు దీనిని పోతబోసిన ఉక్కుస్తంభమని వ్రాసి నాడు. అశోకునికాలమునాటి శిల్పుల నిర్మాణకౌశలము, అద్వితీయముగదా! పందొమ్మిదవ శతాబ్దమునాఁటి ఆంగ్లేయుల గూడ కనుమెరపింపగల్గినది

లారియా శిలాస్తంభము

నలుబది యడుగుల నిడివిగలది ఇదియు మిగుల నునుపుగ నుండును దీనిశిఖరమున వర్తులాకారముగ నుండు పీఠమొకటి యమర్పబడినది దీనియంచున రెండుబాతులాహార మేరుకొని తినునట్లు శృంగారముగ జెక్కబడినవి. ఈపీఠ ముపై ఆరడుగుల యెత్తుగల్గిన సింహావిగ్రహముగలదు.

## రాంపర్వా స్తంభము

ఇది లారియా స్తంభమునకు ప్రతిగానున్నది. రాగిరేకు పీపాయాకారముగ జేయబడి దీనియగ్రభాగమున నమర్చబడి నది. ఈపీపా రాతి శిఖరమునకును రాతిస్తంభమునకును సిమెంటుతో నవసరములేకుండ తూచినట్లతికింప బడినది. నిగ్లివియా రుమ్మిందీ స్తంభములు అశోకుడు తీర్థయాత్రలు వెడలి నపుడు గురుతుగ నిర్మించిన స్తంభములు నేడివి నామమాత్రావశిష్టములై యున్నవి. అందు రుమ్మిందీ స్తంభము నేపాళములోని లంబినీ వనప్రాంతమున నున్నది. ఇది పిడుగు పడి చీలిపోయినది. దీని యగ్రభాగము జెక్కబడిన సింహ విగ్రహము నేల పొర్లాడుచున్నది.

## సాంచీ శిలా స్తంభములు

సాంచిస్తూపపరిసరములందు ఉత్తరద్వారముకడనొకటి యు, దక్షిణద్వారముకడనొకటియు. రెండు శిలాస్తంభము లున్నవి ఇవి రెండును నునుపుదేలి నిగనిగల జిమ్ముచున్నవి. ఇందు ఉత్తరద్వారముకడ నుండునది నలుబదియైదడుగుల యెత్తుగల బ్రహ్మాండమగు స్తంభము. దీనియగ్రభాగమున నొకఋషి నిలిచియున్నట్లు ఒక శిలావిగ్రహము ముద్దులొలుకునట్లు చెక్కబడినది. భారతశిల్పకళాప్రావీణ్యమును ప్రదర్శించు విగ్రహములలో నిదియొకటి. సాంచికి దక్షిణద్వారముకడనుండు స్తంభము ఇంతకంటెచిన్నది. దానినిడివి నలువది రెండడుగులుమాత్రమేయుండును.

## బౌద్ధమఠములు

*అశోకుడు స్తూపములను, శిలాస్తంభములనేగాక పెక్కు బౌద్ధమఠములనుకూడ గట్టించెను. ఇవి బౌద్ధసన్యాసులు నివసించుటకై నిర్మింపబడిన మందిరములు. వీనికే విహారము లనికూడ పేరు. ఇవి కొన్ని పర్వతగుహాలలో దొలిపింపబడి నవి. కొన్ని మైదానములలో నిర్మింపబడినవి. అశోకునిచే మైదానములలో గట్టబడిన మఠములన్నియు విస్మృతములై పోయినవి. గుహాలలో దొలిచినవి మాత్రము నిలిచినవి. కాని ఇవి యంత విరివిగ లేవు ఉన్నవయినను అంతరమణీయముగ లేవు. మోటుగను ఒక మనుజుడు మాత్రము నివసింపగలుగు నంత చిన్నవిగ నున్నవి. అశోకునికాలమున నిర్మింపబడిన గుహాలు ఒరిస్సాప్రాంతమున విశేషముగ గలవు. అచ్చట ఉదయగిరి ఖండగిరి పర్వతావళులలో నివి దొలువబడినవి.

అజీవకజైనుల నివాసార్థమై బరాబరు పర్వతములలో నిర్మింపబడిన గుహాలు ప్రత్యేకముగ జెప్పదగినవి ఇవి యంతవిశాలమైనవి కాకపోయినను వీనికుడ్యములు అద్దముల వలె నునుపుజేయబడి మెరుగులీనుచున్నవి మోములుగూడ వీనిలో ప్రతిబింబించునంత స్నిగ్ధముగనున్నవి

ఇవిగాక అశోకుడు మహాపట్టణములగూడ నిర్మించెను. ఈతడు నేపాళమునగట్టించిన లలితపట్టణముమాట నుడివి తిమి కాశ్మీరమందలి శ్రీనగరమునుగూడ యీతడే గట్టించెనని ప్రతీతి అశోకునిచే కతియవారు ద్వీపకల్పమున కధిపతిగా నియ

మింపబడిన ప్రాంతపాలకు డోకడు గిరినారుమడుగునుండి యొకకాలువ త్రవ్వించెనని రుద్రదాముని శాసనము జెప్పుచున్నది.

అశోకునికాలమునాటి శిల్పుల చాతుర్యము

అశోకుని కాలమునాటి శిల్పులచాతుర్యము అమోఘమైనది. వీరు నిర్మించిన స్తంభములు, కట్టినస్తూపములు, చెక్కిన విగ్రహములు, కల్పించినభవనములు ప్రపంచవిఖ్యాతిని బడసినవి స్తంభముల నునుపుజేయుటలో వీరికి నిరుపమాన ప్రావీణ్యముగలదు వీరు నల్లరాతిని అద్దమును మరపించునట్లు మెరుగుపెట్టగలరు. అట్టిచాతుర్యము లోకమున వేరెచ్చటను గానరాదని పాశ్చాత్యులే ప్రశంసించినారు. తోప్రాలారియా స్తంభములమాట నుడివితిమి

ప్రతిమాశిల్పములోగూడ వీరు అసమానప్రవీణులు. వీరిచే చిత్రింపబడిన సింహ, గజ, మనుజ విగ్రహములు, అత్యంతమనోహరములైనవి. జీవకళ లుట్టిపడునట్లు జెక్కుటలో వీరికెనవచ్చువారు లేరు సారనాదు స్తంభోపరిభాగమున చిత్రింపబడిన సింహవిగ్రహములలో ప్రదర్శింపబడిన శిల్పవిన్నాణమును వర్ణించితిమి. గజవిగ్రహముల జిత్రించుటయందు వీరికౌశలము అప్రతిమానము. గజవిగ్రహముల జెక్కుటలో భారతవర్ష మనాదినుండియు ప్రఖ్యాతివడసినది అశోకుని కాలమున జిత్రింపబడిన గజవిగ్రహమొకటి నేటికిని ఒరిస్సాప్రాంతములోని ధౌలికొండయం దున్నది. నాటిశిల్పులీ

కొండనే గజాకారముగ జెక్కిరి. ఈప్రతిమ మిగుల రమణీయముగ నుండును.

మూర్తిశిల్పమునందుగూడ యీకాలమునాటి శిల్పు లేరికిని దీసిపోరు. దౌర్భాగ్యవశమున ఈకాలమునాటి మనుష్యవిగ్రహములన్నియు కాలవాహినిలో గలిసిపోయి నవి. నాటి శిల్పులప్రావీణ్యమును లోకమునకు చిరస్మరణీయము జేయుటకో యనునట్లు, ఒకటిరెండు విగ్రహములు మాత్రము నిల్చినవి. అందొకటి సాంచికడనుండు స్తంభశిఖరమున జెక్కబడిన ఋషివిగ్రహము. ఇంకొకటి మధుర, ఆగ్రానగరముల మధ్యనుండు పరఖాముగ్రామమున దొరికినది. ఇది బూడిదవర్ణము గల్గినరాతితో జెక్కబడినది. నునుపుదేరియున్నది. దీనిచేతులు విరిగిపోయినవి. ముఖాకృతిగూడ చెడిపోయినది దీనిలో గనుబరుపబడిన దుస్తుల వైఖరి వింతగనున్నది. ఒకవదులువొక్కాయయు, నడుముచుట్టును నొకపట్టీయును ఇందు చిత్రింపబడినవి. విదిశాగ్రామ సమీపమున గాన్పించిన స్త్రీవిగ్రహముగూడ యద్భుతముగ నున్నది ఈకాలమున జెక్కబడిన స్త్రీవిగ్రహములలో నిదియొ మనకు గాన్పించినది. ఇది కడు మనోజ్ఞముగ నున్నది.

శిలాలేఖనమునగూడ, ఈకాలమునాటి శిల్పులు మిగుల చాతుర్యమును గడించిరి. అశోకుని శిలాశాసనములే వీరి యప్రతిమాన శిలాలేఖనానైపుణ్యమును వెల్లడించుచున్నవి. అంచలి అక్షరములు పొంకముదీరి అందముగ నున్నవి.

ఈకాలమునాటి శిల్పచిత్రములలో అప్పటి సాంఘికజీవనము ప్రతిబింబితమై యున్నది. అప్పటి స్త్రీపురుషులు ధరించిన దుస్తులు, ఆభరణములు, వార లుపయోగించిన గృహోపకరణములు, యుద్ధపరికరములు, కత్తులు, కఠారులు, బల్లెములు, జీనులు, తనుత్రాణములు అన్నియు నీశిల్పచిత్రములలో వర్ణింపబడినవి. ఇవికూడ ఆకాలమునాటి చరిత్ర నిర్మాణమున కత్యంతోపయుక్తములైనవి

అశోకుని కాలమున పెంపొందిన యితరకళలు.

ఈతనికాలమునాటి శిల్పరచనల జూచిన యీకాలమున నొక్క శిల్పవిద్యయేగాక, దారు, స్వర్ణలోహవిద్యలు గూడ పెంపొందినవని విదితమగును. ఈకాలమున దారువులపై అత్యంతసున్నితముగ, లతలు, పుష్పములు, విగ్రహములు, పల్లేరములు చెక్కబడెడివి. కాని నిదర్శనములు కాలగర్భమున మణగిపోయినవి. దారునిర్మిత విశాలభవనములు గంగపాలయినవి. ఈకాలమునాటి వడ్రంగుల బుద్ధివైభవ మపారము. అప్పటి స్వర్ణకారుల కౌశలముగూడ ప్రశంసనీయమైనది. వారలచే చేయబడిన పూసలు, స్వర్ణాభరణములు, నాణెములు కొన్ని తక్షశిలాప్రాంతమున త్రవ్వుచుండగ గన్పించినవి. అత్యంత సుందరముగ నున్నవి

ఈ కాలమున చిత్రవిద్యగూడ నభివృద్ధిగాంచినట్లు గ్రంథములవలన దేలుచున్నదిగాని అప్పటిచిత్తరువు లేవియు మనకు లభించుటలేదు. ఇప్పుడు ప్రారంభమై యాకళ గుప్తరాజులకాలమునాటికి పరిపూర్ణత గాంచినట్లు కన్పట్టుచున్నది.

అశోకునికాలమున నిటు కళలన్నియు అద్భుతముగ వెంపొందినవి. అతనికాలమున అత్యంత నిపుణులగు శిల్పులు చిత్రకారు లుద్భవిల్లి జగద్విఖ్యాతమగు శిల్పరచనలను కట్టడములను కల్పించిరి. అశోకుడుఅత్యంత జాగరూకతతో అశేషధనరాసుల ధారవోసి ఇతరదేశములనుండి శిల్పకారులరావించి యిట్టికళల, పరిశ్రమల పోషించెను. ఈ మహామహుని పరిపాలనము మహాత్తరమైనదిగదా!

## విద్యావ్యాప్తి

అశోకుని సామ్రాజ్యమందలి ప్రజలందరువిద్య నేర్చిన వారై యుండవలెను ప్రజలు చదువనేరని నిరక్షరులైయుండిన యెడల అశోకుడు అశేష ధనములు వెచ్చించి అన్ని శిలాశాసనముల వేయించియుండడు. చదువుకొనలేని జనులకు శాసనములేల? బ్రాహ్మి, ఖరోష్ఠి లిపులలో వందల కొలది శాసనముల వ్రాయించి అశోకుడు జనసమ్మర్దములగు ప్రదేశములలో బెట్టించెను. దీనినిబట్టి అతని రాజ్యమందలి జనులందరును చదువనేర్చినవారుగా నుండిరనుట నిర్వివాదాంశము. ఆతని సామ్రాజ్యమున విద్య విశేషముగ వ్యాప్తి నొందియుండవలెను నేటికంటె అశోకునికాలమున అక్షరజ్ఞులెక్కువ గలరని రూఢిగ జెప్పగలము. ఆతని సామ్రాజ్యమున పెక్కుభాషలు, పెక్కులిపులు వెంపొందినవి ఆకాలమున బౌద్ధమఠములు పాఠశాలలుగ నుపకరించినవి. ప్రతిబౌద్ధమఠమును ఒక్కొక్క పాఠశాలగ నుండెను అందందునివసించు భిక్షుకులు ప్రజలలోవిద్యావ్యాపకము జేసిరి

## సారస్వతాభివృద్ధి

అశోకుని కాలమున పాలీసారస్వతము విరివిగ నభివృద్ధి నొందినది ఆతని శాసనముల జదివిన, పాలీసారస్వతము మహోత్కృష్టదశయం దుండవలెనని గోచరింపక మానదు. అందలి భాష, భావగాంభీర్యమున, పదసౌష్ఠవమున, ఉపనిషత్తులలోనిభాషను, బురుడించుచున్నది. ఈశాసనములన్నియు అశోకచక్రవర్తియే వ్రాసినట్లు గన్పించుచున్నది. అట్లయినచో ఆత డద్వితీయ విద్యాప్రవీణుడై యుండవలెను చంద్రగుప్తుని మంత్రియగు చాణిక్యునిచే వ్రాయబడిన 'చాణక్య శతక'మను గ్రంథమును అశోకుడు వెలికిదీసి తనరాజ్యకాలమున దాని ప్రచురించెనని ప్రతీతి. 'కథావత్తు' అను పాలీ గ్రంథముగూడ యీతనికాలముననే రచియింపబడినదని కొందరు చరిత్రకారు లూహించుచున్నారు. నిక్కవముగ మౌర్యరాజులకాలమున మహోద్గ్రంథములు రచియింపబడి యుండవలెను. అంతటి విశాలసామ్రాజ్యము నేలిన చక్రవర్తుల యాస్థానమున అంతటి జగద్విఖ్యాతమగు శిల్పచిత్రముల కల్పించిన శిల్పకారులు, వరలినకాలమున, కవులు, గ్రంథకర్త లుండకుందురా? అఖండ ప్రతిభాశాలురగు కవిశిఖామణులు, గ్రంథకర్తలు, వారియాస్థానముల నలంకరించియుండవలెను వారిచే రచియింపబడిన కావ్యములు, గ్రంథములు కాలవాహిని మ్రింగియుండవలెను.

## అశోకుని గుణశీలములు

అశోకుడు ధర్మజిజ్ఞాసువు. సాధుశీలుడు. అహింసావ్రతదీక్షాపరుడు. కారుణ్యహృదయుడు. ప్రజాశ్రేయోభిలాషి.

దుర్భరరాజ్యపరిపాలనచే ప్రజలపీడించి వారలు కష్టము లనుభవించుచుండ తాను రాజసౌధమున భోగలాలసుడై కులుకు రాజనామమాత్రధారియగు రక్కసిగాడు జనులతనకన్న బిడ్డలవలె జూచుకొనిన ప్రభువతంసము. సర్వదా వారికష్టసుఖముల విచారించుచు అహోరాత్రముల ప్రజాక్షేమమునకై పాటుపడిన దయాళుడు. ప్రజల ధర్మపథమున నడిపించుటకు తన జీవితమంతయు ధారవోసిన మహాత్యాగి. అతని కారుణ్యభావము కళింగరణరంగమును జూచి యాతడు పడినసంతాపమున, ప్రాణిపశుసంరక్షణమునకై యతడుగావించినశాసనములయందు అతడు అడవిజాతులను పరిపాలించిన పరిపాలనావిధానమునందు ప్రదర్శితమగుచున్నది. "పరులెట్టి యపకారమొనర్చినను యాప్రియదర్శినృపాలుడు సహనముదాల్చునేగాని ప్రతీకారము చేయనొల్లడు" అని ప్రకటించుకొనగల్గిన యీతని క్షమాశీలము శ్లాఘనీయము. ఖడ్గమును ముట్టకయె నలువదిదీర్ఘవర్షములు నిరపాయముగా నెట్టికలోలములును జనింపకుండ తనవిశాల సామ్రాజ్యమును పరిపాలింపగల్గిన ప్రతిభాశాలి యీతడు. అద్వితీయపరిపాలనాకౌశలము గలవాడు. తన పరిపాలన కాలమున కళలు పరిశ్రమలు నవిచ్ఛిన్నముగ బోషించి పెంపొందజేసిన రసజ్ఞుడు. తన భాండారమునందలి ధనరాసులనెల్ల ధర్మకార్యములకై, బ్రాహ్మణ జైన బౌద్ధపరివ్రాజకులపోషణకై ధారవోసిన దానశీలుడు.

## అశోకుని యవసానము

అశోకుడు నలువదిదీర్ఘవత్సరము లఖండవైభవముగ రాజ్యపాలనమొనర్చి క్రీ. పూ. 231 సంవత్సరమున దివికేగెను.

ఈభూవలయమున నుద్భవిల్లినమహాచక్రవర్తులలో నీతడగ్రగణ్యుఁ డని నుడువవచ్చును. ఈ ప్రపంచచారిత్రమందిట్టి ధర్మపద్ధతులపై రాజ్యమేలిన చక్రవర్తి గాన్పింపదు. ఎంతటి ధర్మచింత! ఎంతటి భూతదయ! దీనరక్షణ! ఎంతటి న్యాయైకదృష్టి! ఎంతపరమతసహనము! ఎంతగాఢమతాభిమానము! ఎంతప్రజానురాగము! ఎంతటి విద్యాపోషణాభిలాష! ప్రపంచమున నన్ని రాజ్యములలో బౌద్ధమతమును వ్యాపింపజేసి జగద్విఖ్యాతమగు శిల్పచిత్రములగల్పింపజేసిన యీతనినిర్మాణకౌశల ప్రతిభావిశేషము లద్వితీయములు. రెండువేలేండ్లక్రిందట రాజ్యమేలినను, యీతని నామము నేటికిని క్రొత్తగనే ప్రతిధ్వనించుచుండును. ఈతని పేరువినిన పులకలుజనించును. అశోకునినామము వేదమంత్రమై పోయినది. భారతఖండమున నేగాక ఈతడు లోకమంతకును చిరస్మరణీయుడయ్యెను.

అశోకుని వార్ధక్యమున కొన్ని గృహచ్ఛిద్రములు సంఘటిల్లినట్లు గన్పించుచున్నది. ఆతనికి జరాభారమంకురించినంతనే ఆతని సతీమణి పరమసాధ్వి అసంధిమిత్ర యాతనివిడచి యిహలోకమును బాసిపోయెను. అశోకుడు మరల తిష్యరక్షిత యను నొక నవలావణ్యరాసి యగు జవ్వనిని పెండ్లియాడెను ఈపరిణయ మాతని ముసలితనమున సంతాపమునకు కారణమయ్యెను. ఈమెనుగూర్చి యొకవింతకథ గలదు తిష్యరక్షితకు వయోరూపలావణ్యములకు దగిన సుగుణసంపద లేదు ఆమె భోగలాలస, ధూర్త, గర్వితమతి ఆమె యౌవనవతి, అశోకుడు బలశౌర్యము లుడిగిన ముదుసలి అట్టివానితోడి పొందు ఆమె కెట్లు సౌఖ్యదాయకమగును ఆతనివైరాగ్య మామెకు రుచిం

పలేదు. ఆతడెప్పుడును గయాక్షేత్రమందలి బోధివృక్షము కడ ప్రార్థనలు పుచ్చువాడు అది యామెకు గంటకముగ నుండెను. ఒకనాడామె దనయంతఃపుర సేవకుల నంపి దాని తెగనరికించెను. ఈ కథ ఫాహియాను సవిస్తరముగ వర్ణించి నాడు,

క్రమముగ తిష్యరక్షితకు అశోకుని యందనురాగము దప్పెను అశోకుని తనయుడగు కునాలునిజూచి యామె మోహపరవశయై యాతనిపై వలపుదాల్చెను. కునాలుడు సర్వాంగసుందరుడు. కాని ధర్మవ్రతుడు. సుగుణరాసి, అంతటి ఘోరకల్బిషమున కాతడు దోసిలొగ్గునా? క్రోధమూర్తియై యామె కట్టిమోహము వినాశహేతువని మందలించెను. కామాంధులకు హితవచనములు తలకెక్కుట యెక్కడిది? ఆమె పట్టునుపీడలేదు కునాలుడామె ప్రార్థనల నిరాకరించెను. తిష్యరక్షిత హతాశరాయెను. ఆమెప్రణయము క్రోధముగ మారెను. ఏదియో మిషకల్పించి రాచకార్యముల నిర్వహింపుమని యాతని తక్షశిల కంపించెను. అంతటితో యామెక్రోధము జల్లారలేదు. ఆతని తెగటార్చి తనకసిదీర్చుకొనవలెనని సంకల్పించెను కునాలుడు తక్షశిలయందు రాజప్రతినిధిగ నుండెను. "కునాలుడు దుర్జనుడు. ఈలేఖ యందినంతనే యాతనికన్నులుతీయుడు. ఆత డొనర్చిన ఘోరనేరమునకై యాతనికీశిక్ష విధించితిమి. కన్నులుదీసి తక్షణమేయాతని తక్షశిలనుండి వెడల నడిపింపుడు'' అని అశోకుని హస్తాక్షరములతో, రాజముద్రికతో, యొకలేఖ సృష్టించి, తక్షశిలయం

దుండు రాజసేవకుల కంపెను. రాజసేవకు లదియె నిజమని యెంచి, రాజాజ్ఞల నుల్లంఘించిన యేమిచేయుమూడునోయని వెరచి యానిరపరాధుని కన్నులూడదీసిరి. కునాలుడు హేహే యని విలపించుచు, బుద్ధగీతముల బాడుకొనుచు, పాదచారియై భార్యతోగూడ యెట్టులో జనకుని రాజధాని జేరుకొనెను అశోకునకు తిష్యరక్షిత కుటిలవ్యాపారమంతయు దెలిసి యాపాపి నతిదారుణముగ శిక్షించెను. ఒక బౌద్ధయతి యద్భుతమహిమచే కునాలునికి మరల కన్నులువచ్చెను. ఈ కథకల్పితమై యుండనోవుగాని అశోకునకు వృద్ధాప్యమున ఆతని సతీమణి గతించుటయు, మరలనాతడు పరిణయమాడుటయు, ఆమెవలన నాతనికి కొన్ని గృహచ్ఛిద్రములు సంఘటిల్లుటయు నిజమైయుండునని దోచుచున్నది ఈకథ యచ్చముగ మనసారంగధరుని కథను బోలియున్నది దీనినిగాని వచ్చి మన రాజరాజనరేంద్రునకు ముడివెట్టినట్లు గోచరించుచున్నది.

అశోకుడెప్పుడు మరణించెనో దెలియుటలేదు. త్రివిష్టప చరిత్రకారు లాతడు తక్షశిలలో దివంగతు డయ్యెనని జెప్పెదరు.

---

# బౌద్ధ మహాయుగము

# IX

## మౌర్య సామ్రాజ్యాస్తమయము — సుంగ, కాణ్వవంశములు.

### మౌర్య సామ్రాజ్యాస్తమయము

అశోకుడు దివికేగిన యచిరకాలముననే మౌర్య సామ్రాజ్యమస్తమించెను. ఈతడు మరణించిన పిదప నలువది యైదు వత్సరములవరకును మాత్రము ఈ మహాసామ్రాజ్యము కొనయూపిరితో నున్నది. పిమ్మట రూపుమాసిపోయినది. ఈనలుబదియైదు వత్సరములకాలములో అసమర్థులగు మౌర్యవంశజులు మగధసింహాసన మధిష్ఠించిరి. వీరు సరిగ రాజ్యపాలనము నిర్వర్తింపజాలరైరి. పరరాజ్యదండయాత్రలు మరలింపలేక పోయిరి. వీరి రాజ్యకాలమున మౌర్యసామ్రాజ్యలక్ష్మికి పెక్కుచిక్కట్టులు సంఘటిల్లినవి వీరియసమర్థత గుర్తెరిగి యింతవరకును మౌర్య సామ్రాజ్యమున నడగి పడియుండిన క్షుద్రరాజ్యములు తలలెత్తదొడగినవి. రాజ్యతృష్ణాపరులై యవన, శక, తురేనియను జాతులు భారతవర్షముపై దాడివెడలినవి. మగధసామ్రాజ్యము నాక్రమింప నతిశీఘ్రముగ మునేలు ఆంధ్రకళింగ రాజ్యాధిపులు బహుళ సైన్యములతో మగధపై దండెత్తసాగిరి. ఈకారణములచే మౌర్యసామ్రాజ్యభాను డస్తమింపసాగెను. మగధ సామ్రాజ్యము క్రుంగి కృశించి జీర్ణమైపోయెను

చంద్రగుప్త అశోకులచే అంతటి అద్వితీయపరిపాలన పద్ధతులపై నడిపింపబడిన మహాసామ్రాజ్యము అశోకుడు దివి కేగినంతనే యస్తమించిపోవుట కొందరకు ఆశ్చర్యము కల్గింపకమానదు. అఖండప్రతిభాశాలి, అనన్యరాజకీయ పరిజ్ఞాతయగు అశోకుడు గతించిననలువదివత్సరములకే యిది జీర్ణమైపోవుట దురూహ్యముగ నుండవచ్చును సమరశూరుడగు చంద్రగుప్తుడు వైచిన పునాదు లంతత్వరలో పెల్లగిలిపోవుట యద్భుతముగ దోపవచ్చును

కాని ఈయద్భుత సంఘటనమునకు కారణము లేకపోలేదు. కడపటి మౌర్యరాజుల యసమర్థతయే దీనికి కారణము కాదు. బౌద్ధమతవ్యాప్తియే యీయఖండసామ్రాజ్య వినాశమునకు కారణభూతమని పెక్కండ్రయభిప్రాయము అశోకుని అఖండబౌద్ధమతప్రచారమువలన భారతవర్షమునకు మేలు కలుగకపోలేదు దీనివలన, ఆర్యావర్తమందలి సాంఘికరాజకీయరంగము లత్యద్భుతముగ పరివర్తనమునొందినవి ఆర్యానార్యభేదములుసమూలముగనశించి, భారతఖండమునజాతీయతా భావము లంకురించినవి వర్ణవిభేదములకాఠిన్యతతొలగి వివిధవర్ణములకు నొకవిధమగు సౌమ్యతగల్గెను. ప్రాణిహింసలయం దేహ్యతజనించు జనులమానసవృత్తులు మృదుత్వమునొందినవి. వారి సుగుణశీలములు విమలములైనవి.

ఐనను బౌద్ధమతవ్యాపనమువలన అరిష్టములుకూడ సంభవించినవి. బౌద్ధమతము సన్యాసపరమైనది బౌద్ధమత ప్రాబల్యమువలన ప్రజలలో నపారమగు వైరాగ్యతృష్ణ

జనించినది. సంసారికజీవనమునకు భంగము వాటిల్లినది. రణ ముఃపల్పుల హింసాత్మకమైనది అసంఖ్యాకులగు జనులు సంసారముల త్యజింపజొచ్చిరి. గృహస్థధర్మముల నిలువబెట్టుటకై "తగినయుపాధి గల్పింపక భార్యాసుతుల వీడుట శిక్షార్హ"మని శాసనము గావింపవలసివచ్చెను. మగధ రాష్ట్రమున తమ బాహుబలముచే రాజ్యమును గాపాడవలసిన యావను లందరును తండోపతండములుగ సన్యాసమును స్వీకరించిరి. మగధ, సన్యాసిమఠములతో నిండిపోయి, "విహార"మను (విహారములతో నిండిన) సార్థకనామము నార్జించుకొనెను. ఆయుధములు బట్టుట దోషమయ్యెను. ప్రజలు నిర్వీర్యులైరి. శౌర్యము జల్లారెను చంద్రగుప్తుని కాలమునాటి సమర ప్రావీణ్యము మటుమాయమయ్యెను. అందుచే మౌర్యసామ్రాజ్యము అశోకుని మరణానంతరము నిర్వీర్యమై, నిస్తేజమై, జీర్ణమైపోయెను మౌర్యసామ్రాజ్య విచ్ఛిన్నకథనము విషాద పూరితమైనది.

## అశోకుని సంతానము

అశోకునకు పలువురు తనయులుండినట్లు పెక్కుచోట్ల జెప్పబడినది. తీవరుని పేరొక శాసనమునందు నుడువబడినది. కునాలునిగూర్చి పెక్కుగాథలున్నవి. కాశ్మీరమందలి రాజతరంగిణిలో జలౌకునినామము పలుమారులు వినబడును. ఈజలౌకుడు కొంచెము ప్రతాపవంతుడై యుండినట్లు గాన్పించుచున్నది తనతండ్రికాలమున నీతడు కాశ్మీరమునకు రాజ ప్రతినిధియై సమర్థతతో పరిపాలనము నెరపియుండెను. కాశ్మీర

మున నీతనినామమున బరగు ప్రదేశము లెన్నియో నిప్పటి కిని గలవు. ఈతడు తనతండ్రివలె బౌద్ధమతావలంబుడు గాక, శివారాధకుడని రాజతరంగిణిలో వర్ణింపబడినది. ఈతడు తన శౌర్యమును మెరపించి పరదేశీయుల కాశ్మీరమునుండి పార దోలెను.

## దశరధ, సంప్రాతులు

ఈతని తనయులలో నొక్కడును ఈతని మరణా నంతరమువరకును జీవించినట్లు గన్పింపదు. అందరును అతని కంటె మున్నె దివికేగిరి. అందుచే "దశరధ, సంప్రాతు"లనబడు యీతని మనుమలిద్దరకు ఈతని తరువాత నీతని రాజ్య మంతయు సంక్రమించెను. అందు దశరథుడు చక్రవర్తియై మగధసింహాసనమునకు పట్టాభిషిక్తుడయ్యెను. సంప్రాతి, కునా లునితనయుడు, పశ్చిమ ప్రాంతమునకు రాజప్రతినిధిగ నుండెను. తనతాతగారివలె దశరధుడును బరాబరు కొండ లందు కొన్ని గుహాలు దొలిపించి అజీవిక జైనులకు దాన మొసగి దానశాసనములు వ్రాయించెను అవి నేటికిని యీ ప్రాంతమున గలవు. ఇవియే యీకాలమునాటి చరిత్ర నిర్మా ణమున కాధారము లగుచున్నవి.

సంప్రాతినిగూర్చి తెలుపుశాసనములేవియు మనకు లభింపలేదు. కాని యీతనిగూర్చి జైనగ్రంధములలో పెక్కు గాథలుగలవు. ఈతడు జైనమతావలంబుడు. అశోకుడు బౌద్ధమతము నెట్లువ్యాప్తిఁయొనర్చెనో, ఈతడు జైనమతము నట్లు పశ్చిమప్రాంతమున ప్రబలజేసెను. ఈతనిరాజధాని ఉజ్జ

యని. రాజపుత్రస్థానము, కతియవారు, మేవారు దేశము లలో సీతనినామము సుప్రతిష్ఠితమైయున్నది. యోధపుర సంస్థానములోని నాడలెపట్టణమునను, కతియవారు ద్వీపకల్ప ములోని శత్రుంజయ గ్రామమునను యీతడు జైనదేవాల లయముల గట్టించెనని జైనగ్రంథములలో గలదు. మేవారు సంస్థానములోని జాజపురదుర్గమునుగూడ యీతడే నిర్మించె నని ప్రతీతి.

దశరథుడు ఎనిమిది సంవత్సరములుమాత్రము రాజ్య పాలనమొనర్చి మృతిబొందెను. ఈతనివెనుక నలుగురు మౌర్య సంతతిరాజులు మగధరాజ్యాధిపత్యమును వహించిరిగాని ఒక్క రును, అశోకచంద్రగుప్తులవలె రాజ్యపాలనమును నిర్వహింప జాలకపోయిరి. శత్రురాజుల దండయాత్రలనుండి మగధసా మ్రాజ్యమును సంరక్షింపజాలకపోయిరి. తుదకు బృహద్రధు నితో మౌర్యవంశ మస్తమించెను. ఈతడే మగధరాజ్యము నేలిన మౌర్యవంశజులలో కడపటివాడు. క్రీ. పూ 185 సంవ త్సరప్రాంతమున యీతనిమంత్రియగు పుష్యమిత్రుడీతని తుద ముట్టించి మగధసింహాసన మాక్రమించి శుంగవంశమనునూతన వంశమొండు స్థాపించెను. అంతటితో మౌర్యవంశ మంతరిం చెను. మౌర్యసంతతిరాజులు పెక్కుశతాబ్దములవరకును మగధప్రాంతములందు మండలాధీశులుగా నున్నట్లు తెలియు చున్నది.

## శుంగవంశము

### పుష్యమిత్ర, అగ్నిమిత్రుల పరిపాలన.

శుంగవంశము క్రీ. పూ. 73 సంవత్సరమువరకును నూటపంౘెండుసంవత్సరముల కాలము మగధరాజ్యమును బాలించినది. పశ్చిమమున పాంచాలమునుండి దక్షిణమున నర్మదానదివరకును, శుంగవంశజులరాజ్యము విస్తరించినది.

శుంగవంశస్థాపకుడగు పుష్యమిత్రుడు, (లేక పుష్ప మిత్రుడు) స్వామిద్రోహియై కేవలము తన రాజ్యపిపాస మును దీర్చుకొనుటకు తనయేలికను బరిమార్పలేదు. మగధ సామ్రాజ్య మీతరుణమున మహాయాపదల జిక్కువడినది. ఒకవంక యవనరాజగు మిళిందుడు మగధసామ్రాజ్యమును కబళింప రణసన్నాహములు జేయుచుండెను దక్షిణాపథము నుండి కళింగనృపుడగు ఖారవేలుడు మగధ సింహాసన మాక్రమింప బహుళ సైన్యములతో బయలువెడలెను. ఈయుభ యుల సైన్యముల నురుమాడుటకు బాహువిక్రముడగు నృపా లుడు సింహాసన మాక్రమింపవలెను. లేనిచో మగధరాజ్యము శత్రురాజులకు వశమై స్వాతంత్ర్యమునుగోల్పోవుటనిక్కము. అరిసైన్యముల సమయింపగల సమరశూరుడు పుష్యమిత్రు డొకడే రాజ్యమునగలడు. అందుచేతనే ప్రజలు రాజ్యరక్ష ణార్థమై సింహాసన మధిష్ఠింప నతనిప్రోత్సహించి యుండవలెను. పుష్పమిత్రుడు స్వాతంత్ర్యరక్షణకై ప్రజల యనుమతిపై సింహాసన మాక్రమించెనేగాని వేరుగాదు.

మగధ సామ్రాజ్య చారిత్రమున అశోకుని తరువాత ప్రఖ్యాతిగాంచిన రాజు పుష్యమిత్రుడె.ఇతని యేలుబడి యనేక

విధముల ప్రాముఖ్యత వడసినది బౌద్ధమత క్షీణతయు, వైదిక మత విజృంభణమును ఈతని రాజ్యకాలముననే ప్రారంభ మైనవి. ఖారవేల మిళిందు లీతని కాలముననే మగధపై దండె త్తిరి. ఈ యుభయుల సైన్యములతో నీతడు రణము సల్పి, మగధ రాజ్య స్వాతంత్ర్యమును గాపాడెను. ఈవిషయమున నీతని చంద్రగుప్తునితో బోల్పదగును.

ఖారవేల ◆ మిళిందుల దండయాత్రలు

పుష్యమిత్రుడు ఖారవేలునితో పోరి యోడిపోయెను. కాని మిళిందుని సైన్యములనురుమాడి యాతని బారదోలెను. మిళిందుడు బాక్ట్రియాయను నొక యవనదేశపు రాజు. ఈతడు విజృంభించి క్రీ॥ పూ॥ 175 సంవత్సరప్రాంతమున పశ్చిమ భారతఖండమంతయు జయించి యాక్రమించెను సింధు నదీప్రాంతభూములన్నియు నీతని పాలబడెను. సౌరా

---

◆ ఈతడు తన దిగ్విజయమును వర్ణించుచు నొకశాసనము వ్రాయిం చెను. ఈశాసనమున శాసనకాలము స్పష్టముగ వివరింపబడినది. అందుచే ఈశాసనము చారిత్రనిర్మాణమున కమూల్యమైనది. ఇది ఖారవేలుని పరి పాలనకాలమున పదమూడవ సంవత్సరమున అనగ మౌర్యశకము 165, 164 సంవత్సరములలో వ్రాయబడినట్లు యీ శాసనమున గలదు. మౌర్యశకము క్రీ పూ 222 సంవత్సరమున ప్రారంభమైనది కావున యిది క్రీ పూ 157, 158 సంవత్సరములలో వ్రాయబడినట్లు చరిత్రపరిశోధకులు నిర్ణ యించియున్నారు. పుష్యమిత్రుని నామముకూడ ఈశాసనమున బేర్కొన బడినది. దీనినిబట్టి పుష్యమిత్రుని కాలమును దాని ననుసరించి తక్కిటి రాజుల రాజ్యకాలములను నిర్ణయించుటకు వీలైనది. దీనిని బట్టి ఆదివరకు చరిత్రలలో నుపయోగించుచున్న కాలములు ఏబదేళ్ళ వత్సరములు వెనుకకు పోయినవి.

ష్ట్రీద్వీపకల్పము, యమునానదీకూలమందలి మధురానగరము, ఇతనికి వశమయ్యెను. రాజపుత్రస్థానమందలి చిత్తూరుదుర్గమునకు దాపున నున్న మాధ్యమిక పట్టణము నీతడు ముట్టడించెను. అచ్చటనుండి బయలుదేరి విజయధ్వజముల బాతుకొనుచు మార్గమున సాకేతపురమును బట్టుకొని తిన్నగ పాటలీపుత్రమును సమీపించెను. మార్గమున నాతని నెదిరింపగలవారెవ్వరును లేరైరి పాటలీపుత్రము ఆపదలో నుండెను. పుష్యమిత్రుడు మగధసైన్యముల గదలించుకొని పోయి, యాతని నెదిర్చి, యాతని దళముల నుగ్గుచేసి యాతని దరిమివైచెను.

## పుష్యమిత్రుని అశ్వమేధయాగము.

పిమ్మట పుష్యమిత్రుడు విజయసూచకముగ మహావైభవముతో అశ్వమేధయాగము సల్పెను. ఈయశ్వమేధయాగకథాంశమును కాళిదాసు నాటకముగ వ్రాసెను. ఇదియే, నాటకకళాప్రపంచమున సంస్కృతసారస్వతమున ప్రఖ్యాతి వహించి. మాళవికాగ్ని మిత్రనాటకము

పుష్యమిత్రునికి అగ్నిమిత్రుడనుతనయుడుగలడు, ఈతడు మహాశూరుడు. మాళవికాగ్నిమిత్రమందలి కథానాయకుడీతడే. ఈతడు విదిశాపట్టణమును రాజధానిగజేసికొని దక్షిణప్రాంత భూములకు రాజప్రతినిధిగ నుండి పరిపాలనాకార్యముల యందు రణవ్యాపారములందు తనతండ్రికి చేదోడుగ నుండెను. విదర్భరాజ్యమును జయించి అందలి సగభాగమును తన పినతండ్రికి పట్టముగట్టెను. ఈతని దేవేరిపేరు ధారణి. ఈతనికి

వసుమిత్రుడను కుమారుడొకడు గలడు. ఈ వసుమిత్రుడు రణవిశారదుడు. సమరశూరుడు. తనతాతగారగు పుష్యమిత్రుని సేనలకు వాహినీపతిగనుండి యాతని కనేకవిజయముల గూర్చెను. పుష్యమిత్రుడుసల్పిన అశ్వమేధయాగసందర్భమున ఈతడే తురంగరక్షకుడై సైన్యములతో దాని వెంట నరిగెను. ఈతడు గుఱ్ఱము వెంటబోయి తన్నెదిరింపజూచిన రాజులనెల్ల నోడించి సింధునదీప్రాంతమున అశ్వమును బట్టుకొన సాహసించిన యవనుల నుగ్గుజేసి, దానివిడిపించి యెల్ల తావులందు విజయపతాకముల బాతి జయజయధ్వానములతో పుష్యమిత్రుని రాజధాని ప్రవేశించెను పుష్యమిత్రుడు అఖండ వైభవముగ అశ్వమేధయాగమును సల్పెను. ఈయుదంతమును వర్ణించుశాసనములు రెండు మాధ్యమిక పట్టణశిథిలములు దర్శ్యమగుచుండగ గన్పించినవి. ఇవి పుష్యమిత్రునిచే వ్రాయబడిన శాసనములు.

ఈయాగము భారతవర్షమున బౌద్ధమతక్షీణతను, వైదికమతవిజృంభణమును బ్రకటించెను అశోకుడు యజ్ఞయాగాది క్రతువుల నిషేధించి వైదికమతప్రాభవమును మరుగుపరచెను. పుష్యమిత్రుడు బలియాగముల ప్రారంభించి వైదికమతవిజయ దుందుభులు మ్రోయించెను ఇంతటినుండియె బౌద్ధమతక్షీణత ప్రారంభమైనదని జెప్పవచ్చును పుష్యమిత్రుడు వైదికమతము వనయభిమానమతముగ స్వీకరించి యేతన్మతాభివృద్ధికై కృషిసల్పెను.

పుష్యమిత్రుడు బౌద్ధమతవైరియనియు తనరాజ్యకాలమున బౌద్ధుల హింసించి, వారిమతముల తగుల బెట్టెననియు కొందరు చరిత్రకారులు వ్రాయుదురు. కాని వీరినుడుల కేవియు నాధారములు గన్పింపవు. ఆకాలమున ప్రబలెడు మతమును స్వీకరింపక, అన్యమతమును స్వీకరించెనేని అట్టి రాజునకు, పరమతపీడనాకళంక మాపాదించుట పాశ్చాత్య చరిత్రకారులకు నైజమైనది. అన్యమతపీడనము హైందవరాజ ధర్మములకే విరుద్ధము. పుష్యమిత్రుడు వైదికమతాభిమాని యగుటచే, బౌద్ధులసూయాపరులై ఆతని పదచ్యుతుని జేయుటకు కుట్రలు బన్నసాగిరి. కొన్ని బౌద్ధమఠములు రాజద్రోహుల రహస్యాలోచనమందిరము లయ్యెను. పుష్యమిత్రుడు తనరాజ్యపర రక్షణకై రాజద్రోహులగు బౌద్ధుల శిక్షించి యుండనోపు. అంతమాత్రమున నీతడు బౌద్ధమతావలంబుల హింసించెనని వ్రాయుట సాహసము.

ప్రఖ్యాత వైయాకరణియు, యోగసూత్ర గ్రంధకారుడును నగు పతంజలి యీతని సమకాలీనుడు పుష్యమిత్రుడశ్వమేధయాగమును సల్పునపు డీతడు ఆతనియాస్థానముననే యుండెను కాని కొందరీతడు పుష్పమిత్రుని సమకాలీనుడని యొప్పుకొనరు. ఒప్పుకొనకపోవుటకు వీరికాధారములులేవు. పతంజలి పుష్యమిత్రుని సమకాలికుడని జెప్పుటకు దృష్టాంతములనేకములున్నవి. పతంజలి తన "మహాభాష్యమున" పుష్యమిత్రుని అశ్వమేధయాగమును గూర్చియు, ఆ నృపుని కాల

మున సంఘటిల్లిన యవనదండయాత్రనుగూర్చియు జేర్కొని
యున్నాడు. ఈవివర్ణనములనన్నిటిని తొలిపలుకున సాకల్య
ముగ విమర్శించితిమి.

పుష్యమిత్రుడు ముప్పదియేండ్లు రాజ్యపాలన మొన
ర్చెను ఎంతవీరుడైనను ఈతడు మగధసామ్రాజ్య విస్తీర్ణ
తను బీరువోకుండ కాపాడలేకపోయెను. పాంచాల, కళింగ,
దక్షిణాపథములు మగధసామ్రాజ్యమునుండి చీలిపోయెను.
ఈతడు, క్రీ. పూ. 148 సంవత్సరమున దివికేగెను. వీనివెనుక
అగ్నిమిత్రుడు,సుజేష్ఠుడు,వసుమిత్రుడు సుమిత్రుడు మున్నగు
రాజులు జాలమంది క్రీ పూ 73 వరకును మగధ నేలిరి.
అంతటితో మౌర్యవంశమువలె నిదియు నంతరించెను.

## కాణ్వాయనద్విజులు.

శుంగరాజులలో కడపటివారందరును దుర్బలులై వారి
మంత్రుల చేతులలో కీలుబొమ్మలైరి. ఈకాలమున వీరికి
మంత్రులై రాచకార్యములు నిర్వహించిన వారు కాణ్వాయన
ద్విజులు నలుబదియైదు వత్సరములు వీరిప్రభ వెలిగినది.
ఈకాలమున వీరె నిజముగ ప్రభుత్వము జేసిరి. శుంగులు
నామమాత్రావశిష్టులై అస్వాతంత్రులై ఉత్సవవిగ్రహముల
వలె గద్దెనుమాత్ర మలంకరించిరి ఈకాణ్వాయన మంత్రులలో
ప్రఖ్యాతివహించినవారలు వసుదేవ సుశర్మలు. వసుదేవుడు పది
యవ శుంగరాజగు దేవభూతిని బరిమార్చి మరియొక శుంగుని
సింహాసన మెక్కించెను. కాణ్వాయనులలో కడపటివాడు
సుశర్మ. ఈతడు క్రీ. పూ. 73 సం॥ ప్రాంతమున శుంగవంశ

జులలో కడపటివానికి మంత్రిగనుండెను ఈతని కాలముననే ధాన్యకటకాధీశ్వరుడును, ఆంధ్రసామ్రాజ్యాధిపుడును నగు శ్రీముఖశాతవాహనుడు బహుళసైన్యములతో మగధపై దండెత్తి యతని జంపి+ సుంగవంశము నంతమొందించి మగధ రాజ్యమును జయించెను. అంతటితో సుంగవంశ మస్తమించెను. మగధ ఆంధ్రరాజుల వశమయ్యెను. ఈరాజ్యము

---

+ కాణ్వాయనులు క్రీ. పూ. 73 సంవత్సరప్రాంతమున శుంగవంశము నంతమొందించి మగధసింహాసన మాక్రమించి తద్రాజ్యమును 45 వంత్సరముల కాలము పరిపాలించిరనియు, సుశర్మను జంపిన యాంధ్రరాజు శ్రీముఖుడు గాక మరి యొవ్వరో యనియు, స్మిత్తు మున్నగు చరిత్రకారులు వ్రాసిరి. వసుదేవుడే కణ్వాయన వంశస్థాపకు డనిరి. కాని వీరి వ్రాతలకు ప్రమాణములు గన్పింపవు. కాణ్వాయనులు శుంగులకు భృత్యులై, వారికి మంత్రులుగనుండి రాచకార్యముల నిర్వహించిరి గాని వీరెప్పుడును సింహాసన మధిష్ఠింపలేదు. శుంగులు పేరునకుమాత్రము కిరీటాధిపతులుగ నుండిరి. సర్వమును మంత్రులె నిర్వహించిరి. ఇందులకు నిదర్శనముగ వాయుపురాణమున "చత్వారః శృంగ భృత్యస్తే నృపాః కాణ్వాయనా ద్విజాః" యనియు (అనగా కాణ్వాయన ద్విజులు శృంగభృత్యులనియు), "కాణ్వాయనస్త (సంత) తో భృత్యాః సుశర్మాణం ప్రసహ్యత్యం శృంగాణాంచైవ యచ్ఛేషం క్షపయిత్వా బలంతదా" యనియు, (అనగా కాణ్వాయనులను మాత్రమేగాక శృంగవంశజుల శేషించిన యధికారమును కూడ [సింధుకుడను పేరుగల యాంధ్రభృత్యుడు-శ్రీముఖుడు.] త్రుంచివేసెననియు) జెప్పబడినది. దీనివలన సుశర్మ కాలమువరకును, శుంగరాజులు మగధరాజ్యము నేలుచుండిరనియు, వారి కితడు భృత్యుడుగ నుండెననియు యీతనిని, యీతనియేలికను, ఆంధ్రులు బరిమార్చిరనియు దేలుచున్నది. ఇట్లు వాయుపురాణమున స్పష్టముగ జెప్పబడియుండగ కాణ్వాయనులు మగధసింహాసనము నాక్రమించిరని స్మిత్తుగారెట్లు వ్రాయగల్గిరో దెలియదు. భండార్కారుగారు మొట్టమొదట నీవిషయమును పరిశోధించి కాణ్వాయనులు మంత్రులుగా నుండిరేగాని సింహాసన మాక్రమింపలేదని

క్రీ. శ. 225 సంవత్సరప్రాంతమువరకును ఆంధ్రరాజుల యేలుబడిలోనుండినట్లుగాన్పించుచున్నది. ఆంధ్రరాజులుఇంచుమించు మూడు శతాబ్దములకాలము మగధ నేలిరి. తరువాత ఆంధ్రవంశమును తక్కటి రాజవంశములవలెనే క్షీణించి యంతరించి పోయినది. మగధ సామ్రాజ్యమునకు తరువాత భారతవర్షమున ప్రఖ్యాతిగాంచిన సామ్రాజ్యము ఆంధ్రసామ్రాజ్యము. ఈసామ్రాజ్యమును నలుముఖముల విస్తరింపజేసి దానికింతటి ప్రాభవమునుగూర్చినది శాతవాహనులు. శాతవాహనుల గూర్చియు వారి సామ్రాజ్యవైభవమును గూర్చియు యిచ్చట గొంత ముచ్చటింపవలసియున్నది.



వాదించిరి. శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారును వీరి వాదము యుక్తియుక్తముగ నున్నదని దాని ననుకరించిరి నేనును వీరితో నేకీభవించి యిదియే యథార్థమని విశ్వసించుచున్నాను. ఇదియునుగాక కాణ్వాయనులు బ్రాహ్మణులు. బ్రాహ్మణులు రాజ్యభారమును వహించుటఅప్పటి హైందవసాంప్రదాయములకు విరుద్ధము.

# బౌద్ధమహాయుగము

## X

### ఆంధ్రరాజ్య ప్రశంస.

ఆంధ్రరాజ్యము తొలుత కృష్ణా గోదావరీ నదీ గర్భ పరిసరములం దుద్భవమై క్రమముగ విస్తరిల్లి దక్షిణాపథ మంతయు వ్యాపించి కడకు మగధరాజ్యమును కూడ జయించి భారతవర్షమున నొక మేటి సామ్రాజ్యమై ప్రఖ్యాతిగాంచినది. అందు రణవిక్రములును అఖండ ప్రతిభాశాలురు నగు సార్వ భౌము లెందరో యుదయించిరి వారికీర్తి దిగంతములకు వ్యా పించినది. వారిపాలనమున చిత్రశిల్పకళలు, పరిశ్రమలు, వాణిజ్యము భాషావాఙ్మయములు అపారముగ వృద్ధినొందినవి.

అట్టి ఆంధ్రరాజ్య మేకాలమున స్థాపితమైనది? దానిని స్థాపించిన మహామహులెవ్వరు? అనువిషయము పరిశీలింప వలసియున్నది. ఆంధ్రులు నవీనులా, ప్రాచీనులా, ఆర్యులా, అనార్యులా యను సంశయముల నేనిట జర్చింప పనిలేదు దీని గూర్చి యనేకులు జాల పరిశ్రమజేసి వాద ప్రతివాదముల నెరపి ఆంధ్రులు ఆర్యులే యనియు, ప్రాచీనులేగాని నవీనులు గారనియు సిద్ధాంతము జేసియున్నారు. వేదముల లోనికెల్ల నతిప్రాచీనమగు ఋగ్వేదము నందలి ఐతరేయ బ్రాహ్మణ మున ఆంధ్రుల ప్రశంసలుగలవు ఐతరేయ బ్రాహ్మణము క్రీ పూ. 1000 సంవత్సర ప్రాంతమున రచియింప బడినదని చరిత్ర పరిశోధకులు నిర్ణయించి యుండుటచే అంత ప్రాచీన కాలము నుండియు ఆంధ్రులు గలరని రూఢియగు చున్నది.

ఆంధ్రుల ప్రాచీనతను దెలుపు దృష్టాంతము లెన్నియేని గలవు. గ్రంథవిస్తర భీతిచే వానినన్నిటిని యిచ్చట వివరింప జాలము. ఆంధ్రు లుత్తరభారతమునుండి లేచి వచ్చి, దక్షిణాపథమున, దండకారణ్య ప్రాంతమున నివసింప దొడగిన ఆర్యులు.

ఆంధ్రరాజ్యము క్రీ. పూ. నాల్గవ శతాబ్దమునకు బూర్వమే స్థాపింపబడినట్లు నిదర్శనములు గాన్పించుచున్నవి. క్రీ. పూ 300 సంవత్సరప్రాంతమున నీరాజ్యము మహోత్కృష్టదశయందున్నట్లు యవనరాయబారియగు మెగస్తనీసు వర్ణించినాడు. భారతఖండమున నాకాలమున చంద్రగుప్త మౌర్యుని రాజ్యమువక్క, ఆంధ్రరాజ్యమున కెనవచ్చురాజ్యము వేరొకటి లేదనియు ఆంధ్రరాజ్యమునందప్పుడు ముప్పదిదుర్గములును, లక్షకాల్బలమును, రెండువేల హయములును, వేయిగజములు నుండెననియు ఈరాయబారి నుడివియున్నాడు.

### ఆంధ్రవిష్ణువంశము

చంద్రగుప్తునికి పూర్వమే ఆంధ్రరాజ్యము స్థాపింపబడినట్లు ఆధారములు గాన్పించుచున్నను యీరాజ్యమును స్థాపించిన మహాపురుషుని నామముమాత్రము ఎచ్చటను ఉదహరింపబడి యుండలేదు కాని మనదేశమున అనేకశతాబ్దముల నుండి చెప్పుకొనబడుచుండు ఒకానొక పురాణగాధను బట్టియు శ్రీకాకుళప్రాంతమున గన్పడు చరిత్రాధారముల బట్టియు, ఆంధ్రరాజ్యమును స్థాపించిన వీరవతంసము ఆంధ్రవిష్ణువని తెలియుచున్నది. ఈతడు సుచంద్రుని తనయుడు.

కడుపరాక్రమశాలి. నిశంభుడను నాగరాజును జయించి యీతడు ఆంధ్రరాజ్యమును స్థాపించి ప్రఖ్యాతిగాంచెను. శ్రీకాకుళమును రాజధానిగజేసికొని ఆంధ్రరాజ్యమును బాలించెను. చిరకాల మీతనినామము ఆంధ్రలోకమున కీర్తింపబడి యుండవలెను.

తరువాతి సంతతివా రీతని దేవునిగ భావించి యీతని పేరిట నొకదేవాలయమునుగట్టి పూజింపదొడగిరి శ్రీకాకుళాంధ్రదేవుడీ యాంధ్రవిష్ణువేగాని మఱియొండుగాదు. పదునారవ శతాబ్దప్రారంభమున విజయనగర సామ్రాజ్యాధిపుడు కృష్ణరాయలు దక్షిణదిగ్విజయయాత్రవెడలుచు యీతని దేవాలయమును దర్శించి కానుక లర్పించినాడు. ఈపట్టణపు పూర్వవైభవమంతయు నేడు కృష్ణానదీవెల్లువలచే నంతర్హితమై పోయినది.

ఆంధ్రవిష్ణుసంతతిరాజులు రెండుమూడు శతాబ్దముల కాలము అవిచ్ఛిన్నముగ ఆంధ్రరాజ్యమును బాలించిరి కాని శాలివాహనులు రాజ్యభారమును వహించువరకును వీరిచరిత్రమేమియు మనకు దెలియదు. అంతయు విస్మృతమైపోయినది.

చంద్రగుప్త మౌర్యునికాలమున ఆంధ్రరాజ్యము స్వతంత్రరాజ్యముగ నుండెనో, మౌర్యసామ్రాజ్యమున నొకయంతర్భాగమైయుండెనో మెగస్తనీసు మనకు జెప్పియుండలేదు చంద్రగుప్తుడు వింధ్యపర్వతములకు దక్షిణమున నుండు రాజ్యముల జయించినట్లు నిదర్శనములు లేకుండుటచే ఆంధ్రరాజ్య మీతనికాలమున స్వాతంత్ర్యరాజ్యముగనే యుం

డినట్లు గోచరించుచున్నది. ఈతని తనయుడగు బిందుసారుడు, పినాకినీనదీతటము వరకునుగల దక్షిణాపథము నంతయు జయించిన ట్లూహింపబడుచుండుటచే ఈతనికాలమున ఆంధ్రరాజ్యము మగధకు సామంతరాజ్యముగ నుండి యుండవలెను. బింబిసారనృపాలుని తనయుడగు అశోకవర్ధనుని కాలమున గూడ ఆంధ్రరాజ్యము మౌర్యసామ్రాజ్యమునకు సామంతరాజ్యముగనే యుండినట్లు గాన్పించుచున్నది. తన ప్రేరణచే ఆంధ్రులు బౌద్ధమతమువవలంబించిరని, అశోకుడు తన పదమూడవ శిలాశాసనమున జెప్పుకొనియున్నాడు.

అశోకుడు మరణించిన పిమ్మట ఆంధ్రరాజ్యము మగధరాజ్యబంధనముల విదళించి స్వాతంత్ర్యమును వహించినది. బలహీనులగు మౌర్యరాజులు రాజ్యభారమును వహించిన కాలమున నిది హాయిగ స్వాతంత్ర్యము ననుభవించినది. అప్పటినుండి శాలివాహన వంశవిచ్ఛిన్నమునరకును ఆంధ్రరాజ్యము పరరాజులకు దోసిలొగ్గలేదు.

హతభాగ్యుడై యాతని సేనానియగు పుష్యమిత్రునిచే పదభ్రష్టుడై,సంహరింపబడిన బృహద్రథుడు మౌర్యరాజులలో కడసారివాడు రాజ్యమేలుచున్నకాలమున నెప్పుడో ఆంధ్రరాజ్యమున శాలివాహనుల పరిపాలనము ప్రారంభమయ్యెను.

## శాలివాహనులు.

ఆంధ్రరాజ్యమున శాలివాహనుల పరిపాలనము సర్వోత్కృష్టమైనది. శాలివాహనవంశము క్షాత్రవంశము. భారతవర్షమున ప్రఖ్యాతిగాంచిన వీరవంశములలో నిదియొకటి.

శాలివాహనులు ఆంధ్రరాజ్యమును నానాముఖల విస్తరింప జేసి ఆంధ్రుల కీర్తిచంద్రికల దిగంతములకు వ్యాపింపజేసిరి. వీరు మగధరాజ్యమును గూడ జయించి ఆంధ్రరాజ్యము నొక ప్రచండసామ్రాజ్యముగ నొనర్చిరి. బౌద్ధమతవ్యాప్తిచే నిస్తేజమై నిర్వీర్యమై పోయిన భారతవర్షము శాలివాహనుల ప్రతాపాగ్నికీలలచే తళుక్కుమని యొక్క వెలుగు వెలిగినది. భారతఖండమునకెల్ల శక, యవన, పహ్లవసమూహముల జించి చెండాడగల వీరులొక్కరాంధ్రులే గాన్పించిరి. ఈమ్లేచ్ఛసైన్యములు ఉత్తర భారతమునందెల్ల యథేచ్ఛముగ సంచరింపగల్గినవికాని, దక్షిణాపథమున నడుగువెట్టజాలవయ్యెను. శాలివాహనులు వీరిసైన్యముల నురుమాడి వీరిని వెనుకకు దర్మిమివైచిరి. శాలివాహనుల పేరువినిన శక,యవన పహ్లవ, మూకలు దద్దరిల్లిపడినవి

ఈ శాలివాహనవంశమే శాతవాహనవంశమనియు, ఆంధ్రభృత్యవంశమనియు పెక్కు నామాంతరములచే పేర్కొనబడుచున్నది శాతవాహనుడు ఈవంశమునకు మూలపురుషు డగుటచే నిది శాతవాహనవంశమయ్యెను శాతవాహనుని ప్రాకృతభాషలో శాలివాహను డందురు. అందువలననే యీవంశమునకు శాలివాహనవంశమని పేరుగల్గినది ఈవంశరాజుల నామములకుజివర శాతకర్ణియను పదము దరుచుగ జేర్పబడుచుండుటచే దీనిని శాతకర్ణివంశమని కొందరు పాశ్చాత్య చరిత్రకారులు బిలుచుచున్నారు. కాని వీరి వ్రాతలకు చరిత్ర ప్రమాణము లేవియు కానరావు ఈవంశమునకిట్టి నామాంతర

మెచ్చుటను లేదు. శాతకర్ణియనునది శాలివాహనులు ధరించు కొనిన బిరుదునామము. శాతకర్ణి శతకర్ణిశబ్దవిరూపమై యుండునోపు. శతకర్ణియన నూరుకర్ణముల గలవాడు. అనగా రాజ్యాంగ వ్యవహారముల నూరు చెవులతో వినుచు సామర్థ్యముతో పరిపాలన కార్యముల నిర్వర్తింప గలవాడని యర్థము

ఈ కాలము నాటి చరిత్రనిర్మాణమునకు, వాయు, మత్స్య, విష్ణుభాగవత పురాణములును, నాసిక, కార్లె, ధరణికోట, భట్టిప్రోలు మున్నగు ప్రదేశములందు గాన్పించిన శాసనములును గుడివాడ, ఘంటసాల, చినగంజాము అమరావతి, జగ్గయ్యపేట, నాసిక ప్రాంతములందుదొరికిన నాణెములును ఆధారములు. శాలివాహనులలో పెక్కండ్రు శాతకర్ణినామధారులగుట చేతను, ఈకాలమునాటి చరిత్రసాధనము లంత విరివిగ లేకుంటచేతను ఉన్నవైనను అన్యభాషలో వ్రాయబడి వారికంతగా గ్రాహ్యముగాకుంట చేతను విన్సంటు స్మిత్తు మున్నగు చరిత్రకారులు ఆంధ్రుల చరిత్రమును సరిగ వ్రాయజాలరైరి వారివ్రాతలు విపరీత స్వకపోల కల్పనలతో నిండియున్నవి. స్మిత్తుగారు తమ యిచ్చవచ్చిన రీతిని కొందరి రాజులను పైకినెట్టిరి. కొందరను కొన్ని శతాబ్దములు క్రిందికి దోసిరి. మనవారు యింతవరకును వారివ్రాతలనే విశ్వసించుట శోచనీయము.

శాతవాహనుల రాజధాని కృష్ణానదీతటమున విలసిల్లిన ధాన్యకటకము ఇది యాకాలమున నత్యంత విశాలమై, కడు రమణీయమై, అప్పటి భారతవర్షమున ప్రఖ్యాతిగాంచిన నగర

రాజములలో నొకటియై విరాజిల్లినది. ఇప్పుడది కృష్ణాతరంగిణీ వెల్లువలచే విధ్వంసమై, అంతర్హితమై పోయినది. పూర్వవైభవము లంతరించినవి.

## శాతవాహనుడు.

శాలివాహన వంశస్థాపకు డెవ్వరో పాశ్చాత్యచరిత్రకారులు సరిగ నిర్ణయింపలేదు. ఈవిషయమున వీరందరును మౌనముదాల్చిరి ఈ ప్రఖ్యాతవంశమునకు మూలపురుషుఁడు శాతవాహనుడను ఆంధ్రవీరుడు. అట్లుమహారాష్ట్ర ప్రాంతములందు దొరికిన శాసనములు దెల్పుచున్నవి. వీనిని గూర్చిన విశ్వాసపాత్రమగు చరిత్ర మింతవరకును లభింపలేదు. వీని పేరిట యనేకగాధలుమాత్రము కల్పింపబడినవి. వానిలో సోమదేవునిచే రచింపబడిన కథాసరిత్సాగర మొకటి ఈకథలు భారతవర్షమునం దంతటను ప్రచారములోనున్నవి. వానిని గూర్చి యిట ప్రస్తావించుటకు తావులేదు

ఈ వీరాతివీరుడు క్రీ. పూ రెండవశతాబ్దమున పుష్యమిత్రునికి పూర్వమెప్పుడో ఆంధ్రరాజ్యమున కధిపతియై, శాతవాహనయను నీప్రఖ్యాతవంశమును స్థాపించి తన సమరప్రావీణ్యముచే పశ్చిమభాగమున పెక్కుదేశముల జయించి ఆంధ్రరాజ్యమును దశదిశల విస్తరింపజేసెను. రాజధానిని శ్రీకాకులమునుండి ధాన్యకటకమునకు మార్చెను ఇంతియగాక పశ్చిమాంధ్రమునకు గోదావరీతీరమందలి ప్రతిష్ఠానమును (ప్రస్తుతపైఠన్) రాజధానిగనేర్పరచి యందుండి, తన రాజప్రతినిధులచే నాప్రాంతభూముల నేలించెను. ఈతనితండ్రి

దీపకర్ణిమహారాజని కథాసరిత్సాగరమున జెప్పబడినది. ఈతడు శ్రీకాకులమును రాజధానిగగొని ఆంధ్రరాజ్యము నేలిన ఆంధ్రవిష్ణువంశజులలో గడపటివాడై యుండునని దోచు చున్నది ప్రఖ్యాతుడగు గుణాఢ్యపండితుడు శాలివాహనుని మంత్రియని యీకథాసరిత్సాగరము నుడువుచున్నది.

శాలివాహనులు బలాఢ్యులై సమరశూరులై ఆంధ్ర రాజ్యమును బాలించిరి. మగధసార్వభౌముడగు పుష్యమిత్రుని రాజదండమును విదళించి స్వాతంత్ర్యమును వహించుటయే గాక వీరు మీదుమిక్కిలి యాతనికి ప్రత్యర్థులై యాతని యెడ వైరమునుగూడ బాటించిరి. మగధరాజ్యముపై దాడి వెడలిన కళింగనృపాలుడగు ఖారవేలుని సహాయార్థమై వీరు పెక్కు సేనల నంపిరి. పుష్యమిత్రునితో యుద్ధము సేయ సేనలనం పసాహసించిన ఆంధ్రనృపుడు శాతకర్ణి ఈయుదంతము ఖారవే లుడొకశిలాశాసనమున వ్రాయించినాడు. ఈశిలాలేఖన మిప్ప టికిని కటకపురికి దక్షిణభాగమున నుండు ఉదయగిరిపై నున్న హాతిగంపాగుహాలోనున్నది ఇది క్రీ॥పూ॥ 158 సంవత్సరప్రాంత మునాటి మాట.

## శ్రీముఖశాతవాహనుడు

## (క్రీ॥ పూ॥ 73—50).

శాతకర్ణి పుష్యమిత్రునితో గణము సలుప ఖారవేలు నికి సేనలనంపిననాటనుండి, శ్రీముఖశాతవాహనుడు ఆంధ్ర సామ్రాజ్య సింహాసన మధిష్ఠించు వరకును శాతవాహనుల గూర్చిన చరిత్రాంశము లేవియు గన్పించుట లేదు. క్రీ. పూ.

73 సంవత్సర ప్రాంతమున శ్రీముఖ శాతవాహనుడు ఆంధ్ర సామ్రాజ్య సింహాసనమున కభిషిక్తుడయ్యెను. ఈతడు యోధాగ్రేసరుడు, రణప్రవీణ్యుడు ఆంధ్రసామ్రాజ్యము నేలిన చక్రవర్తులలోనికెల్ల మిగుల బ్రఖ్యాతిగాంచిన మేటివీరుడు. ఆంధ్రవీరుల ప్రచండశౌర్యమును మగధరాజులకు చవిజూపించి ఆంధ్రనామమును ఉత్తర భారతమునందెల్ల మారుమ్రోయించిన చిరస్మరణీయుడు. ప్రబల సైన్యముల గదలించుకొనిపోయి కణ్వాయనద్విజుడగు సుశర్మనోడించి శుంగవంశమును నిర్మూలమొనరించి మగధ రాజ్య సింహాసన మాక్రమించిన ఆంధ్రయోధు డితడే.* ఈతనిపేరుగల శాసనములు రెండు, అమరావతీ స్తూపముకడ నొకటియు, మహారాష్ట్ర దేశమున నానాఘట్ట శిరోభాగమందలి రాతిగుహాలో నొకటియు గాన్పించినవి. ఈశిలాలేఖనములలో నీతడు "రాణోసిరి శిమక" యనియు, "రాయసిముక శాతవాహనో" యనియు జేర్కొనబడినాడు. శిమక, సిముక శబ్దములు శ్రీముఖశబ్దము యొక్క ప్రాకృతరూపములు

---

* శ్రీముఖుడే శాలివాహన వంశమునకు మూలపురుషుడనియు, సుశర్మను జంపి మగధరాజ్యమును జయించిన ఆంధ్రరాజు ఎవ్వరో మరియొకరనియు స్మిత్తుగారు వ్రాసిరి. వీరి వ్రాతలను చిలుకూరి వీరభద్రరావుగారు సహేతుకముగ ఖండించి సుశర్మను బరిమార్చిన దీతడేయనియు, శాతవాహన వంశస్థాపకు డీతడు గాడనియు ఋజువు జేసిరి. సుశర్మ మంత్రి నోడించి మగధరాజ్యము నాక్రమించినది శ్రీముఖుడేయని వాయు, మత్స్య, విష్ణు, బ్రహ్మాండ పురాణములు ఘోషించుచున్నవి ఈతడీ పురాణములలో శ్రీశుకుడనియు శ్రీప్రుకుడనియు, సింధుకుడనియు వేర్వేరు నామములచే పేర్కొనబడినాడు.

శ్రీముఖుడు క్రీ. పూ 50 వరకును 23 సంవత్సరము లతి వైభవముగ రాజ్యపాలనముజేసి దివికేగెను.

## కృష్ణ శాతవాహనుడు
## (క్రీ. పూ. 50—40)

శ్రీముఖుని తరువాత రాజ్యభారమును వహించినది కృష్ణశాతవాహనుడు ఈతడు పదిసంవత్సరములు మాత్రము రాజ్యముజేసెను. ఈతని పేరుతోనున్న శాసనమొకటి నాసికాపట్టణ సమీపమందలి యొక చిన్నగుహలో గన్పించినది ఇది కృష్ణశాతవాహనుని సైన్యాధిపులలో నొక్కనిచే వ్రాయింపబడిన శాసనము. ఈతనిగూర్చి మనకింతకంటె విశేషములెవ్వియు దెలియవు.

## శ్రీశాతకర్ణి, పూర్ణోత్సంగ, అప్లవ, పులమావి, శాతవాహనులు (క్రీ పూ. 40—52)

కృష్ణుని యనంతరము శ్రీశాతకర్ణి, పూర్ణోత్సంగ, అప్లవ, పులమావులు క్రమముగ రాజ్యభారమును వహించి సుమారు పండ్రెండు వత్సరముల కాలము ఆంధ్ర సామ్రాజ్యము నవిచ్ఛిన్నముగ నేలిరి. కాని వీరిపరిపాలనమును గూర్చిన చరిత్రాంశము లెవ్వియు మనకు లభించుటలేదు వీరిలో శ్రీ శాతకర్ణి* మాత్రము ప్రఖ్యాతపురుషునివలె గాన్పించు

*ఖారవేలునకు సైన్యముల నంపిన దితడేయని పాపమాతినిని స్మిత్తుగారు నూటయేబది సంవత్సరములు వెనుకకు నెట్టిరి. ఆంధ్రులకు ప్రమాణములు లేవు. ఆతడు శాతకర్ణియనువాడు. శాతవాహన శ్రీముఖులకు నడుమ నెప్పుడో వరలినవాడు ఈతడు వేరు. శ్రీశాతకర్ణి, క్రీ. పూ. 40 సంవత్సర ప్రాంతమున ఆంధ్రరాజ్యము నేలినవాడు.

చున్నాడు. ఈతడు 56 వత్సరములు పరిపాలించినట్లు పురాణములు వాకొనుచున్నవి. ఈతడు తనయొక్కయు, తన దేవేరి, పుత్రులయొక్కయు, సేనానులయొక్కయు, 'విగ్రహముల రాతిఫలకములపై జెక్కించెను. అవి నానాఘట్టమందలి గుహాలో నేటికిని గలవు. ఇందు, శ్రీ శాతకర్ణి పట్టపురాణి నాయనికాదేవియని పేర్కొనబడినది

హాలశాతవాహనుడు.

(క్రీ శ 52___79).

తరువాత శాలివాహనవంశజులలో ప్రసిద్ధినొందిన రాజు హాలశాతవాహనుడు మిగుల ప్రఖ్యాతుడు. ఈతని పరిపాలన మాంధ్ర చరిత్రమున ననేక విధముల ప్రాముఖ్యత గడించినది. ఈతడు సమరశూరుడేగాక కవిపోషకుడనిగూడ యితిహాసరంగమున వినుతికెక్కినాడు. ఈయంశమున హాలుని భోజ, విక్రమాదిత్య, కృష్ణదేవరాయ క్ష్మాపాలురతో బోల్పనగును ఈతడు పండిత పోషకుడై, కవుల విద్వాంసుల నాదరించి వారిచే పలుగ్రంథములు వ్రాయించెను. ఈతడును విద్యాసంపన్నుడే తాను ప్రతిష్ఠానపురమున యువరాజుగానుండుకాలమున సప్తశతియను నీతికావ్యమును రచించెను ఇదిప్రాకృతసారస్వతమున పేర్కొనదగిన గ్రంథము. బాణకవి తన హర్షచరిత్రమున నీగ్రంథమును జాలపొగడినాడు ఈతని కాలమున రణవ్యాపారము లేవియు లేకశాంతి ప్రబలుటచే నీతడు విద్యావ్యాసంగమునందే కాలముగడిపి తననామమును భూలోకమున చిరస్థాయిగా జేసికొనినాడు.

పంచాంగములలో మన కనుదినమును గానుపించు శాలివాహనశక మీతని తోడనే ప్రారంభమయినది * దక్షిణాపథమున నిది నేటికిని వ్యవహారములోనున్నది. ఔత్తరాహులకు విక్రమార్కశక మెట్టిదో దక్షిణాత్యులకు శాలివాహనశకమట్టిది. భారతవర్షమునేలిన రాజులు పలువురు తమ తమ శకములు స్థాపించిరిగాని శాలివాహన విక్రమార్కశకములు దక్క తక్కినవేవియు వ్యావహారికలోకమున నిలువలేదు. యుధిష్ఠిర, బౌద్ధ, మౌర్య, గుప్త, వల్లభి, శ్రీహర్షశకనామములు నేడు వినబడవు. విస్మృతములై పోయినవి ఉత్తర హిందూస్థానమున విక్రమార్కశకమును, దక్షిణాపథమున శాలివాహన శకమును నేటికిని వాడుకలో నున్నవి విక్రమార్కశకము క్రీ. శ. 59 సంవత్సరముతో ప్రారంభమైనది శాలివాహన శకము క్రీ శ. 78 సంవత్సరముతో నారంభమైనది.

---

* శాలివాహనశకము హాలునితో నెట్లు ప్రారంభమైనదని కొందరు చరిత్రకారులు శంకించుచున్నారు కాని వీరిసందేహములకు కారణము నాకు గోచరింపకున్నది. హాలుడు మొదటి శాలివాహనుడు గానిచో నాతని తోడ నీశకము ప్రారంభము గాకూడదా? ప్రసిద్ధపురుషులతో, ప్రసిద్ధ సంఘటనములతో శకములు ప్రారంభమగుట గలదు. బౌద్ధశకము బుద్ధుని నిర్యాణముతో (క్రీ. పూ 543) ప్రారంభమయినది హాలుడు శకకర్తయగుటకు సర్వవిధముల దగియున్నాడు. ఈతడు విద్వాంసుడు. విజ్ఞానవిషయములయందభిరుచి గలవాడు. ఈతడు తన నామముగాక దన వంశనామమున నీశకమును ప్రారంభించి యుండవచ్చును లేనిచో నీతని తరువాతివారలు ప్రజారంజకుడును, విద్యాసంపన్నుడును నగు నీతనితో నీశకమును ప్రారంభించి యుండవచ్చును.

మాండలిక, పురీక సేన, సుందరశాతకర్ణ, చకోరశాతకర్ణ, శివస్వాతి శాతకర్ణులు (క్రీ. శ 90-133) యవన,శక, పహ్లావ దండయాత్రలు.

హాలుని తరువాత మాండలిక, పురీకసేన, సుందర శాతకర్ణ, చకోరశాతకర్ణ, శివస్వాతులు వరుసక్రమమున ఏబది నాలుగు వత్సరములు ఆంధ్రసామ్రాజ్యమును పాలించిరి. వీరికాలముననే యవన, శక, పహ్లావ దండయాత్రలు ప్రారంభమై ఆంధ్రసామ్రాజ్యమును కల్లోలపరచినవి ఈ కాలమున ఆంధ్రసామ్రాజ్యమున అరాజకము ప్రబలినది. సంక్షోభము హెచ్చినది ఈరాజుల రాజ్యకాలమంతయు నీవిజాతీయులతో పోరాటములు సల్పుటతోడనే జెల్లిపోయినది. వీరి చరిత్రల గూర్చిన విశేషములేవియు మనకు తెలియవు.

మౌర్యవంశావసానకాలమున మిళిందుడను యవన వీరుడు బహుళసైన్యములతో మగధరాజ్యముపై బడిన యుదంతమును వేరొకసందర్భమున వివరించితిమి. పుష్యమిత్రునిచే నోడింపబడినను, యవనులు భారతవర్షమును విడిచిపోక సింధు, కాశ్మీర, పాంచాలరాజ్యముల నాక్రమించి పాలింప దొడగిరి పిమ్మట కొంతకాలమునకు పహ్లావ (పార్థియనులు) ప్రవాహములు వచ్చి యవనుల బారదోలి పశ్చిమోత్తర భాగమెల్ల నాక్రమించినవి అటుపిమ్మట మరికొంతకాలమునకు శాకులు మిడుతలదండువలె రేగుచు, భారతవర్షమున బ్రవేశించి, పహ్లవుల దరిమి యీప్రదేశములెల్ల నాక్రమిం

చిరి. ఈశకరాజులలో కనిష్కుడు పేరెన్నిక గన్నవాడు. వీని చరిత్రమును ముందు విపులముగ వర్ణింతుము.

శాకులచే వరుమగొట్టబడిన పహ్లవులు, ఉత్తరమున నివసించుటకు తావులేక దక్షిణమునకు ప్రసరింపదొడగిరి. వీరు ఘూర్జర, మాళవరాజ్యముల నాక్రమించుటయేగాక ఆంధ్ర సామ్రాజ్యమునగూడ జొరబడసాగిరి సౌరాష్ట్ర మాళవ దేశములలో రాజ్యములుస్థాపించి పాలింపదొడగిరి. యవన, పహ్లావ, శకరాజులకు క్షాత్రపులనిపేరు.మాళవదేశమున పహ్లావ రాజ్యమును స్థాపించిన క్షాత్రపుడు చష్టనుడు. ఘూర్జరరాజ్య సంస్థాపకుడు భూమకక్షాత్రపుడు.

పహ్లావ, యవనశాకులు మున్నగు విజాతీయులు హిందూదేశమును ప్రవేశించినతోడనే హిందువులమతమును హిందువుల యాచారముల నవలంబించి హిందూజాతు లలో విలీనమై పోయిరి హిందువులతో సంబంధబాంధవ్య ముల నెరపుచు బ్రాహ్మణుల మంత్రులుగనైకొని ప్రజారంజక ముగ రాజ్యమును బాలింపసాగిరి వీరిలో గొందరు హిందువుల కంటె నెక్కుడు అభిమానముతో బ్రాహ్మణ, జైన, బౌద్ధ మతముల వ్యాప్తిజేసిరి

భూమకుని మరణానంతరము ఘూర్జరరాజ్యమున క్షహ రాటావహపానా యనునాతడు రాజ్యభారమును వహించి, మహాక్షాత్రపుడని బిరుదుగొని, పశ్చిమాంధ్రమెల్ల జయించి యాభాగమును దన యల్లుడగు ఋషభదత్తునకు బట్టము గట్టెను నహాపానుడు తనకూతురగు దక్షమిత్రను ఋషభ

దత్తునికిచ్చి పెండ్లిజేసి, యాతని పశ్చిమాంధ్రమునకు రాజుగ జేసెను. "ఆయముడను" బ్రాహ్మణుని దన మంత్రిగ గైకొనెను. ఋషభదత్తుడు పరోపకారియై యనేక దానధర్మముల జేసినట్లు, నాసికలోని శాసనములు గొన్ని దెలుపుచున్నవి. ఈతడు త్రిరాస్మి శిఖరముపై నొకగుహ దొలిపించినట్లు, బ్రాహ్మణులకు మూడులక్షల గోదానముల జేసినట్లు యాత్రికుల కనుకూలముగ నుండునటు వారణాస్యనదికి సోపానములు గట్టించినటు, దేవబ్రాహ్మణులకు పదునారు గ్రామములు దానముజేసినట్లు, ప్రతివత్సరమును లక్షబ్రాహ్మణ్యమునకు భోజనములు పెట్టినట్లు, సోమనాథపట్టణమున నెనమండుగురు బ్రాహ్మణులకు వివాహములు గావించినట్లు, భరుకచ్ఛమున గృహములు, విశ్రాంతిమందిరములు నిర్మించినట్లు, మాళవ రాజ్యములోని, దశపుర, గోవర్ధన, శూర్పరాగ బట్టణములందు ఆరామముల నిర్మించినట్లు, బావుల, చెరువుల ద్రివ్వించినట్లు, ఇవా, పారదా, దమనా, తాపీ, కరవేణా, దాహానుకా నదులలో రేవుపడవల వేయించినట్లు, ఈనదుల కిరుకెలంకులందు బాటసారులకొరకు విశ్రాంతి గృహముల, చలిపందిళ్ల గట్టించినట్లు, మలయులచే చెరగొనబడినయుత్తమ భద్రక్షత్రియ నాయకుని కొరకైపోరునలిపి యాతనివిడిపించినట్లు, పుష్కరిణీనదిలో స్నానమాచరించి యాసందర్భమున మూడువేలగోవుల బ్రాహ్మణులకు దానమిచ్చినట్లు, నాల్గుదెసలనుండియరుదెంచు బౌద్ధసన్యాసుల యుపయోగార్థమై విహారము ను నిర్మించినటు, అందునివసించుబౌద్ధభిక్షువులకువర్ష ఋతువునందు దుప్పటముల గొనియిచ్చుటకై రెండువేలకర్షపణముల

గోవర్ధనములోని నేతగాండ్రకూటమి యొద్దనుంచినట్లు, యీశాసనములలో నుదాహరింపబడినది. దీనినిబట్టి ఋషభదత్తుడుమిగుల దానశీలుడనియు ప్రజారంజకముగ రాజ్యమును పాలించెననియు దేటపడుచున్నది. ఈతడు బ్రాహ్మణపక్షపాతియైనను బౌద్ధబ్రాహ్మణమతముల సమముగా నాదరించినవాడు

ఇట్లు శకపహ్లవాదుల దండయాత్రలచే ఆంధ్రరాజ్యము సంక్షుభితమయ్యెను. పశ్చిమాంధ్రము వారిహస్తగతమయ్యెను. చకోరశాతకర్ణి శివస్వాతి యున్నగు శాతవాహనులు తమ పౌరుషము మెరపించిరిగాని కార్యము లేకపోయినది. గట్టు తెగి పారు మహాప్రవాహమువలె వచ్చుపడు నీ విజాతీయపుమూకలరాకల నడ్డుసేయజాలరైరి.

### గౌతమిపుత్ర శాతకర్ణి *
### (క్రీ శ 133—154)

శివస్వాతి తరువాత ధాన్యకటకసింహాసనమ ధిష్ఠించిన వాడు గౌతమిపుత్రశాతకర్ణి మహాయోధుడు యవన, శక

*కొల్హాపురమునందు దొరకిన కొన్ని నాణెములపై గౌతమిపుత్రి విలివాయకురునినామము గాన్పించుటచే నాతడె గౌతమీపుత్రశాత్రికర్ణియని స్మిత్తుగారు తమగ్రంథమున వ్రాసిరి. పొరపాటు. ఈవిలివాయకురుని నామము పురాణములలో చేర్కొనబడిన శాలివాహనన్రుపులనామములలో నెచ్చటను గాన్పింపదు. యథార్థముగ నీతడు శ్రీపులమాయి యజ్ఞశ్రీశాతకర్ణి నృపాలుర కాలములో "హిపొక్కురో" (కొల్హాపుర) మండలమును (దక్షిణమహారాష్ట్రప్రాంతమును) పాలించిన ప్రతినిధిపాలకుడుగాని ధాన్యకటకపురాధీశ్వరుడుగాడు టాలమీచరిత్రకారుని భూగోళ మిందుకు ప్రమాణము. "బలియొకురోసు" (విలివాయకురుడు) హిపొక్కురోలో (కొల్హాపురమున) నున్నవాడని యీచరిత్రకారుడు స్పష్టముగ వ్రాసినాడు.

పహ్లవసమూహముల నురుమాడి ఆంధ్రసామ్రాజ్య స్వాతంత్ర్యమును గాపాడిన వీరాగ్రణి. ఈతడు ఐమూళసైన్యము లతో శక,పహ్లవులపై దాడివెడలి వారిని దలుమగొట్టి వారలచే నాక్రమింపబడిన రాజ్యములనెల్ల జయించెను. ఘూర్జరముపై దండెత్తి, క్షహరాటానాహపానుని బరిమార్చి వానివంశము నంతమొందించెను. ఈత డపజయమన్నమాట యెరుగడు. శక పహ్లవాదుల ననేక యుద్ధములలో నోడించి, దిగ్విజయముల గొని, దిగ్జయస్తంభముల బాతెను. పశ్చిమాంధ్రమునుండి పహ్లవుల దరిమి యాప్రాంతమునకు దన కుమారుడగు పులమాయిని రాజప్రతినిధిగ జేసెను ఆంధ్రసామ్రాజ్య సింహాసన మధిష్ఠించిన వీరులలో నీతడగ్రగణ్యుడు ఈతనిరాకతో శక, యవన పహ్లవ రాజ్యములు మాటుమణిగి పోయినవి. తన శౌర్యపటిమను, సమరకౌశలమును, పెక్కు రణక్షేత్రముల ప్రదర్శించి ఈతడు ఆంధ్ర శౌర్యప్రభావమును జూపినాడు.

ఈతని దిగ్విజయముల దెల్పు శాసనము లనేకములు నాసికాపట్టణ సమీపమున నున్నవి. ఈతడు అస్మిక, ఆసిక, మూలక, సురాష్ట్ర, కుకుర, అపరాంత, అనూప, విదర్భ, అకరావంతిదేశముల బాలించెనని యొక శాసనమున దెలుపబడినది." ఈతడు సదాచారసంపన్నుడని, సద్గుణశీలుడని, విద్యానిధి యని, ప్రజల సుఖదుఃఖముల దనవిగా భావించుకొనినవాడని యీశాసనములు నుడువుచున్నవి ఈతనితల్లి గౌతమి ఈమెవీరమాతవలె గాన్పించుచున్నది. ఈమెకూడ పెక్కుశాసనముల వ్రాయించెను. ఈమె "యవన,శక, పహ్లవుల నుగ్గుచేసి చాతు

ర్వర్ణసంకరము గాకుండ జేసినట్టియు, ధర్మశాస్త్రానుసారముగ ప్రజలయొద్దనుండి గైకొనిన పన్నుల యుక్తముగునట్లు వెచ్చించినట్టియు, పౌరాగ్రేసరునకు దాను తల్లియైనట్లు సగర్వముగ నొకశాసనమున జెప్పుకొన్నది.

గౌతమిపుత్రశాతకర్ణుడు బౌద్ధమతాభిమాని. నాసిక పట్టణసమీపమున నీతడొక గుహాలయమును నిర్మించి భద్రాయనీయశాఖలోని బౌద్ధభిక్షువులకు దానమిచ్చినట్లు ఒక శాసనము దెల్పుచున్నది. మఱియు వందలకొలది నివర్తనములు విస్తీర్ణముగల్గిన పొలముల గ్రామములకూడ నీతడును నీతని రాణియు, నీతని జననియు సాధువులకు దానములు జేసినట్లు శాసనములు జెప్పుచున్నవి.

గౌతమిపుత్రుని సామ్రాజ్యము ఉత్తరమున గంగానదీ తటమునుండి దక్షిణమున కాంచీపురము వరకును వ్యాపించి యుండినట్లు గాన్పించుచున్నది.*

ఈతడు మగధాధిపుడని పెక్కుగ్రంథములందు జేర్కొనబడినాడు. ఈతడు నహపానుని జయించి అతని నాణెముల మీదనే తనపేరునుగూడ ముద్రింపించెను. ఇట్టి నాణెములు తొమ్మిదివేలు మహారాష్ట్ర దేశమున యిటీవల దొరకినవి. వానిపై వెనుకప్రక్కను, "రాణ్ణో గోతమి పుతాస, సిరి శాతకానీనో" అని చిత్రింపబడి యున్నది

*ఇందులకు "ఇల్లంకో అడికాల్" అను తమిళకవిపతంసుడు రచించిన "చీలప్పదికార" మను తమిళకావ్యము సాక్ష్యము. గోతమిపుత్రుడు మగధాధీశ్వరుడని యీగ్రంథము పేర్కొనుచున్నది.

ఈరాజమౌళి కీర్తి చాలదూరము వ్యాపించుటచే పలువురు రాజన్యులీతని స్నేహము నపేక్షించినట్లు దెలియుచున్నది. చేరరాజగు 'చెంకుట్టువాను'ను, సింహళ ద్వీపము నేలు 'గజబాహువు'నః యీతనితో చెలిమి పాటించిరి. విజయసేన కనకసేనులకును (ఆర్యరాజులు) చెంకుట్టువానునకును పొసగిన పోరాటములో మన శాతకర్ణి తననెచ్చెలియగు చేరరాజునకు సేనలనంపి సాయమొనర్చెనని ఇల్లంకో అడికాలుని కావ్యము నుడువుచున్నది.

గౌతమీపుత్రశాతకర్ణి నహపానుని దునిమి యాతని రాజ్యమునకు, చష్టనుడను నొకపహ్లవుని రాజప్రతినిధిగ నియమించెనని స్మిత్తుగారు వ్రాసిరి. ఇందుకు చరిత్ర ప్రమాణములు గన్పింపవు. గౌతమీపుత్రుడు శాత్రవానీకములోని వానినే పరల మాళవమునకేలికగ జేసెనను మాట విశ్వాసనీయము గాకున్నది.

గౌతమీపుత్రుడును అతని తరువాతి రాజులును తమ నామములకు ముందు తమ తల్లుల నామముల జేర్చుకొనుచుండుటచే యిందేదియో నొక విశేషముగలదని పొడగట్టుచున్నది అట్లనుటచే వీరినన్యులుగా భావింప రాదు వీరున్ను శాతవాహనకుదుటిలోనివారలె. వీరితల్లులు సత్కుల సంజాతలును రాజతంత్రనిపుణలునై తమ తనయులకు రాజ్యనిర్వహణమున దోడ్పడుచు దాన ధర్మాధికములచే ప్రఖ్యాతి వహించిన వారలగుటచే యీరాజులు తమ పేరులతో తమ తల్లుల నామములగూడ జేర్చుకొనుట యాచారమైయుండెనని యూహింపవలసి వచ్చుచున్నది.

## వాసిష్ఠీ పుత్ర శ్రీపులమాయి.

### (క్రీ శ. 154-- 158)

ఈతడు గౌతమిపుత్రుని తనయుడు బాహుబలుడు. పోటుమానిసి గౌతమి పుత్రుడు శక, పహ్లావయవనులతో సలిపిన సంగ్రామములలో నీతడు తనతండ్రికి కుడి భుజమై మెలగి అనేకరణరంగముల తన ప్రతాపమును జూపి విజయములగొని శౌర్యరాశియని పేరుమ్రోగెను ఈతడు తన తండ్రి రాజ్యకాలమున, ప్రతినిధిగనుండి, పశ్చిమాంధ్రము నేలెను గౌతముడు మరణించినతరువాత నీతడు క్రీ శ. 154వ సంవత్సరప్రాంతమున ధాన్యకటకసింహాసనమున కభిషిక్తుడయ్యెను. ఈతని పేరుతోనున్న దానశాసనమొకటి అమరావతిస్తూపముకడ గన్పించినది. ఇందు కొందరు బౌద్ధగృహస్థు లోకానోకచైత్యమునకు ధర్మచక్రమొకటి దానము జేసినట్లు లిఖింపబడినది

గౌతమిపుత్ర శాతకర్ణి, తమ సైన్యముల నురుమాడి తమరాజ్యముల నెల్లనాక్రమించిననాటనుండియు, శకపహ్లావయవనుల హృదయ కుహరములలో క్రోధానలము ప్రజ్వరిల్లుచుండెను ఎన్నడు ఆంధ్రరాజ్యమును ముట్టడించి కడతేర్తుమాయని యుడికి పోవుచుండిరి కాని చేయునదేమి? గౌతమి పుత్రుడు రణవిక్రముడు, శౌర్యనిధి అతనిలో యని సేయ సాహసించుట పులితోటి చెలగాట లాడుట ఆతని బొందెలో జీవములుండు దనుక తమకు విజయము కలోనివార్త అందువలన నీశాత్రవవీరులు తమమానసము లందు రేగుచున్న

క్రోధమును లోలోపలనే యడంచుకొనుచు గౌతమిపుత్రుఁడు గతించువరకును కుక్కినపేనులవలె నడగి పడియుండి యాతని ప్రాణము లెగసిపోయి నంతనే విజృంభింపసాగిరి. ఈ తరుణమున చష్టనుని కుమారుడు జయదాముడు × ఉజ్జయినికి క్షాత్రపస్వామియై మాళవమును బాలించు చుండెను. చష్టనుడు గతించెను. జయదాముడు బాహుబలుడు, రణవిశారదుడు. క్షాత్రపులకుగల్గినపరాభవమునుసహింపజాలక ఈతడు మహారోషముతో సైనిక వాహినుల గూర్చుకొని ప్రతిష్ఠానముపై దండెత్తివచ్చెను. పులమాయి జయదాములకు ఘోర

---

× ఈతని కుమారుడగు రుద్రదాముని కూతురు దక్షమిత్ర శ్రీపులమాయికి వివాహము గావింపబడినట్లును రుద్రదాముడు పులమాయిని రెండు సారులోడించియు, జామాతయని కరుణించి యాతని రాజ్యము నాక్రమింపక విడచినట్లును స్మిత్తుగారు తమ చరిత్రమున వ్రాసినారు. వీరి వ్రాతలు ఆధారశూన్యములు. వీరు శకాబ్దము 72 సంవత్సరమున రుద్రదామునిచే లిఖింపబడిన యొక శాసనము నాధారముచేసికొని యిట్లు వ్రాసిరి. ఈ శాసనమున "దక్షిణాపథము నేలు శాతకర్ణిని రెండు మారులు జయించియు నతడు సమీపబంధువగుటచే నాతని రాజ్యమును నాశనము జేయలే"దని వ్రాయబడినది. పాపము స్మిత్తుగారు యీశాతకర్ణియే పులమాయియని భ్రమపడినారు. కాని యీతడు వేరు. పులమాయి గాడు పులమాయికి శాతకర్ణియను బిరుదములేదు. ఈతడు గౌతమి పుత్రుని తనయులలో నొకడు. వాసిష్ఠీ పుత్ర శాతకర్ణియను వాడు ఈతనికి వాసిష్ఠీపుత్రచతుష్పర్ణ శాతకర్ణియను నామాంతరము గూడ గలదు. ఇతడు దక్షిణాపథమున నెచ్చటనో రాజప్రతినిధిగ నుండిన వాడు ఇందుకు నిదర్శనముగ కనేహరినూపము కడ గాన్పించిన శాసనములలో నొక దానియందు "మహాక్షాత్రపుడైన రుద్రదాముని తనయయు, కర్దమక రాజవంశమునందు జనించిన వాసిష్ఠీ పుత్ర శాతకర్ణుని రాణియు" నని యున్నది. దీనినిబట్టి రుద్రదాముని యల్లుడు వాసిష్ఠీ

సంగ్రామము జరిగెను. పులమాయి యీయుద్ధమున క్షాత్రప సైన్యముల తునియలు గావించుటయె గాక, జయదాముని దరిమి కొట్టి యాతని రాజ్యమెల్ల నాక్రమించెను. మాళవము ఆంధ్రుల వశమయ్యెను.

## శివశ్రీ శివస్కందులు.
## (క్రీ శ. 158—172).

పులమాయి దివికేగినపిమ్మట యాతని సోదరుడగు, శివ శ్రీ శాతకర్ణియు, యాతని మనుమడగు శివస్కందుడును క్రీ.శ 172 సంవత్సరప్రాంతమువరకు నాంధ్రసామ్రాజ్యము నేలిరి ఈయుభయులును, బ్రాహ్మణ మతావలంబులై, బ్రాహ్మణమతముపట్ల నభిమానముఁజూపిరి. వీరుబ్రాహ్మణులకు మడిమాన్యములఁ దానమిచ్చుచు యజ్ఞయాగాదులఁగూడ సలిపి నట్లు గాన్పించుచున్నది

---

పుత్రిశాతకర్ణి గాని వాసిష్ఠిపుత్రి పులమాయిగాదని స్పష్టమగుచున్నది. మఱియు దక్షమిత్ర నహపానుని కొమార్తెయనియు ఋషభదత్తుని భార్యయనియు నాసికశాసనము నుడువుచున్నది. అదిగాక పులమాయికి రుద్రదాముని తాతయగు చష్టనుడు, సమకాలీనుడని టాలెమీ వ్రాసినాడు అంతియె గాని పులమాయి కాలమున రుద్రదాముడు వరలినట్లెచ్చటను గానరాదు. ఈతడు వాసిష్ఠీ పుత్రచతుష్పర్ణి శాతకర్ణికిని యాతని తనయుఁడగు యజ్ఞశ్రీ శాతకర్ణికిని సమకాలికుడని నిదర్శనములు గన్పించుచున్నవి. ఈవిమర్శనల బట్టి స్మిత్తుగారి గ్రంథమెట్టి యసందర్భపు వ్రాతలతో నిండియున్నదో తేటపడుచున్నది

## యజ్ఞ శ్రీ శాతకర్ణి.
## (172—205).

శాలివాహనుల ప్రభ అస్తాద్రి జేరుసమయమున, తుది రంగమున ప్రఖ్యాతిగాంచిన రాజు యజ్ఞశ్రీశాతకర్ణి. ఈతడు ముప్పదిమూడు సంవత్సరములు రాజ్యమేలెను. ఈతడును సమర శూరుడె. ఈతడుచతుష్పర్ణ శాతకర్ణుని తనయుడు. ఈతని తల్లి ఉజ్జయిని క్షాత్రపుల యింటి యాడుపడుచు. శివశ్రీ శివస్కందుల రాజ్యకాలమున నీతడు ప్రతిష్ఠానమునకు రాజ ప్రతినిధిగ నుండెను మాళవరాజ్య మీతని కాలమున స్వాతంత్ర్యము వహించినట్లు గాన్పించుచున్నది. ఆంధ్రసామ్రాజ్యము లోని యంతర్భాగమై, రుద్రదామునిచే నాక్రమింపబడిన అవంతి రాష్ట్రమును జయించుటకై యీతడు రెండుమారులు రుద్రదామునితో రణమొనర్చి ఓడిపోయి విఫలమనో రథుడయ్యెను. జనగడ శాసనములో రుద్రదాముడు దాను దక్షిణాపథపతియైన శాతకర్ణిని రెండుమారు లోడించితినని వ్రాసిన శాతకర్ణి యీయజ్ఞశ్రీ శాతకర్ణియె

ఈ వీరమౌళిపేర లిఖింపబడిన శాసనములు నాసిక, కార్లి, చినగంజాము మున్నగు ప్రాంతములందు గాన్పించుటచే యీతని రాజ్యము చాల దూరము విస్తరించి యుండవలెను. ఈతడు బ్రాహ్మణ బౌద్ధమతముల రెంటిని సమముగ నాదరించెను. మహాయానమత సంస్థాపనాచార్యుడగు నాగార్జున యతి యీతని కాలముననే మనినట్లు గాన్పించుచున్నది.

---

♦ నాగార్జునుడు ఇతని కాలమున నున్నట్లు పెక్కు నిదర్శనము లుంగలవు.

ఈతనికొఱకు మన శాతకర్ణి యొక సంఘారామము నిర్మించె ననికూడ ప్రతీతి. ఈసంఘారామ మెచ్చట విలసిల్లినదో తెలియకున్నది కొందఱు చరిత్రకారులు ఇది శ్రీశైలపర్వతముమీఁద నిర్మింపబడినదనియు, ఫాహియాను, పారావత విహారమని వర్ణించిన దిదియేయనియు వాదించుచున్నారు. ఫాహియాను వర్ణించిన పారావతవిహార మిదియైనను గాకపోయినను యజ్ఞశ్రీ శ్రీశైలపర్వతముపై నాగార్జునుని యావాసమునకై యొక సంఘారామమును నిర్మించినమాట నిర్వివాదాంశమువలె గాన్పించుచున్నది. అది నేఁడు ఖిలమైపోయి యుండవచ్చును. త్రివిష్టప చరిత్రలు నాగార్జునుడు శ్రీపర్వతముపై పరమపదించె నని నుడువుచున్నవి ఆ శ్రీపర్వతమే శ్రీశైలపర్వతమై యుండును. శ్రీశైలపర్వతమును శ్రీపర్వతమని పురాణములు పేర్కొనుట గలదు.

యజ్ఞశ్రీనాణెములన్నియు నౌకాలాంఛనముగలవి. ఓడ, వానిపై చిత్రింపబడినది దీనినిబట్టి నౌకావ్యాపారము వీనికాలమున విరివిగజరిగినదని మన మూహింపవలసియున్నది. సింహళ,సుమిత్ర,యవ, భరణిద్వీపములతోడను, చీనా, బ్రహ్మ దేశములతోడను ఆంధ్రరాజ్యము శాతవాహనుల కాలమున విశేషముగ సముద్రవాణిజ్యము నెరపినది. మనము పూర్వకాలమున నెప్పుడును, నౌకాయానమే యెఱుగమని వదరు పాశ్చాత్యచరిత్రకారుల నుడువులు సత్యవిరుద్ధములు; అసూయాజనితములు

## ఆంధ్రసామ్రాజ్య విచ్ఛిన్నము

యజ్ఞశ్రీ తరువాత ఆంధ్రసామ్రాజ్యము క్రమముగ జీర్ణించి యంతర్హితమైపోయినది. యజ్ఞశ్రీతోడనే ఆంధ్రసామ్రాజ్యవైభవ మంతరించినది. ఇంక కొంతకాలము 240 సంవత్సరప్రాంతమువరకు నీరాజ్యము సజీవముగ నున్నది కాని యంతవైభవప్రదముగ లేదు. జీవచ్ఛవమువలె పక్షపాతముచే అంగదౌర్బల్యముగల్గిన మనుజునిరీతి మరికొంతకాలమిది జీవించినది ఈకాలమున విజయశ్రీ, చంద్రశ్రీ, శాతకర్ణులు, పులమావి, ఆనందుడు, హారీతపుత్రశాతకర్ణి మున్నగురాజులు ఆంధ్రరాజ్యమును పాలించిరి. వీరి రాజ్యకాలమున ఆంధ్రసామ్రాజ్యము జీర్ణమై పెక్కురాజ్యములుగ చీలిపోయినవి రాష్ట్రకూటులు, కాలచుర్యులు, కాదంబులు, పల్లవులు చెలరేగి ఆంధ్రసామ్రాజ్యాధిపుల ధిక్కరించి వేర్వేరు రాజ్యముల నిర్మించుకొనిరి. ఆంధ్రసామ్రాజ్య మహాసౌధము కూలిపోయినది పైనవివరించిన ఆంధ్రరాజులలో విజయశ్రీ శాతకర్ణి (208 సంవత్సర ప్రాంతమున రాజ్యమేలినవాడు) విజయవాడ పట్టణమును నిర్మించినట్లు గానబడుచున్నది. మూడవశతాబ్దమునాటి ఆంధ్రదేశ యితిహాసరంగము అంధకారమున మున్గియుండుటచే ఆంధ్రసామ్రాజ్య మెట్లు అవసాన మొందినదియు తెలిసికొనుట దుస్సాధ్యముగనున్నది కాని ఆంధ్రభృత్యవంశము క్రీ. శ 240 సంవత్సర ప్రాంతమువరకును ఆంధ్రసామ్రాజ్యమును పాలించినట్లు పురాణములును శాసనములును నుడువుచున్నవి.

ఆంధ్రభృత్యవంశ మంతరించినవెనుక పార్వతీయాంధ్ర వంశమను నొకయాంతశ్శాఖ బయలువెడలి కొంతకాల మాంధ్రరాజ్యమునుబాలించినట్లువాయు, మత్స్యపురాణములు వాకొనుచున్నవి

## ఆంధ్ర సామ్రాజ్యవిభవము.

ఆంధ్రసామ్రాజ్యము శాలివాహనులకాలమున మహోన్నతదశ ననుభవించినది. సొబగులీనెడు పట్టణములతో, సస్యవంతములగు గ్రామములతో, శిల్పసంపదలతో, సంగ్రామశూరులగు ప్రజానీకములతో, నీసామ్రాజ్యము కనులపండువవై వెలిగినది ఆంధ్రసామ్రాజ్యపతాకము భారతవర్షమున నాలుగుశతాబ్దములకాలము నిరాఘాటముగ నెగిరినది. ఈసామ్రాజ్యము నేలిన శాతవాహనుల పరిపాలనము సర్వోత్కృష్టమై నెగడినది వీరికాలమున ఆంధ్రసామ్రాజ్యము నలుముఖముల విస్తరిల్లి భారతవర్షమున నొక మేటిసామ్రాజ్యమై ప్రఖ్యాతివడసినది పెక్కు శతాబ్దములు వరలె మహాసామ్రాజ్యమని పేరువహించిన మగధసామ్రాజ్యమును వీరవలీల జయించిరి వీరికాలమున శిల్పకళ యభివృద్ధినొందినది. వాణిజ్యము పెంపొందినది వ్యవసాయము విరివిగ సాగినది. ప్రజలు సుఖించిరి శిల్పచిత్రములలో మురిపెములు గొలుపు స్తూపములు, విహారములు, ఈకాలమున తామరతంపరగ, ఆంధ్రదేశమం దెల్లెడల కల్పింపబడినవి జగ్గయ్యపేట, భట్టిప్రోలు, చినగంజాము, గుడివాడ, ఘంటసాల మున్నగు ప్రదేశములందు స్తూపములు వెలసినవి జగద్విఖ్యాతమగు

అమరావతిస్తూప మీనాటిదే శ్రీశైలము, అమరావతి, విజయవాడ, గుంటుపల్లి, మొగలిరాజపురము మొదలగు ప్రాంతములందు మనోహరములగు విహారములు నిర్మింపబడినవి. ఆకాలమున నివి వేలకొలది బౌద్ధభిక్షువులతో కలకలలాడినవి

## ఆంధ్రసామ్రాజ్య విస్తీర్ణత

విస్తీర్ణతయం దాంధ్రసామ్రాజ్యమునుబోలినసామ్రాజ్యమాకాలమున వేరొకటి లేదు మగధసామ్రాజ్యము జీర్ణించిపోయిన వెనుక భారతదేశమున యింతటి సామ్రాజ్యము విస్తరిల్లినదిలేదు. ఆంధ్రసామ్రాజ్యము* మైసూరు మొదలు గంగానదివరకును వ్యాపించినది దక్షిణమున పాండ్య, చోళ, కేరళ రాజ్యములును, ఉత్తరమున సింధు, సౌవీర, కన్యాకుబ్జ, పాంచాల, కాశ్మీర, కాశీ, ఉత్తరకోసల, నేపాల, భూపాల, కామరూప, బ్రహ్మదేశములును మాత్రము యీ సామ్రాజ్యమున జేరలేదు తక్కటి యావద్భారతదేశమును యీ సామ్రాజ్యమున యంతర్భాగమైనది

## ఉత్తమరాజ్యపద్ధతులు

ఈసామ్రాజ్యమువిస్తీర్ణతకెట్టి పేర్గాంచినదో, ఉత్తమ రాజ్య పద్ధతులకుగూడ నట్టి ప్రఖ్యాతినే బొందినది శాలివాహనులపరిపాలనము సర్వాంగసౌష్టవమై దనరారినది వీరికాలమున

---

* మైసూరు రాజ్య మాంధ్రసామ్రాజ్యమున జేరలేదని కొందరు వాదింతురు కాని ఆంధ్రరాజులరాజప్రతినిధియై "వనవాసిని" రాజధానిగ జేసికొని దక్షిణ కుంతలమును పాలించిన హారితిపుత్రశాతకర్ణుని దానశాసనము లున్నవి

ప్రజలు రాజ్యపీడన మెట్టిదో యెఱుగక సౌఖ్యమున నోలలాడిరి. మతహింస లీకాలమున వినరావు. శాలివాహనులు బౌద్ధమతావలంబులైనను బ్రాహ్మణమతమును ద్వేషించి యెఱుగరు. వారి రాజ్యకాలమున బ్రాహ్మణ, బౌద్ధమతములు సమముగ వర్ధిల్లినవి బ్రాహ్మణమతాభిమానియగు ఋషభదత్తుడు బౌద్ధులకు గుహాలయములు దొలిపించి యిచ్చెను. శీతకాలమున బౌద్ధ పరివ్రాజకులకు దుప్పటముల గొనియిచ్చుటకై యనేక కర్షపణములు వర్తకసంఘములకడ నిలువయుంచెను. గౌతమి పుత్రశాతకర్ణి బ్రాహ్మణుల నాదరించినట్లు ఆతని దానశాసనములు దెల్పుచున్నవి

శాలివాహనుల కాలమున ప్రజాపరిపాలనాపద్ధతులు వికసిల్లినవి. ప్రజాసంస్థలు పెంపొందినవి ఈకాలమున జనోపయోగకరములగు కార్యముల నన్నిటిని, ప్రజలే నిర్వహించుకొనెడువారు ఇట్టికార్యముల నిర్వర్తించుటకై యీకాలమున పౌరసభ లేర్పడినవి. అట్టి పౌరసభలు రెండు, భట్టిప్రోలు శాసనమున జేర్కొనఁబడినవి. వీనిలోని సభ్యులనామములు గూడ యిందుదహరింపఁబడినవి.

## వాణిజ్యము

వీరికాలమున వాణిజ్యము అపారముగ వృద్ధిబొందినది. ఈకాలమునాటి వణిజులు, వాణిజ్యముచే అశేష ధనము నార్జించి కుబేరులైనట్లు గాన్పించుచున్నది కార్లీ గుహాలయము జయంతపురీ నివాసియగు నొకవర్తకునిచే నిర్మింప బడిన దట! ఆకాలమునాటి వణిజులు కనేహారి, ధాన్యకటక నగర

ములలోగూడ, అద్భుతమగు దానధర్మములు జేసినట్లు నిద ర్శనములు గన్పించుచున్నవి. ఇదిగాక యీకాలమున వర్తకము లుండినవి.

ఇవి యీకాలమునాటి వాణిజ్యాభివృద్ధిని వేనోళ్లజాటు చున్నవి. నేతగాండ్రకు, ధాన్యవిక్రేతలకు, మణికారకులకు నూనెనమ్మువారలకు వేర్వేరుసంఘములుగలవు. ఋషభ దత్తుడు గోవర్ధనములోని నేతగాండ్రకూటమికడ బౌద్ధభిక్షుల యుపయోగార్థమై రెండువేల కర్షపణముల నిలువయుంచెనని నాసికలోని యొకశాసనము దెల్పుచున్నది దీసినిబట్టి యీవర్తక సంఘము లాకాలమున నెట్టిగౌరవస్థాన మలంకరించినవో దేట పడుచున్నవి ఈసంఘములు ఉత్తమపద్ధతులపై నడిపింపబడినట్లు గోచరించుచున్నది. ఈకాలమున ధనినిధులు (బ్యాంకులు) జేయు చున్న కార్యముల నాకాలమున నీసంఘములుజేసినవి ప్రజలీసం ఘములకడ తమసొమ్ముల దాచుకొనెడివారు ఈపద్ధతి యీకా లమున నాచరణలో నుండెనని ఋషభదత్తుని దానశాసనమే జెప్పుచున్నది ఈసంఘములు ప్రజలధనములను భద్రముగ గాపాడుచు, వారలసొమ్ములు దమకడ నిలువయున్నందులకు వారికి వడ్డికూడ నిచ్చెడివారు ఈసంఘముల మూలమున నాకాలమునప్రజాపరిపాలనా పద్ధతులు పెంపొందినవనుట కెంత మాత్రమును సందియములేదు.

శాలివాహనులు, వాణిజ్యాభివృద్ధికై యెన్నియో సౌక ర్యముల గల్పించిరి నాణెముల పోయించిరి. బాటల వేయించిరి ఓడల నౌకాశ్రయముల రేవుపట్టణముల నిర్మించిరి ఆంధ్ర

రాజుల నాణెములు సీసముతోడను, రాగితోడను, వెండితోడను చేయబడినవి వీరినాణెములు వేనవేలు ధాన్యకటక, గుడివాడ, ప్రతిష్ఠాననగరప్రాంతములందు గన్పించినవి వీనిలో గౌతమిపుత్ర, యజ్ఞశ్రీ, చంద్రశ్రీ పులమావుల నాణెములు పెక్కులుగలవు.

ఈకాలమున సముద్రవ్యాపారముకూడ విరివిగ సాగినది. ఆంధ్రదేశము సింహళ, యవ, సుమిత్ర, భరణి ద్వీపములతోడను, కామరూప, బ్రహ్మ, రోమక దేశములతోడను వాణిజ్యము నెరపినది యజ్ఞశ్రీ శాతకర్ణి నాణెములపై నౌకాప్రతిమ చిత్రింపబడినది. దీనివలన ఆంధ్రులకు నౌకాయాన, నౌకానిర్మాణములుగొత్తలు గావని దెలియుచున్నది. మరియు గుడివాడ, ఘంటసాల, నెల్లూరు ప్రాంతములందు రోమక నాణెములుచాల దొరకినవి నెల్లూరు సమీపమున నొకపొలము దున్నుచుండగా నొక మట్టిపాత్రలో నిక్షిప్తమొనర్పబడి పెక్కురోమకనాణెములుగన్పించినవి ఇవి రెండవశతాబ్దమునాటి నాణెములు వీనిపై ఆడ్రియాన్, పోస్టినాముస్నగురోమను చక్రవర్తుల ప్రతిమలు చిత్రింపబడినవి దీనినిబట్టి యీకాలమున ఆంధ్ర రోమక రాజ్యములకు వాణిజ్యము విశేషముగ జరిగినదని స్పష్టమగుచున్నది ఇదిగాక యీకాలమునాటి ఆంధ్రదేశమున విదేశములతో వర్తకవ్యాపారముల విరివిగ నెరపిన రేవుపట్టణము లనేకములు వెలసిల్లినవి. అమరావతి, మోటుపల్లి, మచిలీపట్టణము లాకాలమున ప్రసిద్ధికెక్కిన రేవుపట్టణములు. పూర్వమునుండియు మోటుపల్లి

వజ్రములకును, రవసెల్లాలకును ప్రఖ్యాతి గడించినది. మోటుపల్లి ప్రాంతమున నేత పరిశ్రమ యనేకశతాబ్దములు మహోత్కృష్టదశయం దుండినట్లు గాన్పించుచున్నది. పదునాల్గవ శతాబ్దమున భారతవర్షమున కేతెంచిన మార్కొపోలో, 'ముటఫిలి' (మోటుపల్లి) రవసెల్లాల ప్రస్తుతించినాడు. టాలమీయును (క్రీ॥ శ॥ 150) "పెరిప్లస్ ఆఫ్ ఇరిత్రయన్ సీ" అను గ్రంథమును వ్రాసిన చరిత్రకారుడును (క్రీ॥ శ॥ 80) మాసాలియా యను పట్టణ మాకాలమున (రెండవశతాబ్దమున) ప్రఖ్యాతి గాంచిన రేవుపట్టణమని పేర్కొనియున్నారు 'ఈమసాలియా' మచిలీపట్టణమో, మోటుపల్లియో అయియుండును.

ఈకాలమున ఓడలు, అరేబియా, ఐగుప్త, రోము, గ్రీసు, పారశీక దేశములనుండి పశ్చిమ సముద్ర తీరము నందున్న భరుకచ్ఛ, (బ్రోచి) సింహపుర, శూర్ప రాగములకు తరుచుగ వచ్చెడివి. అచ్చటనుండి కేరళ, చోళ తీరముల నంటి సింహళమునకుబోయి యటనుండి ఆంధ్ర, కళింగ, దేశములలోని రేవు పట్టణముల మీదుగ గంగానదీ ముఖద్వారమునున్న తామ్రలిప్తినగరమునకు బోయెడివి. ఆకాలమున భరుకచ్ఛమునుండి సింహళమునకు, సింహళమునుండి తామ్రలిప్తికిని సముద్రమార్గము లుండెను.

## కళలు, పరిశ్రమలు, వాఙ్మయము

### శిల్పము.

శాతవాహనుల కాలమున కళలు, పరిశ్రమలు, వాఙ్మయముగూడ ప్రోత్సహింపబడి అద్భుతముగ పెంపొందినవి అందు శిల్పము వీరికాలమున పరిపూర్ణతగాంచిన దని నుడువ

వచ్చును. సాతవాహనులు అనేకచైత్యములు, విహారములు, స్తూపములు గట్టించి శిల్పులు తమకళాచాతుర్యమును ప్రదర్శించుటకు మార్గముల గల్పించిరి. అద్వితీయ శిల్పకళాచాతుర్యమును ప్రదర్శించుచు ముద్దులమూట గట్టు అమరావతి స్తూపము వీరి కాలముననే నిర్మింపబడినది. ఇయ్యమరావతిస్తూపము కళాప్రపంచమున కలంకారము ఈస్తూపమున గనుపరుప బడిన శిల్పకళాప్రావీణ్యము పాశ్చాత్యులగూడ సమ్మోహితుల జేయుచున్నది ఈ శిల్పచిత్రములు గల్గిన శిలాఫలకములు కొన్ని లండను నగరమున నున్నవి వానిజూచి పాశ్చాత్యులు విస్మయులై పోవుచుందురు. అమరావతి స్తూపముకడనున్న శిలలపై ప్రదర్శింపబడిన శిల్పవిద్యా కౌశలము వర్ణించుటకు ప్రత్యేకగ్రంథము గావలయును ఈచిన్ని పాత్రము జాలదు. అందుచే దీనిగూర్చి రెండు మాటలు నుడివి విడిచెదము.

ప్రపంచమున శిల్పసంపదలతో విరాజిల్లు స్తూపరాజములలో అమరావతి స్తూపమొకటి. ఇది చిన్ని పన్నెలుగల యలంకారములకు ప్రఖ్యాతి గాంచినది. ఇంతటి పనితనము అవనీతలమున వేరెచ్చటను గన్పింపదు ఈస్తూపము కృష్ణానదీ కూలమున విలసిల్లి ఆంధ్రసామ్రాజ్యమునకు రాజధానియగు అమరావతి నగరమున నిర్మింపబడినది. ఇది ఆర్యావర్తమున గల స్తూపముల లోనికెల్ల సుందరమైనది. ఈస్తూపము మహాయానకాలమున నిర్మింపబడిన దగుటచే అలంకారములతో నిండియున్నది ఇది యెనుబది యడుగుల యెత్తుగల్గి కుదిమట్టముగ నుండెడిది ముప్పది యడుగుల ప్రాకారముగల్గి పదు

నారడుగుల నిడివిగల్గిన యొకపీఠముపై యీస్తూపము నిర్మింపబడినది పీఠమంతయు పాలమెరుగుల నిరసించు నిగనిగల జిమ్ము చలువరాలతో కూర్పబడినది వీనిపై బౌద్ధగాథ లత్యంత మంజులముగ జెక్కబడినవి. స్తూపమున కుపరిభాగమున పుష్పమాలికలు, పూలపళ్లెరములు, ముద్దులుమూటగట్టునట్లు చిత్రింప బడినవి స్తూపమునకుజుట్టును, నిరుపమాన శిల్పచిత్రములతో కనులపండువ సేయు వలయాకారముగ నుండు మూడుకంచెలుగలవు ఈకంచెలు, శిలాస్తంభములపై నమర్పబడి యున్నవి. ఈ స్తంభములపై శిల్పులుజూపిన పనితన మింతింతయని వర్ణింప నలవిగాదు. ఈకంచెలలో స్తూపము నంటియుండు కంచె ఆరడుగుల ఎత్తునున్నది. దీనికావలికంచె పండ్రెండడుగుల యున్నతిగల్గి 165 యడుగుల కైవారముగల్గి యున్నది. దీనివెలుపల బుద్ధభక్తులు ప్రదక్షిణము లొనర్చుటకు పదునైదడుగుల వెడల్పుగల్గిన రస్తాగలదు. దీనికావల మూడవకంచెగలదు. దీనియెత్తు పదునాలుగడుగులు ఈకంచె పైభాగమున నగిషీలుగల్గిన పళ్లెరములును, జాతకకథలును, అడుగుభాగమున బాలురు, జంతువులును, సొబగులీనునట్లు జెక్కబడినవి దీనిపై నొకచోట, తనసైనికవాహినులు, కోట గోడలను సంరక్షించుచుండ రాజు సింహాసనమున గూర్చుండి అప్పుడే యేతెంచిన యొకవేగుగొనివచ్చిన సమాచారమును వినుచుండినట్లును, దిగువను పదాతిసైన్యములు, అశ్వదళములు, గజములు ప్రయాణోన్ముఖములై యుద్ధభూమికి వెడలుచుండినట్లును, శత్రుసైన్యములలో నొకడువచ్చి సంధిగోరుచున్నట్లును అత్యంతగంభీరముగ జెక్కబడినది ఈశిల్పచిత్ర

మున ప్రదర్శింపబడిన కళాప్రావీణ్యము అత్యద్భుతము. పాశ్చాత్యచరిత్రకారులు దీనిని మిగుల ప్రశంసించినారు. రెండవ ప్రాకారకుడ్యముపై బుద్ధగాథలు, స్తూపప్రతిమలు, సింహములు, మనుష్యవిగ్రహములు అతిమార్దవముగ చిత్రింపబడినవి.

ఈ యుత్కృష్టస్తూపమును కాలభుజంగము దనపొట్టన బెట్టుకొన్నది. నేడీస్తూపప్రాకారశిథిలములు మాత్రము అమరావతిసమీపమున గాన్పించును. తక్కటిదంతయు వ్యర్థమై పోయినది శిల్పవైభవములు నశించినవి. శిల్పచిత్రములు గల్గిన శాతిఫలకములు చాలభాగము లండను నగరముజేరినవి.

ఇట్టి స్తూపములు క్రీ. శ మూడునాలుగు శతాబ్దములలో ఆంధ్రదేశమున పలుచోట్ల నిర్మింపబడినవి. భట్టిప్రోలు, గుడివాడ, ఘంటసాల, చినగంజాము, జగ్గయ్యపేట మున్నగు స్థలములందు స్తూపశిథిలము లింకనుగాన్పించును గాని పూర్వవైభవము లంతరించినవి సాతవాహనుల కాలమున ఒక్క స్తూపములెగాక గంభీరములగు గుహాలయములు మనోహరమగు విహారములు గూడ నిర్మింపబడినవి

## గుహాలయములు—కార్లీచైత్యము

బౌద్ధాలయములకే బౌద్ధపరిభాషలో చైత్యములందురు. ఇవిబౌద్ధోపాసకుల ఆరాధన కృత్యములకై కల్పింప బడినవి. హైందవ దేవాలయములవలెను, క్రైస్తవ చర్చిలవలెను ఈ బౌద్ధాలయములుఆరుబయళ్ల నిర్మింపబడక కొండలలో దొలువ

బడినవి. ఈ చైత్యముల యాడంబరము పైకేమియు గోచరింపదు దళీముఖములు మాత్రము తోరణాలంకృతులతో మూర్తిశిల్పములతో గొంచె మలంకరింపబడును. కాని లోనికి బోయి చూచినచో శిల్పవైభవములతో తులతూగుచు నింద్రభవనముల మఱపించు విశాల మందిరములు గాన్పించును

ఇట్టిచైత్యములు బొంబాయి రాజధానిలోని సహ్యాద్రి పర్వత ప్రాంతములందు విశేషముగ గలవు ఇచ్చటి శిలలు చైత్యోద్ఘాదన కనుకూలమగు పాటు పదనులు కల్గియుంటచే నిచ్చట చైత్యములు విరివిగ నిర్మింపబడినవి.

ఈ చైత్యములు ఆంధ్రసామ్రాజ్య కాలముననే విరివిగ నిర్మింపబడినవి. సహ్యాద్రి పర్వత శ్రేణులలో క్రీ. పూ. 3 వ శతాబ్దమున నిర్మింపబడిన గుహాలయము లయిదారు గలవు. కాని యివిమోటుగా నుండి అంత యందముగ లేవు. భక్తిరసప్రధానమగు మహాయాన మత వ్యాపనకు పూర్వము నిర్మింపబడియుండుటచే నిరలంకృతమైనిరాడంబరముగనున్నవి. క్రీ॥ శ॥ మొదటిశతాబ్దమున మహాయన మతవిజృంభణకాలమున చైత్యనిర్మాణము పరిపూర్ణత గాంచినది ఇదియె ఆంధ్రసామ్రాజ్యవైభవకాలము. ఈకాలమున ఆంధ్ర సామ్రాజ్యమున నిర్మింపబడిన గుహాలయములలోని కెల్ల కార్లీ గుహాలయము పేరొందినది. ఇది అత్యంత గంభీరమైనది జగద్విఖ్యాతమైనది భారతవర్షమున నిర్మింపబడిన చైత్యములలో దీనికి సాటివచ్చునది లేదు. ఇది బొంబాయి, పునహా నగరములమధ్య కార్లి అను ప్రదేశముకడ నున్నది.

సొబగులీనుచు అత్యంత రమణీయముగ నుండును. ఇందు ఇరు పార్శ్వములందును శిల్పపు బనులచే నలంకృతమై మూరిపెముల గొల్పు స్తంభావళులపై నమరియుండు నొక విశాలమండిరము గలదు. దీనిపొడవు 126 అడుగులుండును. వెడల్పు 46 అడుగులు. ఈమందిరమున కిరువైపులందును స్తంభావళుల కావల బుద్ధభక్తులు నివసించుటకై గుమ్మటాకారముగ పెక్కు గదులు నిర్మింపబడినవి. స్తంభముల కుపరిభాగమున (ఒక్కొక పార్శ్వమున పదునైదు స్తంభములున్నవి) అందమగు మకుటములు జెక్కబడినవి. ఈమకుటములపై గజారూఢులగు స్త్రీ పురుష విగ్రహములు పంపలకొలది చిత్రింపబడినవి. గుఱ్ఱపు లాడమువలె అర్ధగోళాకారముగ నిర్మింపబడిన మందిరపు పైకప్పు యీగజవిగ్రహములపై వ్రాలియున్నది మందిరాంతరాళమున నెదురుగ శివాలయ గర్భగృహములోని శివలింగమువలె పాలరాతితో నిర్మింపబడిన స్తూపవిగ్రహమొకటి గలదు. ఈమందిరాంతర్భాగమంతయు తమోజాలములచే నావరింపబడి,చూపరుల మానసములందు నిశ్చల గంభీరభావములు స్ఫురింప జేయుచుండును నిశ్శబ్ద మచ్చట రాజ్యము జేయుచుండును ఎట్టి అలుకుడైనను ఓంకార నాదమువలె, హెచ్చురుగ ప్రతి ధ్వనించుచుండును. మందిరోర్ధ్వభాగమున నొకమూల అనుకూలమగు తావున దొలువబడిన గవాక్ష రంధ్రమునుండి ప్రవహించు సూర్యకాంతులు బౌద్ధుల యారాధన స్థానమగు స్తూపప్రదేశమున మాత్రము బడి తక్కటి మందిరభాగమంతయు కనుచీకటిలో నుంచుట

వలన నీగంభీర భావము మరింత ప్రస్ఫుట మగుచుండును. ఆహా భారతశిల్పుల నిర్మాణ కౌశలము!

ఈకార్లీచైత్యము జయంతపుర నివాసియగు నొక వణి జుడు గట్టించెనని ప్రతీతి ఇచట శాతవాహనుల శాసనము లనేకములు గలవు

## బౌద్ధ విహారములు

సాతవాహనులకాలమున గట్టబడిన విహారములు జాల గలవు. కన్హేరి, నాసిక, విజయవాడ, ఆరుగోలను, శ్రీశైలము, మొగలరాజపురము మున్నగు ప్రదేశములందు శాతవాహ నుల కాలమున బౌద్ధమఠములు నిర్మింపబడినవి వీనిలో చాలభాగము శిథిలమై పోయినవి. కన్హేరి, నాసిక కడనున్నవి మాత్రము కొంచెము బాగున్నవి. నాసిక బట్టణమునకు సమీ పమున కొండలలోనిర్మింపబడినవిహారములు జాలయందమైనవి. ఇచ్చట నహపాన, గౌతమిపుత్ర యజ్ఞశ్రీ, శాతకర్ణుల పేరుగల విహారములు మూడుగలవు నహపానవిహారము నహపానుని యల్లునగు ఋషభదత్తునిచే క్రీ శ రెండవశతాబ్దమున నిర్మిం పబడినవి. గౌతమపుత్ర విహారము ఆంధ్రసార్వభౌముడగు గౌతమపుత్రునిచే పోషింపబడినది అన్నిటికంటె యజ్ఞశ్రీ శాత కర్ణిచే నిర్మింపబడిన విహారము కడురమణీయమైనది. ఇందు పరి చారకావరివృతుడై యున్నట్లు చెక్కబడినబుద్ధవిగ్రహమొకటి గలదు ఇది అతిగంభీరముగ నుండును ఇందలి స్తంభములు కూడ శిల్పరచనములతో శోభిల్లుచున్నవి.

## పరిశ్రమలు—వాఙ్మయము

ఆంధ్రసార్వభౌముల కాలమున శిల్పకళావాణిజ్యములే గాకపరిశమ్రివాఙ్మయములుగూడవిశేషముగ వెంపొందినవి. అతి సుందరనగు ముద్దులమూటగట్టు పాత్రలు, కుండలు, గిన్నెలు, భూషణములు, పూసలు నీ కాలమున జేయబడుచుం డెను. అత్యంతకుశలురగు, పణికారకులు, కుంభకారులు (కుమ్మరులు) స్వర్ణకారులు ఈకాలమున వరలినట్లు నిద ర్శనములు గన్పించుచున్నవి. ఈకాలమున చేయబడిన హస్త కంకణములు, స్ఫటిక నిర్మితనగుపాత్రలు, పూసలు గుడి వాడ సమీపమున దొరకినవి. ఇవియన్నియు ఆంధ్రుల పారిశ్రామికా నైపుణ్యమును, హస్తకౌశలమును వెల్ల డిచ్చు చున్నవని రాబర్టు స్యూయలు మున్నగు పాశ్చాత్య చరిత్ర పరిశోధకులు మిగుల ప్రశంసించినారు. ఈకాలమునాటి పూస లు బంకమట్టితో, గాజుతో, ఎముకలతో, మణులతో, కెంపు లతో జేయబడి యత్యంత సుందరముగ నున్నవి. ఇట్టి వస్తు జాలమును నిర్మింపగల మణికారకుల బుద్ధివైభవము ప్రశంసా పాత్రమని పాశ్చాత్యులే నుడువుచున్నారు గుడివాడప్రాం తమున నొక స్ఫటిక శిలానిర్మితమగు గిన్నె దొరికినది ఇది మిగుల నందముగ నున్నది. ఈకాలమునాటి కుమ్మర పనులు గూడ అధిక చాతుర్యమును జూపుచున్నవి. అప్పటి కుంభశిథి లములు కొన్ని దొరికినవి వానిపై ప్రదర్శింప బడిన నగిషీ పనులు నిరుపమానములు ఆంధ్రసాలెల పనితనమును గూడ టోలమీ, పరిప్లస చరిత్రకారులు మిగుల శ్లాఘించినారని

వేరొక సందర్భమున నుడివితిమి పాలమీగడల పరిహసించు నంత మృదులముగ వస్త్రముల నిచ్చట నేసెడివారు. అట్టి నిర్మాణకౌశలము నేడెచ్చట మాయమైపోయినది?

## ఆకాలమునాటి పట్టణములు—పల్లెలు.

ఆకాలమునాటి ఆంధ్రదేశము అసంఖ్యాకములగు పట్టణములతో, పల్లెలతో కల కల లాడుచుండెడిదని వ్రాసితిమి. రాజగిరి, కేవూరు, మందర, విజయపురము (బెజవాడ), ధాన్యకటకము, కుట్ట, పరవేన, మహావనశాల, కూడూరు (గుడివాడ), ఒడిపరివేనన, సాధుగ, రాజశైలము (వేదాద్రి), కటకశాల (ఘంటశాల), వేలగిరి, నడతూరు, నందపురము, గిలనకేర, నగరి మున్నగు పట్టణములు ధాన్యకటక, భట్టిప్రోలు శాసనములలో జేర్కొనబడినవి ఇవి యన్నియు నా కాలమున ప్రఖ్యాత పట్టణరాజములై యుండినట్లు గాన్పించు చున్నవి వీనిలో గొన్ని సరిగ నెచ్చట విలసిల్లినవో తెలియుటలేదు

## ఆకాలమునాటి ఆంధ్రుల ఆచార నడవడులు

ఆకాలమునాటి ఆంధ్రుల విగ్రహములు కొన్ని అమరావతి, కార్లి, నాసిక మున్నగు ప్రదేశములందు గన్పించు చున్నవి. వీనిని జూచిన అప్పటియాంధ్రుల దుస్తులు, ఆభరణములు జ్ఞప్తికి వచ్చును. ఆనాటి స్త్రీ పురుషులు ధరించు వస్త్రాదికములు, నగలు మిగుల నమూల్యములై అత్యంత మంజులము లైనవిగ గన్పట్టుచున్నవి ఆంధ్రనారీమణులు అత్యంత రమణీయమై వెడల్పగు కంఠహారములు ధరించువారు ఇదియె

ఆంధ్ర యువతులకు ప్రియతమమగు ఆభరణమైనట్లు గాన్పించుచున్నది. వారు చెవుల నలంకరించుకొను పోగులు పెద్దవిగ నుండి యొక్కొకప్పుడు భుజసీమవరకును వ్రేలుచుండెడివి. ఇవిగాక వారు హస్తములకు మణికంకణములును, పాదములకు అందెలు కడియములును, నడుములకు ఒడ్డాణములను ధరించువారు. ఈభూషణములు రాగి, యిత్తడి, బంగారములతో చేయబడుచుండెను. బీదలు రాగి, యిత్తడి నగలను, శ్రీమంతులు బంగారు నగలను బెట్టుకొనువారు. ఆకాలమున వెండి యంతవిరివిగ లభింపకుండుటచే కాబోలు బంగారమే విశేషముగ నుపయోగింపబడెడిది. పురుషులు కాళ్ళకు గూడ బంగారపుటందియలును, బంగారు కడియములును ధరించెడివారు.

పురుషులు ముంగటిభాగమున గుండుగనుండు నొక విధమగు శిరోవేష్టనమును ధరించువారు. ఖడ్గములు, ఈటెలు, విల్లంబులు, డాళ్లు, ఆంధ్రవీరుల ముఖ్యరణోపకరణములు.

ఆకాలమున స్త్రీలకెక్కుడు గౌరవస్థానముండెను. ఆంధ్ర రాణులుసైతము తమ యేలికలవెంట రాజసభలో సింహాసనమున గూర్చుండువారు. ఆంధ్రులలో నెప్పుడును ఘోషా పద్ధతులులేవు. ఉత్తమవంశసంభూతలగు స్త్రీలుకూడ విద్యాభ్యాసము జేయువారు. స్త్రీలు మతవ్యవహారములలో రాచకార్యములలో రణవ్యాపారములలో పాల్గొనువారు. మతావేశపరులగు స్త్రీలెందరో గలరు. ఆంధ్రసార్వభౌముల రమణులు బౌద్ధబ్రాహ్మణపరివ్రాజకులకు దానములు జేసినట్లు, గుహాలయముల నిర్మించి యిచ్చినట్లు శాసనములు నుడువుచున్నవి.

ఇట్లు శాతవాహనుల పరిపాలనము సర్వవిధముల సర్వోత్కృష్టమై దనరారినది. గ్రంథవిస్తరభీతిచే ఆంధ్రసామ్రాజ్య వైభవమునుగూర్చి యింతకంటె నుడువజాలము. ఇంతటితో ఆంధ్రసామ్రాజ్యప్రశంస ముగించి, యవన శక పహ్లావుల దండయాత్రల జూడబోయెదము.

యవన, శక, యూచీ దండయాత్రలు.

కుషానువంశము.

దక్షిణాపథమున నిట్లు ఆంధ్రసామ్రాజ్యము విస్తరిల్లుచుండ ఉత్తరభారతమున, పశ్చిమోత్తరప్రాంతమున ఆపదలు సంఘటిల్ల దొడగెను. యవన, శక, యూచీలనబడు, విజాతీయమూకలు మిడుతలదండులవలె పశ్చిమోత్తరద్వారమునుండి హిందూదేశమును జొరసాగినవి చొచ్చి, యీ విజాతీయ సమూహములు హిందూదేశముననే నిలిచిపోయి, యచ్చట సామ్రాజ్యముల స్థాపించి, కడకు హైందవప్రజలలో లీనమై పోయినవి. ఈ విజాతీయదండయాత్రలయుదంతము నిచ్చట కొంత నుడువవలసియున్నది గుప్తసామ్రాజ్యస్థాపన వరకును ఈ విజాతీయులరాకలే మన భారతవర్షచారిత్రమున గమనింపవలసిన ముఖ్యమగు చరిత్రాంశము.

బాక్ట్రియా పార్థియారాజ్యములు.

అశోకుడు సింహాసనారూఢుడైనపిదప మౌర్యసామ్రాజ్యమునకు పశ్చిమమున వ్యాపించియుండిన యవనసామ్రాజ్యము సెల్యూకసుచే స్థాపితమైనది విచ్ఛిన్నమైపోవదొడ

గెను సామ్రాజ్యములోని యంతర్భాగములగు పార్థియా బాక్ట్రియా రాష్ట్రములు స్వాతంత్ర్యమును వహించినవి. ఈరాజ్యములనేలినరాజులు రాజ్యకాంక్షాపరులై అలెగ్జాండరు సెల్యూకసులవలె భారతవర్షమును జయించి యేలవలెనని పలు మారులు ప్రయత్నించిరి. కాని అశోకునగల బలప్రావీణ్యములు వీరికడ శూన్యములగుటచే వీరి ప్రయత్నములన్నియు భగ్నమయ్యెను. అయినను అశోకుడు మరణించు వరకును వీరిప్రయత్నము లెవ్వియు సాగినవికావు. కాని, యాతడు భారతరాజ్యరంగమును వీడిపోయినపిమ్మట సింధునదీప్రాంతమువరకును గల మౌర్యసామ్రాజ్యభాగము నంతయు వీర లాక్రమింపగల్గిరి. మౌర్యసామ్రాజ్యాధిపులు దుర్బలులైరి. ఆప్రాంతమంతయు చిరకాలము వారి యేలుబడిలోనే యుండెను. అందుకు నిదర్శనముగ నాప్రాంతమున యీరాజుల నాణెములు పెక్కులు గాన్పించినవి.

బాక్ట్రియారాజ్యము స్వాతంత్ర్యము వహించినపిమ్మట దానినేలిన రాజులలో నాల్గవవాడగు 'డెమిట్రియసు' అను నాతడు జాల బలీయుడు. ఈతడు ఏరియానా రాష్ట్రమునే గాక (ప్రస్తుత ఆఫ్ఘనిస్థానము) పాంచాలమున జాలభాగమును గూడ జయించెను. అందుచేతనే యీతనికి "హైందవ నృపు" డని నామధేయము గల్గెను.

## మిళిందుడు

బాక్ట్రియారాజ్యమును బాలించిన రాజులందరిలో ప్రఖ్యాతుడు మిళిందుడు (మినేండరు). ఈత డత్యంతరాజ్య

తృష్ణాపరుడు. ఈతని రాజ్యకాంక్షాహామునకు మేర లేదు. ఈతడు క్రీ. పూ. 160వ సంవత్సరప్రాంతమునుండి, క్రీ పూ. 140వ వరకును రాజ్యమేలెను. మగధరాజ్యమునెల్ల జయింపవలెనను పేరాశతో పాటలీపుత్రముపై దాడివెడలి, పుష్యమిత్రునిచే నోడింపబడిన దీతడే. ఈతని ఖ్యాతి చాలదూరము వ్యాపించి నట్లు గన్పించుచున్నది ఈతడు మరణించిన పిదప, ఇతని యస్థిశకలముల సంగ్రహించి, వానిపై నొక దివ్యమందిరమును నిర్మించుటకై యనేక నగరములు పెనగులాడినవట! ఈతని నాణెములు పశ్చిమోత్తరమునను, యమునానదీతీరమునను జాలగ దొరకినవి.

బాక్ట్రియారాజన్యనృపులలో కడపటివాడు 'ఆంటి యాల్కిడసు' (క్రీ పూ 140—130) ఈతనిగూర్చి యొక యద్భుతవిషయము బయల్పడినది. అందుచేతనే యీతని నామ మిచ్చట పేర్కొనవలసివచ్చినది. ఈతడతివిశాలమగు రాజ్యము నేలినట్లు నిదర్శనములు గన్పించుచున్నవి కాబూలు, కాందహారు, తక్షశిలారాజ్యములగూడ నీతడు పాలించెను. ఈతనిచే చీనానగరరాజేశ్వరునికడకు రాయబారిగ నంపబడిన హెలియోడరసు అనువాడు వాసుదేవునికొక జయస్తంభ మునుగట్టించెను ఇదియె ఆంటియాల్కిడసు నృపునిపాలనమున జరిగిన ప్రసిద్ధసంఘటనము. దీనినిబట్టి యవనులుగూడ హైందవ మతావలంబులై హైందవదేవతల నారాధించువారని తేటపడు చున్నది.

బాక్ట్రియా పార్థియారాజ్యములు చిరకాలము వృద్ధి నొందలేదు. క్రీ పూ. 140—120 సంవత్సరములమధ్య శాకులను విజాతీయమూకల దండయాత్రలవలన నీ యుభయ రాజ్యములును అస్తమించిపోయినవి. ఈ రాజులలో పార్థియా బాక్ట్రియా రాజవంశములు నిర్మూలమైపోయినవి. అంతటితో ఆసియాఖండమున యవనవాలంబము మాపుమాసినది

## పార్థియా రాష్ట్రము.

పార్థియారాజ్యమునుగూర్చికూడ ఈ సందర్భమున ఒక్కమాట ముచ్చటింపవలసియున్నది. ఈరాజ్యముకూడ సింధు నదీప్రాంతమువరకును వ్యాపించినది. పాంచాలమునకూడ పార్థియనురాజుల యేలుబడి కొంతకాలముసాగినది. కాని పార్థియనుల పరిపాలనమైనను భారతవర్షమున చిరస్థాయిగ నిలువలేదు ఈపార్థియనురాజుల యేలుబడితో భారతవర్షమునకు 'క్షాత్రప' యను రాజబిరుదమును ప్రవేశపెట్టిరి భారత వర్షము నేలిన విజాతీయులు కొందఱు క్షత్రపబిరుదమునుదాల్చిరి.

మఱియు పార్థియారాజ్యమును పాలించిన రాజులలో ఇతిహాసప్రసిద్ధిగాంచిన రాజు 'గాండోఫర్నీసు' అను నాతడు ఈతడు క్రీ శ 20 మొదలు 40 వరకును కాబూలు కాందహారు,తక్షశిలారాజ్యముల నేలినవాడు సెంటు 'థామసు' అను క్రైస్తవయతి యీతని రాజ్యమునసే క్రైస్తవమతమును బోధించి వధింపబడెనని కొందరు చరిత్రకారుల యభిప్రాయము కాని, చెన్నపురిలో నొకభాగమగు మైలాపురమున వధింపబడెనని మరికొందరు చరిత్రపరిశోధకులు తలంచుచున్నారు.

ఘోషను వధింపబడనేలేదని మరికొందరు వాదింతురు. ఈ సందర్భముననే గాండోఫర్నీసు నామము చరిత్రపరిశోధకులచే పలుమారులు స్మరింపబడుచుండును.

శాక, యూచీలదాడులు.

శాకులనియు, యూచీలనియు పిల్వబడు తురుష్కజాతులకు జెందిన తురేనియను తెగలు క్రీ పూ. 160 సంవత్సరప్రాంతమున అన్నాతురులై, కుటుంబములతో తమనిజనివాసమగు మధ్యాసియాను వీడి, వాసయోగ్యమగు ప్రదేశముల వెదకికొనుచు మార్గమున దగిలిన రాజ్యములనెల్ల విధ్వంసమొనర్చుచు కడకు హిందూదేశమును బ్రవేశించినవి.

ఈ తెగలలో యూచీతెగ భారతవర్షచారిత్రమున మిగుల ప్రఖ్యాతిగాంచిన తెగ అశోకుని దరువాత అశోకుడంతవాడనిపించుకొని, విజాతీయుడైనను ప్రజారంజకముగ రాజ్యమేలిన కనిష్కుడీయూచీతెగలో నొక యుపశాఖయగు కుషానుశాఖకు జెందినవాడు యూచీల నివాసము పశ్చిమ చీనాప్రాంతము వీరు, వనదేశములోని కోయలబోలు గృహవిహీనులగు దేశదిమ్మరులు. క్రీ. పూ 174 సంవత్సర ప్రాంతమున వీరు తమనివాసముల విడచి పశ్చిమముగా బయలుదేరి దరియావదీ (జగ్జార్టిసు) ప్రాంతమును జేరుసరికి, తత్తీరమున నివసించు శాకులను మరియొకతెగ వీరని తారసిల్లెను ఈ యుభయతెగలకును సంకులము జరిగెను. తుదకు యూచీలు విజృంభించి శాకుల నచ్చటనుండి దరిమి, వారి స్థలముల నాక్రమించిరి

శాకులిట్లు విజితులై తమ మాతృక్షేత్రముల కోల్పోయి, అచ్చట నిలువలేక, బయలుదేరి మార్గమున బాక్ట్రియా పార్థియా రాజ్యముల రూపుమాపి, తిన్నగ భారతవర్షమును సమీపించి, యీదేశ సౌభాగ్యమునుజూచి సమ్మోహితులై యిందు ప్రవేశించిరి. పిదప వీరు క్రమముగ సింధు, కతియవాడ, సౌవీర, సౌరాష్ట్రముల నాక్రమించి, రాజ్యముల స్థాపించిరి శకరాజ్యములకును, ఆంధ్రసామ్రాజ్యమునకును సంఘటిల్లిన పోరాటములు, శకరాజుల పరాక్రమ పరిపాలనాపద్ధతులు వెనుక నుడివియుంటిమి శాకులు మొదటినుండియు హైందవ మతాచారములయెడ నభిమానము గొని వాని ననుకరించి కొంతకాలమునకు హైందవులలో విలీనమై పోయిరి. శకరాజులు గొందరు వైదికమతమును వ్యాపిజేసి జనోపయోగకరములగు తటాకములు, బావులు మున్నగువాని నిర్మించిరి

శాకుల పరాభూతులగావించిన యూచీలు దరియానదీ కూలమున చిరకాలము నివసింపలేదు వీరు శాకుల దరిమినట్లు, వూసన్ అను మరియొక తెగ వీరిని దరిమి, యాప్రదేశముల నెల్ల నాక్రమించినది యూచీలు మరల బయలుదేరి, పశ్చిమముగ మరలి, ఆక్ససునదీతీరమును జేరి యచ్చట నివసింపదొడగిరి. వీరు బాక్ట్రియారాజ్యమెల్ల వ్యాపించి యచ్చట చిన్నచిన్న రాజ్యముల స్థాపించిరి

## కుషానువంశము - కుజలకరకాడ్ఫిసీసు.

యూచీలలో నైదు చిన్న తెగలుగలవు. అందు కుషాను తెగ బహుళసంఖ్యాకమగుటచే ప్రబలి బలీయమై, క్రమముగ విజృంభించి తక్కినతెగల జయించి, కుషాను సామ్రాజ్యమును స్థాపించెను ఇట్లు కుషానుల యూచీలపైనడచి వారినెల్ల జయించి భిన్నయూచీరాష్ట్రముల నెల్ల విధ్వంసమొనర్చి కుషాను సామ్రాజ్యమును ప్రతిష్ఠించిన నాయకవీరుడు 'కుజలకరకాడ్ఫిసీసు' ఈతడే కుషాను సామ్రాజ్యమునకు ప్రథమసార్వభౌముడు, కుజలకిరుడు, కూరానగ్రిసరుడు. హిందుకుశ పర్వతావళులకు దక్షిణముగ నుండు భూభాగమును పార్థియా, గాంధార, తక్షశిలారాజ్యములను యీతడు జయించి, బాక్ట్రియారాజ్యమును విస్తరింపజేసెను ఇట్లు కుషానుల పరిపాలన మెల్లగ సింధునదీప్రాంతమువరకును వ్యాపించినది. అంతట కాడ్ఫిసీసు ఎనుబదియవయేట క్రీ శ 40 సంవత్సరమునుండి 78 వ సంవత్సరమువరకును 38 ఏండ్లు రాజ్యపాలనమొనర్చి మరణించెను

### విమకాడ్ఫిసీసు

కుజలకిరుని తరువాత అతని తనయుడు విమకాడ్ఫిసీసు సింహాసనారూఢుడయ్యెను ఈతడును యీతని తండ్రివలెనే రణశూరుడై పెక్కురాజ్యముల జయించెను తూర్పున వారణాసివరకును, దక్షిణమున నర్మదానదీతీరమువరకును గల ఉత్తరభారతమంతయు నీతడు జయించినట్లు గన్పించుచున్నది మాళవ, పశ్చిమభారత భూముల నేలెడు శకక్షాత్రపులందరును ఇతని నవయేలికగ విశ్వసించిరి ఈతని నాణె

ములు పెక్కుచోట్ల దొరకుటంబట్టి యీతని రాజ్యము చాలదూరము వ్యాపించెనని యూహింపవచ్చును. శాలుశకము యీతని పట్టాభిషేకముతోడనే యారంభమైనదని కొందరు చరిత్రకారు లూహించుచున్నారు. కాని యీవిషయమై పరిశోధన లింకను జరుగవలసియున్నది.

విముడు చీనా సార్వభౌమునితో యనిసేయ సైన్యముల నంపి యోడిపోయెను ఈకాలమున చీనా సామ్రాజ్యము నేలిన హోటి మిగుల బలాఢ్యుడై, పలుదేశముల జయించి, గొప్పసామ్రాజ్యమున కధిపతియై యేలుచుండెను. అతనితో సమానత్వమును వాంఛించి గర్వోన్నతుడై విముడు అతని కుమార్తెను తనకిచ్చి పరిణయము గావింపుమని రాయబారమంపెను హోటి కుపితుడై రాయబారమును గొనివచ్చిన కుషాను రాయబారుని బంధించి పరిభవించెను. అందులకు విముడు క్రోధోద్దీపితుడై చీనా సార్వభౌమునికి గర్వభంగము గావింపవలెనని సంకల్పించి, డెబ్బదివేల యశ్వికదళముల నిచ్చి తన రాజప్రతినిధి నాతనిరాజ్యముమీదికంపెను ఈమహాసైనికదళములు మంచుచేగప్పబడిన మహోన్నతములగు సంగ్లింగు పర్వతశ్రేణుల దాటిపోవలసియుండెను అలంఘ్యములగు ఈపర్వతావళుల దాటునపుడు అతిశీతములకు గురియై కుషాను సైన్యములు చాలభాగము నశించినవి హతశేషములగు సైన్యములు ప్రాణావశిష్టములై యార్కండు జేరుకొనినవి. చీనాసార్వభౌముని సేనాని వీని ననేకుల పరాభూతుల గావించి దునుమాడెను విముడు తనసైనికదళముల నెల్ల గోల్పోవుట

యేగాక, యేటేట చీనాసార్వభౌమునికి గప్పముగూడ చెల్లింప వలసివచ్చెను. ఈతనిపరిపాలన క్రీ. శ. 110 వ సంవత్సరముతో ముగిసెను.

కనిష్కుడు క్రీ. శ. 120

విమునితరువాత సింహాసనమధిష్ఠించినవాడు కనిష్కుడు. విఖ్యాతయశుడు. ఈతడు విముని తనయుడుగాడు. వాసిష్కుడను మరియొక కుషానునాయకవీరునిపుత్రుడు. కుషాను సామ్రాజ్యపదవి విమునితరువాత యీతని కెట్లు లభించినదో తెలిసికొనుటకు తగినయాధారము లెవ్వియు మనకు లభించుట లేదు.

కనిష్కుడు క్రీ శ. 120 సంవత్సరప్రాంతమున పట్టాభిషిక్తుడయ్యెను. విముడు దివికేగిననాటనుండి కనిష్కుడు రాజ్యభారమును వహించువరకును కుషానుసామ్రాజ్యపరిపాలన మెవరు నడిపిరో తెలియదు. విమునిచే నియమింపబడిన రాజప్రతినిధులే యీపదివత్సరములకాలమును రాజ్యపరిపాలన నెరపి యుండవచ్చునని దోచుచున్నది.

కనిష్కుడు యోధాగ్రేసరుడు బౌద్ధమతాభిమాని. తనశౌర్యపటిమను మెరసించి యీతడు పలురాజ్యముల జయించికుషానుసామ్రాజ్యమునునలుముఖములవిస్తరిలజేసెను. భారత ఇతిహాసరంగమున నీతడు ద్వితీయ అశోకుడని పేరు మోసెను అశోకసార్వభౌమునివలెనే యీతడును బౌద్ధమతాభివృద్ధికై యత్యంతము కృషిసల్పి మధ్యాసియాఖండమం దెల్ల బౌద్ధమతమును వ్యాపింపజేసి, బౌద్ధలోకమునకు చిరస్మర

ణీయుడయ్యెను. ఈతని కాలమున కళలు, సారస్వతము వృద్ధి నొందినవి. అందుచేతనే విజాతీయుడైనను యీతని నామము భారతవర్షమున నేటికిని కీర్తింపబడుచున్నది

కనిష్కుని దిగ్విజయములు

కనిష్కుడు అశోకునివలె బౌద్ధమతావలంబుడైనను హింసాత్మకములని రణవ్యాపారముల నిరసింపలేదు కనిష్కుడు సమరోత్సాహి. రణశూరుడు రాజ్యతృష్ణాపరుడు రాజ్యాసంపాదనకై యీతడు పెక్కుయుద్ధముల సలిపెను. సమరాంగణములందే కాలముగడిపెను. తొలుత గాంధారమును గెలిచి బాక్ట్రియా రాజ్యమునుండి తన రాజధానీనగరమును పురుషపురమునకు మార్చెను అంతకుమున్నే కాశ్మీరమును జయించి యాప్రాంతమున కుషానుపరిపాలనమును ప్రతిష్ఠించెను. పిమ్మట పార్థియనులతో రణమొనర్చి వారినోడించెను చీనాసార్వభౌమునిపై దాడివెడలి యాతని సామ్రాజ్యములోని పెక్కుదేశముల జయించి ఓమునికి గర్వ పరిభవము నుచల్లార్చెను. సైన్యముల దుర్గమపర్వతభూముల వెంట గొనిపోయి, టాష్‌కుర్గనువంటి కఠిన పర్వతశ్రేణుల దాటించి, ఖుస్తాన, కాష్గర్, యార్కండు మున్నగు రాజ్యముల సైన్యములతో పరుంచి, యాప్రాంతముల నేలెడు సామంతమండలాధిపులనెల్ల గెల్చి వారివలన కప్పములగొనెను వారు కప్పముల సరిగ జెల్లించుచు, సంధిషరతుల నిరాటంకముగ పాలించుటకై వారిలో గొందరి రాకొమరుల నాతడు భారతఖండమునకు హామీగా గొనివచ్చెను.

ఇట్టి సంతత రణవ్యాపారములచే కనిష్కుడు తనసామ్రాజ్యమును ఉత్తరభారతముననే గాక ఆసియాఖండమున గూడ చాలవరకు వ్యాపింపజేసెను భారతఖండమున కనిష్కసామ్రాజ్యము పశ్చిమమున కాశ్మీరము మొదలు తూర్పున వారణాశివరకును, ఉత్తరమున శీతనగము మొదలు, దక్షిణమున వింధ్యపర్వతావళులవరకును విస్తరించెను ఇదిగాక భారతావని కావల ఉత్తరమున మంగోలియావరకును, పశ్చిమమున పారశీకరాజ్యమువరకును గూడ యాతని సామ్రాజ్యము వ్యాపించినది మంగోలియా సామ్రాజ్యములోని కాష్కరు, కుస్తాన, యార్కండు రాష్ట్రములును పారశీకములోని బాక్ట్రియానా, బుఖారా, ఆఫ్ఘనిస్థానములును కనిష్కసామ్రాజ్యములో జేరినవి.

## కనిష్కుడు-బౌద్ధమతము.

కనిష్కుడు అశోకునివలె బౌద్ధమతమును తనయభిమానమతముగ స్వీకరించి, మధ్యాసియాఖండమంతటను వ్యాపింపజేసెనని నుడివితిమి. ఈవిషయముననే యాతని కీర్తి భారతవర్షమున చిరస్థాయిగ నిలిచిపోయినది ఈతడు కావించిన దిగ్విజయయాత్రలు సామాన్యములు అప్పుడే విస్మరింపబడినవి. కాని బౌద్ధమతవ్యాప్తికై యీతడు జేసినకృషి నేటికిని స్మరియింపబడుచున్నది బౌద్ధలోకమున అశోకుని నామమువలె కనిష్కుని నామమును తారకమంత్రమైనది హిందూకుశపర్వతముల కావల మంగోలియా ప్రాంతమున బౌద్ధమతమును అశోకుడు వ్యాపింపజేసినను

అచ్చట యీమహాయానమతబీజము లంత గాఢముగ నాటుకొనలేదు వేగముగ క్షీణించినవి. కనిష్కుడు ఈరాజ్యభాగమున కంతకును ఏలికయగుటచే నీ ప్రదేశములందు బౌద్ధమతమును విరివిగ వ్యాప్తిజేయుట కాతని కవకాశము గల్గెను. మతవ్యవహారములందును వేషభాషలందును ప్రజలు రాజుల ననుసరించుట సహజముగదా! కాని కనిష్కుని రాజ్యకాలమున ప్రాబల్యమునొందిన బౌద్ధమతమున నొక విశేషము గలదు ఈవరికి ప్రాచీనబౌద్ధమతము విరూపము నొందసాగినది అందు అంతశ్శాఖలు పొడసూపనారంభించినవి కొంతకాలమునకు బౌద్ధమతమున మహాయానమను నొకయంతశ్శాఖ బయలువెడలినదని వేరొకచో గ్రంథమున నుడివితిమి. ఇట్టి అంతశ్శాఖ లుదయించుటకు గారణములు గూడ వర్ణించితిమి. ఈ మహాయానమతశాఖ యుచ్ఛస్థితినందిన దన కనిష్కునికాలమునందే. పురాతనబౌద్ధమతమే కొన్ని మార్పులనొంది యీమహాయానమతరూపమును దాల్చినదని చెప్పవచ్చును ఈనూతన బౌద్ధమత సంస్థాపనాచార్యుడు నాగార్జునుడను బ్రాహ్మణయతి. ఈతడు కనిష్కునకు సమకాలీనుడని ప్రతీతి కనిష్కు నాగార్జును లిద్దరును ఈనూతనమత సిద్ధాంతముల నఖండముగ ప్రపంచమున వ్యాపింపజేసిరి ఈమహాయానమతమునకు కనిష్కునిరాజ్యము,అందుముఖ్యముగ తక్షశిలాప్రాంతము ముఖ్యస్థానమయ్యెను. మహాయానమతమున వైదికమత సాంప్రదాయములన్నియు చొప్పింపబడెను. బుద్ధుడు అవతారముగ జేయబడెను విగ్రహారాధన కల్పింపబడెను బౌద్ధదేవాలయములు పెక్కుచోట్ల నిర్మింపబడెను. ఉత్సవములుసాగెను సన్యాసవత

మగు బౌద్ధమతము భక్తిమార్గప్రాధాన్యమయ్యెను మూర్తి త్రయమునకు ప్రతిగ బుద్ధుడు, సంఘము, ధర్మము అను త్రిరత్నములు సృష్టింపబడెను. సర్వవిధముల వైదికమతమును బోలిన యీనూతనమతము అతివేగముగ చీనా, జపాను మున్నగు దూరదేశములకు బ్రాకెను. తదనుగుణముగనే యీకాలమునాటి బౌద్ధశిల్పముకూడ మార్పునొందినది ఈ కాలముననే చిత్రకళలు మిక్కుటముగ అభివృద్ధినొందినవి.

## చతుర్థ బౌద్ధపరిషన్మహాసభ

బౌద్ధమతాభిమానియగు కనిష్కుడు అశోకునివలె బౌద్ధ మతస్థులకుగల్గిన వివాదముల పరిష్కరించుటకై యొకమహా సభగావించెను బౌద్ధమత చారిత్రమున నిది చతుర్థ పరిషన్మహా సభయని ప్రఖ్యాతిగాంచినది. ఈమహాసభ కాశ్మీరరాజ్యమునకు రాజధానియగు శ్రీనగర మండలికుండలవనమను ఒకానొక బౌద్ధమఠమున జరుపబడినది. దీనికి వసుమిత్రుడను బౌద్ధసన్యాసి సభాధిపత్యమును వహించెను పలుప్రాంతములనుండి బౌద్ధ పండితులనేకులీసభకు విచ్చేసిరి వీరు బౌద్ధసారస్వతము నంతయు తరచి భాష్యములు వ్రాసిరి 'మహావైభాషిక' మను గ్రంథ మీతరుణముననే వ్రాయబడినది. ఈ మహావైభాషికము చీనాభాషలో నిప్పటికిని గలదు ఈ మహాసభాసమక్షమున పరిష్కరింపబడిన విషయముల కనిష్కుడు తామ్రఫలకములపై వ్రాయించి, యాఫలకముల నొక రాతిచందనమున భద్రపరచి, దానికొరకు శ్రీనగరసమీపమున నొక స్తూపమును గట్టించి, యాశిలాపేటిక నందుంచెను.

తమంజూషము భూగర్భమున నెచ్చట మడగియున్నదో యింత వరకును దొరకలేదు. చరిత్రపరిశోధకులు విశ్వప్రయత్నము లొనర్చుచున్నారు. కాని కార్యము లేకపోవుచున్నది.

## కనిష్కుని సర్వమత సమదృష్టి

కనిష్కుడు బౌద్ధమతాభిమానియైనను, హైందవ రాజధర్మముల ననుసరించి సర్వమతములను సమదృష్టిని జూచెను. బౌద్ధసన్యాసులకే గాక జరదూష్ట్ర బ్రాహ్మణ మతావలంబులకు గూడ నాతడు పారితోషికముల నొసంగి యాదరించెను.

## కట్టడములు.

కనిష్కు డనేక కట్టడముల గట్టించి హైందవశిల్పకళ నభివృద్ధి నొందించెను. తన రాజధానియగు పురుషపురమున బుద్ధుని శల్యములపై నతడొక బ్రహ్మాండమగు గాలిగోపురమును గట్టించెను ఇది పదమూడంతస్తులుగల దారునిర్మిత గోపురము నాలుగువందల యడుగుల యున్నతిగల్గి మేఘ మండలమును దాటిపోయెడిది. చిత్ర విచిత్రములగు చెక్కడపు బనులతో కనులపండువ జేయునది కనిష్కుడు గతించిన వెనుక పెక్కు శతాబ్దములవరకును యీ గోపురము నిలిచి యున్నది. తరువాత నెప్పుడో వీతిహోత్రున కెరవై నశించి పోయినది.

ఈ గోపురము చెంతనే కనిష్కు డొకమనోహరమగు విహారమునుగూడ గట్టించెను. ఈ బౌద్ధమఠము తరువాత గొప్ప

విద్యాపీఠమై ప్రఖ్యాతినొందినది ఇది పదునొకండవ శతాబ్దమున సర్వనాశకుడగు ఘజ్నీమహమ్మదుచే విధ్వంసమొనర్పబడి యంతరించిపోయినది ఈతడు కనిష్కపురమను పట్టణమును గూడ నిర్మించెను నేడిది శిథిలమై కాలవాహినిలో గలిసిపోయినది ఈనామమునబరగు పల్లెమాత్రమిప్పు డాప్రదేశమున గాన్పించును యమునానదీ కూలమున విలసిల్లిన మధురానగరమున (ప్రస్తుతము ముట్రా) కనిష్కు డనేకరమ్యమందిరముల కల్పించెనట. నేడొక్కటియు గానరాదు. ఈమధురా సమీపమున కనిష్కుని శిలావిగ్రహమొకటి గాన్పించినది దౌర్భాగ్యవశమున దీనిశిరముపిరిగి యెచ్చటనో పడిపోయినది. అయిననిది ఆకాలమునాటి యపూర్వకళాశిల్పకౌశలమును వెల్లడించుచున్నది ఇందు యవనశిల్పవైఖరులణుమాత్రమును గానరావు.

## ఈతనికాలమునాటి శిల్పకళావైఖరులు

కనిష్కునిరాజ్యమున రచింపబడినశిల్పచిత్రములన్నియు గాంధారశిల్పకళా ప్రతిబింబములని కళాభిజ్ఞులు వర్ణించియున్నారు. వీనియన్నిటియందును యవనశిల్ప వైఖరులు పొడసూపినవి ఈతని రాజ్యకాలమున శిల్పకళ మార్పుచెంది నూతన శోభాలంకృతమైనది ఈకాలమున బౌద్ధమత మెట్టిపరిణామము నొందినదో, బౌద్ధశిల్పముగూడ నట్టి పరివర్తనమునే బొందినది హీనయానమతకాలమున బౌద్ధశిల్పము నిరాడంబర సంకీర్ణలక్షణములతో జెలువారినది. నివృత్తిమార్గమిందు ప్రతిబింబితమైనది. కాని మహాయానకాలమున

సీనిరాడంబరము రూపుమాసినది ఆడంబరము పెచ్చుపెరిగినది. ప్రవృత్తి, భక్తిమార్గములకు కళ, తావొసంగినది. అందుచే నీకాలమునాటి బౌద్ధశిల్పము జిలుగుపనులతో వెల్లివిరిసినది. అలంకారభూయిష్ఠమై పోయినది. గయాక్షేత్రమందలి బౌద్ధాలయము, అమరావతీ స్తూపములు, నాసికయందలి బౌద్ధవిహారములు, అజంతాలోని శిలచాప మధ్యస్థమునున్న మందిరములు, కనేవారి దివ్యసభాభవనములు నీకాలము నాటివే. అన్నిటియందును నీనూతన శిల్పవైఖరులు ప్రసన్నతము లైనవి.

## కనిష్కనృపుని విద్యావ్యాసంగము.

కనిష్కుడు విజాతీయుడైనను హైందవ సారస్వతాభివృద్ధికై పలుభంగుల తోడ్పడెను. జగద్విఖ్యాతిపడసిన మహాపండితులు, భిషజ్మణులు అతని యాస్థానమున నివసించిరి. నాగార్జున, అశ్వఘోష, వసుమిత్రులు నీతనియాస్థానమున నుండిరి వీరిలో అశ్వఘోషుడు మిగుల ప్రఖ్యాతుడు. బౌద్ధ సారస్వతమున నమూల్య గ్రంథమగు బుద్ధచరిత్రము నీతడే వ్రాసెను. వైద్యశాస్త్రప్రవీణుడగు చరకుడు, చరకసంహిత గ్రంథకారుడు, ఈతని యాస్థాన భిషజ్మణియని చెప్పెదరు.

## వాణిజ్యాభివృద్ధి

కనిష్కునికాలమునను నీతని తరువాతిరాజుల కాలమునను సముద్రవాణిజ్యము మిగుల నభివృద్ధినొందినది. ఈ కాలమున భారతవర్షము యవనరోమకరాజ్యములకును వాణిజ్యవ్యాపారముగ జరిగినట్లు దృష్టాంతములు గన్పించుచున్నవి. ఈ

సమయమున భారతవర్షము నేలినచక్రవర్తులు రోమకసామ్రాజ్యాధిపతియగు అగస్టసు సార్వభౌమునకు శార్దూలాదివన్యమృగములకానుకలంపినట్లు డియన్ కేసియస్ అను రోమకగ్రంథకారుడువ్రాసియున్నాడు. రోమనులు వ్యాఘ్రముల జూచుట కదియె తొలిసారియట. జార్మోరస్ అను హైందవుడొకడు అగస్టసునృపుని సమ్ముఖమున తన దేశాచారము ననుసరించి యొకచితిపేర్చుకొని యాయనలమున తనదేహమును దగ్ధము గావించుకొని యుసురులు బాసెనని యీతడే (పైనచెప్పిన చరిత్రకారుడు) వ్రాసెను.

రోమనులు భోగపరాయణులు వీరు హైందవరాజ్యములనుండి కొనిరాబడు అత్తరు, పన్నీరు, లవంగాదిసుగంధ ద్రవ్యములు, ప్రసిద్ధిజెందిన దక్షిణపథపు రత్నములు, మణులు మున్నగు వస్తుచయము నత్యాతురముతో గొనెడివారలు. ఇవిగాక ఆకాలమున నాగరకప్రపంచమును విస్మయపడజేసిన హైందవపీతాంబరములు, పాముకుబుసముల తిరస్కరించు మల్లినువస్త్రములు, బంగారుజరీవలువలు, రోమకప్రజలమూర్ఖాగతుల నొనర్చెడి వట! పీనిగొనుటకై రోమనుయువతులు ఆపణవీథులలో విరగబడెడివారట! భోగలాలసులగు రోమను నాతిమణులు ఎంతమూల్యమైననిచ్చి వీనిగొనెడివారట! రోమక సామ్రాజ్యమునుండి భారతవర్షమునకు వాణిజ్యరూపమున గొట్టుకొనిపోవు ధనప్రవాహమును జూచి ప్లైనీ * నిట్టూర్పులు బుచ్చుచు అట్టిధనక్షయము రోమకప్రజాళికి మిగుల

* రోమక చరిత్రకారుడు. మిగుల ప్రఖ్యాతుడు

నరిష్టదాయకమని వాపోయినాడు. ఏటేట ఒక్క రోమక దేశమునుండి యేబదికోటులరూప్యములు భారతవర్షమునకు బోయెడివి. రోమక రాజ్యమునుండి యాకర్షింపబడిన రోమకనాణెములు ఆగస్టసుసార్వభౌముని కాలమునాటివి నెల్లూరు, ఘంటసాల, గుడివాడ ప్రాంతముల పెక్కులు కాన్పించినవి. ఈ నాణెములు దక్షిణ హిందూస్థానమున యిప్పటి బ్రిటీషు రూకలంతవిరివిగ నుండెడివట. దీనివలన రోమక హైందవ రాజ్యముల నడుమ నెంతటి యపారమగు వాణిజ్యము నడచినదో గ్రాహ్యమగుచున్నది.

దక్షిణ దేశమునుండి ముఖ్యముగ ముత్తియములు, మణులు, లవంగాది యమూల్యద్రవ్యములు ఏదేశముల కంపబడెడివి. ఆకాలమున ప్రశస్తమగు అణిముత్తియములు తామ్రపర్ణినదీజలములలో దొరకెడివి మణులు, మైసూరు సింహళరాజ్యములందు లభించెడివి పశ్చిమతీరము లవంగాది సంబారములకు ప్రసిద్ధి ఆంధ్రదేశమున, నాకాలమున కాళీపట్టణము, అమరావతి, మోటుపల్లి, మచిలీపట్టణము మున్నగునవి ప్రాముఖ్యత గడించిన వర్తకస్థానములు. ఇవిగాక, తమిళ, చోళ, పాండ్యరాష్ట్రములలో ముజరీసు, బకరయి, కార్కయిగూడ ఆకాలమునాటి వాణిజ్యలోకమున ప్రసిద్ధిగాంచిన రేవుపట్టణములు ముజరీసు పట్టణమున రోమను వర్తకులు పెక్కండ్రు నివసించువారు

ఈకాలమునాటి హైందవనావికులు యవనరోమక రాజ్యములతోడనేగాక, దక్షిణ సముద్రములదాటి బర్మా,

సయాం, యవ, కంబోడియా దేశములతోగూడ వాణిజ్యము సలిపిరి. వాణిజ్యము సెరవులయెగాక, పెక్కుమంది యీ రాజ్యములకు వలసబోయి యచ్చట నివాసము లేర్పరచు కొనిరి. బ్రాహ్మణులుగూడ యీకాలమున నౌకలలోనెక్కి సముద్రములదాటి పరభూములకు బోయి, వైదికమతమును బోధించిరి ప్రంబన,బోర్బొదూరుప్రాంతములందు బ్రాహ్మణ దేవాలయ శిథిలము లనేకములు నేటికిని గన్పించును

## కనిష్కుని కడసారి యుద్ధము.

కనిష్కుడు రమారమి ఇరువదినాల్గువత్సరములు రాజ్యపాలన మొనర్చి ఓసంగతు డయ్యెను. ఈతనికి బలవన్మర ణాము సంఘటిల్లెనని, ఈతని యవసానము కడు విషాదపూరి తమైన దని పెక్కుచోట్ల వ్రాయబడినది. ఈకనిష్కుడు కడ లేని రాజ్యతృష్ణాపరుడు. ఈతని రాజ్యవిదాహమునకు మేర లేదు. విశ్వమంతయు జయింపవలెనను దురాకాంక్ష గల వాడు ఈతని సంతత రణవ్యాపారములు ప్రజలక్రోధానల మునను రేపినవి ఇతడు, కడసారి ఉత్తరప్రాంతమునకు దాడి వెడలి శత్రుసైన్యములతో సమరము నడుపుచు, వ్యాధి గ్రస్తుడై యుద్ధభూమిని నొకశిబిరమున బడియుండ, ఆతనిచే శిక్షితులై, దేశాంతరప్రవాసము ననుభవించుచున్న కొందరు దండనాయకులు, ఆతనిపై పగబూని, నిశాసమయమున, ప్రతీ హారులు ప్రమత్తులై యొడలెరుగక నిద్రించుచుండ రాజశిబిర మున జొరబడి యొక నిశితకరవాలమున నాతనివక్షమును చీల్చి యాతని బరిమార్చిరట.

కనిష్కశకమని యాతనిపేర నొకశకము, ఆతనిరాజ్య కాలముననే ప్రారంభమైనది. కుషాను సామ్రాజ్యకాలమున నీశకము ఉత్తర హిందూస్థానమంతయు వ్యాప్తిజెందినది. ఇది కనిష్కసార్వభౌముని పట్టాభిషేకదినమున ప్రారంభమై 99 వత్సరములు సాగి కడకు కుషానుసామ్రాజ్యముతో నడియు రూపుమాసిపోయినది.

## కుషానుసామ్రాజ్య విచ్ఛిన్నము.

కనిష్కుని తరువాత, కుషాను సామ్రాజ్యము క్షీణించి పోయినది వీనివెనుక హువిష్కవాసుదేవులు కాశ్మీరము నేలిరి. కాని వీరెవ్వరును కనిష్కునియంతటి రణవిక్రములు గాలేరి. అంతటి పరిపాలనాకౌశలమును వీరికడ శూన్యమ య్యెను. ఈకారణమున నీసామ్రాజ్యము క్రమముగ క్షీణగతి నొంది తుదకు విచ్ఛిన్నమైపోయినది.

హువిష్కవాసుదేవులలో హువిష్కుడు మాత్రము గొంచెము ప్రతిభాయుతుడు ఈతడు క్రీ. శ 162 సంవత్సర ప్రాంతమున రాజ్యభారమును వహించి సుమారు ఇరువదిమూడు వత్సరములు పరిపాలన మొనర్చెను ఈతడు మిగుల రసజ్ఞుడని తోచుచున్నది. ఇతడు కళల, పరిశ్రమల మిగుల నాదరించెను. ఈతనినాణెములు మనోహరములగు చిత్రములతో నలరా రుచు నితని రసజ్ఞతను చిత్రకళాభిరుచిని వెల్లడించుచున్నవి. ఇదిగాక కాశ్మీరమున నీతడు హువిష్కపురమను నూతనరాజ ధాని నొండునిర్మించెను. మధురానగరమున పెక్కుబౌద్ధమఠ ములగూడ గట్టించెను హుయానిత్సాంగు దర్శించినకాలము

నాటి కిది మిగుల వైభవదశలో నుండెను. గయాక్షేత్రమున బోధివృక్షమునకెదురుగ అశోకునిచే నిర్మింపబడిన బౌద్ధాలయము శిథిలమైయుంటచే హువిష్కుడు దాని బడగొట్టించి యొక నూతనదేవాలయమును గట్టించెననికూడ ప్రతీతి. గయాపట్టణమున విష్ణుశిఖరముతో నలరారుచున్న నూతనదేవాలయ మీతనిచే నిర్మింపఒడినదై యుండవచ్చును.

హువిష్కుని తరువాత రాజ్యాభిషిక్తుడైన వాసుదేవుడు కడుదుర్బలుడు. ఈతనితోడనే కుషానుసామ్రాజ్యవైభవ మంతరించినది. ఇట్లు మూడు శతాబ్దములకాలము వర్ధిల్లి మౌర్య ఆంధ్రసామ్రాజ్యములవలెనే యిదియు విచ్ఛిన్నమై అంతరించి పోయినది

---

# XII

# గుప్తసామ్రాజ్యము

ఆంధ్రకుషాను సామ్రాజ్యము లస్తమించిన యొకశతాబ్దమునకు, క్రీ శ. 320 సంవత్సరప్రాంతమున, నాసమయమున ఆర్యావర్తగగనతలము నావరించిన కల్లోల జీమూతపటలి చాటునుండి యొకనూతన సామ్రాజ్యభాను డుదయమయ్యెను భారతేతిహాసరంగమున నీనూతన సామ్రాజ్యము గుప్తసామ్రాజ్యమని ప్రఖ్యాతి వహించినది గుప్తవంశజులచే స్థాపింపబడుటవలన దీని కీనామము గల్గినది.

ఆంధ్ర కుషాను సామ్రాజ్యములు పతనమైననాటగోలె గుప్తసామ్రాజ్యస్థాపనపరకును, భారతేతిహాసక్షేత్రము అంధకార బంధురమై నిశ్శబ్దముగ నున్నది. ఈమధ్యకాలమున నేమిజరిగెనో మనకు దెలియదు. ఈసామ్రాజ్యములు జీర్ణమై, క్షుద్రరాజ్యము లుద్భవిల్లుటచే భారతావని సంతతరణక్షేత్రమై అంతఃకలహములలో మున్గియుండినట్లు గోచరించుచున్నది.

గుప్తసామ్రాజ్యస్థాపనతో భారతేతిహాసక్షేత్రమున నొకనూతనశకము ప్రారంభమైనది. గౌతము డవతరించిన నాటనుండి, యేడెనిమిది శతాబ్దములు తన దివ్యతేజఃపుంజముల దిశాంతములకు వెదజల్లిన బౌద్ధమత మీకాలమున అస్తాద్రి జేరదొడగెను. తైలవిహీనమై ఆరిపోవనున్న దీపపుకళికవలె నీనుహామతము కనిష్క సార్వభౌముని కాలమున నొక్క

వెలుగు వెలిగినది. పిమ్మట బాలభానుని యరుణకాంతులు పొడ
సూపినంతనే తేజోవిహీనమై అదృశ్యమైపోవు నక్షత్రరాశి
వలె నీమతము వైదికమతమార్తాండుని ప్రచండతేజోరాశిలో
విలీనమై అదృశ్యమై పోయినది. వెలుగు వెలుగులో గలిసి
పోయినది. బౌద్ధమత మీకాలమున పేరైన లేకుండ యంతరించి
పోలేదు దేశాంతరగతుడైయున్న ప్రియతనూజుని రాకకై
నిరీక్షించుచు ఎట్లో యాతనికై ప్రాణములు నిలుపుకొని
యుండు వృద్ధజనకునివలె నీమతము జీర్ణమైప్రాణావశిష్టమై
శ్రీహర్షుని ఆగమనమువరకు కొనయూపిరితోనిలిచి, యంతట
అంతర్ధానమైపోయినది

గుప్తసార్వభౌములు వైదికమతాభిమానులు వీరిరాజ్య
కాలమున వైదికమత మహాసామ్రాజ్యము మరల సుస్థాపిత
మైనది. బ్రాహ్మణులు మరల నీసామ్రాజ్యమున కధిపతులుగ
పట్టాభిషిక్తులైరి పోషించుదిక్కుగానక మరుగుపడి, శోషిల్లి,
శుష్కించిపోయిన సంస్కృత భాషావల్లిక గుప్తసామ్రాజ్యా
ధిపుల కాలమున నూతనచాంపములు దొడిగి చిగురింపసాగినది.

## గుప్త సామ్రాజ్యోదయము.

పాశ్చాత్య చరిత్రకారులు వాకొనునట్లు ఒక్క వైదిక
మతోద్రేకమే గుప్తసామ్రాజ్యోదయమునకు గారణము
గాదు విజాతీయమూకల రాకలచే భారతప్రజాళికి ప్రాణ
ప్రియమగు స్వాతంత్ర్యమునకు భంగము వాటిల్లినది. ఈ స్వా
తంత్ర్యహానియే గుప్తసామ్రాజ్యోదయమునకు గారణము.
భారతప్రజ లనాదినుండియు స్వాతంత్ర్యప్రియులు వారికి

స్వాతంత్ర్యము ప్రాణాధికమైనది. పరరాజులకు దోసిలొగ్గి మనుట వారలకు హేయము, నికృష్టము. స్వాతంత్ర్య హాని గల్గినప్పుడెల్ల భారతవీరులు ఒకరెరుగక తమ యుష్ణ శోణితమును సమరభూముల గుమ్మరించి తమ స్వాతంత్ర్య మును గాచికొనిరి. స్వాతంత్ర్యహాని కల్గినప్పుడు ఆర్యావర్త మున మహాకల్లోలములు, రుధిరప్రపూర్ణములగు విప్లవములు జనించినవి. సామ్రాజ్యము లుదయించినవి యవనులు భార తావనిపై దాడివెడలి నపుడు ప్రాంచా విప్లవము రేగినది. మౌర్య సామ్రాజ్య స్థాపనమైనది. మిళిందుడు భారతస్వా తంత్ర్యమును హరింప దలపడినపుడు, మహోద్దండమగు రాజ్యవిక్రాంతి ప్రాదుర్భవించినది పుష్యమిత్రుడు స్వాతంత్ర్య రక్షకుడై భారతరాజ్యరమణికి కళ్యాణము గూర్చెను. యవన, శక, పహ్లావులు మున్నగువిజాతీయ సమూహములు భారతస్వాతంత్ర్యమును చూరగొనినపుడు స్వాతంత్ర్యసమరము మరల చెలరేగినది స్వాతంత్ర్య సమరాగ్నికీలనుండి మహో త్తరమగు గుప్తసామ్రాజ్యము జయవైకలితది.

శక, యవన, కుషాను పరిపాలనములు విజృంభించి, యవన, సిథియా, మంగోలియా, పార్థియా మున్నగు, అన్య దేశ నాగరకతాసాంప్రదాయములు సంస్కృతి ఆర్యసభ్యతను మరుగు పరుపసాగినవి పరిపాలన ఉత్తరభారతమంతటు నలముకొనిపోయినది ఆర్యావర్తమున మంగోలియా, తురు ష్కజాతుల ప్రాభవము హెచ్చినది అన్యసాంప్రదాయము లెట్టివో యెరుగనివీరు, ఉత్తమనాగరికతాసంస్థతుల గోరిలిన

హైందవప్రజానీకమునకు పరిపాలకులైరి. ఇట్టి పరిస్థితులు హైందవప్రజలకు దుర్భరమయ్యెను విజాతీయులయెడ వారి కొకవిధమగు క్రోధభావము జనించెను. పరప్రభుత్వ విధ్వంసమునకై కృషి యావశ్యకమయ్యెను. గుప్తసామ్రాజ్యమున కిదియె ముఖ్యకారణము.

మఱియు పరదేశీయులయండ చేరుటచే బౌద్ధమతమనిన గూడ భారత ప్రజాళికి గౌరవము సమసిపోయినది. ఇది యునుగాక బౌద్ధసంఘములు నానాటికి జీర్ణములై భ్రష్టములు కాదొడగెను. బౌద్ధ సన్యాసులు మానవోద్ధరణకై కృషిసల్పుటకు మారు విషయలంపటులై, ప్రాపంచికసుఖముల మరగి తమ యాధిక్యతను గాపాడుకొనుటకై ప్రయత్నింపజొచ్చిరి. ధర్మపథానురక్తి వారి దృష్టిపథమునుండి మరలిపోయెను. రాజాధిరాజులచే నభిమానింపబడుటవలన గర్వితులై మత్సరగ్రస్తులై, స్వార్థపరులై, సంఘేతరుల నిరసింపసాగిరి. పిలువని పేరంటముగ రాజ్యాంగవ్యవహారములందు కల్పించుకొనసాగిరి. స్వోత్కర్షకై ప్రజలలో మూఢవిశ్వాసముల్ బెంచి, స్తూప విహారాది నిర్మాణములకై బౌద్ధసంఘముల పోషణాదికములకై అశేష ధనరాసుల వ్యయపరుపసాగిరి. ఇట్టిదుర్వ్యయ, దుర్వ్యాపార, దుర్నియతులు ప్రజలకు మిగుల కంటకమయ్యెను. ఎంతటి యైశ్వర్యములతో తులదూగుచున్నను బౌద్ధసంఘములు రాజ్యకాంక్షాపరులగు పరరాజుల చండయాత్రలనుండి భారతభూమిని సంరక్షింపజాలకపోయినవి. మీదుమిక్కిలి బౌద్ధమతప్రాబల్యముచే భారతావని బలశౌర్యము లుడిగిపోవసాగెను. సన్యాసిజీవనమెక్కుడు గౌరవ

ప్రదముగ దలంపబడుటచే మాతృభూమిని సంరక్షింపజాలిన క్షత్రియవీరు లెందరో సంసారముల త్యజించి సన్న్యాసులైరి. భారతావని సైనికబలము విపరీతముగ తరిగి పోయెను. రాజ్య రక్షణ దుష్కరమగుచుండెను రాజ్యసంరక్షణకై వినియోగింప వలసిన ధనరాసులు భిక్షుకసంఘముల పోషణాధికములకై మణగిపోవుచుండెను. బౌద్ధమతక్షీణతవలన గలుగు నుపద్రవముల దప్పించుటకుగూడ నొకనూతనసామ్రాజ్య ముద్భవింప వలసివచ్చెను

భారతవర్షమున సిథియనుమంగోలియనుజాతులప్రాభవమును తొలగద్రోసి భారతస్వాతంత్ర్యమును గాపాడుటకును, బౌద్ధమతక్షీణతవలన గలుగుచున్న యుపద్రవముల తొలగించుటకును, సీతరుణమున నొకనూతనోద్యమము బయలువెడలినది. స్వాతంత్ర్యమారుతము తీవ్రముగ విసరదొడగినది. ఆరుశతాబ్దములక్రిందట ఆర్యావర్తమును యవనరాజ్యపీడనమునుండి తప్పింప యోధాగ్రేసరుడు, భారతస్వాతంత్ర్యరక్షకుడు, చంద్రగుప్తమౌర్యుడు గావించిన శంఖారావముల విని పులకాంకితులై శస్త్రములదాల్చి స్వాతంత్ర్యసమరమును గావింప రణరంగమున నురికిన లిచ్ఛవీక్షత్రియవీరులలోనె ఈ మహోద్యమము మరల నుద్భవిల్లినది.

## స్వాతంత్ర్యసమరము - సామ్రాజ్యస్థాపనము.

ఈసారి యార్యావర్తమున స్వాతంత్ర్య సంగరమునకు బురిగొల్పుటకు, రణభేరిని మ్రోయించినది ఆ పవిత్రనామధారుడగు మరియొక చంద్రగుప్తుడు. ఈతడు పాటలీపుత్రి

ము ను * బాలించు రాజు. కుమారిదేవియను లిచ్ఛవీక్షత్రియ బాల నుద్వాహమాడెను. క్రీ శ 308 సంవత్సరమున నీ వీరాగ్రణి స్వాతంత్ర్యసంగరమును బ్రకటించెను లిచ్ఛవీక్షత్రియ యోధులందరును రణపిపాసాయత్తులై, స్వాతంత్ర్యదీక్షాపరులై ప్రఫుల్లహృదయములతో చంద్రగుప్తుని పిలుపు నంగీకరించిరి. అచిరకాలముననే ఈవీరమాళి యొక ప్రచండసైన్యమును సమకూర్పగల్గెను.

ప్రథమమున చంద్రగుప్తుడు తన సైన్యముల గదలించుకొనిపోయి ఆంధ్రకుషాను సామ్రాజ్యములు పతనమునొందినపిమ్మట ఆర్యావర్తమున గల్గినసంక్షోభము నడచి శాంతి కూర్చెను. పిమ్మట తనసమరకౌశలమును ప్రదర్శించుచు ఉత్తరభారతమందలి రాజ్యములనెల్ల జయింపదొడగెను పండ్రెండు సంవత్సరము లిట్లు రణవ్యాపారముల నడపి, చంద్రగుప్తుడు అయోధ్యాఖండమును గంగాయమునానదులచుట్టునున్న ప్రదేశమును జయించెను అట్లు చంద్రగుప్తు డొక విశాలరాష్ట్రమున కధిపతియై క్రీ. శ 320 సంవత్సరమున, సార్వభౌమ బిరుదములతో పాటలీపుత్ర సింహాసన మధిష్ఠించెను ఇదియె క్రమముగ విస్తరిల్లి, మహాసామ్రాజ్యమై పరిఢవిల్లి, భారతవర్ష చారిత్రమున గుప్తసామ్రాజ్యమని విఖ్యాతినొందినది.

చంద్రగుప్తుడు రాజ్యాధిపత్యమును వహించిన పిమ్మట గుప్తశక మను నొక నూతనశకమును గూడ స్థాపించెను ఇది యాతడు గుప్త సామ్రాజ్యమునకు పట్టాభిషిక్తుడైననాట

---

* మగధరాజ్యము ప్రాచీనావశిష్టమై యింతవరకును జీవించియున్నది.

నుండి (26 ఫిబ్రవరి 320) ప్రారంభమై గుప్తసామ్రాజ్య పతనమువరకును ఉత్తర భారతమున చిరకాలము వ్యవహార ములో నున్నది.

## సముద్రగుప్తుడు

చంద్రగుప్తుడు పరాక్రమశాలియైన చక్రవర్తియైనను చిరకాలము పరి పాలింపలేదు. పది సంవత్సరములుమాత్రము రాజ్యమేలి క్రీ. శ 330 సంవత్సరమున దివంగతుడయ్యెను. ఈతనితరువాత సింహాసన మలంకరించినది యీతనితనయుడగు సముద్రగుప్తుడు. ఈతడు యోధాగ్రణి, రణకుశలుడు భారత ఇతిహాసరంగ మున మిగుల విఖ్యాతినొందిన మహాచక్రవర్తులలో నొక్కడు. ఈతడు ఆసేతుశీతనగమధ్యభారతమున కంతకును ఏకచ్ఛత్రాధి పత్యమును వహించి యేలవలెనని పెద్దకాంక్షయుంచి సర్వ బహురాజ్యముల జయించి, యనేకరాజులనుండి కప్పము లందెను. సముద్రగుప్తుడు ప్రథమమున గంగానదీ కూల మున తన్నెదిరింప సాహసించిన రాజ్యములపై దాడి వెడలి వాని నవలీల జయించెను. పిమ్మట పలుమారులు తన రాజ్య మునకు సంక్షోభము గల్గించుచుండిన అడవిజాతుల నోడించి వారినుండి కప్పములు గొనెను ఉత్తరభారతమున సముద్రుని యేలుబడి సుస్థాపితమయ్యెను కాని అంతటితో నాతడు తృప్తి నొందలేదు ఆతనిదృష్టియంతయు దక్షిణాపథముపై నుండెను. దక్షిణాపథరాజ్యముల జయించుట కాతడు మహాప్రయత్న ములు సల్పదొడగెను.

## సముద్రుని దక్షిణజైత్రయాత్ర.

రణసన్నాహములు పూర్తియైనతోడనే సముద్రగుప్తుడు ప్రచండ సైన్యములతో 335 వ సంవత్సరమున దక్షిణ దిగ్విజయయాత్ర బయల్వెడలెను సముద్రుని దక్షిణ జైత్ర యాత్ర యితిహాసప్రసిద్ధమైనది దక్షిణాపథమున నీతనికి గల్గిన దిగ్విజయముల వర్ణించుచు నీతని యాస్థాన కవియగు హరి సేనుడు అశోకునిచే ప్రయాగక్షేత్రమున నెత్తింపబడిన జయ స్తంభముపై నొకశిలాలేఖనము వ్రాయించెను. ఇందు సముద్రునిచే నోడింపబడిన రాజుల నామములు పేర్కొనబడినవి. ఈ శిలాశాసన మిప్పటికిని అలహాబాదు నగరమున గలదు

ఎటుజూచినను మహాసముద్రతరంగములవలె పొరలి ప్రవహిల్లు సైనికవాహినులతో సముద్రగుప్తుడు అయోధ్యా నగరమునుండి బయలుదేరి మున్ముగా దక్షిణ కోసలమును జయించి యారాజ్యమును పాలించు మహేంద్రునివలన కప్పములగొని, పిమ్మట ఒరిస్సా ప్రాంతమున రాజ్య మేలు వ్యాఘ్రరాజు మున్నగు మహాకాంతార రాజుల జయించి, తరువాత కళింగరాజ్యమును సమీపించి కళింగాధీశుని జోహారు లంది యచటనుండి తూర్పు సముద్రతీర మునంటి గంజాము మండలమును బ్రవేశించి, మహేంద్రగిరి కొత్తూరు కోటల ముట్టడించి, అటనుండి సాగిపోయి మార్గమున పిష్టపురమును వశపరచుకొని, తిన్నగా కృష్ణాగోదావరీ నదులమధ్య విస్తరిల్లిన వేంగిరాజ్యమును సమీపించెను వేంగి ఆంధ్రరాజ్యములో నిది. ఈ తరుణమున దీనిని హస్తివర్మయను రాజు పాలించు

చుండెను. ఉత్తరదైనను సముద్రుని యెదిరింపజాలక ఆతనికి శరణాగతు డయ్యెను. వేంగిరాజ్యమున గూడ విజయధ్వజమును నాటి, యచ్చటనుండి తనసైన్యముల గదలించుకొని పోయి, కంచిని రాజధానిగ జేసికొని పాలించెడు పల్లవచక్రవర్తియగు విష్ణుగోపుని యాహవమున నోడించి, పిమ్మట పాండ్య, చోళ, కేరళ×, పాలక్క* రాజ్యముల జయించి, పశ్చిమముగా మరలి, ఎరండపల్లి ♦ దేవరాష్ట్రముల † గూడ వశపరచుకొని పశ్చిమప్రాంత భూముల మీదుగ దిగ్విజయుడై రాజధానికి

---

× కారాలమని అలహాబాదు శాసనమున నుదహరింపబడినది. ఇది కేరళ దేశమై యుండునని చరిత్రపరిశోధకులు నిర్ణయించి యున్నారు. ఈ కారాలమే కూనాల తీర్థమనియు, యిది కొల్లేరుసరస్సునకు దాపున నుండెడు ఒకరాష్ట్రమనియు కొందర యభిప్రాయము. కాని వీరి యభిప్రాయము మాకంత సమంజసముగ గనుపించలేదు.

* నెల్లూరు మండలములోని యొక చిన్న రాష్ట్రము. దీని నాసమయమున ఉగ్రసేను డనురాజు పాలించుచుండెను. శబ్దసాదృశమును బట్టి యిది పాలఘాట్టని కొందరూహించుచున్నారు కాని యిది సరిగాదు. పల్లవరాజ కుటుంబములలో నొకశాఖ పాలక్కడ యందుండి పరిపాలించినట్లు వారిశాసనములే నుడువుచున్నవి

♦ యెరండపల్లిని గూర్చి పలువురు పలువిధములుగ దలంచుచున్నారు. కొందరిది ఖాండేశుజిల్లాలో నిలిచియున్న యొకసామంతరాజ్యమనియు ప్రస్తుతము యెరండోలు అను నామమున బరగునదే ప్రయాగశాసనమున నుదహరింపబడిన యెరండపల్లి యనియు, పెక్కుమంది చరిత్రకారుల యభిప్రాయము. ఇదియే మాకును సరియగు స్థలనిర్దేశమని తోచుచున్నది. కాని కొందరిది గంజాము మండలములోని శ్రీకాకుళము సమీపమున నిలిచియున్న యొకపట్టణమని యూహించుచున్నారు వీరికి ఆధారము యిటీవల గంజాము మండలములోని సిద్ధాంతమున దొరకిన యొకశాసనము. ఇందు ఎరండపల్లి

దిరిగివచ్చెను. ఈతరుణమున నీతడు దక్షిణాపథము నేలినపన్నిద్దరు రాజుల జయించెనని శాసనములు నుడువుచున్నవి. ఆంధ్ర, చోళ, పాండ్య, చేర రాజ్యము లీతనికి సామంతరాజ్యములైనవి. మహాదివాంతరము నేలిన వ్యాఘ్రరా జీతనికి వశుడయ్యెను శౌర్యధనులగు నాగు లీతనికి దోసిలొగ్గి కుబేరనాగయను సుందరి నాతని తనయునికి పెండ్లిగావించి యాతనితో సంధిగావించుకొనిరి.

దక్షిణాపథమున నాతనికిగల్గిన యఖండవిజయముల ప్రకటించుకొనుచు సముద్రగుప్తుడు మహావిభవముతో అశ్వమేధయాగముసల్పెను. ఈసందర్భమున నాతడు, ముద్దులొల్కెడు స్వర్ణపతకములను పోయించెను. వీనిపై యూపస్తంభమునకు గట్టబడిన యాగాశ్వ మతిమనోహరముగ జిత్రింపబడినవి. లండను నగరమందలి చిత్రవస్తుప్రదర్శనశాలలో నిట్టి

---

వాస్తవ్యునికి కొంతిభూమి దానము చేసినట్లు చెప్పబడినది. ఇంతిమాత్రమున అలహాబాదు శాసనమున నుదహరింపబడిన ఈరండపల్లి గంజామండలము లోనిదని నిర్ధారించుట మాకంత సహేతుకముగ గన్పించుటలేదు

మహారాష్ట్రదేశము కొందరు చరిత్రపరిశోధకులు యిది విశాఖపట్టణమండలములోనిదనియు, సముద్రగుప్తుడు మహారాష్ట్రదేశమును జయింపనేలేదనియు, పిష్టపురమును దాటియే పోవలేదనియు, సముద్రగుప్తుడు ఆంధ్రరాజ్యమును జయించినమాట యబద్ధమనియు వాదించుచున్నారు వీరికి కసింకోటయందు దొరకిన పూర్వచాళుక్య ప్రభువగు భీమవిష్ణువర్ధనుని దానశాసనము ఆధారము. వీరి వాదము మాకంత సహేతుకముగ దోచలేదు అట్లయినచో అలహాబాదు శాసనమును సముద్రమున ద్రోయవలయును. సముద్రునిచే నోడింపబడిన దక్షిణాపథ మేలురాజు లందరు నిందు చేర్పంబడి యున్నారు. ఇదియంతయు నసత్యపువ్రాతయగును.

పతకమొకటిగలదు. లక్ష్మణపురము — వస్తుప్రదర్శనశాలలో ద్వారముకడనున్న శిలానిర్మితమగు అశ్వవిగ్రహము యీ యాగసమయమున, సముద్రగుప్తునిచే చెక్కింపబడినదైయుండునని దోచుచున్నవి.

దక్షిణాపథమునేగాక, సముద్రగుప్తుడు పశ్చిమోత్తర ప్రాంతమున ప్రబలియున్న సిథియను, పార్థియను రాజ్యములనెల్ల రూపుమాపి చంద్రగుప్తుని పవిత్రసంకల్పమును నెరవేర్చెను.

## సముద్రగుప్తుని సామ్రాజ్యము.

తన సంతతరణపరిశ్రమలచే సముద్రగుప్తుడొక మహా సామ్రాజ్యమును నిర్మాణమొనర్చెను. అశోకుడు మరణించిన పిమ్మట నింతటి విశాలసామ్రాజ్యము భారతఖండమున పొడ చూపినది లేదు. ఆసేతుశీతనగమధ్య భారతమున నాతనికి జోహారు నొనర్పని రాజు లేడు. కాని యీతడు ఆర్యావర్తమున వివిధ ప్రాంతములందు విలసిల్లిన రాజ్యములనెల్ల నున్మూలింప లేదు తన యాధిపత్యము నంగీకరించి తనకు కప్పమును జెల్లించిన రాజులనెల్ల తమరాజ్యము నేలుకొననిచ్చెను. సింధునదీ ప్రాంతమునుండి బ్రహ్మపుత్రానదీమూలములవరకును, హిమవన్నగమునుండి నర్మదానదీ జలమువరకును వ్యాపించియున్న భూభాగము మాత్రము అతనిచే పరిపాలింపబడెను. తక్కిన రాజ్యభాగములన్నియు నాతని సామంతమండలాధిపుల యేలుబడిలోనుండెను. ఆంధ్ర, కేరళ, చోళ, పాండ్య, మున్నగు దక్షిణాపథరాజ్యములును, నేపాల, కామరూప (అస్సాము),

కర్త్రిపుర దవాక (తూర్పు బంగాళము) మున్నగు సరిహద్దు రాజ్యములును, పాంచాల, మాళవ రాజ్యములు నాతనికి సామంతరాజ్యములై కప్పముజెల్లించెను

## విదేశరాజులకడనుండి రాయబారములు.

సముద్రగుప్తునికీర్తి బహుదూరము వ్యాపించుటచే ఆకాలమున నాతనికి సమకాలికులగు రాజులెందరో యాతని చెలిమి నభిలషించి యాతనికడకు రాయబారము లంపిరి. సింహళద్వీపము నేలిన మేఘువర్ణుడు, పశ్చిమోత్తరమున బాలించిన శకరాజులు ఆతనికడకు రాయబారుల నంపిరి

## వైదికమతప్రాబల్యము.

గుప్తసామ్రాజ్య స్థాపనమువలన కుషాను సామ్రాజ్య వైభవ మంతరించెను. సముద్రగుప్తుడు చక్రవర్తియై కుషాను రాజ్యముల నిర్మూలించెను. యవన మంగోలియను సభ్యతా ప్రాబల్యభయము వాసెను. ఆతని రాజ్యకాలమున ఆర్యావర్తము మరల సంస్కృతవిజ్ఞానలక్ష్మికి క్రీడారంగమయ్యెను. మౌర్యరాజులచే నిరసింపబడి శుష్కించి కళావిహీనమై పోయిన సంస్కృతభాషామతల్లి గుప్తచక్రవర్తుల కాలమున నవలావణ్య శోభితయై విరాజిల్లెను. వీరిపాలనమున సంస్కృతము రాజభాషయయ్యెను. ఆదరణలేక అడవులబట్టిన సంస్కృతపండితులు విపినభూముల నుండి మరల దిరిగి వచ్చి గుప్త సామ్రాజ్యాధిపుల యాస్థాన మలంకరించిరి. బౌద్ధభిక్షువుల

---

♦ ఘురవాత్ సమీపమున విలసిల్లినది.

ప్రభ తరిగిపోయెను రాత్రివేళల వీధులలో జనులు గుమిగూడి బౌద్ధావతారకథల జెప్పుకొనుటమాని రామాయణవాల్మీకము, సీతా వియోగము, రావణసంహారము మున్నగు పురాణగాథలజెప్పు కొనసాగిరి. వైదికమతధర్మముల వ్యాప్తిజేయుటకై తన్మత కర్తలు నూతనగ్రంథముల నూతన పురాణముల రచియింప జొచ్చిరి. మహాభారతము, విష్ణు వాయు మత్స్య పురాణములు నీకాలముననే వ్రాయబడినవని కొందరి యభిప్రాయము. బౌద్ధసన్యాసులవలె బ్రాహ్మణయతులు ప్రచారులై వాడ వాడలకు బోయి వైదికధర్మముల నుపదేశింపసాగిరి.

గుప్తసామ్రాజ్యకాలమున వైదికమత మిట్లు విజృంభింప సాగినది. గుప్తసార్వభౌములు దానిని తమ యభిమానమతముగ స్వీకరించి ఆదరించిరి. కాని వీరు బౌద్ధమతమునెడ వైరమును బాటించి తన్మతావలంబుల హింసింపలేదు అశోక కనిష్కుల వలె గుప్తరాజులు మతావేశపరులుకారు. బౌద్ధమతపోషణాదిక ములకై మౌర్య కుషాను సామ్రాట్టులచే నొసంగబడిన మడి మాన్యముల వీరు హరింపలేదు. బౌద్ధసంఘముల నిర్మూలింప లేదు. గుప్తసార్వభౌముల కాలమున గూడ బౌద్ధవిహారములు, బౌద్ధసంఘములు, బౌద్ధవిద్యాలయములు వర్ధిల్లెను. బౌద్ధ సంఘములు మహమ్మదీయ దండయాత్రల వరకు నిలిచి అప్రతిహతాగ్ని హోత్రజ్వాలలోబడి మ్రగ్గిపోయినవి. బౌద్ధమత వినాశమునకు గారణములైనవి. కాలగతిగాని, బౌద్ధసంఘముల దురాచార, దుర్వినియోగ, దురాకాంక్షలుగాని, గుప్త సామ్రాట్టుల కులిశధారలుగావు. మహాయానమతము బౌద్ధ

మతవిశిష్టలక్షణముల రూపుమాపి, దానిని హిందూమతము లోని యొక యంతశ్శాఖగ నొనర్చివైచినది. అందుచే బౌద్ధ వైదికమతములకు గలతారతమ్యము లంతరించినవి. కొంత కాలమునకు బౌద్ధమతము క్షుద్రవాహినియై వైదికమత ప్రవాహమున సంగమించి యందు లీనమైపోయినది.

## సముద్రుని గుణశీలములు.

సముద్రుడు సుగుణరాసి, సహనశీలుడు, రసజ్ఞుడు, పండితపోషకుడు ఆతని మతసహనము కొనియాడదగినది. సముద్రగుప్తు డెన్నడును బౌద్ధులను పీడించియెరుగడు. బౌద్ధ యాత్రికుల సౌకర్యార్థమై ఈతడు సింహళాధిపుడగు మేఘ వర్ణుని గయాక్షేత్రమున బోధివృక్షసమీపమున నొక బౌద్ధ విహారమును గట్టుకొననిచ్చెను * ప్రఖ్యాతబౌద్ధపండితుడగు వసుబంధుని ఆదరించి పారితోషికములనిచ్చెను. దీనివలన సముద్రుని ఔదార్య పరమతసహిష్ణుతాది సుగుణములు వెల్లడి యగుచున్నవి. సముద్రుని సమరకౌశలమును మున్నె వర్ణించి తిమి. ఇంతియగాక అతడు మిగుల రసజ్ఞుడనికూడ నితి హాసమున బ్రఖ్యాతిగాంచెను. సముద్రుడు సంగీతసాహిత్య ములం దత్యంత నిపుణు డు ఈతడు ధారాళముగ గవిత్వ మును జెప్పనేర్చెను. సంస్కృతమున రసవంతములగు గ్రంథ ముల బెక్కింటిని రచించి, సంస్కృతసారస్వతరంగమ్మున 'కవి రాజ' యను బిరుదము నార్జించుకొనెను. ఈతని గానవిద్యా నైపుణ్యమును హరిసేనుడు పలుమారులు ప్రశంసించినాడు.

---

* ఈవిహార మిప్పుడు శిథిలమై భూమిలో గ్రుంకుకొనిపోయినది.

సువర్ణమయ సింహాసనమున గూర్చుండి సముద్రుడు విపంచీస్వన ముల మీటుచున్నట్లు చిత్రింపబడిన ప్రతిమ గల్గిన సువర్ణ మొకటి యిటీవల దొరికినది. ఇది లండనునగరమున చిత్ర వస్తుప్రదర్శనశాలలో సురక్షితముగ నున్నది

## రెండవ చంద్రగుప్తుడు. 375

సముద్రగుప్తు డెప్పుడు మరణించెనో సరిగ దెలియదు. ఈతనితరువాత నీతని తనయుడగు చంద్రగుప్తుడు ద్వితీయ చంద్రగుప్తయను బిరుదనామముతో క్రీ. శ. 375 సంవత్సర ప్రాంతమున రాజ్యభారమును వహించెను. సముద్రగుప్తుని తనయులలో నీతడు కడు సమర్థుడని గుప్తసామ్రాజ్యమున కీతడు పట్టాభిషిక్తుడుగ గావింపబడెను.

తండ్రివలె నీతడును మిగుల రణశూరుడు పలురాజ్య ములజయించి పెక్కు రణక్షేత్రములయందు తన సమర కౌశల మును ప్రదర్శించి విక్రమార్క ♦ డను బిరుదమును గొనెను.

## చంద్రగుప్త విక్రమార్కుని దిగ్విజయములు

బంగాళ పాంచాల రాష్ట్రము లీతని యాధిపత్యము నంగీకరింపక తిరస్కరించుటచే విక్రమార్కు డీరాజ్యములపై

---

♦ మాళవాధిపుడును కాళిదాసాది కవిపోషకుడునగు విక్రమార్కు డీతడే యని కొందరు చరిత్రకారు లపోహపడిరి ఉజ్జయిని నేలిన విక్ర మార్కుడు వేరు, ఈతడు వేరు భారతవర్షము నేలిన రాజులనేకులు విక్ర మార్కబిరుదమును దాల్చిరి.

దాడివెడలి వాని జయించి ఢిల్లీనగరమున దిగ్జయ స్తంభమును బాతించెను. ఇది లోహనిర్మితమగు స్తంభము; నేటికిని గలదు. ఇప్పుడిది కుతుబుద్దీనుచే నిర్మింపబడిన మసీదు ఆవరణలోనున్నది. నిన్ననో మొన్ననో చెక్కింపబడిన స్తంభము వోలె నిది నేటికిని మెరుగు లీనుచున్నది. దీని యగ్రభాగమున నొక నీలోత్పల మతిమనోహరముగ జెక్కబడియున్నది

పిమ్మట చంద్రగుప్తుడు పెక్కు శతాబ్దములనుండి శకరాజులచే పరిపాలింపబడుచున్న మాళవ, సౌవీర (గుజరాతు), సౌరాష్ట్రము (కతియవాడు) లపై సేనలగొని పోయి వానిగూడ జయించి పశ్చిమసముద్రతీరమువరకును దన సామ్రాజ్యమును విస్తరింప జేసెను. ఈ రాజ్యముల బాలించు రుద్రసింహుడను శకక్షత్రపు నొక్కని విక్రమార్కుడు ఆహవమున మార్కొని తన హస్తములతో నాతని కంఠమును దునుమాడెనని గ్రంథములందు వర్ణింపబడియున్నది ఈశకరాజు దుర్నీతుడై విషయలోలుడై ప్రజల హింసించెనట.

చంద్రగుప్తవిక్రమార్కుడు యోధానయోధుడు. సమరతంత్రమునందారితేరినబంటు సమరోత్సాహి. అపారమగు పరిపాలనా కౌశలముగలవాడు కీర్తికాముడు తన సమర ప్రావీణ్యమును వెల్లడింపగల బిరుదములదాల్చుటయం దీతని కభిలాషమెండు ఈతడు అరివీరులతో రణముసేయుచున్నటు సింహములతో పోరుచున్నట్లు తననాణెములపై చిత్రించుకొనినాడు. నలువదివత్సరము లీతడు నిరాఘాటముగ రాజ్యమేలి దివికేగెను (413)

## ఫాహియాన్ యాత్రికుడు

ఈతనికాలముననే ఫాహియాన్ అను నొకచీనాయాత్రికుడు కొన్ని బౌద్ధగ్రంథములు గొనిపోవుటకై భారతవర్షమున కరుదెంచి, తక్షశిల, రాజగృహము, గయ, వారణాసి, పాటలీపుత్ర, కపిలవస్తు, తామ్రలిప్తి, మున్నగు బౌద్ధక్షేత్రముల దర్శించినాడు. ఈతడు తనయాత్రాసందర్భమున ఆకాలమునాటి భారతవర్ష మేతీరుగనుండెనో మనోహరముగ చిత్రించినాడు. ఈతనివ్రాతలే అప్పటిచరిత్ర నిర్మాణమునకు ముఖ్యాధారములైనవి. ఈతని విచిత్రపర్యటనమును ఆత డీపుణ్యభూమినిగూర్చి గావించిన ప్రశంసలను నిచ్చట కొంతవర్ణించుటనుచితముగానేరదు

ఆకాలమున నిఖిల బౌద్ధప్రపంచమునకును భారతవర్షము పుణ్యభూమి బౌద్ధమత సంస్థాపనాచార్యుడగు బుద్ధభగవాను డిచ్చటనే యుద్భవిల్లెను ఆప్రాచీనకాలమున వేలకొలది బౌద్ధయాత్రికులు ఆసియాఖండమున పలుప్రాంతములనుండి భారతవర్షమున కరుదెంచి బౌద్ధక్షేత్రముల సేవించిపోవుచుండెడివారు అట్టి బౌద్ధయాత్రికులలో ఫాహియాను డొక్కడు ఈతడు చీనాదేశనివాసియగు బౌద్ధసన్యాసి. 399 సంవత్సరమున నీతడు సూత్రపిటకముల వెదకికొనిపోవుటకై చీనారాజ్యమునుండి ఆర్యావర్తమునకు బయలుదేరినాడు. ఆరుసంవత్సరములు ప్రయాణమొనర్చి మార్గమున నెన్నియో కష్టములబడి కర్కశశిలావృతమగు నిర్జనారణ్యభూముల సంచరించి కొండలనెక్కి భయంకరపుగాలిదుమారముల కాకరమై

దారియు తెన్నును గానరాని మృత్యుసదనములనదగు పెద్ద యెడారుల ద్దాటి శరవేగముగబారు నదీప్రవాహముల తరించి, యెట్టకేలకు భారతవర్షమును జేరుకొనెను ఆర్యావర్తమున నీతడు ఆరువత్సరములుండి సంస్కృతభాష నభ్యసించు, వలయు గ్రంథముల సముపార్జించి, తామ్రలిప్తినగరమున ఓడనెక్కి, మార్గమున సింహళ, యవ ద్వీపముల దర్శించి సముద్రమార్గమున మరల చీనా జేరెను. సముద్రమునగూడ నాతని కెన్నియో కష్టములొదవెను. ఓడ ప్రళయభీకరములగు తుపానుల జిక్కుకొని మునిగిపోవుటకు సిద్ధమయ్యెను అదృష్టవశమున నన్నియు గడచి సురక్షితముగ చీనా జేరెను.

ఫాహియాను తన యాత్రావృత్తాంతమును పట్టువలువలపై వ్రాసి కొనిపోయెను. ఇందే యీతడు ఆకాలము నాటి భారతవర్షసౌభాగ్య మెట్టుండెనో, ప్రజల శీలవర్తనము లెట్లుండెనో, పరిపాలన మేగతి నడుపబడుచుండెనో, మతవ్యవస్థలెట్లుండెనో, కన్నులకు గట్టినట్లు చిత్రించినాడు ఫాహియాను ఆరువత్సరములార్యావర్తమంతయు నామూలాగ్రముగ దిరిగి ప్రజల సౌశీల్యముల పరిశీలించినాడు చంద్రగుప్త విక్రమార్కుని కాలమునాటి భారతవర్షసౌభాగ్యమును జూచి దిగ్భ్రమ జెందినాడు అచ్చటి పరిపాలనావ్యవస్థను దిలకించి ఆనందాశ్రుల రాల్చినాడు ప్రజల గుణశీలములగాంచి పులకాంకితుడైనాడు.

కాని యేమికారణముననోగాని సంగ్రామవిజయుడగు విక్రమార్కుని రాజ్యవిభవము నాతనియుజ్జ్వలశౌర్యసాహస

మును రణప్రావీణ్యమును రాజ్యకౌశలమును ఒక్కమాటైనను స్మరించియుండలేదు. ఆకాలమునాటి జనులందరును ప్రఫుల్లవదనములతో పీడించుచుండిన వైదికమతప్రాబల్యమును గూర్చి యొక్క మాటయైన నాడడు. ఆతడు వచ్చిన కార్యము వేరగుటచేతను, విరాగియగుట చేతను, ఇట్టి ప్రాపంచిక విషయముల నెడ నీతడు మౌనము దాల్చి యుండనోపు

## దేశస్థితి.

చంద్రగుప్తుని యేలుబడిలోనున్న దేశస్థితిని మాత్రము ఫాహియాను చక్కగ వర్ణించినాడు. గంగమైదానము నీతడు మధ్యభారతమని పేర్కొనినాడు. ఈప్రాంతమంతయు సుభిక్షముగ నుండెను. ప్రజలు సౌఖ్యమున నోలలాడు చుండిరి. అచ్చటి శీతోష్ణస్థితు లత్యంత మృదులములై హాయిగొల్పుచుండెను. హిమగిరిప్రాంతమున వీచు దారుణ శీతలవాయువు లిచ్చట గానరావు. తుషారములు మచ్చునకైన గన్పింపవు. ఈ రాజ్యమందలి పట్టణము లత్యంత విశాలములైనవి. అన్నిటిలోను పాటలీపుత్ర మతిరమణీయమైనది. అందు మేఘపటలమును జొచ్చుకొని పోవు ప్రాకారములచే నావరింపబడి మురిపెముల గొల్పు శిల్ప చిత్రములచే కనులపండువు సేయు అశోకుని సౌధమునుగాంచి ఫాహియాను "ఇది మనుష్యనిర్మితమా" యని విభ్రాంతుడైనాడు. ఈ నగర పూర్వవైభవము లాతని కాలమునాటి కింకను అంతరించి పోవలేదు. సంస్కృతభాష నభ్యసింపుచు నీమహానగరమున ఫాహియాను మూడువత్సరములు నివసించినాడు. ఇందు రెండుబౌద్ధ

మఠములుండెను. అందునివసించు భిక్షువులు మహాపండితులని పేరుమోసిగిరి. వీరియుపదేశముల వినుటకై దేశదేశములనుండి వందలకొలది జనులు వచ్చుచుందురు. ఈపట్టణమున నొక యౌషధశాలగూడ గలదు ఇది దయాశీలురును పరోపకార పారీణులునునగు పాటలీపుత్రపౌరులచే నిర్మింపబడినది. అందు నిరుపేదలకు ఔషధములియ్యబడును. రోగులకు వ్యాధిమరలు వరకును అందే అన్నపానములగూడ నొసగబడును ఇట్టిఔషధశాలలు ఒక్క పాటలీపుత్రముననేగాక మధ్యభారతమునందంతటను తామరతంపరగనున్న వని ఫాహియాను తెల్పినాడు. ఇవిగాక యెక్కడజూచినను ధర్మశాలలు, అన్నసత్రములు, పానీయగృహములు, విశ్రాంతిమందిరములు గూడ నుండెనని యీతడు వర్ణించినాడు.

## రాజ్యపాలనము

విక్రమార్కుని రాజ్యపాలనము సర్వోత్కృష్టముగ నుండినట్లు ఫాహియాను వర్ణించినాడు. అచ్చట గన్పడిన పరిపాలనావిధానమునుగాంచి, ఫాహియాను చకితుడైనాడు. అట్టిధర్మపాలనము ఆతడు తిరిగినదేశములందెచ్చటను గాన్పింపలేదు రాజ్యపాలన మత్యంతకౌశలముతో నడిపింపబడుచుండెను. ప్రజలెట్టినిర్బంధముల నెఱుగక హాయిగ సుఖించుచుండిరి దేశమున నట్టికల్లోలములును లేవు చోరభయమెచ్చట వెదకినను కానబడదు చోరులతో తన కెట్టిసంఘటనములు గల్గినట్లును ఫాహియాను వివరింపలేదు. దేశమంతయు సుశాంతముగనుండెను ఎట్టియాటంకమును లేక ఫాహియాను ఆరు

వత్సరములు ఆర్యావర్తమంతయు దిరిగెను. తనయిచ్ఛవచ్చిన చోట నివసించెను పూర్వమెప్పుడును హైందవప్రజలు స్వేచ్ఛయెట్టిదో యెరుగక దుర్భరరాజ్యపీడనకు వశ్యులై పరితపించువారని కొందరు పాశ్చాత్యచరిత్రకారులు వ్రాయువ్రాతలెంత యసంగతములో ఫాహియానుపలుకులవలన స్పష్టమగుచున్నది:— "ప్రజలు తమగృహావళుల వీడిపోవుటకెట్టి నిర్బంధములును లేవు. వారు చీటికిని మాటికిని న్యాయాధికారులయొద్దకు బరుగులెత్తబనిలేదు ఒకలు జలవరించుకఠోర శాసనము లిచ్చుటమచ్చునకైన గాన్పింపవు. రాజసేవకులవలన ప్రజలకెట్టి యిక్కట్టులును లేవు వారివేతనములు నిర్ణయింపబడుటచే వారు లంచగొండులై ధనము లిమ్మని ప్రజల నెన్నడును బీడింపరు. ఇచ్చట సేనియంగరక్షకులకుగూడ వేతనములుగలవు నృపతి ప్రజలపై నెట్టి సుంకములును విధింపడు. రాజబొక్కసమునకు వలయు ధనమంతయు ప్రభుమాన్యముల నుండియేవచ్చును ఆనిమాన్యమును సేద్యమొనర్చు కృషీవలులు మాత్రము పండిన పంటలో షష్ఠభాగమును పరిపాలనావ్యయములకై నృపుని కియ్యవలయును ప్రభుమాన్యముల సేద్యమొనర్చువారైనను తమయిచ్ఛవచ్చినపుడు పొలములవీడి పోవచ్చును ఇష్టముండినను లేకపోయినను వాని నంటియుండవలెనను నిర్బంధము లేదు.

మరణదండన విధింపకయే యిచట రాజు రాజ్యపాలన మొనర్చును ఇచ్చట శిక్ష లతిమార్దవముగ నుండును. తాడనము మున్నగు క్రూరదండన లిచ్చుట లేవు! కరచ్ఛేదన మనువ

దీరాజ్యమున గానబడదు. దోషులకు సాధారణముగ విధింపబడు శిక్ష పరిహారము*. తేనిపై పలుమారులు తిరుగబడి రణమొనర్చినరాజద్రోహునికైన నిచ్చట శిరచ్ఛేదన విధింపరు. అట్టి వారల నిచ్చట దక్షిణహస్తమునుమాత్రము ఛేదించి విడుతురు."

అని ఫాహియాను ఆకాలమునాటి పరిపాలనా విధానమును వర్ణించినాడు. ప్రపంచమున నేరాజ్యమున నిట్టి పరిపాలనము పొడసూపినది? పాశ్చాత్యచరిత్రకారులు తమదేశములలో నెచ్చటనైన, నేకాలముననైన, నిట్టి పరిపాలనము గలదని వ్రేలెత్తిచూపగలరా? దుర్లభము. అది స్వర్ణయుగము. ఆకాలమునాటి రాజ్యపాలనము అద్వితీయమైనది. అట్టిది భారతవర్షమునకే చెల్లినది.

## ప్రజల గుణశీలములు.

ఫాహియాను ఆకాలమునాటి ప్రజల గుణశీలముల నిట్లు వివరించినాడు:—

"ఇచ్చటి ప్రజ లెవ్వరును ప్రాణిహింస నొనర్పరు. సూకర కుక్కుటములు మున్నగు క్షుద్రజంతుజాలముల బెంచుకొనరు. గోవుల విక్రయింపరు. మాంసమును భక్షింపరు! మద్యమును గ్రోలరు వెల్లుల్లిమున్నగు నింద్యపదార్థముల దరికి జేరనీయరు ఈదేశమున అపణాదులయం దెచ్చట వెదకినను కసాయిదుకాణములు గానరావు. మద్యకుటీరములు గాన్పింపవు. మృగవధాజీవనులగు చండాలురు, మాంసవిక్రేతలు ఊరిబయట నివసింతురు."

---

* జుర్మానా.

ఆకాలమునాటి ప్రజల గుణశీలము లెంత విమలములైనవి! ఫాహియానుని వర్ణనల జదివిన మన మేదినేని యొక యూహాప్రపంచమున స్వప్నలోకమున మెలగుచుంటిమాయని యనిపించును. ఇదియంతయు బౌద్ధమతప్రభావము అహింసావ్రతప్రధానమగు నీమహామతము దేశమందెల్లెడల ప్రేమవాహినుల ప్రవహింపజేసి ప్రజల గుణశీలములం దిట్టియద్భుతపరివర్తనమును గల్పించినది! శ్లాఘనీయము. కర్మపరహితమగు నొక నూతనప్రపంచమునే సృష్టియొనర్చినది ప్రపంచమున నేరాజ్యమందలి ప్రజలిట్టి సౌఖ్యము గల్గి వర్ధిల్లిరి? అబ్బురము!

## బౌద్ధమతవ్యవస్థ

ఫాహియానువర్ణనల వలన విక్రమార్కుని కాలమునాటికి బౌద్ధమత మస్తప్రాయమగుచున్నట్లు విస్పష్టమగుచున్నది. ఆకాలమునాటి బౌద్ధమతస్థితిని జూచి ఫాహియాను నిట్టూర్పులు విడచినాడు. ఈతడు ఆర్యావర్తమును దర్శించునాటికి దీని పూర్వవైభవము లంతరించినవి ఈమతము ప్రాణావశిష్టమైయున్నది కుషానుసామ్రాట్టుల కాలమున అతులవైభవమున వనరారిన బౌద్ధక్షేత్రములు నేడు నిర్జనప్రదేశములై కళావిహీనములై, పాడుపడి, వెలవెల బోవుచున్నవి. గౌతముడుపుట్టినచోటగు కపిలవస్తునగరము నిర్మానుష్యమై, కంటకావృతమై సింహశార్దూలాది వన్యమృగములకు నివాసభూమియై భీతిగొల్పుచున్నది కోసలరాజ్యమునకు రాజధానియై గౌతముని కాలమున మహాపట్టణమై, జనసంకీర్ణమై వెల

సిల్లిన యీనగరరాజమున నేడు ఇన్నూరు కుటుంబములైన గానరాకున్నవని ఫాహియాను విలపించినాడు.

తక్కటి ప్రాంతములం దత్యంతదైన్యస్థితియందున్నను మధ్యభారతమున యమునానదీప్రాంతభూములందు బౌద్ధమత మంతక్షీణగతినొందలేదని ఫాహియా నించుక సంతసించి నాడు. దీనిని బట్టి విక్రమార్కుని రాజ్యమున ఐదవశతాబ్దారంభమున బౌద్ధమత మింకను నస్తమించిపోవలేదని స్పష్టమగుచున్నది. ఇచ్చటి బౌద్ధమతము లింకను భిక్షుకసంఘములతో గలకలలాడుచున్నవి. ఇచ్చటి బౌద్ధసన్యాసులకు నృపాలురు సైతము జోహారులొనర్తురని ఫాహియాను దెల్పియున్నాడు మఱియు నీకాలమున ఆర్యావర్తమున నెచ్చట జూచినను బుద్ధదేవునకు మహోత్సవములు సల్పబడుచుండినట్లు ఫాహియాను వర్ణించుటచే నీతరుణమున భారతవర్షమున మహాయానమే మిగుల ప్రబలముగనుండినట్లూహింపవలసియున్నది.

## విక్రమార్కుని సర్వమత సమదృష్టి

విక్రమార్కుని కాలము వైదికమత విజృంభణ కాలమైనను అన్యమత పీడన ముండినట్లు ఫాహియా నెచ్చటను వ్రాసియుండలేదు. విక్రమార్కుని రాజ్యమున నింకను బౌద్ధమతము ప్రబలుచుండినట్లు యీతడు వ్రాసెను. ఈకాలమున వైదికబౌద్ధమత వైరము లుండినయెడల ఆయ్యుదంతమును ఫాహియాను విపరింపకపోడు. వైదిక మతావలంబులైనను స్వమతోత్కర్షకై గుప్తనృపులు మతాంతరులగు బౌద్ధుల హింసలపాలుగావించి తమహస్తముల కళంకితము జేసికొన

లేదు. ఒక్కఁగుప్తసార్వభౌము లననేమి భారతవర్షము నేలిన హైందవరాజు లెవ్వరును నట్టి దౌష్ట్యముల కొడిగట్టినట్లు గా న్పింపదు సముద్రగుప్తుడు మేఘవర్ణు నెట్లు తనరాజ్యమున బౌద్ధవిహారమును నిర్మించుకొననిచ్చి బౌద్ధమతము నాదరించెనో తెల్పియుంటిమి ఇదిగాక మౌర్యచక్రవర్తులచే నొసగ బడినవడిమాన్యముల విహారముల, భిక్షువులెట్టి యాటంకమును లేక యథేచ్ఛముగ ననుభవించుచుండిరనియు పూర్వరాజులచే లిఖియింపబడిన దానశాసనము లీకాలమునగూడ గుప్తసార్వ భౌములచే దమరాజసౌధముల సంరక్షింప బడుచు పూజింప బడుచున్నవని ఫాహియాను తెల్పియున్నాడు. విక్రమార్కు నిరాజ్యమున బౌద్ధసంఘము లభివృద్ధి జెందుచున్న వనియును, హీనయాన మహాయానము లనెడు యుభయమతములు నెట్టి పరస్పరవైరములును లేక నడుచుండినవనియును కూడ ఫాహి యాను నుడివియున్నాడు. మఱియు నీకాలమున నార్యావర్త మున నెచ్చటకు బోయినను బౌద్ధసన్యాసుల కెట్టి కొరతయు లేదనియు మందిరారామభోజనశయ్యాదులకు గరవులేదని యు నీయాత్రికుడు తనగ్రంథమున సూచించినాడు. దీని వలన గుప్తచక్రవర్తుల పరమత సహిష్ణుత, సర్వమత సమదృష్టి, విదితమగుచున్నది.

ఇట్లు చంద్రగుప్త విక్రమార్కుని పరిపాలనము వైభ వోపేతమైనది. ఆతడు భారతవర్షము నేలిన ప్రఖ్యాత చక్ర వర్తులలో నొక్కఁడు.

## కుమారగుప్తుడు.

**413—455**

చంద్రగుప్త విక్రమార్కుని యనంతరము రాజ్యమేలిన వాడు కుమారగుప్తుడు ఈతడును తండ్రివలెనే మిగుల పరాక్రమవంతుడు. 413వ సంవత్సరమున పట్టాభిషిక్తుడై నలువదేండ్లకుపైగా రాజ్యపాలన మొనర్చెను. ఈతని రాజ్యకాలమున జరిగిన విశేషము లెవ్వియు మనకంతగా దెలియవు. అశ్వమేధయాగమును సల్పుటచే నీతడు మిగుల రణశూరుడనియు అన్యరాజ్యములపై దండెత్తి పెక్కు విజయముల బడసెననియు నూహింపవలసి వచ్చుచున్నది. ఈతని రాజ్యకాలమున తుదిరంగమున పుష్యమిత్ర * యను వారలు గుప్తసామ్రాజ్యముపై దాడిసల్పిరి. కాని కుమారగుప్తుడు వారిసైన్యముల చిందరవందర గావించి వెనుకకు దరిమివైచెను.

## స్కంధగుప్తుడు, గుప్తసామ్రాజ్య వినాశము.

**455—480**

కుమారగుప్తుడు దివికేగిన పిమ్మట అతనికుమారుడు స్కంధగుప్తుడు సింహాసన మధిష్టించెను. ఈతడు పోటుమానిసి. సమరకౌశలమున తండ్రిని మించినవాడు ఈతని కాలముననే గుప్తసామ్రాజ్యమునకు కష్టములు ప్రారంభమయ్యెను ఈతడు రాజ్యభారమును వహించినంతనే హూణు

* వీరలొక తెగవారు వీరలెచ్చట నివసించువారో సరిగ తెలియకున్నది. ఐరంఖయుల్లై యుండవచ్చునని తోచుచున్నది.

లు మిడుతలదండువలె హిందూదేశముపై బడి దేశమున మహా సంక్షోభము గల్పింప సాగిరి. హూణులు మధ్యాసియా ఖండమునినివసించు క్రూరజాతులు. వీరినెన్నిసారులుగుప్తరాజు లు మరలించినను ఈమూకలు మరలమరల సముద్రతరంగముల వలె, ఉప్పెనగాలులవలె వచ్చిపడుచుండెను. పర్వతాగ్రముల నుండిపడు జలప్రవాహములవలె వీరిసంఖ్యలకు మేరలేకుండెను. వీరిదాడులతోడనే గుప్తసామ్రాజ్యమహాసౌధము కూకటివేళ్ళతో కదలి గుభిల్లున గూలిపోయెను హూణదండయాత్రలు గుప్తసామ్రాజ్యవినాశమునకు గారణమయ్యెను.

స్కంధగుప్తుడు సమరశూరుడు. తొలిసారిహూణులనీత డుసమరమున మార్కొనియోడించెను. స్కంధగుప్తుడు హూ ణుల దరిమి విజయుడై ఆహవభూమినుండి తల్లికడకేగి నమ స్కరించెనట అట్టి విక్రమము నెఱపి భీకర శత్రుజాలముల బారినుండి భారతవర్షమును సంరక్షింపజాలిన తనయుని గాంచి యావీరమాత యానందాశ్రువుల రాల్చుచు దీవించెనట

ఈయోటమితో నడలి పరువులెత్తి హూణులు మరి పండ్రెండు వత్సరముల వరకును ఆర్యావర్తమును త్రొక్కి చూడలేదు కాని హూణులంతటితో తమదండయాత్రల విర మింపలేదు మరల సాహసులైచెలరేగి మనుష్యరక్తమును జవి జూచిన తోడేళ్ళగుంపులవలె వీరు భారతవర్షముపై బడసాగిరి. ఈసారి గుప్తరాజులు హూణసమూహముల మరలింప లేక పోయిరి ఎన్నిసారులని యామూకలతో పనిసేయగలరు? వారిదండయాత్రల కంతము లేకుండెను. సైన్యములు వడిసి

పోవుచుండెను. ధనాగారములందలి ధనరాసులు తరిగిపోవు చుండెను. సంతతరణవ్యాపారములతో గుప్తసామ్రాజ్యము బలహీనమై తుదకువిచ్ఛిన్నమై పోయెను. హూణులు గాంధారము నాక్రమించిరి. ఇంతలో యుద్ధములతో విసిగి 485 సంవత్సరమున స్కంధగుప్తుడు దివంగతుడయ్యెను.

## నరసింహగుప్తబాలాదిత్యుడు

తరువాత హూణులతో రణము నడుపవలసినభారము నరసింహగుప్తబాలాదిత్యునిపై బడెను. స్కంధగుప్తుడు అవసానము నొందినపిమ్మట గుప్తసింహాసనము నధివసించిన దీతడె. ఈతడును ధీరుడె రణవిశారదుడె. హూణసైనికబలముల నురుమాడి, భారతవర్షమున తలయెత్తదొడగిన హూణరాజ్యముల నీతడు విధ్వంసమొనర్చెను.

బాలాదిత్యుడు బౌద్ధమతాభిమాని. విద్యాపోషకుడు. అనేక బౌద్ధమఠములకు దానధర్మముల జేసెను. నలందా విశ్వవిద్యాలయము నీతడే యనేకవిధముల పోషించి యున్నతికి దెచ్చెను.

కాని బాలాదిత్యుడు విద్యలపోషించుచు నెమ్మదిగ రాజ్యమేలుకొనుటకు నోచుకొనలేదు. హూణుల రాకలవలన రాజ్యమున శాంతములేదు. రాజ్యరక్షణ దుర్భరమగు చుండెను బాలాదిత్యుడు రణవ్యాపారములయందే మునిగి పోవలసివచ్చెను పశ్చిమకనుమలనుండి హూణ సమూహములు హిమపాతములవలె వచ్చిపడుచునేయుండెను హూణు

లగుంపులతో గుప్తసామ్రాజ్యము కల్లోలితమై పోవుచుం డెను హూణులు వచ్చినెత్తురుదాగ్రు క్రూరపిశాచులు. దయా రసమనునది వీరికడ గన్పింపదు అతిఘోరముగ వీరు పసి పాపల, అబలల, వృద్ధుల కుత్తుకలగోసి వధించుచుండిరి. హూణు లదండు వచ్చుచున్నదనిన ప్రజల ప్రాణము లెగసిపోవు చుండెను. కాని వీరిసైన్యముల నురుమాడు నుపాయము గానరాకుండెను. బాలాదిత్యుని ప్రయత్నములు వ్యర్థములగు చుండెను. ఈతడు సింహాసన మధిష్ఠించినపిమ్మట వీరిరాకలు మరింత ప్రబలమయ్యెను. మునుపటివలెగాక వీరు రాజ్యముల గూడ నాక్రమింపసాగిరి. 495 సంవత్సరమున తోరమానుడను హూణనాయకుడొకడు ప్రచండసైన్యములతో మాళవము పైబడి యారాజ్యమును జయించెను. బాలాదిత్యునిబలములు వాని నెదిరింపలేక పలాయనముల య్యెను. మాళవము తోర మానునిపాల బడెను. తోరమానుడు రాజబిరుదములతో మాళవమునకు రాజయ్యెను. భారతమున నొకహూణ రాజ్యము నిర్మాణమయ్యెను. ఒక్కమాళవమేగాక పాంచా లము మున్నగు పరిసరరాజ్యములన్నియు అతనికి పాదాక్రాంత మయ్యెను.

తోరమానుని విజయములు హైందవరాజులకు మరింత భయకారణ మయ్యెను. ఇంతవరకును హూణులకు రాజ్య కాంక్ష లేదు ఆకస్మికముగ దేశములపైబడి ప్రజల ప్రాణ ములదీసి, నిరపరాధుల రక్తములొలికించి, ధనములదోచుకుని పోవుటతో తృప్తినొందెడివాడు. తోరమానుని రాజ్యనిర్మా

ణముతో శార్దూలము పశులమందలో జొరబడినట్లయ్యెను. హూణరాజ్యము ఎదురులేమిపై కుంపటియైనది. తోరమానుడు పశ్చిమోత్తరప్రాంతమెల్ల హూణరాజ్యమును విస్తరింపజేసి తన తనయుడగు మిహిరకులుని దాని కభిషిక్తుని జేసి యేగెను.

మిహిరకులుడు అతి క్రూరుడు. ప్రపంచమున మున్నెన్నడును ఇంతటి క్రూరుడుద్భవించినట్లు గన్పింపదు. ఈతని క్రౌర్యముల దలచుకొనిన నిప్పటికిని యొడలు జలదరించును. నిరపరాధులగు ప్రజల నీతడు చిత్రవధల గావించెను. ఏపాప మెరుగని పసికూనలు, అబలలు, ఆతని కెన్నడును కీడుదలంపని బౌద్ధసన్యాసులు ఎంతరెందరో యీతని కులిశధారల కాహుతియై మ్రగ్గిరి. బౌద్ధసన్యాసులకంఠము లెన్ని తెగినవో లెక్కలేదు. శోణితము కాల్వలై ప్రవహించినది. ఉత్తర భారతమంతయు నొక కసాయిదొడ్డి యైపోయినది. ఈతనికంటబడిన బౌద్ధవిహారములు నిర్మూలమై పోయినవి. అంతయు సర్వనాశనము. విధ్వంసము మిహిరకులుని హత్యాకాండలతో భారతవర్షము, సంక్షోభిల్లిపోయెను. ప్రజలెంతని యోర్చుకొనగలరు?

ఆర్యావర్తమున మరల నొకమారు రోషానలము ప్రజ్వరిల్లినది. స్వాతంత్ర్యసమరము రేగినది. ఆ నరహంతకుని పరిమార్చుటకు ప్రజలలో యుద్రేకము బుట్టినది. తనసైన్యము లొంటరియై యాతనిబలముల మార్కొనజాలవని బాలాదిత్యుడు ఆర్యావర్తమునగల రాజులకెల్ల ఈమహాసమరమున తనకు

సహాయ మంపవలసినదని ఆహ్వానము లంపెను ఆదాన్యాపదేశమున నెక్కుచోట్లనుండి సైన్యములు కదలినవి. అచిరకాలముననే యొక పి్రచండసైన్యము పోగయ్యెను బాలాదిత్యుడును మధ్యభారతమున రాజ్యమేలుచుండిన యశోవర్మ యను నొక వీరాగ్రిణియు, ఈమహాసైన్యములకు వాహినీపతులై స్వాతంత్ర్యసంగ్రామమును నెరపిరి. హూణ హైందవసైన్యములకు 528 సంవత్సరమున పి్రచండమగుయుద్ధము జరిగెను. హైందవులకే తుదకు విజయముగల్గెను. మిహిరకులుడు రణరంగమున పట్టుపడెను. కాని ఎట్టి కట్టడికృత్యము లొనర్చినను, ఎంతటి కూ్రరపాపియైనను బాలాదిత్యుడాతని సంహరింపలేదు. ఆతడు ధర్మజిజ్ఞాసవు హైందవరణధర్మములు సంగ్రామరంగమున పట్టుపడిన బందీని బరిమార్చుట కిచ్చగింపవు. అది నీచధర్మము. భీరులలక్షణము. బాలాదిత్యుడాతని భారతఖండమునుండి తొలగిపొమ్మని మిహిరకులుని విడిచిపుచ్చెను ఎంతటి కారుణ్యభావము! ఎంతటి ఉత్తమరాజనీతి! భారతవర్షమునకు ప్రబల శతు్రవును గుప్తసామ్రాజ్యవిధ్వంసిని ప్రాణముతో విడచెను.

కాని అంతటితో మిహిరకులుడు తనకార్యమును విడువలేదు. ఆతని నైజహూవంతయు మార్పునొందలేదు శార్దూలమునకు సాధుభావమా? మిహిరకులుడు కాశ్మీరమునకు బోయి యచ్చట తలదాచుకొనెను కాశ్మీరనృపుడు జాలిగాని ఎంతటిశతు్రవైనను శరణార్థియైవచ్చెగావున ఆతనికి తనరాజ్యమున నాశ్రియమిచ్చెను. ఆతని యంగరక్షకుల పోషణాదిక

ములకై మిహిరకులునకొక చిన్ని జాగీరుకూడ నొసగెను. పాప మాతని దయాశీలతయే యాతనిప్రాణముల బలిగొనెను. మిహిరకులుని రాజ్యమున నుంచుకొనుట మృత్యుదేవత నింట గట్టివైచుకొనుట యయ్యెను మిహిరకులుడు కిరాతుడు. దయాశూన్యుడు మాయావి. హైందవసమరాంగణమున గల్గిన పరిభవము మహాగ్నిజ్వాలలయి యాతనిహృదయమును దహించి వేయుచుండెను స్వామిద్రోహియై యాతడు ప్రాణదాతయగు కాశ్మీరనృపునిపై తిరుగబడి యతని బరిమార్చి యాతని రాజ్యము నపహరించెను అంతటితో తనివి నొందక సైన్యముల ప్రోవుచేసికొనిపోయి గాంధారముపై బడి యారేని దునిమి, యాతని భార్యాసుతల కంఠము లుత్తరించి యాతని రాజ్యమునుగూడ నాక్రమించెను ఈతరుణమున నీతడు నిరపరాధులగు ప్రజల నెందరినో తనఖడ్గధారల కెరగావించి తన రుధిరదాహమును దీర్చుకొనెను. ముద్దుమూటగట్టు బౌద్ధవిహారముల నాశనమొనర్చెను.

మిహిరకులుడీఘాతుకకృత్యము లొనర్చిన తరువాత చిరకాలము జీవింపలేదు. ఒక్కయేడాదియైన గడువకమున్నె మృత్యుదేవత యాతని తననోట గరచుకొనిపోయెను భారతప్రజాళిహృదయసీమలనుండి యొకభారము దింపినట్లయ్యెను.

మిహిరకులుని మరణముతోడనే హూణరాజ్యములు కూడ క్షీణించి యదృశ్యమైపోయెను

హూణరాజ్యములు నశించినను గుప్తసామ్రాజ్యము కోలుకొనలేదు. అఘోరసంగ్రామ దావానలకీలలో బడి యది

దగ్ధమై పోయినది. సంతత రణపరిశ్రమలచే నీసామ్రాజ్యము బలహీనమై కృశించిపోయినది. బాలాదిత్యునితోడనే ఈసామ్రాజ్యవైభవ మంతరించినది. అంతటినుండియు నిది జీర్ణమై శుష్కించి యొక క్షుద్రరాజ్యముగ మారి జీవచ్ఛవము వలె ఎనిమిదవశతాబ్దమువరకును నిలిచి కాలగర్భమున మణిగి విస్మృతమైపోయినది. ఆంధ్ర, మౌర్య, కుషానుసామ్రాజ్యములగతియె దీనికిని బట్టినది.

---

# బౌద్ధమహాయుగము

## XIII

### గుప్తసామ్రాజ్యకాలమునాటి భారతవర్షము

గుప్తసామ్రాజ్యకాలము చంద్రగుప్త, సముద్రగుప్త, చంద్రగుప్తవిక్రమాదిత్య, కుమారగుప్త, స్కంధగుప్తులు రాజ్య మేలిన కాలము నిక్కువముగ స్వర్ణయుగమనియే జెప్పవల యును. అప్పటి భారతవర్ష మెట్లుండెనో ఫాహియాను కొంల దిగ చిత్రించినాడు. ఆకాలమున భారతవర్షము మహదైశ్వర్య ముల దేలియాడినది. అప్పటి ప్రజలు దయాశీలురై ధర్మమా ర్గమున వర్తిల్లిరి. అప్పటి పరిపాలన సర్వోత్కృష్టమై దనరారినది. అంతటి యుత్కృష్టపరిపాలన ప్రపంచమున నేరాజ్యముననను ఏకాలముననను గన్పింపదు. గుప్తసార్వభౌములు అతిమార్దవ ముగ జనుల బాలించిరి ఈరాజులు ప్రజల క్రూరముగశిక్షించి యెరుగరు. తాడనశిరచ్ఛేదనము లాకాలమున లేవు. ఱేని పదచ్యుతునిజేయ మంతనముసల్పు ద్రోహులకైన మరణదండన లేదు. ప్రజలు భరింపరాని పన్నులులేవు అట్టి సుపరిపాలన నేప్రజలకు హాయిగొల్పకుండును! జను లీకాలమున సంతుష్టులై మనిరి. రాజ్యమందంతటను శాంతము ప్రబలినది. కళలు వృద్ధి నొందినవి. పరిశ్రమలు పెంపొందినవి. విజ్ఞానము వికసించినది. శిల్పచిత్రవాఙ్మయము లీకాలమున పరిపూర్ణత గాంచినవి. ప్రపంచమున నెందరో కవిపుంగవు లుద్భవిల్లిరిగాని యింతటి మహాకవి యుద్భవిల్లినది లేదని నేటికిని ప్రాగల్భ్యల గాంచుచు

లోకమును రసవారధిని ముంచి లేవనెత్తుచున్న కవిరాజు కాళి దాసు ఈకాలముననే ఉద్భవిల్లెను. లోకమిన నెచ్చటను గానరాని చిత్రశాల యీకాలముననే కల్పింపబడినది. ఇంత యేల, ఈ కాలముసర్వవిధముల స్వర్ణయుగ మనిపించుకొన్నది. దీని కీడగుకాలము భారతవర్షచారిత్రమున వేరొకటి లేదు. ఈనాటి శిల్పచిత్రకళాసంపదల గూర్చియు, వాఙ్మయ సౌర భమును గూర్చియు, రాజ్యాంగపద్ధతుల గూర్చియు కొంత నుడువవలసియున్నది.

## ఈకాలమునాటి రాజ్యాంగవిధానము.

ఫాహియాను ఈకాలమునాటి బౌద్ధమతస్థితిని వర్ణించి నాడు. ప్రజల గుణశీలముల గొనియాడినాడు కాని పరిపా లనావిధానమునుగూర్చి యొక్కమాటయైనను నుడువలేదు. కౌటిల్యుని అర్థశాస్త్రము మౌర్యరాజ్యాంగమును వర్ణించినట్లు ఈకాలమునాటి రాజ్యపద్ధతుల వర్ణింపగల గ్రంథమేదియు గానరాకున్నది. ఐనను మనుధర్మశాస్త్ర మీవిషయమున గొంతవర కుపకరించుచున్నది మౌర్యులకాలమున అర్థశాస్త్ర మెట్లు రాజ్యాంగమును శాసించినదో గుప్తయుగమున మను శాస్త్ర మట్లు శాసించినది.

మౌర్యులకాలమునాటి రాజ్యాంగమునకును ఈ కాల మునాటి రాజ్యాంగమునకును అంతగ భేదముగాన్పింపదు. మౌ ర్యసార్వభౌములకాలమునందువలెనే యీకాలమునను, రా జ్యాంగనిర్వహణమున నృపునకు తోడ్పడుట కొకసభ గలదు. దీనికే 'రాజసభ' యనిపేరు. దీనియం దెనమండుగురు మంత్రి

లుందురు. ఉత్తమవంశసంజాతులై, ధర్మశాస్త్రముల గోల్లి విలువిద్యల నేర్చి సమరతంత్రమున ప్రావీణ్యత గడించినవారలై యిందు సభ్యులుగ నుండవలెను.♦ సైనిక,నావిక, ఆర్థికవ్యవహారములందును, పరరాజులతో యుద్ధము సల్పవలసినపుడును, సంధి నెరపవలసినపుడును, రాజ్యరక్షణకార్యములందును నృపుడు రాజసభతో నాలోచించితీరవలయును.*

నేడు గ్రామ, తాలూకా, జిల్లా, రాష్ట్రవిభాగము లుండినట్లే ఆకాలమున గ్రామ, దశగ్రామ, వింశతిగ్రామ, శతగ్రామ, సహస్రగ్రామ విభాగములుండెను. ప్రతి విభాగమునకును నృపుడె అధికారుల నియమించువాడు వారివారి కార్యభారములబట్టి ఇయ్యుద్యోగులకు వేతనములుగలవు. దశగ్రామాధికారికి రెండరకల భూమియు, వింశతి గ్రామాధికారికి పదియరకల భూమియు, శతగ్రామాధికారి కొక గ్రామమును, సహస్రగ్రామాధికారి కొక బట్టణమును వేతనములు. అపరాధుల దండించి ప్రజల సంరక్షించుట వీరిపని.
ఈయుద్యోగులు అధికారమదాంధులై ప్రవర్తింపకుండ వీరిపై నొకరాజప్రతినిధి యుండును. గ్రామాధికారులు తమ రాజధర్మములను దీక్షగ నిర్వర్తించుచున్నదియు లేనిదియు నీతడు వేయికన్నులతో పరీక్షించుచుండును.

---

♦మౌలాన్ శాస్త్రవిద్యశ్శూరాన్ లబ్ధలక్షాన్ కులోద్గతాన్ । సచివాన్ సప్తచాష్టౌచా ప్రకుర్వీత పరీక్షితాన్॥ (మను స. 54.)

* తైస్సార్ధం చింతయేన్నిత్యం సామాన్యమ్ సంధివిగ్రహమ్ । స్థానం సముదయం గుప్తం లబ్ధప్రశమనానిచ॥ (మను. స. 56.)

# గుప్తసామ్రాజ్యమునాటి భారతవర్షము

విక్రమార్కుని కాలమున భారమగు పన్నులు లేవని ఫాహియాను వ్రాసినాడు. గుప్తసామ్రాజ్యకాలమున రాజు పండినపంటలో షష్ఠభాగమును మాత్రము ప్రజలనుండి పరిపాలనానిర్వహణమునకై పన్నుగ బుచ్చుకొనువాడు. ఆపత్సమయమున రాజ్యరక్షణార్థమై శత్రురాజులతో నని సేయవలసినప్పుడుమాత్రము నృపుడు నాల్గవవంతు బుచ్చుకొనును. విద్వాంసులగు బ్రాహ్మణుల కీకాలమున బన్నులు లేవు ఈకాలమున సరకులపై సుంకములుకూడ విధింపబడెడివి. వణిజులు దమకు పండినపంటలో పండ్రెండవవంతును ♦ వాణిజ్యమున వచ్చులాభములో నేబదవవంతును సుంకముచెల్లించువారు కొలది వ్యాపారములను జేయు వర్తకులకు అత్యల్పవగు పన్నులు ఏడాదికొకసారి విధింపబడెడివి. *శ్రమజీవులు నెలకొకరోజు బత్తెము పన్నుగ జెల్లింపవలయును. ఇవిగాక నితరములగు ప్రజల సంసారముల గూల్చు పన్ను లెవ్వియు నాకాలమున లేవు. ఉప్పుపై బన్నులును, పప్పుపై బన్నులును ఈకాలమున గానరావు.

---

♦ పంచాశద్భాగ ఆదేయో రాజ్ఞా పశుహిరణ్యయోః
ధాన్యానా మష్టమో భాగః షష్ఠో ద్వాదశ ఏవవా.
మను. ప. 130.

* యత్కించిదపి వర్షస్య దాపయేత్కర సంజ్ఞితం
వ్యవహారేణ జీవితం రాజా రాష్ట్రేపృథగ్జనం
మ. ప 137.

## మ త వ్య వ స్థ

ఈకాలమున బౌద్ధమతము అస్తమింపదొడగినదనియు వైదికమతము మరల ప్రబలసాగినదనియు నుడివితిమి గుప్త సార్వభౌములు తాము వైదికమతావలంబులైనను బౌద్ధ జైన మతముల హింసింపక వానిగూడ నాదరించిరి. బౌద్ధులును జైనులును ఈకాలమున యథేచ్ఛముగ తమ మతారాధనల సల్పుకొనిరి.

బౌద్ధమతసంపర్కమువలన ఈకాలమున వైదికమతము విపరీతముగ మార్పునొందినది. బౌద్ధమతసాంప్రదాయము లెన్నియో వైదికమతమునకు ప్రాకినవి. అట్టు గల్గిన మార్పులలో ప్రతిమారాధన యొకటి వేదకాలమున విగ్రహారాధన లేదు. ఇటీవలనే మహాయానమతము ననుకరించుటవలన వైదికమతమున విగ్రహారాధన మేర్పడినట్లు గాన్పించుచున్నది. గుప్తరాజుల కాలమున బౌద్ధులజూచి బ్రాహ్మణమతస్థులు దేవాలయముల గట్టదొడగిరి. ఈకాలముననే భారతవర్షమున లెక్కలేనిదేవాలయములు నిర్మింపబడినవి వైదికులు బౌద్ధుల వలె యాడంబరముగ రథోత్సవములుగూడ సల్పజొచ్చిరి

## వాణిజ్యసంపద

ఈకాలమునాటి పారిశ్రామిక వాణిజ్యసంపదల నిదివరకే వర్ణించితిమి నాటి యార్యావర్తము సువర్ణసీమయని, రత్నఖనియని పేరువడసినది. ఆకాలమున భారతవర్షము సువర్ణరాసులతో, మణిమాణిక్యములతో తులతూగినది. ఇచ్చట నేయబడిన సన్నవలిపెముల, చీనాంబరముల జూచి యవన

రోమక ప్రజలు దిగ్భ్రమ జెందిరి. రోమక సామ్రాజ్యమునుండి ఆర్యావర్తమునకు గొట్టుకొనిపోవు ధనప్రవాహమును జూచి ప్లైనీ విభ్రాంతపడినాడు. ఆకాలమునాటి భారతవర్షము తన పట్టువలువలతో, సువర్ణవస్త్రములతో, లవంగాది సుగంధ ద్రవ్యములతో, చందనాగరుపన్నీరులతో, అమూల్యమణులతో పాశ్చాత్యప్రపంచమును గప్పివేసినది.

## ప ట్ట ణ ము లు.

ఈకాలమున ఆర్యావర్తము రమణీయములగు బట్టణములతో కలకలలాడినది. అప్పటిపట్టణముల సౌందర్యమును వీక్షించి ఫాహియాను తన్మయత్వము నొందినాడు. ఆనాటి పట్టణములు అత్యున్నతములగు ప్రాకారములచే నావరింపబడి దుర్భేద్యమై జనసంకీర్ణమై కనులపండువ జేసెడివి. పురవీధులందు అంగళ్ళకు మేరలేదు మృగవధాజీవనులు, మత్స్యవిక్రేతలు, హంతకులు పురబాహ్య ప్రదేశముననే నివసించెడివారు. తక్షశిల, మధురానగరి, కాశీ, గయా, పాటలీపుత్ర, రాజగృహ, చంపా, తామ్రలిప్తి, శ్రావస్తి, కపిలవస్తు, ధాన్యకటక, కంటకశిల, (ఘంటసాల) మోటుపల్లిమున్నగునవి యాకాలమున ప్రఖ్యాతిజెందిన పట్టణరాజములు

## శి ల్ప వి ద్య.

గుప్తసామ్రాజ్యకాలమున శిల్పవిద్య మిన్నుముట్టినది. ఈకాలమున చిత్రింపబడిన శిల్పచిత్రములు నిరుపమానములు. ఇంతటి లావణ్యమును రసస్ఫూర్తిని జిక్కరించు విగ్రహము లేకాలముననూ జిత్రింపబడియుండలేదు. జగద్విఖ్యాత

మగు అమరావతి శిల్పచిత్రము. లీకాలముననే రచియింపబడి నవి. గుప్తసార్వభౌములకాలమున మూర్తిశిల్పము కడలేని యభివృద్ధిగాంచినది. ఈకాలమున విగ్రహారాధన ప్రాబల్యము నొందుటచే దేవాలయము లసంఖ్యాకములుగ నిర్మింపబడినవి. విగ్రహము లపరిమితముగ చిత్రింపబడినవి శిల్పులు తమ యసమాన కళాప్రావీణ్యమును శిల్పరచనలయందు ప్రదర్శించి శిల్పజగత్తునందు భారతవర్షమున కగ్రస్థాన మొసంగిరి. ఇయ్యది వైదికమత విజృంభణకాలమగుటవలన నీకాలమున స్తూపచైత్యవిహారములకంటె దేవాలయములే మిక్కుటముగ నిర్మింపబడినవి. వీనిపై ప్రదర్శింపబడిన శిల్పవిన్నాణ మద్వితీయము ప్రపంచమున నింకెచ్చటను ఇట్టి శిల్పరచనలు గన్పింపవు. కళింగరాజ్యములోని ప్రఖ్యాతమగు భువనేశ్వర దేవాలయ మీకాలముననే నిర్మింపబడినది. ఈ ఆలయ గోపురము 180 అడుగుల యున్నతిగల్గి మేఘమండలమును దాటిపోవుచున్నది. దీనిపై గనుపరుపబడిన శిల్పచాతుర్యము అత్యద్భుతము గుప్తరాజుల కాలమున పలుచోట్ల యిట్టి దేవాలయములు నిర్మింపబడినవి. ఇవియన్నియు కాలగర్భమున మణగిపోయినవి. ఝాన్సీ జిల్లాలోని దేవఘుర నొద్దను, వారణాసికి సమీపముననున్న షార్నాతుకడను ఈకాలము నాటి దేవాలయ శిథిలము లింకను గాన్పించును. వీనిపై అప్పటి యద్భుత శిల్పరచనలు గానబడును.

ఈకాలమునాటి శిల్పులు శిలలజెక్కుటలో గాక, లోహపుబనులయందుగూడ కడునిపుణులు. సముద్ర

గుప్తుడు తన దిగ్విజయముల వెల్లడించుకొనుటకై ఎత్తిన జయస్తంభము ఈకాలమునాటి లోహకారుల నిరుపమాన లోహవిద్యాకౌశలమును ప్రదర్శించుచున్నది. ఇది కరగిపోసిన యినుపస్తంభము. నేటికిని ఇది ఢిల్లీనగరమున నున్నది. నిన్న మొన్న నే పోతపోసిన ట్లిది నేటికిని మెరుగులీను చున్నది.

విగ్రహముల పోతపోయుటలో కూడ వీరి కింతటి కౌశలమును గలదు. ఆరవ శతాబ్దాంతమున నలందాపట్టణమున బుద్ధునిప్రతిమ యొకటి పోయబడినది ఇది ఎనుబదియడుగుల పొడవగు రాగివిగ్రహము దీనిజాడ లిప్పుడు తెలియవచ్చుట లేదు. ఇంకొక బుద్ధవిగ్రహము నిలువెత్తువిగ్రహము ఇటీవల సుల్తానాగంజియను ప్రదేశమున దొరికినది. ఇది చంద్రగుప్త విక్రమార్కుని కాలమునాటిది. నేడిది బర్మింగుహాము వస్తు ప్రదర్శనశాలలో నున్నది.

## చిత్రకళ

కాని అన్నిటికంటెను పేర్కొనదగినది, కళాప్రపంచమున భారతవర్షమునకు శాశ్వతకీర్తి నొసంగినది యీ కాలమునాటి చిత్రకళ దీనిముందు తక్కిన కళలన్నియు మరుగువడిపోవుచున్నవి. చిత్రకళ యీకాలమున పరిపూర్ణత గాంచినది. ప్రపంచమున నెచ్చటను గానరాని యద్భుత రూపకల్పనలు ఈకాలమున చిత్రింపబడినవి. జగద్విఖ్యాతమగు అజంతా చిత్రశాల యీకాలముననే నిర్మింపబడినది. ఈఅజంతా గుహాలయములలోని చిత్తరువు లందు గానవచ్చు

చిత్రరచనాకౌశలము వర్ణనాతీతము. ఇందలి చిత్రకళావైఖరులు చిత్తరువుల సౌందర్యము ఖండాంతరములందలి కళాభిజ్ఞులగూడ సమ్మోహితుల జేసినవి. పాశ్చాత్యు లీచిత్రముల దిలకించి ఆనందపారవశ్యమున భారతచిత్రకళా ప్రావీణ్యమునకు కేలుమోడ్చి పోవుచుందురు. అజంతాచిత్రశాలవంటి చిత్రశాల ప్రపంచమున నింకెచ్చటను లేదని పాశ్చాత్యచరిత్రకారులే అంగీకరించిరి. ఇచ్చట కళాలక్ష్మి తాండవించుచుండును. ఇందలి రూపకల్పనలు ముద్దులు గుల్కుచు నేత్రపర్వ మొనర్చుచుండును. ఈచిత్తరువులందు ప్రదర్శితమైన భావోన్మీలనము, రసపుష్టి, ఆధ్యాత్మికతేజము, రేఖావిన్యాసములు, రచనానైపుణ్యము, వర్ణసమ్మేళనము, నిరుపమానములు ప్రపంచమున నింకేచిత్తరువులందును యిట్టి సులక్షణము లొక్కచోట కుప్పబోసినట్లు గాన్పింపవు. ఇంతటి పరిపూర్ణత గానబడదు. ఇందలి రూపకల్పన లెట్టి యద్భుత వర్ణములతో చిత్రింపబడినవోగాని, అవి లిఖింపబడి నేటికి పదునైదువందలేండ్లైనను ఈచిత్తరువులు రవ్వంతయైన వివర్ణము నొందలేదు. వాడిపోవలేదు వానిరమణీయత యావంతయు దరుగలేదు. నేడే చిత్రింపబడినవాయని నేటికిని భ్రమగొల్పుచుండును నాటి చిత్రకారుల వర్ణసమ్మేళనాకౌశలమును వీక్షించి కళాభిజ్ఞులు నేటికిని విస్మయులగుచున్నారు. మఱియు నీచిత్తరువులన్నియు కేవల మూలికతోడనే చిత్రింపబడినవి మూలికావిక్షేపములతోడనే యిట్టి చిత్రముల రచింపగల్గిన యీశిల్పు లెట్టి సిద్ధహస్తులో!



అజంతావిహారములోని చెక్కడపుపని. (౩౦౮ పుట)

ఈయద్భుతచిత్రములు అజంతావిహారమందలి కుడ్యములపై వ్రాయబడిన ఈవిహారమున పెక్కుగుహాలుగలవు. ఇవియన్నియు నతిరమణీయమగు నొక యున్నతశైలమున దొలువబడినవి. ఈఅజంతాశైలము అర్ధచంద్రాకృతిగ నుండి ప్రకృతిసౌందర్యమును కుమ్మరించుచు చూపరుల కానందము గొల్పుచుండును.

ఈపర్వతపరిసరము లన్నియు వివిధతరులతా నికుంజములతో నల్లిబిల్లిగ నల్లుకొనియుండును. చుట్టును ఎటుజూచినను తమ సహజ గాంభీర్యమును వెల్లడించు పర్వతశ్రేణులు గాన్పించుచుండును. కొండకు దిగువభాగమున భుగ్రీనదీ జలములు రాలనడుమనుండి పరుగులిడుచు గండశిలలపైనుండి దొర్లుగింతలిడుచు శీకర సమ్మరప్రవాహములతో సంతతధారగ ప్రవహించుచుండును. సెలయేటి మధురగానము లచ్చట ఎప్పుడును వీనులకు విందుగొల్పుచుండును.

అజంతా చిత్రములన్నియు బౌద్ధపురాణగాథల వర్ణించు చిత్రములు, బుద్ధునియవతారకథలు రసము లొల్కునట్లు జీవకళ లుట్టిపడునట్లు ఈచిత్రశాలయందలి గోడలపై చిత్రింపబడినవి. ఇందు రచింపబడిన స్త్రీవిగ్రహములు అత్యంత కోమలముగ నున్నవి. అబలలకు సహజమగు ముఖవిలాసము, ముగ్ధత్వము, శరీరలావణ్యము, వదనసౌందర్యము, అంగసౌష్టవము, లజ్జ, సౌభాగ్యము నీచిత్తరువులం దత్యద్భుతముగ జూపబడినవి. ఫాలభాగమున జూపట్టు విషాదరేఖలు కనుగవలు కుమ్మరించు తేజము చెక్కిళుల దళోపాత్త పుల్కలు, వల

పులకుల్కుల హొయలుగూడ అత్యంతనిపుణముగ నీ బొమ్మలయందు ప్రదర్శింపబడినవి రాజఠీవి, విరహావేదన, మోహాపరవశత, రోషావేశము, ధ్యాననిష్ఠ మున్నగు భావము లుగూడ యిందు పరిస్ఫుటముగ గనుపరుపబడినవి వానరములు మున్నగు జంతువులుగూడ అసమానకౌశలముతో అత్యంత లలితముగ చిత్రింపబడినవి పుష్పములు, లతలు, అతిసౌకు మార్యముగ నున్నవి.

ఆనాటి మతసాంఘికజీవనములు ఈచిత్తరువులలో ప్రతిబింబితమైనవి. ఈతరుణమున బౌద్ధమతక్షేత్రమున పొడ సూపిన విప్లవము, మహాయానమతవిజృంభణము నీయలం కారములలో ప్రతిఫలించినవి ఐదవశతాబ్దమునాటికి బౌద్ధ మతము సంపూర్ణముగ విరూపముజెందినట్లు ఈచిత్రముల వలన గోచరించుచున్నది. ఈకాలమునాటికి బుద్ధుడొక యవ తారముగ జేయబడి బుద్ధునియారాధన సాగినట్లు ఈచిత్త రువులందు స్పష్టముగ గాన్పించుచున్నది. ప్రథమగుహాలయ మందొక కుడ్యముపై సిద్ధార్థుని పరిణయము చిత్రింపబడినది. అందు మహావిష్ణువు భోధిసత్త్వుడై విష్ణుకమలమును హస్తమున గీలించియున్నట్లు, శివపార్వతులు కైలాసపర్వతాగ్రములనుండి యీపరిణయమహోత్సవమును వీక్షించుచున్నట్లు మనోహర ముగ చిత్రింపబడిరి

ఎల్లోరాలోని విశ్వకర్మచైత్యముకూడ నీగుప్త రాజులకాలముననే నిర్మింపబడినది. ఎల్లోరా పట్టణమున అతిప్రాచీనమునుండియు అత్యంత నిపుణులగు శిల్పులు వరలి



ఎల్లోరాగుహాలోని కైలాసము ౩౦౬ పుట



కనోజ్‌లోని పురాతనమందిరము. ౩౨౨ పుట.

నట్లు గాన్పించుచున్నది ఈమందిరమును ఇచ్చటి శిల్పులు తమ యిష్టదేవతయగు విశ్వకర్మ (దేవాతాశిల్పి) నారాధించు టకై గట్టిరి ఇది అద్భుతశిల్పరచనలతో కడుసుందరముగ నున్నది. జగద్విఖ్యాతమగు ఎల్లోరాగుహాలు వీరలే మలచి నట్లు దోచుచున్నది. వీరి నిర్మాణకౌశలము, కల్పనాశక్తి, అద్వితీయములు ఎల్లోరాపర్వతము అర్ధచంద్రాకృతిగనుండి చూచుట కత్యంత రమణీయముగ నుండును. దీని యగ్రభా గమునుండి యొక జలపాతము, హెూరున శబ్దముజేయుచు ఆకాశతరంగిణివలె క్రిందికి దిగిపోవుచుండును.

పాశ్చాత్యఖండ మింకను కన్నులు దెరువనికాలమున ఆర్యావర్తమున నిట్టిచిత్రకళ పెంపొందినది. జగద్విఖ్యాతమగు నిట్టి చిత్రశాలలు కల్పింపబడినవి నాటిచిత్రకళానైపుణ్యము, రచనాకౌశలము నే డెచ్చటను గాన్పింపదేమి? స్వాతంత్ర్య ములేని దేశమునకు కళలా? చావుకళలు

## సారస్వతము

మౌర్యరాజులకాలమున ఆదరణలేక కృశించిపోయిన సంస్కృతభాషావల్లిక గుప్తరాజులకాలమున మరల చివురింప సాగినదని వేరొక సందర్భమున నుడివియుంటిమి. గుప్తసా మ్రాట్టులకాలమున సంస్కృతము రాజభాషగ జేయబడెను. సంస్కృతముననే శాసనములు వ్రాయబడసాగెను. గ్రంథ ములు రచింపబడ దొడగినవి. సంస్కృతభాషావల్లిక మెల మెల్లగ పుష్పింప సాగినది.

---

# బౌద్ధమహాయుగము

## VIX

### మాళవసామ్రాజ్యము

గుప్తసామ్రాజ్యము జీర్ణమైనవెనుక భారతరాజ్యరంగమున కంధకారము గప్పినది. గుప్తసామ్రాజ్యము శిథిలమైన తోడనే క్షుద్రరాజ్యములు తలలెత్తినవి ఈమహాసామ్రాజ్యమున అంతర్లీనమై పోయిన చిన్నరాజ్యములు చీలి మరల స్వాతంత్ర్యము వహించినవి. అట్లు గుప్తసామ్రాజ్యము పతనము నొందినవెనుక ఆర్యావర్తము పెక్కురాజ్యములుగ జీలిపోయినది. పశ్చిమప్రాంతమున వల్లభరాజ్యమును,♦ తూర్పున మగధ కామరూపములును, మధ్యభారతమున మాళవమును, దక్షిణాపథమున చాళుక్యరాజ్యమును ఈకాలమున ప్రాముఖ్యత గడించిన రాజ్యములు. మగధరాష్ట్రమును గుప్తసంతతి రాజులు పాలించుచుండిరి.* ఇంకను క్షుద్రరాజ్యము లెన్నియో యుద్భవిల్లినవి గాని వానిగూర్చి యిట ప్రస్తావింపపని లేదు

### విక్రమాదిత్యుడు (525-583)

ఈకాలమున నుద్భవిల్లిన రాజ్యము లన్నిటిలో మేటి రాజ్యమై తక్కిటిరాజ్యముల జయించి సామ్రాజ్యాధిపత్య

---

♦ సౌరాష్ట్రద్వీపకల్పమున విస్తరించిన రాజ్యము.

* మగధ సంతతిరాజులు పూర్వవైభవమును గోల్పడి ఎనిమిదవ శతాబ్దాంతమువరకును మగధను బాలించిరి

మును వహించిన రాజ్యము మాళవము. తక్కిన రాష్ట్రముల జయించి దీని కింతటి ప్రాభవమును గూర్చినవాఁడు యశోవర్మఁడు. మహాయోధుఁడు. బాలాదిత్యునికి తోడై భారత సైన్యములకు వాహినీపతియై భారతస్వాతంత్ర్యరణదుందుభులు మ్రోయించి యుద్ధరంగమున చిందులుద్రొక్కించి భయంకరుడగు మిహిరకులు నోడించి, తన విజయధాటిని భారత సమరాంగణమున ప్రదర్శించి ఆర్యావర్తస్వాతంత్ర్యమును గాపాడిన వీరాగ్రణి యీతఁడె గుప్తసామ్రాజ్య మహాదుర్గము కూలినంతనే యీతఁడొక ప్రచండసైన్యమును ప్రోవుజేసి ఆర్యావర్తమునగల రాజ్యములనెల్ల జయించి యొక విశాలసామ్రాజ్యమునునిర్మాణమొనర్చి ఉత్తరభారతమున కంతకును ఏకరాయై విక్రమాదిత్యబిరుదముతో ఉజ్జయినినుండి కొంతకాలము రాజ్యమేలెను. భారతసామ్రాజ్యలక్ష్మి తన చిరనివాసమగు పాటలీపుత్రమును వీడి ఉజ్జయిని జేరినది.

ఈకాలమునాటి భారతరాజ్యరంగము అంధకారమున పడి చరిత్రసాధనము లన్నియు వ్యగ్రమైపోవుటచే ఈవీర మాళి రాజ్యపాలనమును గూర్చిన వివరములు మనకేమియు తెలియకున్నవి. ఈతని సామ్రాజ్యము గుప్తసామ్రాజ్యము కంటె విశాలమై పశ్చిమసముద్రతీరమునుండి బ్రహ్మపుత్రవరకును, హిమవత్పర్వతములనుండి మహేంద్రగిరివరకును విస్తరించినదని ఈతని యాస్థానకవీశ్వరులు రచించిన గ్రంథములు జెప్పుచున్నవి.

ఇతడు పెక్కురణక్షేత్రములందు పోరి విజయముల గొనినాడు. బాలాదిత్యునికాలమున రేగిన స్వాతంత్ర్యసంగ్రామమునకు నాయకవీరుడై హూణసైన్యముల నురుమాడిన వీర కథనమును మున్నె చెప్పితిమి. ఇంతియగాక ఇతడు పశ్చిమభారతమున నింకను బలీయులై రాజ్యమేలుచున్న శకనృపతులపెక్కండ్ర 525 సంవత్సరమున ♦కుహారూరు ప్రాంతమున నోడించి విక్రముడను పౌరుషనామము నార్జించుకొనెను. మాటుమణగిపోయిన విక్రమశకమును* మరల నిల్పెను. ఈ విజయముల సూచించుటకై యీతడు మందసారలో నొక దిగ్జయస్తంభ మెత్తించెను ఆలమున శకరాజుల నిర్జించి బందీలగాగొని యీతడు తనపురవీధులవెంట ద్రిప్పెనని జ్యోతిర్విదాభరణమను గ్రంథమున వ్రాయబడినది + అట్లు పట్టుబడి పరి

♦ ముల్తాను సమీపమున నెచ్చటనో విలసిల్లినది.

* విక్రమశకము క్రీ. పూ 57 సంవత్సరమున తొలుత ప్రారంభమైనది. ఎవరు ప్రారంభించిరో సరిగ తెలియదు. శకరాజుల నాహవమున గెలిచి విక్రమనామధారు డెవ్వరో ప్రారంభించి యుండవలెను. తరువాత కనిష్కుని శకము ప్రబలుటచే నీశకము మఱుగంటి పోయినది. 525 సంవత్సరమున విక్రమాదిత్యుడు శకరాజుల యుద్ధమున జయించి మరల నీశకమును నిల్పెను. ఇంతటినుండియు నిది విక్రమస్మృతియై నేటికిని నిల్చి జయశీలుని నామము నవీనముగ స్మరణకు దెచ్చుచున్నది

+ శ్లో॥ రూమదేశాధిపతిం శకేశ్వరం
జిత్వా గృహీత్వోజ్జయినీం మహాహవే
ఆనీయ సంభ్రామ్య ముమోచ తం, త్వహో
శ్రీవిక్రమార్కః సమసహ్యవిక్రమః.

భవింపబడినవారిలో గొందరు రోముదేశస్థులుకూడ నుండిరి. ఈయోటమితో పశ్చిమోత్తరప్రాంతమున ప్రబలిన హూణ శకరాజ్యములు బలహీనములై కృశించిపోయినవి.

విక్రమార్కుడు విద్యాభిలాషి పండితపోషకుడు. ఈతనికాలమున సంస్కృతసారస్వతము మహోత్కృష్టదశ ననుభవించినది సంస్కృతభాష యింతటి యభివృద్ధి నెన్నడును గాంచలేదు. ప్రపంచమున నింకేసారస్వతమున గానరాని రస వత్తరములగు కావ్యములు, నాటకములు నీతనికాలమున రచియింపబడినవి. ఈతని యాస్థానమున కవితావధూటి విచిత్ర గతుల నాట్యమాడినది. తమ యసమానప్రతిభావిశేషముచే, పాండిత్యగరిమచే, కవితానైపుణ్యముచే, శిల్పకళాకౌశలముచే లోకవిఖ్యాతిబడసిన పండితులు, కవులు, శిల్పులు, శాస్త్రజ్ఞులు, భిషజ్మణులు నీతని యాస్థానమున వరలిరి. కవిసార్వభౌ ముడు, కాళిదాసు ఇతని యాస్థానమున మసలినాడు ధన్వం తరి, క్షపణక, అమరసింహ, శంకు, వేతాళభట్ట, ఘటఖర్పర, కాళిదాస, వరాహమిహిర, వరరుచులు నీతని యాస్థాన మున మనిరి.* వీర లీతనికాలమున నవరత్నములని ప్రఖ్యాతి వడసిరి ఇందు ధన్వంతరి భిషజ్మణి వైద్యశాస్త్రపారంగతుడు. వైద్యప్రపంచమునవిప్లవకారిపంస్తుతుల గనుచున్నవాడు క్షపణ కుడు మహావార్ధవిదుడు అమరసింహుడు శబ్దశాస్త్రప్రవీ

* శ్లో॥ ధన్వంతరిః క్షపణకోఽమరసింహ శంకు
వేతాళభట్ట ఘటఖర్పరకాళిదాసాః
ఖ్యాతో వరాహమిహిరో నృపతేః సభాయాం
రత్నాని వై వరరుచిర్నవ విక్రమస్య

ణుడు అమరనిఘంటువును రచించిన ప్రఖ్యాతయశుడు శంకుడు శిల్పశాస్త్రజ్ఞుడు. వేతాలభట్టుడు మంత్రశాస్త్రమును గ్రోలినవాడు. ఘటఖర్పరుడు భూగర్భశాస్త్రమున నారి తేరిన వాడు. వరాహమిహిరుడు జ్యోతిశ్శాస్త్రమును తరచిచూచిన వాడు. వరరుచి ప్రాకృతభాషాపండితుడు. కాళిదాసు మహా కవి. కళాజగత్తును రసవాహినిలోముంచి లేవనెత్తిన కవిచంద్రుడు. శకుంతలాదినాటకకావ్యముల రచించిన ప్రతిభాశాలి.

విక్రమార్క-చక్రవర్తి యిట్టి కవుల, పండితుల నాదరించిన రసజ్ఞుడు. ఈతని సామంతరాజ్యమగు కాశ్మీరమున రాజవంశ మంతరించినపు డీకవిజనకల్పవల్లి యారాష్ట్రమును తనయాస్థానకవియగు మాతృగుప్తునకు ధారవోసి దాని కతని బట్టముగట్టెనట! పండితపోషణమున నితని కెంతటి యభిరుచియో!. ఇట్టి హైందవనృపతు లుండబట్టియే యిట్టి మహాకవు లుద్భవిల్లిరి. ప్రౌఢములగు కావ్యములు రసవంతములగు నాటకములు రచియింపబడినవి నేడో? పరరాజుల పాలబడినప్పటినుండియు భారతావని గొడ్డువోయినది. ఆకాలమున కావ్యరూపమున వెల్లువిరిసిన రసవాహిని నే డింకిపోయినది. కళలు గంగగలిసినవి. పరిశ్రమలు పాడైనవి. అంతయు సర్వమంగళము. నాటినుండి నేటిదనుక కాళిదాస భవభూతులబోలు కవు లుద్భవిల్లినదిలేదు వరాహమిహిరునివంటి జ్యోతిష్కులును, అమరసింహునివంటి శబ్దశాస్త్రవిదులును కరవైరి. చంద్రగుప్త సముద్రగుప్తుల బోలినవీరులు నేడు మచ్చునకైన గాన్పింపరు పరాధీనత!

విక్రమార్కు డెంతకాలము పరిపాలించెనో సరిగ తెలి యుటలేదు. ఏబది సంవత్సరములు రాజ్యమేలి 583 సంవత్సర ప్రాంతమున దివిజేరెనని కొందరు చరిత్రకారు లూహించు చున్నారు.

## శిలాదిత్యుడు. 583—606.

విక్రమార్కుని తరువాత మాళవసామ్రాజ్య సింహాసన మధిష్టించినవాడు శిలాదిత్యుడు. ఈతడు విక్రమార్కుని తన యుడని జెప్పెదరు నిర్ధారణగ దెలియదు. పరిశోధన లింకను గావింపవలసియున్నది. ఈతడు బౌద్ధమతాభిమానియై బౌద్ధుల నాదరించెను. కాని ఈతడు తండ్రివలె శూరుడుగాడు. అశక్తుడు, దుర్జనుడు. పరిపాలనాకౌశలముకూడ ఇతని కడ శూన్యమే. భారతస్వాతంత్ర్యపహారులగు హూణ, శక రాజులతో నీతడు స్నేహము బాటించి జనకంటకుడై తన సామ్రాజ్యపదవికి జిచ్చుపెట్టుకొనెను. అభిమానశూన్యు డని, గృహనాశకుడని ప్రజలందరు నీతని నపహాసించిరి. వీనిమ మిక్కిలి విజాతులతోడి సాంగత్యమువలన భారతభూమి కెట్టికీడు మూడునోయని భీతిల్లి, తక్కటి భారతరాజన్యు లందరును ఏకమై కర్తవ్యము నాలోచించి స్వాతంత్ర్యసమర మును ప్రకటించి సైన్యముల ప్రోవుజేసికొని పోయి శిలా దిత్యుని యుద్ధమున నోడించి యాతని పదచ్యుతుని జేసిరి. ఈ సారి భారతసైన్యములకు వాహినీపతియై స్వాతంత్ర్య సంరంభ మును నడిపిన వీరుడు స్థానేశ్వరరాజ్యాధీశ్వరుడగు ప్రభాకర వర్ధనుడు హూణదండయాత్రలతో నడలి పదవులెత్తిన భారత

సామ్రాజ్యలక్ష్మికి కళ్యాణమును గూర్చిన వీరవతంసవగు శ్రీహర్షచక్రవర్తికి దండ్రి. హూణులతో ననేక యుద్ధము లందు పోరి జయముగొనిన యోధుడు.

రణమున నోడిన శిలాదిత్యు డూరకొనలేదు తనమిత్రు లగు హూణరాజుల సాయమున మాళవముపై దండెత్తి వరల సింహాసనమాక్రమించెను. అంతటితో నూరకొనక మాళవముతో రణము నడపి తన్ను పదభ్రష్టుని జేయ సాహసించిన యా 'క్షుద్రుని'పై, ప్రభాకరవర్ధనునిపై పగసాధింప బూనెను కాని ఆవీరునితో రణమునకు దలపడి గెలుపొందుట కలలోనివార్త యని యాత డెరుగును. అందుచేత చేయునదిలేక ఆతనియల్లు డగు గృహవర్మనిపై దాడివెడలి యాతని జంపి యాతని దేవేరియు, ప్రభాకరవర్ధనుని తనయయు నగు రాజశ్రీని చెర గొని యాతనిరాజ్యమగు కన్యాకుబ్జము నాక్రమించెను

ఈవార్త ప్రభాకరవర్ధనుని రాజధానియగు స్థానేశ్వరము జేరెను ప్రభాకరవర్ధను డింతకుమున్నె స్వర్గముజేరెను. ఆతని జ్యేష్ఠపుత్రుడగు రాజ్యవర్ధనుడు పశ్చిమోత్తరప్రాంతమున హూణులతోపోరి జయశీలుడై విజయపతాకములతో అప్పుడే స్థానేశ్వరము బ్రవేశించెను రాజశ్రీ చెరగొనబడె ననువార్త యీతని చెవిబడెను ఆతని విజయోల్లాసము క్రోధముగ మారిపోయెను క్రోధమూర్తియై ప్రళయకాలరుద్రుని వలె మండుచు తక్షణమే సైన్యముల వెనుకకు మరలించి రాజ్యమును గాపాడుచుండుమని తనతమ్ముని హర్షవర్ధను నొడబరచి మాళవము దండువెడలెను మాళవ స్థానేశ్వరసైన్యములకు

ఘోరయుద్ధము జరిగెను. అంతమున రాజ్యవర్ధనునకే విజయముగల్గెను. శిలాదిత్యుడు సంపూర్ణముగ నోడింపబడెను. మాళవము జయింపబడెను అంతటితో మాళవసామ్రాజ్యమంతరించెను.

కాని పాపము, రాజ్యవర్ధనుడు తనరాజధాని జేరక మున్నె శత్రుహస్తముల జిక్కుపడి దారుణమరణమునకు గురియై మ్రగ్గిపోయెను. శత్రుకోటిలోనివాడగు శశాంకుడు, కర్ణసువర్ణ రాజ్యము♦ నేలెడురాజు, కపటియై యాతని విందునకు బిలిచి యాతని బరిమార్చెను. రాజ్యవర్ధనుడు కపటమెరుగక మోసపోయెను. రాజశ్రీమాత్రము చెరనుండి తప్పించుకొని యెట్లో పారిపోయెను



♦ కర్ణసువర్ణము మగధ కామరూపముల మధ్య విస్తరిల్లిన రాజ్యము

# బౌద్ధమహాయుగము

## XV

### హర్షవర్ధనుడు.

ఇట్టి విషమసమయమున శ్రీహర్షుడు స్థానేశ్వరసింహాసన మాక్రమింపవలసివచ్చెను. జనకుడు ప్రభాకరుడు. హూణులతో పోరిపోరి దివంగతుడయ్యెను. సోదరుడు యోధాగ్రణి, సమరతంత్ర నిపుణుడు, శశాంకునిచే మోసగింపబడి ప్రాణముల గోల్పోయెను. సోదరుని తనయులందరు పసిపాపలు. సింహాసన మధిష్ఠించి రాజ్యపాలనము నడుపగలుగునంత ప్రాయము లేదు. తానైనను పదునారేండ్ల బాలుడు సమరతంత్రమున నారితేరినవాడు గాడు. శత్రువులు బలీయులు. స్థానేశ్వరరాజ్యమును మ్రింగుటకు రణసన్నాహములు చేయుచుండిరి. స్థానేశ్వరమును శశాంకుడు మున్నగు శత్రురాజులనుండి సంరక్షింపవలెను. ప్రభాకర రాజ్యవర్ధనుల మరణములతో ఆర్యావర్తమున అరాచకము ప్రబలినది. దీని నడపవలయును. ఈభారమంతయు బాలుడగు హర్షునిపై బడెను.

బాలుడయ్యును, హర్షుడు కడుసమర్థతతో రాజ్యనౌకను నడిపించెను. తన రణప్రావీణ్యమును మెరపించి శత్రుజాలములనుండి స్థానేశ్వరమును సంరక్షించెను. రక్షించుటయే గాక శత్రురాజ్యములనెల్ల జయించి ఉత్తరభారతమున కంతకును ఏలికయై ఏకచ్ఛత్రాధిపతిగ రాజ్యమేలెను. భారతవర్షము నేలిన ప్రఖ్యాతసార్వభౌములలో నీత డొకడు. శౌర్య

మున, సమరతంత్రమున సముద్రగుప్త, విక్రమాదిత్యులతో సాటియైనవాడు. అద్వితీయపరిపాలనాకౌశలము కలవాడు. ఆర్యావర్తమును పాలించిన బౌద్ధచక్రవర్తులలో నీతడు కడపటివాడు ఈతనితరువాత బౌద్ధమతనామము ఆర్యావర్తమున వినబడదు విలుప్తమైపోవును. భానుడు తానస్తమించిపోవు నపుడు ఆకాశపథమున ప్రదర్శించు అరుణరాగమువలె నీమహామతము ఇతనికాలమున తన దివ్యతేజము నొక్కమారు వెదజల్లిపోయినది. ప్రాణావశిష్టమైయున్న వృద్ధజనకుని సాకు తనయునిపగిది హర్షుడు తనయభిమానమతమును, అవసానకాలమున శ్రద్ధాళువై పోషించినాడు ఈతని నామము అశోకుని నామమువలె ఆర్యావర్తమున చిరస్మరణీయమై పోయినది. ఈతని కాలమున హ్యూనిత్సాంగు అను చీనాదేశవాసి యొకడు భారతవర్షమును దర్శించి యీతని రాజ్యపాలనమునుగూర్చి మనోహరముగ వర్ణించెను.

హర్షుడు బుద్ధభక్తుడు. బాల్యమునుండియు ఆముష్మికచింత యీతని మనమున ప్రవేశించెను. రాజ్యకాంక్ష, ఆహవములు, రాజ్యసుఖములు వీనిపై తొలుత నితనిమనసు పోవలేదు అందుచేతనే యీతడు రాజ్యభారమును వహించుటకు కొంత సందేహించెను కాని మాతృరాజ్యము స్థానేశ్వరము • అపాయస్థితిలో నుండెను దురాకాంక్షాపరులగు నృపులు దానిపై పగబూనిరి దాని స్వాతంత్ర్యమును గాపాడవలయును ఇది దుర్ఘటకార్యము. దీని సాధింపగల వీరు లెవ్వరును రాజ్యమున గానబడరైరి రాజసభ "నీవేతగు" ఎని యీ

భారము నీతనిపై వైచినది. ఈతనినే స్థానేశ్వరరాజ్యమునకు రాజుగ నియమించినది + హర్షునకు ప్రజాభీష్టము నిర్వహింపక తప్పినదిగాదు. మఱియు తనసోదరుని ప్రాణములదీసిన దుష్టుని నీచశశాంకుని శిక్షింపవలసియుండెను. ఆత డింకను జీవములతోనె యుండెను. శత్రురాజుల చెరనుండి తప్పించుకొని తనసోదరి రాజశ్రీ, భర్తృవిహీన, యెటకో పోయెను. ఆమెజాడల నరయవలయును హర్షునకు రాజదండమును గైకొనుట యనివార్యమయ్యెను.

రాజ్యభారమును వహించినతోడనే హర్షుడు తనసోదరిజాడల నరయుటకై బయలుదేరెను. ఆమె శత్రురాజుల హస్తముల జిక్కకుండ వింధ్యపర్వతారణ్యభూముల బడి యెటకో పోయెను. నిర్ఘటుడను ఒకానొక కొండరేనితోడ్పాటుతో హర్షుడు వింధ్యారణ్యప్రాంతములన్నియు దిరిగి ఎట్టకేలకు ఒకచోట రాజశ్రీని రక్షణోపాయమును గానక తనపరిచారికలతో అగ్నిహోత్రమునబడి జీవముల బాయుటకు సిద్ధమగుచుండిన యామెను కనుగొనెను ఆమె ప్రాణములు దక్కెను. ఇంకొకత్రుటిలో రాజశ్రీ మహాగ్ని జ్వాలలబడి దగ్ధమై పోవలసినదే దుఃఖార్తయగు రాజశ్రీ బౌద్ధభిక్షురాలగుటకు తన కనుజ్ఞనొసగవలసినదని హర్షుని వేడుకొనెను ఈమె అశోకునితనయవలె చక్రవర్తి సోదరియయ్యె

+ ఆకాలమున రాజును నియమించుటకు, రాజు ప్రజాకంటకుడై జనుల హింసించెనేని, అతని పదచ్యుతుని జేయుటకు రాజసభ కధికారము గలదు.

రాజ్యభోగముల విసర్జించి కాషాయాంబరధారియై సన్యాసినియై తన జీవితశేషమంతయు గడపెను. అప్పటి కామె పదునై దేండ్ల జవ్వని. ఈమె చాలచదువుకొన్న దనియు, రాజధర్మముల నెరిగిన వనితారత్నమనియు, రాజ్యనిర్వాహణమున తన సోదరునికి చేదోడుగనుండెడిదనియు హ్యూయనిత్సాంగు యీమె బుద్ధిచాతుర్యమును ధర్మచింతను జాలగ ప్రశంసించినాడు

## హర్షుని దిగ్విజయములు

పిమ్మట హర్షుడు ఐదువేలగజములు, ఇరువదివేలహయములు, ఏబదివేల కాల్బలములు గల్గిన మహాసైన్యమును గూర్చుకొని శశాంకునిపై పగదీర్చుకొనుటకును, తనకు లోబడనిరాజ్యముల జయించి ఆర్యావర్తమున శాంతము నెలకొల్పుటకును జైత్రయాత్ర బయలువెడలెను. ఆత డట్లు ఎత్తినఖడ్గమును వాల్పక ఆరువత్సరములు రణవ్యాపారములయందే మున్గి శత్రురాజుల నెల్ల జయించి ఆర్యావర్తమునం దెల్లచోట్లను విజయపతాకముల నాటెను. తూర్పుసముద్రము మొదలు పశ్చిమసముద్రమువరకును, శీతనగము మొదలు వింధ్యపర్వత భూములవరకును గల యావద్భారతదేశమును యీతనికి వశమయ్యెను మాళవ నేపాళ♦ కర్ణసువర్ణములు జయింప

♦ హర్షుడు నేపాళమును జయించెనాయను విషయమున చరిత్రకారులింకను భిన్నాభిప్రాయులై యున్నారు. కాని యిటీవల కావింపబడిన చరిత్ర పరిశోధనలవలన హర్షుడు నేపాళమును జయించినమాట యథార్థమని నిర్ధారణ యగుచున్నది. కాట్మండునగరమున కనతిదూరమున అంశువర్మనిచే లిఖింపబడిన శాసనమొకటి కన్పించినది. అంశువర్మ హర్షునికి సమకాలీనుడు. హర్షునికి సామంతుడై నేపాళము నేలినవాడు. ఈతనిశాసనమున హర్ష,

బడెను. వల్లభీ, కామరూపములనేలు ధ్రువసేన, కుమార రాజులు ఆతనికి సామంతులైరి.

రాజుల రాజ్యకాంక్షకు మేరలేదుగదా! ఉత్తరభారత మంతయు ఆతనికి వశమయినను హర్షుడు తనివినొందలేదు. ఆతనికి సముద్రగుప్తునివలె దక్షిణాపథమునుగూడ జయింప వలెనని యాశగల్గెను. సైన్యముల నింకను వృద్ధిజేసికొని అపార సైన్యములతో నీతడు 636 సంవత్సరమున* దక్షిణాపథ

శకవత్సరము లుపయోగింపబడినవి. నేపాళరాజతరంగిణియను వంశావళిలో అంశువర్మ రాజ్యభారము వహింపకయున్న విక్రమాదిత్యుడు నేపాళమును జయించి అచ్చట తనశకమును స్థాపించెనని ఉదహరింపబడినది. హర్షుడు విక్రమాదిత్యబిరుదమునుగూడ దాల్చెను. ఇదిగాక హర్షుడు హిమవత్పర్వత ప్రాంతమున విలసిల్లు నొక దుర్భేద్యమగు రాజ్యము జయించెనని బాణ విరచితమైన హర్షచరిత్రమునందున్నది. హ్యూయెన్‌త్సాంగుగూడ అంశువర్మ యను రాజు నేపాళము నేలుచుండెనని వ్రాసినాడు.

* హర్షుడు దక్షిణాపథముపై దాడివెడలినది 620 సంవత్సరమున నని విన్సెంటుస్మిత్తుగారు వ్రాసిరి. ఈవిషయమున వీరియభిప్రాయము మిగుల ప్రమాణవిరుద్ధమని చెప్పుట కెంతయు చింతించుచున్నాము. చాళుక్యప్రభు వగు మొదటిపులకేశవునిచే 534 లో చెక్కింపబడిన అయిహోలుశాసనమున ఈసార్వభౌమునికి హర్షునిపై గల్గిన దిగ్విజయ మెచ్చటను పేర్కొనబడి యుండలేదు. అందితడు ఘూర్జర, కళింగ, మాళవులపై తనకు గల్గిన విజయ ములు వ్రాసికొనినాడు. ఈశాసనకాలమునాటికే పులకేశవుడు హర్షునిసైన్య ముల నోడించియుండినయెడల ఆర్యావర్తమంతకును ఏలికయై ప్రఖ్యాతి గాంచిన సార్వభౌముడు హర్షునిపై తనకు గల్గిన యాముఖ్యవిజయమును యాశాసనమున జెప్పుకొనకుండునా! ఇదిగాక 636 నకు తరువాత వ్రాయ బడిన శాసనములలో హర్షపులకేశవసైన్యములకు గల్గినపోరాటమునుగూర్చిన యుల్లేఖన లెన్నియేని కాన్పించుచున్నవి. ఈశాసనములలో నొకచోట పుల

ముపై దాడివెడలెను. కాని హర్షుని కీసారి విజయము గల్గలేదు. ఈతని సైన్యములు నర్మదానదీకూలముల సమీపించుసరికి ఆవలియొడ్డున నొకమహాసైన్యము ఇసుకతిన్నెలపై శిబిరముల నిర్మించుకొని సందుకిడిసియుండెను. ఇవి యీతరుణమున దక్షిణాపథమునేలుచున్న చాళుక్యసార్వభౌముడగు రెండవపులకేశవుని ప్రచండసైన్యములు. పులకేశవుడు హర్షుని కీడగు వీరుడు. పోటుమానిసి. సమరకౌశలమున హర్షుని మించినవాడు. దక్షిణాపథమునందలి రాజ్యముల నెల్ల జయించి యీతడు చాళుక్యసామ్రాజ్యమను నొక మహాసామ్రాజ్యమును నిర్మాణమొనర్చి ఆప్రాంతమున కంతకును ఏకఛత్రాధిపతియై రాజ్యమేలుచుండెను. హర్షుడు దక్షిణాపథ మెల్ల జయింప సైన్యములగొని వచ్చుచుండెనను వార్త తెలిసినంతనే యీతడు తన సైన్యముల నెల్ల తరలించుకొనిపోయి హర్షునిరాకకై నిరీక్షించుచు నర్మదానదీతీరమున వేచియుండెను. కొన్నిదినములకుహర్షునిసైన్యము రాత్రకనుకొనిన్న దీర్ఘప్రయాణముచే నుస్సురనుచు నర్మదానదీతీరమును సమీపించినవి. రిపుసైన్యములపై బాణవృష్టి గురిపింపుడని పులకేశవుడు తన సైనికవాహినుల కానతిచ్చెను. హర్షపులకేశవసైన్యములకు ఘోరసంకులము జరిగెను. హర్షునిసైన్యములు ఈయుద్ధమున సంపూర్ణముగ నోడిపోయెను. అపజయ మెట్టిదో యెరుగని హర్షునకు

---

కేశవుడు "హర్షవిచ్ఛేదహేతు" అని వర్ణించుకొనినాడు. ఏదివిధమెట్టి హర్షుడు దక్షిణాపథమునకు దాడివెడలినది 634 వ సంవత్సరమునకు తరువాతనే యని నిర్ధారణగ జెప్పగలుగుచున్నారు.

నాటికి అపజయము గల్గినది హర్షుడు తనసైన్యములు మరల్చుకొని తిన్నగ వచ్చినదారిని బట్టెను.

ఇంతటినుండి హర్షుడు రణవ్యాపారముల చాలించి శాంతముగ రాజ్యమును బాలించుకొనెను. పులకేశివునితో ఓటమిగ్గొన్న తరువాత హర్షుడు దిగంతుడగువరకును ఏ రాజ్యముపైకేని దాడివెడలలేదు సమరము సలుపలేదు. ప్రజాపరిపాలనయందే మగ్నుడైపోయెను.

### హర్షుని రాజ్యపరిపాలనము.

హర్షుడుత్తరభారతమును జయించినవెనుక కాబోలు తన రాజధానిని స్థానేశ్వరమునుండి కన్యాకుబ్జమునకు మార్చెను హర్షుడేమికతమున నిట్లు తనరాజధానిని కన్యాకుబ్జమునకు మార్చెనో తెలియదు. స్థానేశ్వరము మారుమూలగ నుండుటచే పరిపాలనాసౌలభ్యముకొరకు తనసామ్రాజ్యమునకు మధ్యగ నుండు కన్యాకుబ్జమునకు హర్షుడు తన రాజధానిని మార్చినట్లు దోచుచున్నది ఈతని కాలమున కన్యాకుబ్జము కడురమణీయమై అత్యంత వైభవదశలో నున్నదని హ్యూనిత్సాంగు వర్ణించినాడు ఈనగరము రెండుక్రోశముల పొడవును ఒకక్రోశము వెడల్పునుగల్గి యొకవైపున గంగాతరంగిణిచేతను తక్కటి మూడువైపులను అగాధమగు పరిఖలచేతను ఆవరింపబడి ఆకసమునంటు సౌధపంక్తులతో నిర్మలజలపూరితములగు తటాకములలో మనోహరములగు ఉద్యానవనములతో నేత్రపర్వమొనర్చుచుండెనని హ్యూనిత్సాంగుదీని వైభవమును మిగుల కొనియాడినాడు తాను దర్శించిన కాల-

మున నీపట్టణమున నూరు బౌద్ధ విహారములును, ఇన్నూరు దేవాలయములును గలవని కూడ ఇతడు వర్ణించినాడు. ఈ నగరము పదునారవ శతాబ్దము వరకును ఉత్తరభారతమున గల ఉత్కృష్ట నగరరాజములలో నొకటియై, జయచంద్రుడు మున్నగు చక్రవర్తులకు రాజధానియై నెగడి అంతట ఘోరీ యను మహమ్మదీయ సుల్తానుచే విధ్వంసమొనర్పబడి రూపు మాసిపోయినది. హర్షునిచే నిర్మింపబడిన దివ్యభవన మొక్కటియు నేడు గానబడదు. ఇప్పుడు మైళ్ళకొలది పొడవు గల మంటదిబ్బలు మాత్రము కన్పించును. ప్రాచీన విహారములు, దేవాలయములు, రాజ సౌధములు మటుమాయమై పోయినవి.

హర్షుని రాజ్యపాలనము అశోక చంద్రగుప్త విక్రమార్కుల పరిపాలనములవలె మిగులనుత్కృష్టమైనది. ఆతని రాజ్యపాలనము ప్రశాంతము ప్రబలినది. ప్రజలు సౌఖ్యాంబుధిలో దేలియాడిరి సంస్కృతసారస్వతము వృద్ధినొందినది. విద్యాపుష్టి యాతని కాలమున సంస్కృతభాషాలక్ష్మి నిలయమై కిలకిలలాడినది. హర్షుడు రసజ్ఞుడు పండితపోషకుడు. ఆతని యాస్థానమున ననేకపండితులు, కవులు, చిత్రకారులు వరలిరి. బాణకవి యీతని యాస్థానపండితుడై సంస్కృత ఇతిహాసరంగమున నమూల్యగ్రంథమని ప్రఖ్యాతిగాంచిన హర్షచరిత్రమును వ్రాసెను. ఆకాలమునాటి చరిత్రనిర్మాణమున కిది మిగుల నాధారమగు గ్రంథము. ఇది హర్షుని చరిత్రమును వర్ణించు వచనప్రబంధము. ఇదిగాక ఆతడు కాదంబరియను మరియొక గద్యకావ్యమును

గూడ రచించెను. ఇది రసవత్తరమై, అలంకారములతో శ్లేషలతో నొప్పారుచు, కవిత్వమును మించిన వచనమున వ్రాయబడినది. భర్తృహరి మయూరకవులుకూడ నీతని యాస్థానమున నేయుండిరి. ఇందు మయూరకవి సూర్యశతక, ఆర్యముక్తమాల, మయూరాష్టకములను గ్రంథములవ్రాసెను. అందు సూర్యశతకము సంస్కృత సారస్వతమున, భావగాంభీర్యమునకు పదసౌష్టవమునకు పేరగ్గలగాంచిన గ్రంథము.

హర్షుడుగూడ సంస్కృతభాష నభ్యసించి ధారాళముగ కవిత్వమును జెప్పనేర్చినవాడు. ఈతడు రత్నావళి, ప్రియదర్శిక, నాగానందము లనుముద్దులమూటగట్టు నాటకములు రచించెను. ఇవి కల్పనాచమత్కృతికి పాత్రపోషణమునకు శబ్దజాలమునకు సంస్కృత నాటకజగత్తునందు ప్రసిద్ధినొందిన నాటకరాజములు.

ఈతని కాలము విద్యావ్యాప్తికి కూడ చాల విఖ్యాతి గాంచినది. ఆకాలమున ప్రపంచములోనికెల్ల భారతవర్షము విద్యావృద్ధికి పేరుమోసినది విద్యలతల్లి యని ప్రఖ్యాతివడసినది. ఆశియాఖండమునకెల్ల విద్యాభ్యాసమునకిదియే కేంద్రస్థానమైనది. తక్షశిల, కాశీ, ఉజ్జయిని, నలందా మున్నగు విశ్వవిఖ్యాతములగు విద్యాపీఠము లిచ్చట వెలసినవి. అన్నిటిలోన హర్షుని కాలమున నలందా విశ్వవిద్యాలయము మహోత్కృష్టదశయందుండెను ఇచ్చట విద్యనభ్యసించుటకు, జపాను, చీనా మున్నగు దూరదేశములనుండి జనులు గుంపులు గుంపులుగ వచ్చెడివారు. ఈవిద్యాపీఠమును గూర్చియు అందలి విద్యాపద్ధతుల గూర్చియు హ్యూయనిత్సాంగు విపులముగ వర్ణించినాడు.

## రాజ్యాంగము.

"రాజు ప్రజాసేవకుడు, ప్రజారక్షణమే యాతని పరమ ధర్మము" అను ప్రాచీనరాజధర్మమును చక్కగానెరిగిన హర్షుడు తనరాజ్యపాలనను నడిపించినాడు. ఆత డెప్పుడును అలసటలేక తనరాజ్యమున సంచరించుచు రాజ్యాంగ మేతీరున నడుచుచున్నదో పరీక్షించుచు పరిపాలనాలోపముల నరయువాడు. ఎంతటి యల్పవిషయమైనను ప్రజలుకోరుదురేని యీతడు స్వయముగ విచారించువాడు. హర్షుడు పక్షిసేన్య భేరీమృదంగ నిస్వనములతో సేనాగణములతో నిరంతరము రాజ్యమంతయు తిరుగుచుండువాడు. తాను రాజధానిలో లేనికాలమున రాజసభ పరిపాలనాకృత్యముల నిర్వహించెడిది. ఉతని రాజసభ పేరునకుమాత్రమే కాక సంపూర్ణాధికారముగల్గి విదేశ, ఆర్థిక, సమరవ్యాపారముల పరిశీలించుచు హర్షునకు కుడిభుజమై రాజ్యాంగమున నొక ముఖ్యాంగముగ నుండెను. తనసోదరుడు రాజవర్ధనుడు హతముగావింపబడి విషమపరిస్థితులేర్పడినపుడు రాజసభయే హర్షునకు రాజదండము నొసంగినది. దీనివలన రాజసభ రాజ్యమునకు యేలికను గూడ నియమించు నధికారము గల్గియుండెడిదని స్పష్టమగుచున్నది. ఈతరుణమున రాజసభాసమితిమున సైన్యాధిపతియగు సింహనాదుడును, గజసైన్యాధిపతియగు స్కందగుప్తుడును విదేశరాజ్యాంగమంత్రియగు అవంతియు ఈ క్లిష్టసమయమున రణవ్యాపారము నెట్లు నడిపింపవలయునో సూచించుచు ఉపన్యాసములొసగినట్లు బాణుడు వర్ణించినాడు.

హర్షుని రాజ్యాంగమునగల యుద్యోగులగూర్చి బాణ కవి వివరించినాడు. ఆతని యుద్యోగబలమున ప్రధానయుద్యోగి మహాసంధివిగ్రహాధికారి. ఈతనికి సమరమునల్పుటకును, సంధినడుపుటకును అధికారముగలదు ఇట్టి యుద్యోగుల నామములు ఆకాలమునాటి శిలాశాసనములలో పెక్కుచోట్ల పేర్కొనబడినవి. ఈతనివెనుక సర్వసైన్యాధిపతిగలడు. ఈతనికి మహాబలాధికృత యనిపేరు. హర్షుని సైనికవాహినులకు అధిపతి సెమ్మట మహాక్షపాటలిక పేర్కొనదగినవాడు. సంధిపత్రములు, ముఖ్యముగ రాజ్యమునకు సంబంధించు అమూల్యపత్రములన్నియు నీతని యధీనమునందుండును. ఈతడు పాశ్చాత్యదేశములందలి యిప్పటి లార్డు హైకీప రాఫ్ .కార్డ్సును బోలి యున్నాడు. వీరుగాక మహాప్రతీహారులుగలరు. వీరు సౌధరక్షణమునందు సప్రమత్తులై, ద్వారములకడ కావలియుండి రాజదర్శనార్థమై యేతెంచువారల ఱేనిసమక్షమునకు గొనిపోవుచుందురు.

హర్షుడు తన విశాల సామ్రాజ్యమునంతయు తనరాజధానినుండియె పరిపాలించుట కష్టమగుటచే దానిని పెక్కు రాష్ట్రములుగ విభజించి యొక్కొక్క రాష్ట్రమున కొక్కొక్క ప్రతినిధిపాలకుని నియమించెను. నగరపాలనమును నిర్వహించుటకు ప్రత్యేకయధికారులు గలరు. వీరికి మహత్తరులని పేరు.

హర్షుని పరిపాలనము అతిమార్దవమై శాంతిదాయకమై ప్రజారంజకముగ నుండెనని హ్యూనిత్సాంగు ప్రశంసించినాడు.

సామంత రాజులకసీతడు కప్పముఁగొని వారి రాజ్యముల వారి నేలుకొననిచ్చెను.

ఈతని రాజ్యపాలనమున భారమగు పన్నులు లేవు. రాజమాన్యముల సేద్యము జేయు కర్షకుల పండినపంటలో నారవవంతు మాత్రము రాజునకు శిస్తుచెల్లించువారు వణిజులు నదీసముద్రతీరములకడ, సరిహద్దు ప్రాంతములచెంత, అత్యల్పమగు సుంకములు చెల్లించువారు. ఈ జేనియాదాయమంతయు రాజమాన్యముఁనుండియే వచ్చెడిది. రాజమాన్యములనుండి వచ్చు ధనమంతయు హర్షుడు చతుర్విభాగముల జేసి యొక్కొక భాగము నొక్కొక కార్యమునకై వినియోగించెను ఒకభాగము పరిపాలనా వ్యయములకును మహారాధనలకును, ఒకటి ఉద్యోగుల జీతములకును, వేరొకటి కవుల విద్వాంసుల శిల్పకారుల నాదరించుటకును, మఱియొక భాగము భిక్షువులు, బ్రాహ్మణయతులు, జైన పరివ్రాజకులు మున్నగు వివిధమత ప్రబోధకుల పోషణాదికములకును హర్షుడు వినియోగించువాడు. ఈతని పరిపాలనమున భారమగు పన్నులు నిర్బంధసేవలు లేకుండుటచే ప్రజలు తమతమల వృత్తుల పాటించుచు పితార్జిత భూక్షేత్రము హాయిగసేద్యము జేసికొనుచు యథేచ్ఛగ నిశ్చింతగ మనిరి. హర్షునిరాజ్యకాలమున దేశము సుభిక్షముగ నుండెననియు బాటలు సురక్షితముగ నుండినవనియు హ్యూయనిత్సాంగు తెల్పుచున్నాడు.

## హర్షుని సైన్యములు.

హర్షుడు రాజ్యరక్షణమునకై ప్రచండ సైన్యముల నిల్పెను. మొదలుతనికి 5,000 గజములు 20,000 హయములు, 50,000 కాల్బలములుగల సైన్యముండెను. దీనితోడనే ఇతడు ఉత్తరభారత మంతయు జయించెను. మహాసైన్యములతో బోల్చిన నివి యత్యల్పముగ గాన్పించును చంద్రగుప్త మౌర్యుని సైనికవాహినులు 30,000 అశ్వములు 9,000 గజములు 6,00,000 కాల్బలములుగల్గి సముద్రతరంగములవలె గిన్పట్టి గుండె లదరజేయుచుండెను. విజయనగరసామ్రాజ్యాధిపుడగు కృష్ణరాయని బలములుకూడ హర్షుని సైన్యములకంటె పెద్దవే. ఈతని సైన్యమున 32,000 హయములును, 7,03,000 కాల్బలములు నుండెనట. ఇంతటి క్షుద్రసైన్యములతో హర్షుడుత్తరభారతము నంతను జయించుటచూడ, నీతని సైన్యములు రణశిక్షణమం దారితేరియుండవలె ననియు, ఈతడు అసమాన సమరతంత్రప్రవీణుడై యుండుననియు నూహింపవలసి వచ్చుచున్నది. హర్షుడు దక్షిణాపథమునకు దాడివెడలునపుడు తనసైన్యముల పెంపుజేసినట్లు గాన్పించుచున్నది. అప్పు డీతని సైన్యమున నూరువేల తురగములును అరువదివేల గజములును నుండెనని హ్యూయానిత్సాంగు వ్రాసినాడు! ఈతని రాజ్యకాలమున తుదిరంగమున అంతఃకలహములు, యుద్ధరంగములు లేక దేశము సుశాంతముగనుండెను. దీనినిబట్టి అతని సైన్యము లెంతటి బలపమువైనవో, ఆత డెంతటి పరిపాలనాకుశలుడో తెలియుచున్నది.

హర్షునికాలమున శత్రువులను డాసి ప్రతిఘటించువాడును సైన్యమున జేరితీరవలయునను నియమములేదు. సైనిక వాహినిలో జేరు శత్రుజీవులకింత పారితోషిక మొసగబడు నని ప్రకటింపబడుచు ఎవ్వరైన సైనికులగుట కిచ్ఛగించువారందరును సైన్యమున జేరిపోవుదురు. ఇది యీ కాలమునాటి సైనికబలముల గూర్చుపద్ధతి.

## పరదేశములతోడి రాయబారములు.

హర్షుని కీర్తిచంద్రికలు బహుదూరము ప్రసరించుటచే అన్యదేశముల నేలు నృపులు ఈతని స్నేహము నభిలషించుచు నీతనికడకు రాయబారముల నంపుచుండువారు. ఈతడును పరుల వారికడకు రాయబారుల నంపువాడు. హర్షుడొక బ్రాహ్మణుని చీనాధిపతికడకు రాయబారిగా నంపెను. ఈతడు చీనా సార్వభౌమునితో రాయబారము నెరపి 643 సంవత్సర ప్రాంతమున భారతవర్షమునకు తిరిగివచ్చెను.

హర్షుడు పరరాజులతో స్నేహములను బాటించియు, రణమునుసల్పియు, బాంధవ్యమును నెరపియు, తనసామ్రాజ్యపు పొలిమేరల సురక్షితము గావించుకొనెను. చీనాసామ్రాజ్యాధిపునితో రాయబారములు నడపి యాతని తనమిత్రునిగా జేసికొనెను. పూర్వదిశనున్న కామరూప నృపాలు డీతని బాహుబలమునకు వెరచి యాతని సామంతుడయ్యెను. పశ్చిమోత్తరప్రాంతమున వల్లభీ రాజ్యమునేలు ధ్రువసేను నోడించి యాతనికి తనయనిచ్చి పెండ్లిగావించి, యాప్రాంతమునుండి తనసామ్రాజ్యమునకు భయము బాపుకొనెను

పశ్చిమ ఆగ్నేయభాగముల విస్తరిల్లుచుండిన పారశీక, చాళు క్యరాజ్యముల నుండి రాజ్యతృష్ణాప్రవాహము పొంగి హర్ష సామ్రాజ్యముపై ప్రసరింపకుండ, నీవల్లభీరాజ్యమొక యడ్డ కట్టగనుండెను. హర్షుని దూరదృష్టియు, సమరతంత్ర ప్రావీణ్య మును అద్వితీయములుగదా!

## హర్షుని బౌద్ధమత దీక్ష.

హర్షుడు ప్రథమమున శివారాధకుడనియు తరువాత బౌద్ధమతము నవలంబించెననియు జెప్పెదరు. ఏమైనను హర్షుడు బుద్ధభక్తుడై తనరాజ్యకాలమున బౌద్ధుల నాదరించి బౌద్ధప్రపం చమున రెండవయశోకుడని పేరు మోసెను. ఈతడు భక్తి పరుడు. అనుదినమును బుద్ధారాధనలయందు ధ్యానతపోనిష్ఠల యందు మునిగి తేలువాడు. ధర్మప్రతిష్ఠాపనయందు దప్రమత్తుడై ఆహారనిద్రల గూడ మరచువాడు. తనరాజ్యమున నీతడు మృగవధలు మాంసాశనము వలదని శాసించెను రాజశాసన ము నతిక్రమించు పశుహంతకుల నతి క్రూరముగ దండించు వాడు. పశుసంరక్షణమునకై తనరాజ్యమున పెక్కు చోట్ల పశు చికిత్సాలయములకల్పించెను. బౌద్ధమఠముల నిర్మించెను. భిక్షువులకు హిరణ్యదానముల జేసెను. రాజమార్గముల కిరు వైపుల ప్రయాణికుల సౌకర్యమునకై చల్లనినీడలిచ్చు వృక్ష ముల బాతించెను. ధర్మశాలల గట్టించెను. విశ్రాంతిగృహ ముల గట్టించెను.

హర్షుడు బుద్ధభక్తుడైనను అన్యమతముల నిరసించియెరు గడు. ఈతడు సర్వమత సమదృష్టిగలవాడు. బౌద్ధభిక్షువుల

తోబాటు జైన బ్రాహ్మణయతులకు హిరణ్యదానముల జేసెను. బౌద్ధమఠముల నిర్మించినట్లే దేవాలయముల గూడ గట్టించెను. ఈతని యాస్థానకవియగు బాణుడు వైదికమత బ్రాహ్మణుడు ఈతనిప్రాణమిత్రుడగు కుమారరాజు కామరూపనృపతి బ్రాహ్మణకులావలంబుడు.

## బౌద్ధపరిషత్సభ

బౌద్ధమతము కనిష్కునికాలమున హీనయాన మహాయానములను ద్వివిధశాఖలుగ చీలిపోయినదని చదువరులెరుగుదురు. అప్పటినుండియు నీయుభయమత ప్రవాహములును ఒండొంటితో సంగమింపక వేర్వేరుదిశల ప్రవహింపజొచ్చినవి ఈయుభయమతధర్మముల పరిశీలించి వానికిగల పరస్పర వైషమ్యముల తెగనాడుటకు హర్షుడొక పరిషన్మహాసభ పిలిపించెను అప్పుడు చీనాక్షేత్రవాసియగు హ్యూయనిత్సాంగు హర్షచక్రవర్తియతిథియై భారతవర్షముననే యుండెను. ఈతడు ప్రఖ్యాతయశుడగు మహాయాన పండితుడు అసమాన వాక్పటిమగలవాడు. ఈతడే సభాసమక్షమున నడచినవాక్సంఘర్షమున, తనయద్వితీయ వాగ్వైభవమును ప్రదర్శించి హీనయాన పండితుల నోడించెనట హర్షుడు తనరాజ్యమునగల బౌద్ధపండితులందరకును సభకురావలసినదని ఆహ్వానములంపెను.

ఈసభ మహావైభవముగ జరిగినదని హ్యూయనిత్సాంగు మనోహరముగ వర్ణించినాడు. చక్రవర్తియు, అతని అశేష పరివారమును తనసామ్రాజ్యమునగల పదునెనమండ్రు సామంతనృపులును ఈసభకువిచ్చేసిరి. వీరుగాక నాలుగువేల మహా

యాన హీనయాన పండితులును రెండువేల బ్రాహ్మణ జైన పండితులును వివిధ ప్రాంతములనుండివచ్చిరి. నలందా విశ్వవిద్యాలయమునుండి యొక వేయిమంది బౌద్ధభిక్షువు లరుదెంచిరి. మహాసభను దిలకింపవచ్చిన జనసమూహములకు లెక్కలేదు. సభామంటప పరిసరములన్నియు జనసంతతులతో క్రిక్కిరిసి పోయినవి. కొందరు భిక్షువులు గజారూఢులై వచ్చిరి. కొందరు పల్లకీలనెక్కివచ్చిరి. వీరి వెంటనరుదెంచిన పరివారము వెన వేలు నికేతనముల ధ్వజపటముల హస్తములదాల్చియుండిరి.

సభామంటపము కన్యాకుబ్జ నగరమున, నొకవిశాల మైదానమున నిర్మింపబడినది. దానికెదురుగ అత్యున్నతమగు నొకగోపురము కల్పింపబడి దానిలో నిలువెత్తు బుద్ధవిగ్రహ ముంచబడినది. సభామంటపమునకు కొంచెముదూరముగ చక్రవర్తి శిబిరము నిర్మింపబడినది. నిర్ణీతదినమున (644 సంవత్సరమున నొకానొక శుభదినమున) సభ ప్రారంభమయ్యెను. ఆదినమున చక్రవర్తి మహోత్సవముతో సభాప్రవేశమొన ర్చెను. కనులకు పండువుగ నలంకరింపబడిన యొకఏనుగుపై, రత్నఖచితమగు అంబారి యుంచబడెను. దానిలో సువర్ణనిర్మితమగు బుద్ధవిగ్రహ ముంచబడెను కుడివైపున హర్షుడు నిలుచుండి బుద్ధదేవునకు సురటీవిసరుచుండెను. వామభాగమున కుమారనృపుడు బుద్ధునకు ఛత్రిముబట్టెను. మహారాణులును, అమాత్యవరులును గజములపై నధిష్ఠించి వెనుకనచ్చుచుండిరి సామంతరాజులు వారి వారి పరివారములతో హయారూఢులై వీరిననుగమించిరి. ఇట్లు గోలా

హాలముతో హర్షుడు మార్గమున సువర్ణములు, ముత్తియ ములు, మణులు, వెదజల్లుచు సభామంటపమునకు గదలిపోయెను. సభామండప ద్వారమును సమీపించినతోడనే హర్షుడును అతని సామంతనృపులును, తమతమ వాహనముల నుండి దిగిరి హర్షధ్వానములతో, మంగళాశీర్వాదములతో, శంఖారావములతో బుద్ధవిగ్రహము సభామండపములోనికి గొనిపోబడ దానికై యమర్చియుంచిన మణులుపొదిగిన సువర్ణ సింహాసనమున నుంచబడెను. హర్షుడే, పూజావిధానములతో నీపవిత్ర కార్యక్రమమును నిర్వర్తించెను. పిమ్మట పండితులు, అతిథులు ఉచితాసనములపై నధివసింప జేయబడిరి. హర్షుడు సువర్ణములతో, సముచితరీతిని సభాస్తారుల గౌరవించి, హ్యూయానిత్సాంగును అధ్యక్షపీఠమున నలంకరించి, సభా కార్యక్రమమును నడిపింపుమని ప్రార్థించెను.

మహాయాన మతధర్మములే యీ సభాంతరాళమున నంగీకరింపబడెను. హ్యూయానిత్సాంగుని వాదమును ఖండింప గలవార లెవ్వరును ఆమహాసభయందు లేరైరి. తనవాదముల నన్నిటిని నీతడొక తాళపత్రగ్రంథమున బొందుపరిచి దిగువన "ఈసభలోనివార లెవ్వరైన నావాదమున దోషములు జూప గలరేని నామస్తకమును నరికి వారిపాదములకడ నుంచెదను" అనివ్రాసి సభాద్వారమునకు గట్టెను. ఆతనిపిలుపు నంగీకరించెడివారు లేరు. ఇట్లీసభ పదునెనిమిది దినములు జరిగెను. హీనయాను లెవ్వరును హ్యూయానిత్సాంగును వాగ్యుద్ధమున నోడింపలేకపోయిరి. తుదకు హీనయానులకు పరాజయము గల్గెను. మహాయాన మతవైరు లెవ్వరో కోపము

పట్టజాలక సభామండపమునకు జిచ్చుపెట్టిరనియు, ఎవ్వడో యొకపాషండుడు సాయుధుడై హర్షునిజంప నాతనిపై కురికెననియు, అందువలన ఆకస్మికముగ సభ ముగిసిపోయినదనియు, కొన్నిచోట్ల జెప్పబడినది. దీనియాథార్థ్యము సందేహాస్పదముగ నున్నది. ఇట్టియల్లరులు జరుగలేదనియు, సభ జయప్రదముగ నడచినదనియు జెప్పుటకు ప్రమాణములు గన్పించుచున్నవి.

హర్షుడు సభను దిగ్విజయముగ నడిపించి హ్యూన్‌త్సాంగున కనేకవేల సువర్ణముల అమూల్యాభరణముల బహుమానమొసంగెను. కాని హ్యూన్‌త్సాంగు ఒక్కతృణమైనను గ్రహింపలేదు. సర్వభోగముల త్యజించిన విరాగికి సువర్ణములేల?

## సత్రోత్సవము

ఈ సమయముననే ప్రయాగ క్షేత్రమునందు సత్రోత్సవము కూడ జరుగనుండెను. హర్షుడు గంగాయమునాసరస్వతులు సంగమించు పావనక్షేత్రమున అయిదువత్సరములకొకమారు ఇట్టి మహోత్సవములుసలిపి యాతరుణమున తనభాండారమున ప్రోగుపడిన ధనరాసు లన్నియు అర్థిజనులకు ధారవోయుచు హర్షుడిట్టి సత్రములనైదింటిని సల్పెను. ఇది యారవది. బౌద్ధపరిషన్మహాసభ ముగిసిన కొలది దినములకే యీయుత్సవమారంభమయ్యెను. హ్యూన్‌త్సాంగు హర్షునిచే నాహ్వానింపబడి యీమహోత్సవమును జూడబోయెను. యమునాతరంగిణికి పశ్చిమ దిశగానున్న విశాలసైకతస్థలిపై నొకచోట పెక్కు కుటీరములు నిర్మింపబడినవి. భాండారమునుండి కొనిరాబడిన

ధనరాసులు మణులు సువర్ణభూషణములు ముత్యాలహారము లు వీనిలో కుప్పలు పోయబడినవి. కొన్నిటియందు బంగారు వెండి నాణెములును సుచేలములు సన్నవలిపెములు దుకూలములు చీనాంబరములు రత్నకంబళములు మున్నగు అమూల్య పాత్రచయములు పేర్చబడినవి. ఈ కుటీరముల చుట్టును పరులకు జొరశక్యముగాకుండునట్లు వాడి మొనలుగల శూలములు పాతబడినవి. శూలములకు వేనవేలు నికేతనములు గట్టబడినవి ఈ యావరణకు వెలుపల అతిథులకు భోజనము లిడుటకై పసనగ నతిదీర్ఘములగు నూరుపందిళ్ళు వేయబడినవి. ఇవి ఒక్కొక్కదానిలో వెయ్యిజనులు త్రొక్కిడిలేక భోజనములు సలుప గల్గునంత విశాలముగ నిర్మింపబడినవి. ఈమహాసమారాధనకు తన సామ్రాజ్యమునగల అన్నాతురులు, నిరుపేదలు, భిక్షువులు. బ్రాహ్మణయతులు, జైనపరివ్రాజకులు, ఎల్లరు రావలయునని హర్షుడు శాసనములు వ్రాయించెను.

అంతయు సిద్ధమైనపిమ్మట, హర్షుడు సామ్రాజ్యవిభవ రాజశ్రీలతో సపవిత్రక్షేత్రమునకు గదలిపోయెను ఇరువదినొకండు సామంతనృపులును వేనవేలు పరిజనులును అతని వెంటనుండిరి అప్పటికే ఆప్రదేశమున పెక్కుబౌద్ధ, బ్రాహ్మణ జైనభిక్షువులు, వేలకొలది నిరుపేదలు జేరియుండిరి. త్రిమూర్త్యారాధనతో ఉత్సవము ప్రారంభమైనది. తొలుత ప్రథమ దినమున బుద్ధదేవునకు పూజలుసలుపబడినవి. ఆదాపున యమునానదీతీరమున ఇసుకతిన్నెపై ప్రత్యేకముగ నొకఆలయము నిర్మింపబడి అందొక బుద్ధమూర్తి ప్రతిష్ఠింపబడినది. ఆప్రతి

మకు పుష్పహారములు అమూల్యమణులు సువర్ణములు సమర్పింపబడినవి. నివేదనలు గావింపబడినవి. మంగళవాద్యములు గానములు సలుపబడినవి మంత్రపారాయణములు జరిగినవి. రెండవదినమున విష్ణుదేవునకు ఆదిత్యునకు మూడవనాడు మహేశ్వరునకు నిత్య అర్చనలు జరిగెను.

నాల్గవనాటనుండి భక్తిపూర్వకముగ త్రిమూర్తుల కర్పించబడిన ధనరాసులన్నియు హర్షుడు అర్థిజనులకు పంచిపెట్టెను. తొలుత హర్షుడు బౌద్ధభిక్షువుల బహూకరించెను. వారల మృష్టాన్నములతో సంతృప్తుల జేసి పిమ్మట ఒక్కొక్కని కొక్కొక ముత్తియమును, నూరుసువర్ణములును ఒకదుకూలమును పుష్పసుగంధములను దక్షిణగనిచ్చెను హర్షు డిట్లు పదివేలభిక్షువుల గౌరవించెను. పిమ్మట నీరీతినె హర్షుడు యిరువదిదినములు బ్రాహ్మణులను ఇరువది దినములు జైనులను సన్మానించెను. పిదప నొకనెలదినములు వరకు దిక్కులేనిబిడ్డలకు పేదలకు అన్నదానవస్త్రదాన సువర్ణదానములు జేసెను. అంతటితో రాజ్యరక్షణ కత్యవసరమగు గజతురగాది యుద్ధసాధనములుదక్క హర్షునిభాండారమున నైదుసంవత్సరములనుండి చేరుకొనిన ధనరాసులన్నియు వెచ్చపోయెను. తుదకు హర్షుడు, లోకరక్షణార్థమై ఆలుపిల్లల రాజ్యభోగముల త్యజించిన పరంజ్యోతి ఆశాక్యకుమారునివలె తన రాజాలంకరణముల ముత్యాలహారములు, హస్తకంకణముల, కేయూరముల, మణికుండలముల, సువర్ణచేలముల దీసి వానినికూడ దానమొసగి రాజశ్రీని బిచ్చమడిగి ఆమెయొసంగిన యొక కాషాయాంబరమును.

ధరించి, భక్తిపరుడై బుద్ధదేవునకు నమస్కరించి వినమితమస్త కుడై అర్ధనిమీలిత నేత్రములతో గద్గదస్వరముతో "దేవా! నాద్రవ్యము సౌధాంతరాళమున శిలాపేటికలయందు కుడ్యాంతర్గర్భిత పాతాళగృహములందు మణగియుండక ఉత్కృష్టఫల సిద్ధికై సుక్షేత్రమున వెదజల్లబడినది" అనిపల్కి ఆనందాశ్రువుల రాల్చెను సత్రము ముగిసెను.

ఈయుత్కృష్టచరితుడు, ఈమహాత్యాగి, ఈదానశీలుడు, ఈధర్మజిజ్ఞాసువు, ఈయోధాగ్రణి 647 వ సంవత్సరమున దివంగతుడయ్యెను. వృద్ధాప్య మంకురింపకమున్నె నలువదియెనిమిదేండ్ల నడిప్రాయమున యీమహాపురుషుడు గతించెను. భారతరాజ్యరంగమున నాట్యమాడిన మహాచక్రవర్తులలో నీతడొకడు. ఈతనినామము భారతవర్ష చారిత్రమున చిరస్థాయిగా పోయినది. మఱపునకుర్వాదు. అశోకహర్షుల నామములు ప్రతి హైందవుని జిహ్వాగ్రమున తాండవించుచుండును

హర్షుడు సుగుణరాసి, ధర్మనిరతుడు, పండితపోషకుడు. అహోరాత్రములు విరామములేక తనరాజ్యమునసంచరించుచు ప్రజాపరిపాలనయందప్రమత్తుడై పరిపాలనకృత్యము ఒనిర్వర్తించువాడు.అశోకునివలె నీతడునుభూతదయాళువు.అహింసావ్రతదీక్షాపరుడు. ఆతనివలెనే తనరాజ్యమున ప్రాణిహింసలమాన్పించెను. వేనవేలు బౌద్ధవిహారముల స్తూపముల, మండపముల గట్టించెను. జనోపయోగముకై, విశ్రాంతిగృహముల సత్రముల నసంఖ్యాకములుగ నిర్మించెను బౌద్ధభిక్షువులకు, బ్రాహ్మణసన్యాసులకు, జైనయతులకు తనభాండారమునగల ధనరాసుల గుమ్మరించెను. అనుదినమును తనరాజధాని

యందు వేయిబౌద్ధభిక్షువులకు అయిదువందల బ్రాహ్మణ్య మునకు అన్నదానము సల్పువాడు

## హ్యూయానిత్సాంగు

మన చరిత్రభాగమున హ్యూయానిత్సాంగుని నామము పలుమారు లుచ్చరింపబడినది. హర్షుని రాజ్యకాలమున హిందూదేశమును జూడవచ్చిన ఈచీనాతీర్థవాసుని చరిత్రమును ఇచ్చట సాకల్యముగ పరికింపవలసియున్నది ఈతడు ఎనిమిది వత్సరములకాలము ఆసేతుశీతనగ పర్యంతభారతవర్షము నామూలాగ్రముగదిరిగి ఆనాటి ఆర్యావర్త మెట్లుండెనో, కన్నులకుగట్టినట్లు చిత్రించినాడు. హర్షుని పరిపాలనమును గూర్చి ఆనాటి హైందవప్రజలగుణశీములగూర్చి మతసాంఘిక వ్యవస్థలగూర్చి, పూసగ్రుచ్చినట్లు వర్ణించినాడు. ఈతని చరిత్రగ్రంథము ఆకాలమునాటి చరిత్రలేఖనమున కమూల్య సాధనమైనది. ఈతడు అద్భుతపరిశీలనాశక్తిగలవాడు అపూర్వమగు రచనాకౌశలముగలవాడు. అందుచేతనే మన కీతని గ్రంథము అమూల్యమైనది.

హ్యూయానిత్సాంగు చీనాదేశములోని సత్కులీనుడగు ఒకానొక సంపన్నగృహస్థుని బిడ్డడు. ఈతని తండ్రి కీతడు నాల్గవతనయుడు. పసితనమునుండియు హ్యూయానిత్సాంగు బాల్యచాపల్యమున ఆటల మరగియుండక, ప్రాపంచిక సుఖములందు విరక్తుడై, ఏకాంతజీవియై మతగ్రంథముల నెప్పుడును జదువుచుండువాడు.నిరంతర గ్రంథపఠనచే నీతడు అచిరకాలముననే మతవిషయములం దపారపాండిత్యమును గడిం

చెను కాని హ్యూనిత్సాంగున కంతటితో తృప్తికలుగలేదు. తేజోమూర్తియగు నాబుద్ధభగవాను డవతరించిన పుణ్యభూమి, ఆర్యావర్తమును దర్శించి అచ్చటగల బౌద్ధగ్రంథములగూడ జదువవలెనని ఇతనికభిలాష జనించెను అందు ముఖ్యముగ హీనయానులచే పాషండగ్రంథమని నిరసింప బడుచుండిన యోగశాస్త్రమును గూడ పఠించిరావలెనని యాతనికి కోర్కె యుదయించెను.

బుద్ధభగవానుని యనుగ్రహము వలన 629 సంవత్సరమున నితని ప్రయత్నములు కొనసాగినవి ఈయేటనే యీతడు ఆర్యావర్తమునకు బయలుదేరెను. అప్పటి కీతనికి యిరువది తొమ్మిదేండ్ల ప్రాయము అప్పటికే హ్యూనిత్సాంగు ప్రఖ్యాత మహాయానపండితు డని చీనాసామ్రాజ్యమంతయు పేరుమోసెను. ప్రయాణము భయంకరమైనది. ఎక్కడి ఆర్యావర్తము! ఎక్కడి చీనారాజ్యము! వేనవేలుమైళ్లున్నది సరియగు రాజమార్గములులేవు పర్వతముల, అడవుల నదుల గడచిపోవలయు ఇదిగాక చీనారాజ్యమునుండి ఏరును పశ్చిమప్రాంతభూములకు ప్రయాణము సలుపరాదని రాజశాసనము రాజశాసనమును తృణీకరించుట ప్రమాదకరము. కాని కష్టపరంపరలు, రాజశాసనములు, ధీరచిత్తుల సంకల్పమును మరల్పగల్గునా? ఆతని హృదంతరాళమున ప్రవహించుచున్న వైరాగ్యతృష్ణ, విద్యాతురత ఆతనిచే రాజశాసనముల నుల్లంఘింపజేసినవి. మార్గమున నొదవిన యాపదల తృణప్రాయముగ జేసినవి.

ఆతడు భయంకరమార్గముల బడి పాదచారియై పదు నారు వందల మైళ్లదూరము ప్రయాణమొనర్చి ఎట్టకేలకు భారతవర్ష పొలిమేరల జేరుకొనెను. విద్యాసంపాదనకై యీ సాహసి పడినకష్టముల దలంచుకొనిన యొడలు జలదరించి పోవును. ఇసికులసరస్సును దాటి, టాష్కుండు, సమర్కుం డు, కందూజదేశముల మీదుగ నితడొక్క సంవత్సరము నకు గాంధారము జేరుకొనెను. అటనుండి మెలమెల్లగ ఆర్యా వర్తమంతయు దిరిగెను. కాశ్మీర, మధుర, హరిద్వార, కురుక్షేత్రముల జూచెను. హరిద్వారమున విమల గంగా తరంగిణీ పవిత్రాంబువులలో స్నానమాచరించి ముక్తుల గుట కరుదెంచిన యాత్రికాగణమును దిలకించినాడు. సార్వ భౌముని యతిథియై కన్యాకుబ్జనగరమును దర్శించినాడు. మహాచక్రవర్తి హర్షుడు గావించిన పరిషన్మహా సభకేగి యాస భాంతరాళమున మహాయాన మత జయదుందుభులు మ్రోయిం చినాడు రామాయణ కథానాయకుడు శ్రీరాముడు రాజ్య మేలిన అయోధ్యా నగరిని, హిందువులకు పుణ్యభూములగు కాశీ గయా ప్రయాగముల వీక్షించినాడు. విశ్వేశ్వరుని సేవింప భక్తులు వేనవేలు వారణాసి జేరియుండిరి. ఇచ్చట నిరువది ఉత్కృష్ట దేవాలయములుండెను. అందు మహేశ్వ రాలయము ప్రాముఖ్యమైనది. మహేశ్వరున కెప్పుడును ఆరా ధనలు జరుగుచుండును. నూరడుగుల ఎత్తుగల్గిన శివుని రాగి విగ్రహమొకటి యిచ్చటగలదు. ఇది యత్యంత గంభీరమై జీవముతో నున్నదాయని భ్రమగొల్పుచుండును.

మనబాటసారి బౌద్ధధర్మములకు ముఖ్యస్థానమగు జిల్లా మగధరాజ్యమున జాలకాలముండెను. ఈతడు దర్శించునాటికి మగధరాజ్య వైభవమంతయు మాటుమణగిపోయెను. పెక్కు శతాబ్దములు మగధసామ్రాజ్య రాజధానియై వెలిగి, ప్రపంచములోనికెల్ల రమణీయమైనదని విదేశములనుండి వచ్చిన మెగస్తనీసు మున్నగు రాయబారులచే పొగడ్తలగాంచిన పాటలీపుత్రము కళాహీనమై పాడువడియుండెను. గయా క్షేత్రము శిథిలమైపోయినది మునుపటివలె జనులతో కలకలలాడుచుండుట లేదు. పవిత్రబోధివృక్షము, రాజవర్ధనుని వధించిన దుష్టశశాంకునిచే పెల్లగింపబడి నేలకొరగిపోయినది. పాటలీపుత్రము నేలు పూర్ణవర్మ దానిని మరలనిలువబెట్టియది పడిపోవకుండ యడ్డుగ నొకరాతిగోడ గట్టించెను.

కాశీ గయాక్షేత్రముల దిలకించి, మనబాటసారి నలందాకుబోయి యచ్చట ఏడెనిమిది వత్సరములుండి యోగశాస్త్రము నభ్యసించెను అచ్చటి విద్యాపీఠమును, అందలి విద్యావిధానమును మనతీర్థవాసి రమణీయముగ వర్ణించినాడు. నలందావిద్యాపీఠ మీ కాలమున విశ్వవిఖ్యాతిగాంచి ప్రపంచమునం దెల్లతావుల నుండియు విద్యాతురుల నాకర్షించుచున్నది హ్యూయనిత్సాంగు ఆర్యావర్తమున నడుగిడినతోడనే యాతని కీర్తి బహుదూరము వ్యాపించినది. ఈతడు నలందాకు వచ్చుచుండెనను వార్త దెలిసినంతనే నలందా విద్యాపీఠమున కాచార్యుడగు శీలభద్రుడు మహాపండితుడు, యశస్వి యాతని కెదురేగి యాతని విద్యాభవనమునకు తోడ్కొనిరండని వేవురపండితుల నెదురుగానంపెను. వీరు ఊరిపొలిమేరల

కెదురుగజని, ఆకాలమున ఆర్యావర్తమున విద్వాంసులకు జేయు మర్యాదల ననుసరించి ఛత్రచామరములతో కేతువు లతో హారతులతో, పుష్ప మాలికలతో నాతెరువరిని విద్యాపీఠ భవనమునకు గొనిపోయిరి వృద్ధుడగు శీలభద్రుడు హర్ష ప్రఫుల్లవదనముతో నాతని కూర్చుండుమని ఎంతయో గౌరవించి, యొకదివ్యమందిరమున నుండబంచి రాజాధిరాజుల నువారములందైన లభింపని సువాసనలుగల్గిన దివ్యాన్నము లతో మధుర ఫలములతో నాతని సంతృప్తుని జేసెను.

నలందావిద్యాలయ గోపురములు అత్యున్నతములై గాలి లోనికి తేలిపోవుచు ప్రత్యూషతుషారములలో దాగుడు మూతలాడుచుండునని హ్యూనిత్సాంగు చమత్కారముగ వర్ణించినాడు ఈగోపురముల గవాక్షరంధ్రములనుండి సూర్యాస్తమయ అరుణదీపులు సంజకెంజాయలు, సరోజ బాంధవుని పండువెన్నెలలు వీక్షింపనగును శిల్పపుబను లతో వివిధవర్ణములుగల్గిన చిత్తరువులతో వెలుగొందు విశా లభవనములెన్నియో యీవిద్యాపీఠఆవరణమున గలవు. శీత లచ్ఛాయలనొసగు రసాలవృక్షజాలములతో, వసంతుని యా హ్వానమునకై ప్రకృతిలలామయెత్తిన జయపతాకములో యనిపించుచు సూర్యకాంతులలో మిలమిలలాడిపోవు దివ్య కుసుమములతో నిండిన యెర్రగోరంటలతో, గిరగిర దిరు గుచు జిమ్ముజిమ్మని సన్నని సలిలధారల నెగజిమ్ము జల యంత్రములతో నిర్మలజలపూరితములై, పిల్లతెమ్మెరలచే సంచలితమై యటునిటు ఉపరిభాగమున నుయ్యాలలూగు నల్ల కలువలుకల్గి మహోరగములవలె ప్రవహించు మంచినీటికాలు

వలతో శోభిల్లు ఆరామములు ఈయావరణముచుట్టు నున్న వి. ఆర్యావర్తమున వేలకొలది బౌద్ధమతములున్న విహారా సౌందర్యమున, గంభీరాకారమున దీని మఱపించునది లేదు.

ఇచ్చటి బౌద్ధశ్రమణకులు శిక్షణనియమముల గ్రంథ ములందు జెప్పబడినరీతిని క్రమము దప్పకుండ యథోచితముగ ననుచరింతురు. ఈవిహారము నిర్మింపబడి యిప్పటి కేడువంద లేండ్లైనను యింతవరకును అచ్చటి సన్యాసు లీనియముల నుల్లంఘించిన జాడలు గన్పింపవు. అందువలననే నలందా నివా సియగు సన్యాసియనిన నాకాలమున యావద్భారత దేశమున పూజింపబడువాడు.

నలందా విద్యాపీఠమున దివారాత్రములు శాస్త్రార్థ ములు, విద్యావాదములు జరుగుచుండును అచ్చట విద్యనభ్య సించువారలకు దినప్రమాణ మత్యంత స్వల్పముగగన్పించును. "ఇంతత్వరితముగ రవి గ్రుంకిపోవుచున్నాడే" యనిపించును. ఆప్రాంతమేలు నృపుడు దీని పోషణాదికములకై నూరు గ్రామముల నిచ్చెను. వీనిపైవచ్చు ద్రవ్యము పండితులకును విద్యార్థులకును భోజనాది వసతులకై ఖర్చుపరుపబడును. ఇచ్చట విద్యావిక్రయములేదు విద్యార్థుల కుచితముగనే విద్య గరుపబడును. భోజనాది వసతులుగూడ ఉచితముగనే యొసగ బడును. దీనిఖ్యాతి దిగంతములకు వ్యాపించుటచే పెక్కండ్రు విద్యాతురులు దూరదేశములనుండి యెడతెరిపిలేక యిచ్చట విద్యనభ్యసించుటకై వచ్చుచుందురు నలందాకు బోయివచ్చిన పండితుడయినచో నాకాలమున ప్రపంచమున నేదేశమునకు బోయిన నధికముగ గౌరవింపబడువాడు.

నలందా విద్యాపీఠమున వేదములందును, గణితవైద్య శాస్త్రములందును విద్యగరుపబడుచుండెను. ఈవిద్యాపీఠమున విద్యాప్రవీణులగు సన్యాసులు పదివేలుగలరు వీరిలో పదిశాస్త్రములందు ప్రావీణ్యము గడించినవారు వేయిమంది యుందురు. ముప్పదిశాస్త్రముల నారితేరినవారు ఐదునూర్లు గలరు. ఏబదిశాస్త్రముల చతురత గల్గినవారు పదిమంది యుందురు ఆచార్యుడగు శీలభద్రుడు సకలవిద్యా పారంగతుడు; సాహిత్య సామ్రాజ్య చక్రవర్తి; అనన్యసామాన్య ప్రతిభాశాలి; తపస్వి. ఈతడు జదువని శాస్త్రము లేదు.

హ్యూనిత్సాంగు నలందా యందుండగ కామరూపమును బాలించు భాస్కరవర్మ, తన యాస్థానమునకు వచ్చిపొమ్మని యాతనికి వర్తమానమంపెను. ఈనృపుడు హర్షుని ప్రాణమిత్రుడు. బ్రాహ్మణ మతావలంబియైనను పరమత సహిష్ణువు, సుగుణశాలి, పండిత ప్రియుడు. విద్యాంసులని నీతని కమితమగు గౌరవము. తనరాజ్యమునగూడనీతడు పెక్కువిద్యాశాలల స్థాపించి విద్యల కమితమగుప్రోత్సాహము కల్గించెను. నలందా విశ్వవిద్యాలయమువలె నివియు నాకాలమునప్రఖ్యాతములై పలుదేశములనుండివిద్యార్థుల నాకర్షించినవి. హ్యూనిత్సాంగునిపాండితీప్రౌఢిని తర్కచాతుర్యమును కర్ణాకర్ణిగవిని యాతని తనరాజ్యమునకాహ్వానింప వలెనని యీతనికి యభిలాషగల్గెను ఈతడు హ్యూనిత్సాంగునకు పెక్కుసందేశముల నంపెను రాయబారుల పుత్తెంచెను నలందాను విడిచిపోవుట కిష్టములేకమునుపాటసారి వల్లెయనుచు కాలవిలంబనమును జేసెను గాని తుదకు పోకతప్పినది కాదు ఎట్టకేలకు తాను భారతవర్ష

మున దిరిగి సముపార్జించిన అమూల్యవిగ్రహములను తాళపత్ర
గ్రంథములను మూటగట్టుకొని ఎంతయో కష్టముమీద, పరమ
పూజ్యమగు నలందా విద్యాలయమునకు విడిచి శీలభద్రునికడ
సెలవుగైకొని కామరూపమునకు ప్రయాణమై పోయెను.

ఈతడు మార్గమున హిరణ్యశైలమును చంపారణ్య
మును. వీక్షించి పుండ్ర×, సమాతత*, తామ్రలిప్తి♦, కర్ణసు
వర్ణములగడచి, కామరూపమును జేరుకొనెను. ఈరాజ్యము
లన్నియు జనసంకీర్ణములై పాడిపంటలతో సిరి సంపదలతో
తులతూగుచున్నవనియు, అందలిజనులు దయాశీలురై,విశ్వ
సనీయులై ప్రతిభాయుతులై, శౌర్యవంతులై, రణప్రవీణులై,
విద్యాభిలాషులై, చెలువొందుచుండిరనియు, మన తెరువరి
వర్ణించినాడు.

కామరూపమున తద్రాజేశ్వరుని యతిథియై కొన్నినా
ళ్లుండి పిమ్మట నీతడు దక్షిణాభిముఖుడై బయలుదేరి ఓఢ్ర
కళింగరాజ్యములమీదుగ ఆంధ్రదేశమునకు బోయెను. శాత
వాహనుల రాజధానియగు ధాన్యకటకమును దర్శించెను. విజ
యవాడకడ కృష్ణాతరంగిణికీవలను ఆవలను విలసిల్లినపూర్వ
అపరసంఘారామముల వీక్షించెను.

పిమ్మట కృష్ణానదీజలములదాటి చోళ, ద్రవిడ. మాలక
కూటరాజ్యములగాంచి యటనుండి ఉత్తరముగమరలి మహా
రాష్ట్రమును జొచ్చి అజంతాగుహాలయముదర్శించి, యటు
పిమ్మట మాళవ, వల్లభి, ఘూర్జర, ఉజ్జయినీ సింధుదేశముల
జూచిఅంతట నారాయ్యవర్తమును వీడిపోయెను.

---

+ ఉత్తరబంగాళము. * తూర్పుబంగాళము. ♦ దక్షిణబంగాళము.

పోవునపుడు కుమారహర్షు లీతని కౌగలించుకొని, వలదనుచున్నను చాలదూరము సాగనంపి సాయుధులగు భటుల పశ్చిమోత్తర సరిహద్దుల వరకును తోడిచ్చి వీడ్కొల్పిరి. భారతఖండముననేయుండిపొమ్మని యితనిబ్రతిమాలుకొనిరి. కాని చీనారాజ్యమున బౌద్ధమతము పాడువడియున్నదనియు, దాని సంస్కరించుటకు దాను అవశ్యము పోవలసి యున్నదనియు వారలకు జెప్పియొప్పించి యీసన్యాసి, వారలకడ సెలవుగైకొని చక్రవర్తియంపిన రాజసేవకులు వెంటరా నార్యావర్తమును విడచి సురక్షితముగ భారతవర్షపు పొలిమేరల జేరుకొని యటనుంటి దక్షిణమార్గమును బట్టి కాష్గర్, యార్కండు,కుస్తానములగడచి, మహాకష్టమగు ప్రయాణము సల్పి యెట్టకేలకు 645 సంవత్సరమున పదునారు వత్సరములకు చీనా సామ్రాజ్యము జేరెను

హ్యూయనిత్స్యాంగు చీనారాజ్యమును జేరుకొనినపిదప తా నార్యావర్తమునుండి పదిలముగ గొనివచ్చిన సంస్కృత గ్రంథముల చీనాభాషలోని కనువదింపసాగెను. ఈతని జీవిత శేషమంతయు నిట్లు చెల్లిపోయెను ఇతడు ఎనుబదినాలుగు సంస్కృత గ్రంథముల చీనాభాష లోనికి పరివర్తించెనని ప్రతీతి. అంతలోనితనికి మృత్యువు దాపరించినది ఇతడుఅరువది నాల్గవయేట ఇలుసేరిన పందొమ్మిది వత్సరములకు దివంగతుడయ్యెను భౌతికదేహమునువీడిపోయినను ఇతడింకనుసూక్ష్మదేహముతో మనమానవ వీధుల సంచరించుచునే యున్నాడు. ఇతిహాస క్షేత్రమున ఇతని నామము నేటికిని స్మరింపబడుచునే యున్నది. ఆనాటి చరిత్రాంశముల విరళముగ చిత్రించి,

చరిత్రపరిశోధనమున కమూల్యసాధనముల గూర్చి, యితడు మనకు చిరస్మరణీయుడైనాడు. ఈతని సాహిత్యపాటవము, అద్భుతపరిశీలనాశక్తి, రచనాచమత్కృతి, సాహసధైర్యములు ప్రశంసాపాత్రములు.

## మహమ్మదు.

హర్షుడు రాజ్యమేలుచున్న కాలమున జరిగిన చరిత్రాంశమొకటి చెప్పమరచితిని. భారతవర్షమున నీతడు చక్రవర్తియై పరిపాలించుచుండ, మగధరాజ్యమున జనించిన మతతృష్ణాసమీరములు, చీనా జపాను రాజ్యములవరకును ప్రసరించి యారాజ్యముల సంచలింపజేసి, అందలిజనుల తండోపతండములుగ, తక్షశిలా నలందా మున్నగు విద్యాలయములకు గొనివచ్చుచుండ, అరేబియాదేశమున, 622 సంవత్సరప్రాంతమున నొకమహాప్రవక్తజన్మించి అరబ్బిజాతులకు యేకేశ్వరోపాసన ముద్బోధించి, వారి మానసక్షేత్రముల నిర్మాణమైన మూఢవిశ్వాసమహాదుర్గములకు జిచ్చువెట్టసాగెను ఈతడే ఇస్లాముమతధ్వజసంస్థాపకుడగు మహమ్మదు. ఈతని యుద్బోధనలతో భారతవర్షమునకు పశ్చిమప్రాంతమున విస్తరిల్లిన అరేబియా, పారసీకము, మెసిపొటోమియా, ఆఫ్గనిస్థానము మున్నగు దేశములన్నియు సంచలితమై పోయినవి. తరువాత కొంతకాలమునకు మహమ్మదీయమత ప్రవాహము పొంగి, హిందూదేశమునుకూడ ముంచినది

ఈవిషయము భారతవర్షయితిహాసరంగమునకు సంబంధించినది కాదని కొందరుచరిత్రకారులు దీనిని విస్మరించిరి. కాని

క్రైస్తవమతమువలె నిదియు బౌద్ధమతసమీరోద్ధూతమగు నీ ప్రపంచమహాసముద్రమునసుద్భవమైన యొకఉత్తుంగతరంగము గాని వేరొండుగాదు. బౌద్ధమతధర్మములు ఆశియాఖండ మందలి పూర్వపశ్చిమదేశములకు గొనిపోబడినవి. బౌద్ధమతపతాకముఆశియాఖండమందెల్ల వేయిసంవత్సరములు నిరాఘాటముగ నెగిరినది పారశీక అరాబియా అఫ్గనిస్తానము లందు గూడ బౌద్ధమతము ప్రబలి, చాలకాలము నివాసము జేసినది. తాను భారతవర్షమును దర్శించిన కాలమునపారశీకమున బౌద్ధమతముప్రబలుచున్నదనియు అచ్చట పెక్కు హీనయాన బౌద్ధమఠములుగూడ గలవనియు, మన హ్యూయానిత్స్యాంగు నుడివియున్నాడు. "పూర్వకాలమున ఖురాసన్, పారశీకము, ఇరాకు, మోసలు మున్నగు సిరియావరకును గల దేశములన్నియు బౌద్ధదేశములె" యని పదునొకండవ శతాబ్దమునాటి ఆల్బెరూని వ్రాసెను. ఆర్యావర్తమందలి సభాంతరాళముల రేగుచున్న మతవాదములు అరేబియా యెడారిప్రదేశములలో ప్రతిధ్వనింపక పోయినను ఆప్రాంతవాసులు ఈశ్వరుడొక్కడేయను సత్యమును మున్నెన్నడును వినియుండక పోలేదు. మహమ్మదు తన ప్రళయ శంఖారావములు గావింపక మున్ను కొన్ని శతాబ్దములు ఈసిద్ధాంతము వారికర్ణపుటములప్రతిధ్వనించినదని చెప్పుటకు సందియము లేదు. ఇదిగాక హీనయాన మహమ్మదీయమతముల కత్యంత సాదృశము గన్పించుచున్నది ఉభయ మతములును ఆడంబర రహితమువలె. బౌద్ధమతమునకు ముఖ్య సిద్ధాంతములగు సత్సంకల్ప సన్మార్గవర్తనములు దీనికిని ముఖ్యసిద్ధాంతములె కుసుమమంజరులు తరులతాదులు కమం

డములు మున్నగునవి దప్ప ఊహాజనితములగు స్త్రీ పురుష విగ్రహములు చిత్రింపరాదని బుద్ధుడు నిషేధించెను. మహామ్మదీయమతమున చిత్రకారుల తూలికాసంచారముల బంధించినశాసనముకూడ నిట్టిదే. ఆరాధన విధానములందు దప్ప తక్కటి విషయములందు హైందవ, మహామ్మదీయమతముల కంతగ వైషమ్యము గన్పింపదు. మహామ్మదీయ ముల్లాకును, బ్రాహ్మణ పురోహితునకు యీషణ్మాత్ర భేదము. ఇక భారత వర్షమునకును మహామ్మదీయమతమునకు సంబంధము లేక పోవు టెట్లు?



# బౌద్ధమహాయుగము

## XIV.

### ఉపసంహారము.

బౌద్ధమహాయుగనాటకము ముగిసినది తుదియంకము గూడ నాఖరైనది మన గమ్యస్థానమును జేరుకొంటిమి. ధర్మమూర్తి, శౌర్యరాసి, సుగుణఖని, దానశీలుడు, హర్షవర్ధన చక్రవర్తి, యితిహాసరంగమునుండి నిష్క్రమించెను. అతనితోడనే బౌద్ధమతముకూడ అస్తమించి పోయినది. ఆర్యప్రతిభకూడ విలుప్తమైపోయినది. అలెగ్జాండరు, మిళిందులవంటి వీరాతివీరులగూడ యుద్ధరంగమున చిందులు ద్రొక్కించిన భారతశౌర్యము మాటుమణగినది. కళాసంపద యస్తమించినది. అప్పటినుండియే పారతంత్ర్యముగూడ దేశమునకు దాపురించినది. భారత సామ్రాజ్యలక్ష్మికి కష్టకాలము సంప్రాప్తమైనది బౌద్ధయుగాంతమున, భారతభూమి కెట్టియిక్కట్టులు సంఘటిల్లినవో వర్ణించుట కిచ్చట తావులేదు. ముందునకుజూచిన భయంకర విషాదతరంగమాలికలే గోచరించును గాన నావంకజూడక, వేయివత్సరములు మహోత్కృష్టదశ ననుభవించిన బౌద్ధయుగమునాటి భారతవర్షము నొక్కసారి కనులార దిలకించి, భారత యితిహాసరంగమునుండి సెలవు గైకొనెదము.

బౌద్ధమహాయుగమునకు స్వర్ణయుగనామము సార్థకమైనది. భారతవర్షచరిత్రమున దీనినిబోలిన యుగములేదు. ఈయుగమున భారతవర్షము మహోన్నతదశ ననుభవించినది.

కళా వాఙ్మయములు ఈయుగమున పరిపూర్ణత గాంచినవి. కృషివాణిజ్యములు మిన్నంటినవి. ఈయుగమున భారతభూమి సమస్త సంపదలతో తులతూగినది. పరదేశములనుండి యేతెంచిన ధ యబారులు తీర్థవాసులు ఆనాటి భారతవర్ష అతులిత భాగ్యవైభవముల గాంచి విస్మయులై పోయిరి. ప్రపంచమున నెచ్చటను గానరాని చిత్రశాలలు, శిల్పమందిరములు, శిలాస్తంభములు నీ కాలముననే ఈపుణ్యభూమిని వెలసినవి. చంద్రగుప్త, అశోక, సముద్రగుప్త, విక్రమాదిత్య, హర్ష, గౌతమిపుత్ర, శ్రీముఖ, శాతవాహనులవంటి మహా చక్రవర్తులు, జగద్విఖ్యాతిగనిన శౌర్యధనులు, యోధాగ్రేసరులు, అఖండప్రతిభాశాలురు, అనన్యరాజకీయ పరిజ్ఞాతలు, నీయుగముననే యుద్భవిల్లిరి. మౌర్య, ఆంధ్ర, గుప్త, కనిష్క, మాళవ, హర్షసామ్రాజ్యములును ఈ కాలముననే విస్తరిల్లినవి శౌర్య మీయుగమున వెల్లివిరిసినది భారత వీరుల రణప్రౌఢి యీకాలమున జగద్విఖ్యాతమై పోయినది. ఆసియాఖండమంతయు విజయధ్వజముల ఖ్యాతి. మహాశక్తివంతములనిపించుకొనిన యవన, శక, పహ్లవ సైన్యములు భారత సైన్యముల జూచి కలగుండుపడి పారినవి భారతసైన్యముల వంటి సైన్యములు అంత సుశిక్షితములైనవి అంతటి రణకౌశలమును ప్రదర్శింప గల్గినవి ఆకాలమున లోకమందెచ్చటను గాన్పింపలేదు ఈప్రపంచమున మహామతములై పరిఢవిల్లి లెక్కలేనిమానవకోటి నాకర్షించి, లోకములోని తక్కినమతముల కెల్ల మూలబీజములై తనరారిన బౌద్ధ, జైన, అద్వైతమతముల స్థాపించిన చిరస్మరణీయులు బుద్ధమహావీరశంకరులు నీకా

లమునందే భారతవర్షమున నవతరించిరి. ఈయుగమునను ద్భవిల్లిన బౌద్ధమతము భారతవర్షముననే గాక, తక్కిన ఆశియా ఖండమునగూడ మతసాంఘిక క్షేత్రములం దొక మహావిప్లవమును గల్పించినది. ఈమతప్రచారమువలన ఆసియాఖండమున నొక శాంతి సామ్రాజ్య ముత్పన్నమైనది. బుద్ధుని ప్రేమగీతలు ప్రజల మానసములనుండి రాగద్వేషములు పోద్రోలినవి. జనులు అహింసాప్రతతత్పరులైరి. ఈమహామత వాహినిలో నుద్భవించిన తరంగములె మహమ్మదీయ క్రైస్తవమతములు. భారతవర్ష మీకాలమున, మతసాంఘిక క్షేత్రములందు ఆశియాఖండమున కెల్ల శాసనకర్తయై వెలిగినది.

## బౌద్ధయుగమందలి రాజ్యాంగము.

బౌద్ధయుగమున ఆర్యావర్తమున పెంపొందని సంస్థలేదు. నవీనకాలమున పాశ్చాత్య దేశములలో గనుపించు పరిపాలనా పద్ధతులన్నియు ఆకాలమున భారతవర్షమున పెంపొందినవి. ఒకరాజ ప్రభుత్వమేగాక, ప్రజాస్వామిక ప్రభుత్వము కూడ నీకాలమున వికసించినది. ప్రజాప్రభుత్వము, పాశ్చాత్యప్రపంచముననే బుట్టి పాశ్చాత్యప్రపంచముననె బెరిగినదని పాశ్చాత్య చరిత్రకారులు అనృతములువ్రాసికొందురు. ఒక్కసారి కండ్లు తెరచిజూచిన ఇప్పటికి రెండువేల అయిదువంద లేండ్లక్రిందటనే ఆర్యావర్తమున ప్రజాపరిపాలనము నేడు పశ్చిమదేశములలో ప్రబలియున్న దానికంటె సర్వవిధముల నుత్కృష్టమైనది గలదని దెలియగలదు అనాదినుండియు, భారతవర్షము రాజ్యతంగమున వెనుకబడి యున్నదనియు,

స్వాతంత్ర్యవాయువు లీభూస్థలి నెప్పుడును యథేచ్ఛముగ వీచి యెరుంగదనియు, భారతవర్షమందలి జను లెప్పుడును నిరంకుశ పరిపాలనమునబడి మ్రాల్గుచుండువారనియు, తాము వెదజల్లిన స్వాతంత్ర్యబీజములు, మొలచి పుష్పించి, కాయలు గాచిన వెనుకగాని భారతవర్షమునకు స్వరాజ్యార్హత సిద్ధింపదనియు పాశ్చాత్య చరిత్రకారులు మాటిమాటికిని వాపోవుచుందురు. పాపము; ఇంగ్లాండువంటి పాశ్చాత్యదేశములు, అరణ్యములచే గప్పబడి, అందలి ప్రజలు, వస్త్రధారణ మెట్టిదో యెరుంగక దిగంబరులై జడలమాతంగులై పచ్చిమాంసమును పీకుకొని తినుచు తోడేళ్ళగుంపులవలె కారడవులలో సంచరించిన కాలముననే ఈ భారతవర్షమున నిట్టి రాజ్యపద్ధతులన్నియు విలసిల్లిన వని వీరెంగరుగాబోలు. భారతావని పాశ్చాత్యుల పాలబడి నప్పటినుండియె ఈదుర్గతి సంప్రాప్తమైనది. స్వాతంత్ర్యము విలుప్తమైనది. విశుద్ధమై, అనాదిసిద్ధమగు హైందవ పరిపాలనా పద్ధతులు మరుగువడిపోయినవి. అంతియెగాని ప్రాచీన భారతవర్షమునకు, నవీన రాజ్యాంగపద్ధతులు క్రొత్తలుగావు.

బుద్ధుని కాలమున వరలిన, శాక్య, లిచ్ఛవీ, ఉత్తర కురు, పాంచాల, మల్ల, విదేహ, భోజ,మున్నగు రాజ్యములన్నియు ప్రఖ్యాత ప్రజాస్వామిక రాజ్యములేయని చరిత్రలు ఘోషించుచున్నవి. బుద్ధుడు జన్మించు కాలమునాటికే అనగ క్రీ. పూ. ఆరవశతాబ్దము నాటికే యీ రాష్ట్రములలో రాజ్యప్రభుత్వమంతరించి ప్రజాప్రభుత్వమేర్పడినది. ఇది నేటి పశ్చిమదేశములలో వ్యాపించియుండు ప్రజాప్రభుత్వముల వలె నామమాత్రమైనది గాదు; ఉత్తమపద్ధతులపై నడిపింప

బడుచుండిన సర్వాంగ సౌష్టవమైన, ప్రజాస్వామికము. ఈ రాష్ట్రములలో ప్రజాప్రతినిధులతో నిండిన యొక మహా సభయే రాజ్యపాలనము గావించెడిది దీనికి ప్రజాసభ యని పేరు. ఈ సభయనుదినమును సమావేశమై రాజకార్యముల నిర్వహించు భవనమునకు సంఘాగారమని పేరు ఇట్టి సంఘాగారమొకటి శాక్య రాజ్యమునకు రాజధానియగు కపిలవస్తు నగరమున ,నుండెడిది. ఈరాజ్యమున పరిపాలనము నెరపిన ప్రజాసభ యిందే సమకూడెడిది. ఇట్టి ప్రజాసభయే ఈరాజ్యములలో రాజ్యాధిపత్యమును వహించినది. సర్వరాజ్యాంగ వ్యవహారముల నిదియేచక్క బెట్టినది. శాసనముల గావించినది.

ప్రజలచే నియమితుడగు నాయకుడొకడు యీ సభ కధ్యక్షుడుగ నుండువాడు ఈతని పదవి నేటి అమెరికా రాష్ట్రమంవలి సభాధ్యక్షుపదవికి బోల్పదగును. ఈత డెంతకాల మున కొకసారి యెన్నుకొనబడువాడో తెలియదు మహాజన సభచే గావింపబడు శాసనముల నీతడే అమలు సలుపును. ఈ సభచే ననుజ్ఞాతుడై రాచకార్యముల నెరవేర్చుచుండును. ఈతడు రాజబిరుదమునుదాల్చి ప్రత్యేక సౌధమున నివసించు వాడు. కిరీటాధిపతియగు నృపునకు జూపబడు రాజమర్యాద లన్నియు నీతనికి జూపబడు చుండెడివి. బుద్ధుని తండ్రియగు శుద్ధోదను డీరీతిగనె "నృపాలక" పదవి నంది శాక్య రాజ్యమును బాలించెను. అప్పటి యీ ప్రజాపరిపాలనము నేటి పాశ్చాత్య దేశములలో ప్రబలుచున్న ప్రజాస్వామికమున కెవ్విధమున దీసిపోయినది?

ఇదిగాక ఆకాలమున ప్రతిగ్రామమును ఒక్కొక ప్రజాస్వామిక రాష్ట్రమని చెప్పవచ్చును పైవివరించిన ప్రజా సభలవంటి సభలు ప్రతియూర నుండెడివి. ఈ గ్రామ సభలే గ్రామవ్యవహారములన్నియు నిర్వహించెడివి. ఊరిపెద్దలంద రును గ్రామసభలో సభ్యులుగ నుండువారు. ఇట్టి సర్వాంగ సౌష్టవమగు ప్రజాపరిపాలన మీప్రపంచమున నింకేరాజ్య మున గలదు?

పూర్వకాలమున ప్రజాపరిపాలనము సంపూర్ణముగ గలదని యింకెన్నియేని దృష్టాంతములు జూపగలము ఆకా లమునాటి మతసభలన్నియు ప్రజాపరిపాలనా పద్ధతుల ననుక రించినవి. గౌతమబుద్ధునిచే నిర్మింపబడిన 'బౌద్ధసంఘమున' ప్రజా పరిపాలనాంకురములు పెక్కగాన్పించును. బౌద్ధసంఘ మున మతవ్యాపారములన్నియు ఒక మహాసభ నిర్వహించె డివి ఈసభ తన కార్యనిర్వహణమున ప్రజాస్వామిక పద్ధతు లనే యనుకరించినది సభాసదుల ఆసనముల నిర్ణయించుటకై యొకయుద్యోగి యుండెను ఈతనికి 'ఆసన ప్రజ్ఞాపకు'డని పేరు. ఈతడు సభాసదుల సమర్థతాసమర్థతలబట్టి వారెచ్చటెచ్చట గూర్చుండవలయునో నిర్ణయించువాడు. సభ సమావేశమైన పిమ్మట సభాధ్యక్షుడు లేచి వినయము గదుర, "పూజ్యులగు సభాసదులందరు నాలకింతురుగాక, సంఘసభ్యులు నేడు నిర్ణ యింపవలసిన విషయమిది" యనువాక్యములతో సభాకార్య క్రమము నుపక్రమించును. పిదప తీర్మానము నుపపాదింప బోవు సభ్యుడునిలుచుండి తీర్మానమును జదివి దాని యర్థ మిదమిద్ధమని విపులపరచును తరువాత దాని బాగో

గులు పరిశీలించుచు సభ్యులు ఉపన్యాసములు సలుపుదురు. వాదములు ముగిసినవెనుక సభాధ్యక్షుడు సభాసదుల దిలకించి, "తీర్మానము నంగీకరింపవచ్చునా" యని ప్రశ్నించును. ఇట్లు మూడుసారు లడిగినవెనుక వలదనువారు లేకున్నయెడల నది యంగీకృతమైన ట్లెంచబడును. సభ్యులు భిన్నాభిప్రాయులై యుండినచో సమ్మతులు గైకొనబడును. అధికసంఖ్యాకులకు సమ్మతమగునెడల ఆతీర్మానము జయమందినట్లు పరిగణింపబడును. సమ్మతుల లెక్కించుటలో సభకురాజాలని సభ్యుల యభిప్రాయములుకూడ విచారింపబడును. సభకు బోజాలనిసభ్యులు తమ యభిప్రాయముల సభకు బంపుటకు వారికర్హతగలదు. ఇట్టి సభాంతరాళముల గావింపబడు శాసనములు సర్వజనులును మన్నించి తీరవలయును. రాజాధిరాజైనను వానికి కేలుమోడ్పవలసినదే. గత్యంతరము లేదు.

మఱియు బౌద్ధయుగమున అనేకాలమునను ప్రజలకు పరిపాలనా కృత్యములందు ప్రసక్తియుండినట్లే చరిత్ర పరిశోధనలవలన గాన్పించుచున్నది. క్రీ.పూ. ఆరవశతాబ్ద ప్రాంతమున ప్రబలిన ప్రజాస్వామిక పరిపాలన మంతరించి రాజులు విజృంభించినపుడు గూడ ప్రజల పరిపాలనాధికారము మ్రగ్గిపోవలేదు. ప్రజలు సభలుకూడి ఎప్పుడును రాజ్యవ్యవహారములందు పాల్గొనుచునే యుండిరి. ప్రజాసభ లీకాలమున నెప్పుడును వైధవ్యము ననుభవింపలేదు. ఏనృపుడును దీనిని విచ్ఛిన్నమొనర్పలేదు రాజ్యప్రభుత్వమున కెప్పుడును ఇది యొక యంకుశముగనే యుండెను హర్షునికాలమున గూడ నీసభ రాజ్యాంగ వ్యవహారములందు సర్వాధికారము గల్గియుండి

నట్లు నిదర్శనములు గన్పించుచున్నవి. రాజు మరణించు నపుడు ఆతనిపిమ్మట గద్దెపై నధివసించువారెవ్వరో ఈసభయే నిర్ణయించునది. ప్రజలు రాజ్యమునకు పరిపాలకుని నియామించు నధికారము గల్గియుండిరి. హర్షునిసోదరుడు రాజవర్ధనుడు శశాంకునిచే హతము గావింపబడినపుడు ఈసభయె హర్షునికి స్థానేశ్వర సింహాసనమును బ్రసాదించినది. శశాంకుడు మున్నగు అరివీరులతో రణమునెట్లు సలుపవలయునో గూడ నిదియె ఆతనికి నిర్ణయించి చెప్పినది.

పరిపాలకుని నియమించుట యందేగాక పరిపాలనము సరిగ నిర్వర్తింపని యెడల నాతని పదచ్యుతుని జేయుటకు గూడ నీసభ కధికారముండెను. రాజ్యమునకు విషమపరిస్థితు లేతెంచినపుడు, రాజు దుర్బలుడై శత్రుసైన్యముల నురుమాడి రాజ్యమును సంరక్షింప జాలనపుడు, నృపుడు దుష్టుడై ప్రజల హింసించునపుడు, ప్రజాసభ వాని పదభ్రష్టుని గావించి ఇంకొకని సింహాసన మెక్కించునది మహాపద్మనందుడు ప్రజాకంటకుడై జనుల పీడించినపుడు ఈసభ చంద్రగుప్తుని మగధసింహాసనమున గూర్చుండ బెట్టినది. బృహద్రథుడు ఆంధ్రమిళింద సైన్యముల మరలించి రాజ్యమును రక్షింపజాలడని ఆతని బరిమార్చి సింహాసన మాక్రమింపుమని ప్రజాసభ పుష్యమిత్రుని ప్రోత్సహించి రాజదండము నాతని కొసగినది.

ఆకాలమున ప్రజలకు రాజ్యాంగమున సర్వాధికారముండెనని జూపుట కింతకంటె ప్రబలనిదర్శనము లేమిగావలయును? ఇప్పుడు పాశ్చాత్య దేశములలోని ప్రజల కింతకంటె నెక్కువ

యధికారము గలదందురా? కల్ల ప్రజా ప్రతినిధులతో నిండి సర్వశాసనాధికారము గల్గి రాజాధిరాజులచే జోహారులందిన నాటి ప్రజాసభలముందు బ్రిటిషు దీవులలోని నేటి పార్లమెంటు సభ, అమెరికాఖండమందలి కాంగ్రెసు, దివిటీముందరిదీపము అని వీనికంటె నవియె బలిష్ఠములైనవని హావెలుఅను ఆంగ్లేయ చరిత్రకారుడు నుడివియున్నాడు.*

ఆకాలమునందలి రాజ్యాంగవేత్తలు అక్షరనిరక్షరులను భేదము బాటింపక భాగ్యభోగ్యముల సరకుగొనక ఎల్లజనులకు, అబలలకుసైతము రాజ్యాంగ వ్యవహారముల బాల్గొనుటకర్హతగల్పించిరి. నిరక్షరత్వము రాచకార్య నిర్వహణమునకెంత మాత్రమును ఆటంకముగల్పింప నేరదని యుద్ఘోషించిరి. నిరక్షరకుక్షియగు అక్బరు చక్రవర్తి మహాకౌశలముతో రాజ్యనౌకను నడిపించి నిరుపమాన రాజకీయ పరిజ్ఞాత యని పేరు మ్రోగుట జగద్విఖ్యాతమే గదా! విద్యాపాటవము లేని ప్రజలు పరిపాలనా కార్యముల నిర్వహింప నేరరను సూక్తులు అర్థశూన్యములు. అన్యాయార్జితమైనను, నిరంకుశ భూయిష్టమైనను, విజాతీయమైనను అన్యదేశములలో తమ పరిపాలన మావశ్యకమని సమర్థించుకొనజూచు విజాతీయ పరిపాలకులాడునవి అనృతములు.

ఆకాలము నాటి ఆర్థిక పరిస్థితులు; కృషి సంపద.

బౌద్ధయుగమున నెప్పుడును సుపరిపాలనమే ప్రబలినది. అందు ప్రజలు సౌఖ్యమున తేలియాడిరి. ఐశ్వర్యములతో

---

* హావెలు రచించిన Aryan rule in india ఉపోద్ఘాతము 13 పుట.

తులతూగిరి దుర్భిక్షమనున దీకాలమున గన్పింపదు ఆకాలమునాటి భారతవర్షము స్వర్ణభూమి యని ప్రశంసలగనినది. ఎచ్చటఁజూచినను ధనరాసులే, ఐశ్వర్య చిహ్నములే గనుపించు నని ఈకాలమున భారతవర్షమును జూడ వచ్చిన మెగస్తనీసు ఫాహియాను హ్యూనిత్సాంగులు అప్పటి భాగ్యవైభముల గాంచి ఆశ్చర్య మగ్నులైరి. ఆకాలమున నిర్మింపబడిన స్తూపావళులు, రాజసౌధములు మణిస్థగితములై పసిడి పూతలతో మెరుగు లీనుచు కన్నులు మిరుమిట్లు గొల్పినవని నాటి స్తూపముల రాజప్రాసాదముల వర్ణించి ఇతీర్థవాసులు ఆనందపరవశులైరి నాటిరాయిశ్వర్యమంతయు నేడెచ్చట మణగిపోయినది!

నాడు సమస్తపరిశ్రమలును వర్ధిల్లినవి. కృషివాణిజ్యములు పెంపారినవి. నేఁటిపాశ్చాత్య దేశములలోని కృషీవలుర స్థితి కంటె బౌద్ధయుగమందలి కర్షకుల స్థితిగతులు, ఆర్థికబలనైతిక సంపదలు, వేయిరెడుగు లుత్తమముగ నున్నవి ఐదవ శతాబ్దమున కీవలను ఆవలను పాశ్చాత్య చరిత్రకారులచే అజ్ఞానయుగమని పేర్కొనబడుచుండినకాలమున నివసించినహైందవ ప్రజ లనుభవించిన స్వాతంత్ర్య సౌఖ్యములలో సహస్రాంశమైనను నేడు పార్లమెంటువంటి ఉత్తమ రాజ్యాంగసంస్థల సహాయముతో ప్రపంచమున నన్ని ప్రాంతముల నుండియు గొట్టుకొని వచ్చు ధనరాసుల యూరగింపులతో, బ్రిటిషు దీవులలోని ప్రజలు అనుభవించుటలేదని హావెలు వచించినాడు.

* Introduction to Havel's Aryan Rule in India Page 1

ఆకాలమునాటి కృషిసంపదను యవనరాయ బారియగు మెగస్తనీసు చాల బొగడినాడు. ఈతడు ఆకాలమునాటి ఆర్యావర్తము నీరీతి వర్ణించినాడు "నిర్మల జలపూరితము లగు పెక్కునదీ ప్రవాహములతో విపుల సస్యవంతములై అత్యంత విశాలములగు మైదానములతో దేశమెంతయు కనులపండువ జేయుచుండును. ఇచ్చటి భూమియంతయు సేద్యము గావింపబడును. సస్యములు పుష్కలముగ ఫలించును. ఏడాదికి రెండుపంట లవలీలగపండును. వరి, గోధుమ, జొన్న, మున్నగు నవధాన్యములును, పశువుల కాహారముగ నుపకరించు పచ్చికయు విశేషముగ పెరుగును. దుర్భిక్షమను నదీదేశమున నెచ్చటను గానరాదు. క్షామదేవత యిచ్చట నడుగువెట్టిన జాడలుగన్పింపవు." నాటికిని నేటికిని ఎట్టితారతమ్యము. నాటిసస్యసమృద్ధి నేడెచ్చట మాయమైపోయినది. నేడు భారతవర్షమునకీ నిత్యకాటకమేల? సస్యఫల శోభితమగు యీదేశమున బుట్టినజనుల కీవేదరికమేల? "అన్నము, అన్నము, ఆకలి దహించుకొని పోవుచున్నది. అయ్యో, ఈక్షుద్బాధ నేను భరింపలేను." అని యేడ్చియేడ్చి దిక్కులేని ప్రాణులై, యేచెట్టునీడనో జీవములుబాయు ప్రాణికోటుల యుసురు ఎవరికి గొట్టవలయును?

## కళలు, చిత్రశిల్పములు.

ఇంక కళల యభివృద్ధికిగూడ భారతవర్షమును జెప్పి మరియొకదేశమును జెప్పవలయును. ఇచ్చట పెంపొందని కళ లేదు. అభివృద్ధినొందని పరిశ్రమలేదు బౌద్ధయుగమున శిల్ప

చిత్రకళలెట్టి పరిపూర్ణత గాంచినవో మున్నే వర్ణించితిమి. ఈయుగమున సిద్ధహస్తులగు చిత్రకారులు, శిల్పులు వరలిరి. వీరిచే రచియింపబడిన చిత్తరువులు, శిల్పములు లోకవిఖ్యాతిని బడసినవి వీనినిజూచి కళాప్రపంచము నేటికిని విస్మయము జెందుచున్నది. రసజ్ఞులు నేటికిని వీనిజూచి ముగ్ధులై పోవుచున్నారు ఇవియున్న తావులు కళాప్రపంచమునకు తీర్థవాటికలైపోయినవి. అజంతా విహారమున ఎల్లోరా, కార్లిగుహలందు, అమరావతి, బార్హుతు, సార్నాదు, సాంచి స్తూపములందు ప్రదర్శింపబడిన చిత్రనైపుణ్యమును, శిల్పవిన్నాణమును జూచుటకేతెంచు తీర్థవాసులకు నేటికిని మేరలేదు భారతవర్షమున బౌద్ధమత మస్తమించినను అపూర్వ నిర్మాణకౌశలమును అద్వితీయ శిల్పకళా ప్రావీణ్యమును ప్రదర్శించు యీ యద్భుతపు కట్టడములు మాత్రము చిరస్థాయిగ నిల్చి నాటి కళావైభవమును స్మరణకు దెచ్చుచున్నవి.

ఆకాలమునాటి భారతశిల్ప కాంతులు ప్రాచ్యప్రపంచమునం దెల్లతావులను ప్రసరించినవి. మతసాంఘిక జగత్తులం దేగాక కళాప్రపంచమున గూడ ఆకాలమునాటి భారతవర్షము శాసనకర్త్రియై వెలిగినది. ఆసియాఖండములోని రాజ్యములన్నియు భారతశిల్పవైఖరుల ననుకరించినవి. ఇటీవల మధ్యఆసియాలోని టెరిము ప్రాంతమున త్రవ్వుచుండగ కొన్ని విచిత్రపు కట్టడములు బయల్పడినవి. అందు చిత్రింపబడిన బొమ్మలచ్చముగ అజంతా చిత్రముల బోలియున్నవి జపాను ద్వీపమున హోనురుషీ ప్రాంతమున నొక ప్రాచీనభవనమున అజంతా చిత్తరువులవంటి కుడ్యాలంకారములు గన్పించినవి.

భారతశిల్పము, మహాసముద్రముల దాటి జలరాసులచే నావరింపబడిన ద్వీపములకుగూడ బ్రాకినది!

## పరిశ్రమలు, పారిశ్రామిక జీవనము.

బౌద్ధయుగమున పలువిధములగు పరిశ్రమలు పెంపొందినవి. ఈ పరిశ్రమల విచిత్రలక్షణ మేమన, ఒక్కొకపరిశ్రమ యొక్కొక కులమున వృద్ధినొందినది. అది ఆయాకుటుంబముల కులవిద్యయై పెంపారి పరిపూర్ణత గాంచినది. ఒక్కొక కులమొకేవిద్యయందు మగ్నమై పెక్కు శతాబ్దములు పరిశ్రమ జేయుట వలన అట్టికులమునకు ఎడలేని హస్తకౌశల మలవడినది. అందువలననే మన దేశమున పరిశ్రమలు అపారమగు అభివృద్ధిగాంచి ప్రపంచమున నెచ్చటను గానరాని అద్భుత ప్రావీణ్యమును ప్రదర్శింప గలిగినవి లోకమున నేదేశమును పరిశ్రమలందు ఇంతటి యభివృద్ధి నొందలేదు ఆకాలమున సృజింపబడిన వస్తుజాలమును జూచి లోకము నేటికిని దిగ్భ్రమ జెందుచున్నది. ఆకాలమునాటి దుకూలములకు, వలిపెములకు దంతపు పనులకు, చిత్రలేఖనములకు, శిల్పరచనలకు సాటియగునవి యింతవరకును ప్రపంచమున నెచ్చటను గన్పింపలేదు. అందువలననే ఎన్ని దండయాత్రలు వచ్చినను ఎన్ని శతాబ్దములు పారతంత్ర్యమునకు లోనయినను ఎన్ని యిక్కట్టులు సంభవించినను ఎంతయాదరణ లేకపోయినను ఇచ్చటి పరిశ్రమ జీవుల హస్తనైపుణ్యము అంతరించిపోక అచ్చటచ్చట యింకను నిలిచియున్నది.

ఇంకొకశుభలక్షణము; ఆనాటిపరిశ్రమలు తరతరములవరకును గృహపరిశ్రమలుగనే నిలిచి యద్భుత నైపుణ్యమును గడించినవి. నాటి పారిశ్రామికుల దృష్టి యంత్రశాలలవంకకు బరుగిడలేదు. యంత్రశాల లనుపెనుభూతములాకాలమున లేవు. నాటిపారిశ్రామిక జీవనము లలితమై, సుకుమారమై, సర్వాంగ సుందరమై, సౌఖ్యప్రదమై తనరారినదేగాని నేటిపాశ్చాత్య దేశములలోని పారిశ్రామిక జీవనమువలె కలుషితమై దుస్సహమై దుర్భరమై పోవలేదు. నేడు పాశ్చాత్య దేశముల నావరించియున్న ఘోర పారిశ్రామికపద్ధతు లాకాలమున గానరావు ఈకాలమున ఇంగ్లండు, జర్మనీ, ఇటలీ ఫ్రాన్సు మున్నగు దేశములలోని యంత్రశాలలో దినబత్తెములకు పనిజేయు కూలివాండ్రు యుద్ధమునకు బోవుటయనిన ఆనందసాగరమున నోలలాడెదరట. రణరంగమునకు బోవునప్పుడు సంతోషాతిరేకమున నృత్యములు సల్పుదురు సంగీతముల బాడెదరు ఇది రణక్రీడయందలి ప్రీతిచేగాదు. యుద్ధరంగమున మరణము సంప్రాప్తించిన యెడల యంత్రశాలలందు తాము పడుబాధలనుండి, దుర్భరదాస్యమునుండి త్వరితముగ విముక్తి చేకూరు నను నాశచే. ఇట్టి సంతోషారావములు, భయంకరానందనిస్వనములు పాశ్చాత్యలోకమున శాంతిసమయమున వినబడవు. అప్పుడు వినబడునవి హృదయవిదారణములగు కష్టజీవుల రోదనములు, మూల్గులు పాశ్చాత్యదేశములం దీసమయమున నెచ్చటజూచినను కాంతివిహీనములై, విషాదరేఖలచే నావరింపబడి భీతిగొల్పు స్త్రీపురుషుల వదనసందోహమ్మే గానవచ్చును. చిక్కి శల్యములై, వివర్ణములై, మలినభూయిష్టములై

హృదయము స్రవింపజేయు తనుఁతతే కాన్పించును శ్రమజీవులకును, ధనాఢ్యులకును పరస్పర వైషమ్యము నిరంతర సమరము ఒకరిపొడ యొకరికిగిట్టదు. యంత్రశాలాధికారి కంటఁబడిన శ్రమజీవులు మార్జాలమును జూచిన మూషికము వలె నిర్జీవులై పోయెదరు. కోపానలముచే మండిపోవుదురు. ధనాఢ్యులు కూలివాండ్రు తారసిల్లిన గ్రుడ్లెఱ్ఱజేసి పండ్లు పట పట గీటెదరు. ఇట్టి ఘోరదృశ్యములు ప్రాచీన భారతవర్షమున నెప్పుడును కని విని యెఱుంగము. గ్రుక్కాడు వంచిగా లేకైన గరవై, యనేక నిరపరాధుల జీవముల ఒలిగొనుచు భూతలనరకము లనదగుయంత్రశాల లాకాలమున నవతరింపలేదు.

ఆకాలమున నొక్కొకపరిశ్రమ కొక్కొకకులమేర్పడిన దని నుడివితిమి. ఇట్లీకాలమున నేర్పడిన కులము లనేకములు గలవు. వీనిలో ముఖ్యముగ బేర్కొనదగినవి పదునెనిమిది గలవు. వీని గూర్చి యిట కొంచెము ప్రస్తావించెదము.

వడ్రంగులు:— వీరు గృహములు, ఓడలు, రథములు, బండ్లు వివిధములగు గృహోపకరణములు జేయువారు.

లోహకారకులు:— వీరు ఈటెలు, బల్లెములు, కత్తారులు, కృపాణములు, కవచములుమున్నగు రణోపకరణములను గొడ్డళ్లు, పారలు, నాగలి కర్రులు, ఛురికములు లోనగు వ్యవసాయపు పనిముట్లను, మిగుల హస్తకౌశలమునుగోరు స్వర్ణ, రజిత పాత్రములను చేయువారు.

శిల్పకారులు:—వీరు గృహములు, దేవాలయములు, స్తూపములు, సౌధములు, కుడ్యములు, సోపానములుమున్నగు

వాని నిర్మించువారు. ఇవిగాక దేవాలయ కుడ్యములపై స్తంభములపై, జిలుగు పనుల జెక్కుటలో జీవకళ లుట్టిపడునట్లు శిలావిగ్రహముల జిత్రించుటలో కఠినపాషాణమును అద్దమును మరపించునట్లు మెరుగుపెట్టుటలో, ముద్దులమూటగట్టు శిలామయపాత్రల జేయుటలో నారితేరిరి. వీరిపనితనము, అద్భుత నిర్మాణకౌశలము, శిల్పరచనాప్రావీణ్యము ఎల్లోరా, కార్లి, గుహాలయములందును సాంచి, అమరావతి, బార్హూతు, స్తూపములందును, నిగ్లివియా, రుమ్మెంద మున్నగు శిలాస్తంభములందును, బరాబరు కొండలందలి అజీవక గుహాలందును ప్రదర్శింపబడినవి.

వస్త్రనిర్మాతలు లేక సాలెలు:— వీరు ప్రజలనుదినమును ధరించు వస్త్రములనేగాక పరదేశముల కంపుటకై సన్ననై అత్యంత మృదులములగు వలిపెములను పట్టు వలువలను రమణీయములగు రత్నకంబళములనుగూడ నేయువారు.

చర్మకారులు:— పలువిధములగు పాదరక్షలు, శస్త్రజీవులు ధరించు తనుత్రాణము, డాలు మున్నగువానిని జేయువారు వీరు చర్మములపై జిలుగుపనులఁగూడ జేయువారు.

కుంభకారులు:— భోజనాదికముల కుపకరించు అందమగు పాత్రలు, పళ్ళెరములు చేయువారు. వానిపై చిత్రవర్ణములతో లతలు, పుష్పములు, మనుష్యవిగ్రహములు జిత్రించువారు. ఆకాలమునాటి బ్రహ్మాండములగు భాండములు, కాగులు, సార్నాధుకడ శిథిలములను ద్రవ్వుచుండగ గాన్పించినవి. అవి అంతకాలమునుండి భూమిలో గప్పబడియుం

డినను జీర్ణమై మంటిలో గలిసిపోక, నేటికిని నిలిచియున్నవి. ఆకుండపెంకులనుపట్టిజూచిన లోహముతో చేయబడిన వాని వలె, ఖంగుఖంగున మోగినవి. ఆబంకమట్టి యెట్టిదో, అందే యేపాళ్లు గలిపెడివారో తెలియరాదు.

దంతపు పనివాండ్రు:—ఎముకలతో, దంతములతో దువ్వెనలు, వీవనలు, చిత్రవిచిత్రములగు నగిషీలతో గూడిన పాత్రలు, ఖడ్గహస్తములు జేయువారు భారతవర్షమునం దీ పరిశ్రమ, మైసూరుప్రాంతములందు, రాజపుత్రస్థానమున, ఆంధ్రదేశములోని విశాఖపట్టణ మండలమున నేటికిని వర్ధిలుచున్నది

రంగుల వేయువారు:—వీరు సాలెలునేయు వస్త్రము లకు రంగులవేయుదురు. కనులకింపగు రంగులవేయుటలో చిత్రవిచిత్రములగు లతలు, పక్షిరములు, పుష్పములు ముద్రించుటలో భూమండలమున నెవ్వరును వీరికి సరిరారు వారణాసి, సూరతు, మచిలీపట్టణము, మోటుపల్లి మున్నగుప్రాంత ము లీ పరిశ్రమకు ప్రఖ్యాతివడసినవి.

స్వర్ణకారులు:—వెండిబంగారు భూషణముల జేయువారు. వీరు బంగారుపై, అత్యంతరమణీయములగు నగిషీ చెక్కుటలో ప్రసిద్ధిగాంచిరి.

చిత్రకారులు:—ఆకాలమున గృహకుడ్యములపై ఎల్లవారును శోభాయమానముగ చిత్తరువుల చిత్రించుకొనువారు. ఇప్పటివలె దిసమొలరీతి, శూన్యాలలాటమువలె గృహకుడ్య

ములు కళావిహీనమ్ములైయుండక చిత్రములతో నలంకరింపబడు చుండెడివి.

ఈకాలమునాటి చిత్రకారుల నిరుపమాన చిత్రకళా కౌశలము పెక్కుసారులు వర్ణించితిమి

నావికులు:—వీరు నౌకాయాత్రలం దారితేరినవారు. ఓడలనెక్కి వీరెట్టి అపారపారావారముల నైన తరించి దూరదేశములకు పోవువారు.

వీరుగాక పుష్పమాలికల గట్టువారు, బుట్టలల్లువారు, బోయలు, జాలరులు మున్నగువారింక నెందరెందరో పారిశ్రామికు లుండువారు.

వారిలో నుదయించు కలతలదీర్చుటకు, పారిశ్రామిక జీవనమందలి కంటకముల తొలగించి యభివృద్ధి మార్గముల నరయుటకు, ప్రతితరగతి పారిశ్రామికులకును ఒక్కొక్క సంఘముండెడిది. వీనికే పూగలనియు, శ్రేణులనియు పేరు. ఇవి పాశ్చాత్య దేశములలోని "గిల్డు" లను బోలియున్నవి. ఈశ్రేణులగూర్చిన వర్ణనలు జాతకకథలలో పెక్కుచోట్లగలవు. ప్రతి శ్రేణికిని యొక్కొక్కనాయకు డుండువాడు ఈతనికి ప్రముఖుడని పేరు. ఈతడే తనశ్రేణిలోని మంచిచెడ్డల విచారించుచుండును, తగవులదీర్చును తనసంఘమున కేదేనికష్టము గల్గినప్పుడు ఱేనియొద్దకుబోయి నివేదించును ఒకశ్రేణికిని మరియొకశ్రేణికిని సంభవించు కలహములను భాండార రక్షకుడగు 'మహాశ్రేష్ఠి' పరిష్కరించువాడు దీనిబట్టి ఆకాలమున పారిశ్రామిక జీవనమెంతయభివృద్ధి గాంచినదో తెలియుచున్నది. ఆకాలమున పారిశ్రామికులు మిగుల గౌరవింపబడు

వారు. చంద్రగుప్తుని రాజధానియగు పాటలీపుత్రమున బ్రాహ్మ క్షత్రియులు నివసించుచోటనె శిల్పులు, చిత్రకారులు మున్నగు పారిశ్రామికులనివాసము లేర్పరుపబడినవి.

## వాణిజ్య వైభవము.

ఈకాలమునాటి వాణిజ్యవైభవమును పలుమారులు వర్ణించితిమి. బౌద్ధయుగమున ఆర్యావర్తము నం దెల్లప్రాంతము లందును వాణిజ్య మభివృద్ధినొందినది. వాణిజ్యాభివృద్ధికి వలయుసాధనము లన్నియు నాకాలమున భారతవర్షము నేలిన నృపాలురు కల్పించిరి. ఆకాలమున మార్గ సౌకర్యములకు కొదువలేదు. ఉత్తరప్రాంతమునుండి దక్షిణమునకును పశ్చిమమునుండి తూర్పునకును విశాలమగు రస్తాలుగలవు. ఇట్టి మార్గములు జాతక కథలలో పలుచోట్ల వివరింపబడినవి. ఆకాలపు రాజులచే నాణెములుగూడ పుష్కలముగ ముద్రింపబడినవి. ఈకాలమున బంగరు, రాగి, సీసపునాణెములుండెడివి. అప్పటి రాగినాణెములకు కర్షపణములనిపేరు. ఆంధ్ర సార్వభౌములగు శాతవాహనులు తమ నాణెములను బంగరుతోను సీసముతోను పోయించెడివారు. వీరినాణెములు అమరావతి ప్రాంతమున వెదకిన వేనవేలు నేటికిని దొరకును

వర్తకు లీకాలమున సరకులగొనిపోవుటకై ఒంటెలను వృషభములను, అశ్వములను, బండ్లను, నావలను, ఓడలును నుపయోగించువారు.

ఈకాలమున భారతవర్షము తన అపూర్వవస్తుసామగ్రిని అన్యదేశములకుగూడ విరివిగ బంపినది. ఇంతయేల! యవన,

రోమక, ఐగుప్తు, బవేరు, చీనామున్నగు రాజ్యములను తన సరకులతో గప్పివైచినది. ఈకాలమున ఆర్యావర్తము విదేశములతో అపారమగు వాణిజ్యము నెరపినది ఆకాలమున హైందవవణిజులు తిరుగని దేశము లేదు తరించని సముద్రము లేదు

బౌద్ధయుగమున భారతవర్షమునకును చీనా, త్రివిష్టప, మధ్యఆసియా, బర్మా, కామరూప, యవన, రోమక అస్సీరియా, ఈజిప్టు దేశములకును రాకపోకలుండినటు పెక్కు నిదర్శనములు గన్పించుచున్నవి క్రీ పూ 860 సంవత్సర ప్రాంతమున అస్సీరియా రాజ్యమును పాలించిన తృతీయ షాల్మనెస్సరుచే నెత్తింపబడిన విజయస్తంభమొకటి యిటీవల గాన్పించినది. దీనిపై హైందవవానరములు, గజములు చిత్రింపబడినవి దీనినిబట్టి యింత ప్రాచీనకాలమునకూడ అస్సీరియా, హైందవదేశములకు రాకపోకలున్నవని తెలియుచున్నది క్రీ పూ 516 ప్రాంతమున పారసికసార్వభౌముని సేనానియగు స్కైలాక్సు ఆర్యావర్తముపై దాడిసల్పి సింధునదీప్రాంత భూములన్నియు జయించెను. ఆప్రాంతమును కొంతకాలము పారశీకులు పరిపాలించిరి ఈజిప్టుదేశమందలి మమ్మీలు గొన్ని హిందూదేశమున నేయబడిన నీలివర్ణపు సన్నవలిపెములలో జుట్టబడి యున్నవి. హైందవ, ఈజిప్టు రాజ్యములకు వర్తక వ్యాపారములున్నట్లు చెప్పుటకిది యొక నిదర్శనము క్రీ. పూ. 3000 ప్రాంతమున బవేరు (బాబిలను) రాజ్యమును పాలించిన ఉరుబగస్ నృపాలునిచే గట్టబడిన 'ఉర్' పట్టణ శిథిలములు వెదకుచుండగ ఒకపెకు

మూలము గన్పించినది. ఆసమీపమున ద్రవ్వుచుండగనే మరి యొక టేకు స్తంభము కూడ గనుపించినది. ఇది యొకచంద్రుని దేవాలయమున కెత్తబడిన స్తంభము. ఈ దేవాలయము క్రీ. పూ. ఆరవశతాబ్దమున బాబిలోనియా నేలిన 'నేబోనిడస్సు' చే నిర్మింపబడినట్లు పరిశోధకులు నిర్ణయించియున్నారు. ఈ దేవాలయ నిర్మాణమున నుపయోగింపబడిన టేకుకలప హిందూ దేశము నుండియే గొనిపోబడినది క్రీ. పూ. భారత, పశ్చిమ దేశములకు వాణిజ్యము నడచినదని జెప్పుట కింతకంటె ప్రమాణము లేమికావలయును? బవేరు, సుప్పరాక, మహాజనక జాతకములలో, బవేరియా, ఆర్యావర్తములకు రాకపోకలుండినట్లు వర్ణనలు గలవు ఆకాలమున హైందవనావికు లుపయోగించిన సముద్రమార్గములుకూడ పలుచోట్ల వర్ణింపబడినవి. ఋగ్వేదమున నూరుతెడ్లు గల్గిన నౌకలు వర్ణింపబడినవి. దీని వలన అంత ప్రాచీనకాలమున గూడ హైందవులు నౌకాయానము నెరిగినవారని విస్పష్టమగుచున్నది.

నైలునదీతీరమున నొక ఆలయశిథిలములలో గన్పించిన శిలాశాసనమున 'సుభాను' డను హైందవ నావికుడు గావించిన పశ్చిమదేశయాత్ర వర్ణింపబడినది. ఐగుప్తరాజగు 'టోలమీసోటరు' వెండినాణె మొకటి బెంగుళూరు బజారులో దొరకినది.

పాండ్య, మౌర్య రాజులు యవనస్త్రీల నంగరక్షకులుగనుంచుకొనువారు. అందువలన హైందవ యవన రాజ్యములకు విరివిగ రాకపోకలుండి యుండవలెనుగదా.

క్రీ. శ. 80 సంవత్సరమున పెరిప్లసు చరిత్రకారుడును, 150 సంవత్సరప్రాంతమున టాలమీయును హిందూదేశమును వర్ణించినారు. పెరిప్లసు చరిత్రకారుడు (ఈతనెవ్వరో తెలియదు) ఆకాలమునాటి భారతవర్షము నైసర్గిక స్వరూపములను పాడిపంటలను మనోహరముగ వర్ణించినాడు. సింధునది సముద్రమున సంగమించినచోట ఏడుపాయలుగ చీలియున్నదనియు, మెరకగాను, బురదగానుండి నౌకాగమనమున కంత యనువుగ లేదనియు, ఈతడు వ్రాసినాడు ఈతడు సింధునదీ ముఖద్వారమునుండి సౌరాష్ట్రతీరమును జుట్టి, బరిగాజా (భరుకచ్ఛము) ను జేరెను. సౌరాష్ట్రప్రాంతమున నీతడు జూచిన విశేషముల నీరీతినివర్ణించినాడు ఈతీరమంతయు వర్తక వ్యాపారమునకు ప్రసిద్ధిజెందినది. సౌరాష్ట్రమును, ఆ పరిసర రాజ్యములును, మిగుల ఫలవంతములగు ప్రదేశములు. ఇచ్చట వడ్లు, గోధుమలు, మంచినూనె, నెయ్యి విరివిగ లభించును. ఇచ్చటిజనులు మంచి పొడగరులు. కృషివాణిజ్యములవలన జీవింతురు. ఈ సౌరాష్ట్రతీరమున కావల 'నంబానసు'నిచే పరిపాలింపబడు హైందవరాజ్యము విస్తరిల్లుచున్నది. ఈనావికుడు దర్శించినకాలమున నీ ప్రాంతమంతయు ఆంధ్రచక్రవర్తుల యేలుబడిలో నుండెను వీరు ఆంధ్రరాజ్యమునెగాక యావద్భారతదేశమునుకూడ పాలించుచుండిరనుట కిది యొక ప్రమాణము కాని ఈ నంబనాసు డెవ్వరో తెలియకున్నది. నహపానుడై యుండునని కొందరు చరిత్రకారు లూహించుచున్నారు కాని అట్లు తోచుటలేదు నహపానుడు క్రీ. శ. 124 సంవత్సరప్రాంతము వాడని అతని జామాతయగు

ఋషభదత్తుని శాసనమువలన దెలుచున్నది. పెరిప్లసుగ్రంథ *
కారుడు క్రీ. శ. 80 సంవత్సరప్రాంతమున నీ సముద్రయాన
ము గావించినాడు. ఓడ పగిలిపోవ నడిసముద్రమునబడి
కొట్టుకొనిపోయి, ఎట్లో ప్రాణముల సంరక్షించుకొని
ఉత్తరసముద్రతీరమును జేరుకొనిన ఒకానొక హైందవనావి
కుని విషాదకథనమును 'టాసిటసు' తనచరిత్రగ్రంథమున
వర్ణించినాడు.

పూర్వమెప్పుడును హైందవులు నౌకాయానమే యెరు
గరను వాదము నిరాధారమని, అసూయాగ్రస్తులగు పాశ్చా
త్యచరిత్రకారులు కల్పించిన యపవాదమని జెప్పుట కింకను
సందియము గలదా?

పట్టణములు.

ఈకాలమున రమణీయమై, అత్యంతవైభవోపేతమై,
జనసంకీర్ణమై కలకలలాడు పట్టణము లెన్నియేని భారతవర్ష
మున వెలసినవి. ఆకాలమునాటి పట్టణవర్ణనలు బౌద్ధవాఙ్మ
యమున పెక్కుచోట్ల గలవు. మెగస్తనీసు పాటలీపుత్రవైభ
వమును మనోహరముగ వర్ణించినాడు. అప్పటి పట్టణముల
వీక్షించి ఫాహియాను, హుయ్యానిత్సాంగులు ఆనందవీచికల
దేలియాడినారు. పాటలీపుత్రము, అయోధ్య, రాజగృహము,
శ్రావస్తి, వైశాలి, చంపానగరము, వారణాసి, కౌశాంబి,
మధురానగరి, తక్షశిల, నలందా, ఉజ్జయిని, కన్యాకుబ్జము,

* ఈగ్రంథముయొక్క సంపూర్ణనామము, పెంప్లసు ఆఫ్ ది ఇరిత్రియన్
సీ. అనగా తూర్పుసముద్రముల సంచారము జేసిన నావికుడని యర్థము

కోరుకొ, ధరణికోట, కంకికళాలు, విజయవాడ, ప్రతిష్ఠానము (పైఠాణి) మోటుపల్లి ఆకాలమున ప్రసిద్ధి జెందినపట్టణరాజములు. వీనిలో పాటలీపుత్రము మగధసామ్రాజ్యరాజధాని. అజాతశత్రునిచే నిర్మింపబడినది. మౌర్యచక్రవర్తులకాలమున దీని ప్రభ వెలిగినది అయోధ్య యితిహాసప్రసిద్ధమగు పట్టణము. దశరథ శ్రీరామచంద్రులు రాజ్యమేలిన పుణ్యవాటిక. దీనికే సాకేతనగరమనికూడ పేరు దీనికి దాపుననుండు అంజనవనముననె బుద్ధభగవానుడు జనసంతతులకు పెక్కుబౌద్ధసూత్రముల నుపదేశించెనని ప్రతీతి రాజగృహము పెక్కుశతాబ్దములు మగధరాజ్యమునకు రాజధాని ప్రాచీనయితిహాసక్షేత్రమున మిగులప్రఖ్యాతివహించిన పట్టణము. ప్రకృతము రాజఘర్ అనునామమున పరగుచున్నది ప్రాచీనరాజగృహమనియు నవీనరాజగృహమనియు రాజగృహపట్టణములు రెండుగలవు ప్రాచీనరాజగృహమొక పర్వతదుర్గము దీనికే గిరివ్రజమనికూడ పేరు. ఇది బహుపురాతనపట్టణము. ఇది మహాగోవిందుడను శిల్పకారునిచే గట్టబడినదని జెప్పెదరు. నవీనరాజగృహము బుద్ధుని కాలమున మగధరాజ్యమును బాలించిన బింబిసారుడు గట్టించెను ఈపట్టణములు ఫాహియాను వర్ణించినకాలమునాటికే శిలమైపోయినవి వీనిప్రాకారములుమాత్రము నేడుకాన్పించును వీనిపైచూపట్టు శిల్పమత్యంతప్రాచీనమైనది. శ్రావస్తి కోసలదేశరాజధాని. బుద్ధునికాలమున ఆర్యావర్తమున అష్టమహానగరములని ప్రసిద్ధిగాంచిన నగరరాజములలో నిదియొకటి చరిత్రపరిశోధకులీయ్యది సరిగ నెచ్చటవిలసిల్లినదో నిర్ణయింపజాలకున్నారు వైశాలి లిచ్ఛవీవంశరాజుల రాజధానియై

నెగడినపట్టణము బుద్ధునికాలమున మహావైభవ మనుభవించి నది. చంపానగరము అంగరాజ్యమునకు రాజధాని. ప్రస్తుత భగలూప్వరుసమీపమున విలసిల్లినది ఇందొక రమణీయమగు సరోవరమును యీసరోవరతీరమున నొక చంపకవనమును ఉండెడివి బుద్ధునికాలమున దేశాటన మొనర్చివచ్చిన బౌద్ధభిక్షువులిందు విడిదిసేయువారు. ఇది యాకాలమున బ్రహ్మ, శ్యామ (సయాము) దేశములతోడను సువర్ణ, యవ, సింహళద్వీపములతోడను అపారమగు వాణిజ్యము నెరపినది. వారణాశి మహాపుణ్యక్షేత్రము కౌశాంబి వత్సరాష్ట్రరాజధాని. పూర్వమిదియొక గొప్పవర్తకస్థానము. మగధ కోసలరాజ్యములనుండి అసంఖ్యాకులగు బాటసారులిచ్చటికి వచ్చుచు బోవుచుండువారు ఈపట్టణ పరిసరములందు బదరిక, కుక్కుట, పోషిత, ఆమ్రవనములను నాల్గుప్రసిద్ధ సంఘారామము లుండెడివి మధురానగరి శ్రీకృష్ణభగవానుని రాజధాని తరువాత శూరసేన వంశజులకు రాజధానియైనది. గౌతముని శిష్యవర్గములోనివాడును, తొలుత పాళీభాషకు వ్యాకరణమును వ్రాసిన ప్రఖ్యాత వైయ్యాకరణియునగు మహాకచ్చాణుని నివాసస్థాన మిదియె తక్షశిల, నలందా, ఉజ్జయినీ పట్టణములు ప్రఖ్యాత విద్యాపీఠములు రోరుకము సౌవీర రాష్ట్రమునకు రాజధాని. బౌద్ధయుగమున ప్రసిద్ధివహించిన వర్తకక్షేత్రములలో నొక్కటి. భారతవర్షమందలి తక్కటి రేవుపట్టణములతోడనే గాక నిది సింహళ, యవద్వీపముల తోడను యవన, రోమక, పులస్తనీ (పాలస్తైను) మున్నగు విదే

శములతోడను వర్తకవ్యాపారములు చేయుచుండెడివి. ప్రస్తుత సూరతుపట్టణ సమీపమున నుండెడిది. మోటుపల్లి మరి యొక ప్రసిద్ధరేవుపట్టణము. అమరావతి ఆంధ్రసామ్రాజ్య రాజధాని. కృష్ణాతరంగిణీకూలమున విలసిల్లినది

ఈపట్టణములు నేడు చాలవరకు విస్మృతములైపోయి నవి. రాజగృహ, పాటలీపుత్ర, అయోధ్య, అమరావతి, గయా, తక్షశిలా, నలందా, రోరుక, చంపానగరములు నేడు గానరావు. రూపుమాసిపోయినవి. శిధిలముల ప్రోవులుమాత్రము గాన్పిం చును.

పూర్వకాలమున పట్టణములు విశాలములగు ద్వార ములతో, బురుజులతో, ఉన్నతములగు ప్రాకారములతో అగాధమగు పరిఖలతో నలరారుచుండెడివి.

ఈకాలమునాటి పట్టణములందలి గృహములు విశాల ములగు ప్రాంగణములతో అత్యంతరమణీయముగ నుండె డివి అప్పటి గృహవర్ణనలు వినయపిటకలో పెక్కుచోట్ల గన్పించును. ఆకాలమున పాతాళగృహము లుండెడివి ఇట్టి దొకటి హంపి శిధిలములలో నేటికిని గలదు. ఈకాలము నాటి పెద్దపెద్ద భవనములన్నియు దాలితో నిర్మింపబడినవి. క్రీ పూ. ఆరవ శతాబ్దముననే గృహనిర్మాణమున రాల నుప యోగించెడివారు. అంతకుపూర్వము నిర్మింపబడిన గిరివ్రజ పురప్రాకారము శిలానిర్మిత మైనది దీని శిధిలములు నేటికిని గానవగును దాలతోడనె గాక నాకాలమున ఇటుకలతో గూడ గృహముల గట్టువారు కుడ్యములపై రంగులతో

చిత్రవిచిత్రములగు లతలు, మృగములు, పక్షులు, మనుష్య విగ్రహములు అత్యంత మనోహరముగ చిత్రించుకొనువారు. ప్రతిగృహము సు ఒక చిత్రశాలవలె నేత్రపర్వ మొనర్చెడిది.

పూర్వకాలమున ఏడంతస్తుల హార్మ్యములుగూడ నిర్మింపబడినట్లు నిదర్శనములు గన్పించుచున్నవి. ఇవి సప్తభూమికాప్రాసాదములని జాతకకథలలో పేర్కొనబడినవి ఇప్పుడే కట్టడములన్నియు క్షీణమైపోయినవి ఒక్కటియు గన్పింపదు. సింహళద్వీపమున పులస్తినగరమునమాత్రి మెట్లో యొక్క భవనము నిల్చినది ఈద్వీపముననే అనూరాధ పురమున ఇట్టి సప్తభూమిక ప్రాసాదమొకటి సహస్ర స్తంభములపై గట్టబడినది నేడి హార్మ్యమంతయు కాలవాహినిలో గలసిపోయినది స్తంభములుమాత్రము నిలచియున్నవి

ఇవిగాక ఆకాలమున అందమగు స్నానగృహములు నిర్మింపబడినవి. వీనిని గూర్చిన ఉల్లేఖనలు వినయపిటక గ్రంథమున పెక్కుచోట్లగాన్పించును. ఇట్టివి ఎత్తగు ప్రదేశమున గట్టబడి మిగుల రమణీయముగ నుండెడివి. వీని యడుగుభాగము ఇటిఫలకములతో గప్పబడి యుండును. వీనియంతర్భాగమున నొకగదియు, దానికిక్రిందిమావల నొక కమలాకరమునుండును గదికి మధ్యభాగమున నొకయగ్ని కుండ ముండును. దానిచుట్టును స్నానమాచరించు వార లాసీనులగుటకై వేయబడిన పీఠములుండును చెమట పట్టుటకై తొలుత వారిపై ఉష్ణోదకము కుమ్మరింపబడును పిదప వారలు కమలాకరమును జొచ్చి స్నానమొనర్తురు. వీనికి ఉష్ణసమీర స్నాన

గృహాములని పేరు. ఇట్టి పద్ధతి పాశ్చాత్యఖండమున నేడు పిరివిగ ప్రబలియున్నది. దీనిని పశ్చిమఖండవాసులు 'టర్కిష్ బాత్' అందురు. ఇదితురుష్కుల మూలమున నార్యావర్తము నుండి పశ్చిమదేశములకు బ్రాకియుండవలెను.

మఱియు ప్రతిపట్టణమునను జనులు స్నాన మొనర్చుటకై పెద్దసరోవరములుండెడివి. లోనికి దిగుటకు దానికినాలు వైపులను సోపాన పంక్తులుండెడివి ఆకాలమున నిర్మింపబడి నట్టి మనోహరతటాకములు నేడుచాలవరకు శిథిలమై పోయినవి. అనూరాధపురము మున్నగు క్షేత్రములందు వాని శిథిలములు నేటికిని గాన్పించును.

ఆకాలమున ధనికులకు మనోజ్ఞములగు భవనములుండెడివి. నిరుపేదలు పూరిండ్లలో నివసించువారు.

పూర్వకాలమున పట్టణములు పొడవగు బజారులతో దివ్యభవనములతో సరోవరములతో విస్తృతగు రాజమార్గములతో కనుల పండు వొనర్చుచుండెడివి జనసమ్మర్దమై, ఎప్పుడును మధుచక్రమున మూగు తేనెటీగలరొదనుబోలిన రొదలతో నిండియుండెడివి.

అప్పటి పట్టణములును పల్లెలును మిగుల పరిశుభ్రముగ నుండెడివి. ఆకాలమున శౌచధర్మము లత్యంతజాగరూకతతో నిర్వర్తింప బడెడివి. పట్టణమందలి మురికినీటిని పురబాహ్య ప్రదేశమునకు గొనిపోవుటకై మురికినీటి కాలువలుండెడివి.

## గ్రామములు, గ్రామజీవనము.

బౌద్ధయుగమున పట్టణములకంటె పల్లెలె విశేషముగ నుండెడివి. జనులు విశేషభాగము పల్లెలందే నివసించువారు. ఆకాలమునాటిపల్లెలు సస్యఫలశోభితములై నేత్రపర్వము జేసెడివి. అప్పటిగ్రామజీవనము పరిశుద్ధమై, సౌఖ్యప్రదమై తనరారినది. గ్రామములోని యిండ్లన్నియు, పాశ్చాత్యదేశములలోని గృహావళులవలె ఎవరికివారె యమునాతీరేయనునట్లు అక్కడనొకటియు అక్కడనొకటియు దూరదూరముగ గట్టబడక పరస్పరసహాయమున కనుకూలించునట్లు ఒక్కచోటనే కట్టబడెడివి. ప్రతిగ్రామమునంటియు నొకచిట్టడవియు, దానికావల పచ్చికబీడును, దానినిజేరి గ్రామవాసుల వరిపొలములు నుండెడివి. ఆకాలమున ప్రతిగ్రామమునందును పశువులమేత కుపకరించు పచ్చికబీళ్లును, గృహనిర్మాణాదికృత్యముల కుపకరించు కలపయు, భోజనాదికముల పచనమునకై వలయు కట్టెలునులభించు అడవిప్రదేశములును ఉండెడివి. పచ్చికబయళ్లు గ్రామవాసుల కెవ్వరికిని ప్రత్యేకముగనుండవు. వరికోతలైన తరువాత ఊరిపశువులన్నియు పొలములలో దిరిగి మేయును. తక్కినకాలములందు పశులకాపరులు కదుపులను పచ్చికబీళ్లకు దోలుకొనిపోవుదురు.

పంటకాల్వలను గ్రామవాసులే త్రవ్వించుకొందురు. నీరు అన్ని పొలములకును సమముగ పోవునట్లు నియమములు గలవు నీరు సమముగ బారునదియు లేనిదియు గ్రామాధికారి కనిపెట్టి చూచుచుండును.

ప్రతిగ్రామమునకును ఒక్కొక గ్రామాధికారియుండును. గ్రామ వ్యవహారములన్నియు గ్రామసభతో నాలోచించి ఈతడే నిర్వహించును గ్రామపరిపాలన మంతయు గ్రామస్థులే నిర్వహించుకొనెదరు తేనికిప్రసక్తిలేదు గ్రామమునకు వలయుబాటలు, తటాకములు, ఆరామములు, దేవాలయములు గ్రామములే నిర్మించుకొనును న్యాయవిచారణకు గ్రామపంచాయతులు గలవు. ఇవియే గ్రామమున నుదయించు వివాదముల పరిష్కరించును. గ్రామములలో చౌర్యములు, బందిపోటులు మిక్కిలియరుదుగ జరుగుచుండెను "పల్లెలలో నివసించుజనులు పసిపాపల చేతులలో నాడించుకొనుచు తలుపుల మూసికొనుట యెట్టిదో యెరుంగక సుఖముగజీవించుచుండిరి" అని బుద్ధుని సంభాషణములను గ్రంథమున ఆనాటి గ్రామజీవనము వర్ణింపబడినది.

దీనినిబట్టి పూర్వకాలమున గ్రామములు సంపూర్ణస్వాతంత్ర్యము ననుభవించినట్లు స్పష్టమగుచున్నది ఆకాలమున ప్రతిగ్రామమును ఒక్కొక ప్రజాస్వామిక రాష్ట్రమైయుండెనని వేరొక సందర్భమున నుడివితిమి గ్రామాధికారినైనను రేడు నియమింపడు. ఈపదవి వంశపరంపరానుగతమైనది ఇది సాధారణముగ జ్యేష్ఠపుత్రునియందు సంక్రమించుచుండును. ఆకుటుంబమున గ్రామాధికారిపదవి నలంకరింపగల దక్షులెవ్వరును లేనియెడల గ్రామసభ వేరొకకుటుంబమునుండి తగినవాని గ్రామాధికారిగ నియమించును.

గ్రామములోని ప్రజలు చాలభాగము కృషివలననే జీవించువారు కృషీవలులేగాక కుంభకారులు, స్వర్ణకా

రులు, చర్మకారులు, శిల్పులు, సాలెలు మున్నగువారు కూడ గ్రామమున నుండువారు గ్రామవాసులకువలయు పాత్రలు, వ్యవసాయసాధనములు గ్రామముననే సృష్టియయ్యెడివి.

ఆకాలమున పల్లెలలోని ప్రజలు లేమి యెట్టిదో నెఱుంగరు. దుర్భిక్షమనున దీకాలమున గానబడదని గ్రీకురాయబారి మెగస్తనీసు నుడివియున్నాడు. అనావృష్టి యావహిల్లినను నీటివసతులు సంపూర్ణముగనుండి సేద్యము నిరాఘాటముగ సాగుటవలన, పంటలెప్పుడును ఫలించుచునేయుండినవి. పండినపంటల నేదోవిధముగ తన్నుకొనిపోవు పరపాలనమింకను ఆకాలమునాటి భారతవర్షమునకు దాపురింపలేదు అందుచే అన్నమన్నమని అడలు క్షుద్బాధితుల ఆర్తనాదములాకాలమున వినబడకుండెను. ఎక్కడ చూచినను నవ్వుమోములు, కోమలశరీరములు, సంతోషారావములు, పచ్చనిపైరులు,సుఖజీవనము, కుంభవృష్టిగ క్షీరములనొసగు గోజాలములు అంబాయని గంతులువైచుచు ఏనుగుగున్నలవలె కండపుష్టిగల్గి ఈగవాలిన జారిపోవు లేగదూడలు కంటికి గానవచ్చెడివి. తిండిలేక శుష్కించి ప్రాణావశిష్టములైన తనూలతలు, విషణ్ణవదనములు, ఒక్కకబళము, పట్టెడన్నము అని గోలపెట్టు క్షుద్బాధాపీడితుల యరపులు ఆకాలమున కానగాకుండెను

## మతవ్యవస్థ.

ఈకాలముననే బౌద్ధ, జైన, అద్వైతమతములు భారతవర్షమున నుద్భవిల్లినవి ఇన్నిమతములు పొడసూపినను ఈయుగమున శాంతమే ప్రబలినదిగాని మతకలహములు జనిం

పలేదు. మెగస్తనీసు ఫాహియాను, హ్యూయనిత్సాంగులు మతసంఘర్షణలచే భారతవర్షము కలుషితమైపోయినట్లు వర్ణింపలేదు. ఏకాలమున నెప్పుడును అన్యమత సహనమే భారత వర్షమున ప్రబలినది ఆర్యావర్తము నేలినరాజు లేరును అన్య మతముల నిరసించి యెరుగరు. హైందవులకు పరమత సహిష్ణుత ఉగ్గుపాలతో యలవడినట్లు గాన్పించుచున్నది. ఇంగ్లండు, జర్మనీ, ఫ్రాన్సుమున్నగు పశ్చిమదేశములలో రేగినమత యుద్ధములవలన కలిగిన సంక్షోభమునకు మేరలేదు. రుధిరము కాల్వలు గట్టినది శిరములు వేనవేలు దుల్లినవి దేశములు కసాయికొట్టములైపోయినవి ఫ్రాన్సుదేశమున ఒక్క నాటిరేయి, సూర్యుడు పూర్వాకాశమున పొడసూపకిమున్న పదివేల హ్యూజినోలకుత్తుకలు దరుగబడినవి * స్పెయిను, హాలండుదేశములలో కాతలిక్కు రాజులు ప్రొటెస్టంటుల కాలుసేతులు బంధించి అగ్నిజ్వాలలో త్రోసిరి ఎఱ్ఱగకాలిన ఇనుపపెనములపై వ్రేల్చిరి అనుదినము కొంచెము కొంచెము మాంసమును దరిగి చిత్రవధల గావించిరి చర్మమొలిచి, ఎఱ్ఱగకాగిన వేడిచమురు నాభాగమున జల్లిరి. ఇంగ్లాండుదేశముమాటజెప్ప మరచితిమి. పదునారవ శతాబ్దమున రాజ్యమేలిన మేరీరాణి భగభగ మండు అగ్నిజ్వాలలలో ద్రోయించి, వేనవేలు ప్రొటెస్టాంటు మతస్థులజీవముల దీసినది. అందుచేతనే యీమె యితిహాసమున 'రుధిరప్రియ' యనుబిరుద నామము నార్జించుకొన్నది ఇంగ్లాండుదేశము నేలినరాజు

---

* ఫ్రాన్సుదేశమున 1597 సంవత్సరమున సెంటు బర్తిలోమ్యూ పుణ్య దినమున యీఘోరహత్యలు జరిగినవి.

లలో ఇట్టియుత్తమ పాలకు లింకెందరో గలరు. వారినిగూర్చి ప్రశంసించుట కిట తావు లేదు.

ఇట్టి హత్యాకాండలు మన భారతవర్షమున గానరావు. ఆకాలమున రాజ్యమేలిన చంద్రగుప్త, అశోక, శ్రీముఖ శాతకర్ణి, గౌతమిపుత్ర, పుష్యమిత్ర, కనిష్క, సముద్రగుప్త, విక్రమాదిత్య, హర్షులు పరమతముల హింసించి తమ హస్తముల కళంకితము జేసికొనలేదు. అన్యమతముల నెప్పుడును గౌరవముతోడనే చూచిరి. ఇట్టియద్భుత పరిస్థితులు భారత వర్షమున దక్క ప్రపంచమున మరెచ్చటను గన్పింపవు.

## సాంఘిక వ్యవస్థ.

బౌద్ధయుగమునాటికే బ్రహ్మక్షత్రియ వైశ్య శూద్ర లను చాతుర్వర్ణ్య విభేదము లేర్పడినట్లు గాన్పించుచున్నది ఇవి గాక ఛండాలురను పంచమవర్ణముగూడ ఉద్భవించి నట్లు నిదర్శనములుగలవు. ఫాహియాను, చండాలురు పుర బాహ్యప్రదేశమున నివసించుచుందురనియు, ఆపణవీధుల వెంట బోవునపుడు వీరు ఒకవిధమగు శబ్దము జేయుచు పోవుదురనియు తెల్పియున్నాడు బౌద్ధయుగమున ఆర్యానార్యభేదములంతరించుటచే అనార్యజాతులెన్నియో హిందూ సంఘమున జేరినవి. అందుచేతనే ప్రాచీనకాలమున నేర్పడిన చాతుర్వర్ణ్యములుగాక క్రొత్త వర్ణములు అసంఖ్యాకములుగ పెరిగిపోయినవి.

చాతుర్వర్ణ్యములలో వర్ణాంతరవివాహము లుండినట్లు జాతకకథలలో పెక్కుచోట్ల వివరింపబడినది. భోజనప్రతిభో

జనము లంత పరివిగ నున్నట్లు గన్పింపదు బౌద్ధమతము వర్ణవిభేదములకాఠిన్యత కొంతవఱకు తొలగించినది. ఏకులమున బుట్టినను గుణశీలుడై విద్యాసంపన్నుడగుచో పూజనీయుడను ధర్మమును బౌద్ధమతముద్ఘోషించినది. ఏకులీనుడైనను సన్న్యాసమును స్వీకరింపవచ్చును భిక్షుక సంఘములలో వర్ణవిభేదములు లేవు. హీనకులమునబుట్టిన యుపాలి విరాగియై సర్వజనపూజ్యుడయ్యెనని బౌద్ధగ్రంథములందు జెప్పబడినది. ఇంకను ఇట్టి నిదర్శనము లెన్నియేనిగలవు.

సాంఘికజీవనమున గమనింపవలసిన సదాచార నియమముల శాసించుచు నీకాలమున పెక్కుగ్రంథములు బయలైవెడలినవి. ఇట్టిగ్రంథములకు ధర్మశాస్త్రములనియు స్మృతులనియు పేరు. వీనిలో మనుధర్మశాస్త్ర మత్యంత ప్రాముఖ్యమైనది దీనిగూర్చి ముందు ప్రస్తావింతుము.

## ప్రజల గుణశీలములు

ఆకాలమునాటి ప్రజల గుణశీలము లత్యంతవిమలములైనవని విదేశములనుండి యేతెంచిన బాటసారులు చాలగ గొనియాడినారు. "ఇచ్చటిజను లెప్పుడును సౌఖ్యమున తేలిపోవుచుందురు వారివాంఛ లతిస్వల్పములు. వీరలు భోగలాలసులు గారు నిరాడంబరులు. పొదుపరులు. తగవులాడి వీరు చీటికిని మాటికిని రచ్చకెక్కి న్యాయస్థానముల వెంట దిరుగరు. ధనాపహరణ, వాగ్దానభంగముల గూర్చిన వివాదము లిచ్చట లేవు. ఒకరియొద్ద ధనమును దాచుకొనునప్పుడు వీరు వ్రేలిముద్రల గోరరు. సాక్షుల వెంటగొనిపోరు. ద్రోహచింత

యిచ్చటి జనులలో మందునకైన గన్పింపదు. వీరి ఇండ్లెప్పుడును రక్షణశూన్యములై యుండును. వీరు ఇండ్లకు తాళములు వేసి కొనరు. వీరి వివేకజ్ఞానములు ప్రశంసనీయములు. సత్యసౌశీల్యములకు వీరు కేలు మోడ్తురు" అని మెగస్తనీసు ఆకాలము నాటి హైందవప్రజల సుగుణశీలముల వర్ణించినాడు. ఫాహియాను అప్పటి ప్రజలు సుగుణధనులనియు, అహింసావ్రత దీక్షాపరులనియు సత్య సంధులనియు మోస మెరుగరనియు, మద్యమాంసముల దరికి జేరనీరనియు, చాలదూరము చెప్పినాడు హ్యూయానిత్యాంగు గూడ ఆకాలమునాటి ప్రజల గుణశీలముల వీక్షించి అబ్బురపడినాడు. "ఇచ్చటి ప్రజలు విద్యాభిలాషులు. చాలచదువుకొన్న వారు కపటమెరుగని అమాయకులు సత్యసంధులు. పరదేశవాసుల మిగుల కరుణతో నాదరింతురు. ఇహలోకమందలి మనుజుని సుఖదుఃఖములు పూర్వజన్మ సుకృత దుష్కృతముల ననుసరించి యుండునని నమ్మెదరు. వీరు ఐహిక సౌఖ్యముల నిరసింతురు ఆముష్మిక చింతలందే కాలము గడపెదరు. సన్యాసులనినను, పండితులనినను వీరికమితమగు పూజ్యభావము కేలుమోడ్తురు వారిజీవనము నిష్కళంకమయినది ఆడంబరమనునది వీరికడ గన్పింపదు" అనిహ్యూయానిత్యాంగు మనప్రాచీనుల గుణసంపదల వర్ణించినాడు.

ఆకాలమునాటి ప్రజల యాచారముల గూర్చి కూడ మెగస్తనీసు కొన్నియుల్లేఖనల గావించినాడు. హిందువుల యలంకార ప్రియత్వమును జూచి యీతడు ఆశ్చర్యమందినాడు. స్ట్రాబోయను గ్రీకుచరిత్రకారుడు ఆకాలమునాటి ఉత్సవవైభములదిలకించి విభ్రాంతుడైనాడు. ఈత డాకాలము

నాటి యుత్సవముల నీరీతిని వర్ణించినాడు. "ఉత్సవసమయము లందు సువర్ణ భూషణములతో నత్యంత శోభాయమానముగ నలంకరింపబడిన గజసందోహము ముందు నడుచుచు హయ ములు వృషభములు బూన్చిన శకటములు వీనివెంటనుండును. వానివెనుక పంజరస్థములగు కారుదున్నలు, చిరుతపులులు, సింహములు మున్నగు వన్యమృగములు, చిత్రవర్ణశోభితము లగు పక్షిసంతానములు అధివసించియుండు బండ్లుండును అటు తరువాత సువర్ణాంబరముల దొడిగి మణులపొదిగిన సువర్ణరజిత పాత్రలహస్తములగొని యేగుచుండు సేవకాగణముండును." ఇట్టియుత్సవ మెవ్వనికానందము గల్గింపదు? బౌద్ధమతకాలమున ఇట్టియుత్సవములు భారతవర్షమం దెల్లప్రాంతములందును విరివిగ సలుపబడుచుండునట్లు నిదర్శనములు గన్పించుచున్నవి. ఇట్టియుత్సవములు బౌద్ధమతముతోడనే ప్రారంభమయ్యెనని దోచుచున్నది.

## వాఙ్మయము.

వాఙ్మయమునగూడ బౌద్ధయుగమునకు సాటియగు యుగములేదు ప్రపంచము రసవాహినుల ప్రవహింపజేసిన కాళిదాసు, దండి, భారవి, బాణుడు మున్నగు మహాకవులు నీయుగముననే యుద్భవిల్లిరి. పాణిని, వరాహమిహిరుడు, చరక, శుశ్రుతులుమున్నగు ప్రఖ్యాత జ్యోతిష్కులు, భిష జ్మణులు, వైయ్యాకరణులును ఈయుగముననే యవత రించిరి. వైద్య, జ్యోతిష, గణిత, వ్యాకరణ శాస్త్రములు నీ యుగమున కడలేని యభివృద్ధిగాంచినవి ఆయాశాస్త్రముల

వ్రాయబడిన మహోద్గ్రంథములజూచి ప్రపంచము నేటికిని విస్మయము జెందుచున్నది.

బౌద్ధయుగమున శాంతము ప్రబలినది. రసజ్ఞులగుచక్రవర్తులు రాజ్యమేలిరి అందుచే వాఙ్మయము తరంగితమైనది. కనిష్క, సముద్రగుప్త, విక్రమాదిత్య, హర్షవర్ధన సార్వభౌములు తమయాస్థానముల కవుల, విద్వాంసుల నాదరించి వారిచే రసవత్తరములగు కావ్యముల వ్రాయించిరి. అప్పటి నుండియు భారతవర్షమున రసవాహిను లింకిపోయినవి ఆర్యావర్తము పరాధీనమైనది. కవులనాదరించు విద్యలపోషించు రాజులు లేకపోయిరి. కళాసారస్వతములు మాటుమణగినవి.

బౌద్ధయుగమున సారస్వత వాహిని రెండు ప్రవాహములుగ చీలినది. అందొకటి పాళీసారస్వతము రెండవది సంస్కృత సారస్వతము. అశోకుని మరణానంతరమువరకు పాళీ సారస్వతము వృద్ధినొందినది అటుపిమ్మట అది మాటుమణగినది అంతటనుండి, సంస్కృత సారస్వతము పెంపొందినది. ఈ రెంటినిగూర్చి యిటగొంచెము నుడువవలసి యున్నది.

## పాళీసారస్వతము.

పాళీభాష యాకాలమున జనసామాన్యము మాట్లాడుకొనిన భాష. దీనికే ప్రాకృతమనికూడ పేరు ఇది వ్యావహారిక సంస్కృతము. సంస్కృతము గ్రాంథికభాష. బౌద్ధపురాణగాధలన్నియు ప్రాకృతములోనే వ్రాయబడినవి. పామరులకుగూడ సులభముగ దెలియునట్లు బుద్ధుడు తనధర్మముల నీభాషలోనే బోధించెను. అశోకుడు తనశాసనములగూడ

నీభాషయందే వ్రాయించెను. ఇంతయేల: బౌద్ధసారస్వతమంతయు నీభాషలోనె వెరిగినది.

బౌద్ధ వాఙ్మయమును పిటకములనియు, నికాయములనియు, సుత్తాంతములనియు మూడుతరగతులుగ విభాగింపవచ్చును. పిటకములలో బౌద్ధధర్మములు వివరింపబడినవి. పిటకమన పేటికయని యర్థము. ఇందు వినయ, అసూత్రి, అభిధర్మ పిటకములనబడు త్రిపీఠికలుగలవు వైదికమతమున వేదాంతమెట్లో బౌద్ధమతమున సుత్తాంతములట్లు ఇవి బౌద్ధమత సారమునుదెల్పు సంభాషణలు నికాయములు అయిదుగలవు. వీనికే పంచనికాయములని పేరు.

ఇవిగాక జాతకకథలుగలవు. ఇవి బౌద్ధవాఙ్మయమున నొక ప్రధానాంగము. వీనిగూర్చి ప్రత్యేకముగ నుడువవలసియున్నది

## జాతకకథలు

ఇవి బుద్ధభగవానుని యవతారముల వర్ణించుకథలు పూర్వజన్మములందు బోధిసత్వుడెట్టి మహాత్యాగములొనర్చి బుద్ధుడై పుట్టుట కర్హతనార్జించుకొనెనో యిందువర్ణింపబడినది. ఈకథలొక్కరిచే వ్రాయబడినవిగావు. కాలానుగతిని వెరిగినవి ఈకథలు జాలగలవు. ఇప్పటికి 547 మాత్రము దొరకినవి. తక్కినవి విస్మృతములైపోయినవి సింహళములోని యొక వ్యాఖ్యానకర్త వీనికి ఐదవశతాబ్దప్రాంతమున వ్యాఖ్యలు వ్రాసెను ఈతడెవ్వరో యీతని నామమెయ్యదియో తెలియుటలేదు. ఈకథలు చారిత్రికముగ మిగుల నమూల్యమైనవి.

బుద్ధునికాలమునను ఆతనికి పూర్వమునను ఉత్తరభారతమం దలి ప్రజలశీలవర్తనములగూర్చియు ఆచారనడవడుల గూర్చి యు ఇందు పెక్కుయుల్లేఖనలుగలవు నాటిసాంఘిక జీవనము కూడ అచ్చటచ్చట వర్ణింపబడినది మత రాజకీయ వ్యవస్థలు గూడ స్వల్పముగ చిత్రింపబడినవి ఆకాలమున విస్తరిల్లిన పాంచాల, మద్ర, కోసల, విదేహ, కాశీ, విదర్భరాజ్యముల నామము లిందు పేర్కొనబడినవి

ఈకథ లేకాలమునబుట్టినవో నిర్ణయించుట కలవిగా కున్నది. అందువర్ణింపబడిన రాజకీయ, మతవ్యవస్థలబట్టి, ఇవి క్రీ. పూ. అయిదారు శతాబ్దములనాటివని గోచరించుచు న్నది. ఇవి మధ్యభారతమున రచింపబడినట్లు గాన్పించుచు న్నది. వీనిలో వర్ణింపబడిన నాగరకత యత్యంత పురాతన మైనది.

ఈజాతకకథల రచనాపద్ధతి కడువిచిత్రమైనది. కథయం తయు వచనములో వ్రాయబడి మధ్యమధ్య సంభాషణములు పద్యములలో నుండును అశోకుని కాలమునాటి శిల్పులు ఈజాతకకథలను స్తూపములపై చిత్రించిరి జాతకకథలన్నియు నీతిబోధకములై మిగుల మనోహరముగ నుండును. ఈ కథ లిట్లుండునని చూపుట కిచ్చట నొక్కదాని నుదాహరించెదము.

కినారజాతకకథ

కుమారకాశ్యపులతల్లి దుశ్చరితయని దుర్మార్గు లెవ్వ రో యామెపై అపనిందలమోపిరి ఆర్తపరాయణుడగు బుద్ధ భగవానుడామె పరమసాధ్వి, సుగుణశీలయని లోకమునజాటి

దురంతపరిభవచింతానలమునుండి యామెను రక్షించెను. ఒక నాటిసాయంసమయమున కొందరు భిక్షువు లొక చోట గూర్చుండి యేదియో మాట్లాడుకొనుచుండ బుద్ధుడాదారిని బోవుచు వారినిజూచి "భిక్షువులేదియో దీర్ఘముగ నాలోచించుచున్నట్లు గన్పించుచున్నదే" యనెను అందులకు భిక్షువులు, "ప్రభో, ఆలోచించుటకేమున్నది, సాధ్వీమతల్లియగు కుమారకాశ్యపుని తల్లికి గల్గిన దుస్సహామనస్సంతాపమునకు వగచుచుంటిమి. ఈయపవాదల కాతల్లి యెంత దుఃఖించినదో!

బుద్ధుడు:—శోషణకులు దయార్ద్రహృదయులు కానితథాగతు డామెను ఆపదల నుండి రక్షించుట కిదియే తొలిసారి గాదు, పూర్వజన్మమునగూడ నీమె కొదవిన కష్టముల బాపెను

భిక్షువులు:—ప్రభో! పూర్వజన్మమున నీమె కెట్టి కష్టములు సంభవిల్లినవి? తథాగతుడు వానినెట్లు నివారించెను. ఆకథ మాకించుక వినిపింపుడు విన కుతూహలముగ చున్నది.

అని భిక్షువులు వేడుకొన బుద్ధుడామె పూర్వజన్మ కథ నీక్రింది విధముగ జెప్పదొడగెను:—

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యమును బాలించుచున్న కాలమున బోధిసత్త్వుడు జింకల తేడయి భూమండలమున నవతరించెను ఈనృపాలుని యారామమున రెండులేళ్లగుంపు లుండెను ఒక్కొకమంద కొక్కొకరాజుండెను మాంసమునకై రా జనుదినమును ఈలేళ్ళ వేటాడి చంపుచుండెను. ఈవేట

వలన హరిణములు సంక్షోభిల్లి పోవుచుండెను చిరుతకుక్కల యరపులు, వేటకాండ్ర బాణవృష్టి లేళ్లగుండె లదరఁజేయు చుండెను. ఆరామమున శాంతము లేకుండెను. అంతట నావనమున నివసించు యొక లేడిగుంపునకు రాజగు బంగరువన్నె జింక కిన్నారుడు రెండవమందకు ఱేడగు పంచకొమ్ముల లేడి యొద్దకు బోయి, "మనగుంపులలో ఒక్కొకమృగము వంతులప్రకారమనుదినమును ఆనరపాలుని వంటశాలకుబోయి వంటలవాని ఖడ్గధారల కెరయయినచో మనకీ వేటయుపద్రవము దప్పును. అట్లు గావించుట క్షేమకరము" అని చెప్పియొప్పించెను. ఇట్లనుదినమును ఒక్కొకలేడి రాజప్రాసాదమునకుబోయి వంటలవాని నిశితఖడ్గమునకు బలియగుచుండెను. దీనివలన తక్కిన లేళ్ళకు క్షేమముగల్గెను.

ఇట్లుండ నొకనాడు రెండవమందలోని యొకచూడి లేడివంతు వచ్చెను ఆనాడు రాజప్రాసాదమున కది పోవలసియుండెను పాప మాలేడి నిండుగర్భవతి ఆనాడు తనకంఠము దెగిన గర్భములోని పసికురంగముగూడ జచ్చును రెండు ప్రాణములు మృత్యువున కశనమైపోవును. అందుచే, తనకు కొంతకాలము గడువొసంగి ఆనాటికి వేరొకలేడిని బంపుమని యాహరిణము తనఱేని నతిదీనముగ వేడికొనెను లేడిరాజు కన్నులెఱ్ఱజేసి "ఏమీ, మఱియొకలేడిని బంపవలయునా? ఎవరినిబొమ్మన్న యిప్పుడెవరు బోయెదరు? అట్లు వలనుపడదు. నీవేపోయి తీరవలయు" నని కఠినముగ శాసించెను పాపమా హరిణ మేమిజేయును? గర్భస్థమైయున్న పసికూనను రక్షించు వెరవుగానక యడలుచు తిన్నగ మొదటిగుంపునకు ఏలికయగు

పసిడిలేడి యొద్దకుబోయి తన దుస్థితినంతయు జెప్పుకొనెను. బంగరులేడికి మిక్కుటమగు జాలిగల్గెను తానే యానాడు రాజుసాన్నిధ్యమునకు బోయి వంటలవాని చురకమున కాహుతియగుటకు నిశ్చయించుకొని విచారింపకుమని యాచూడిలేడి నింటికి బంపివైచి యాజింకలఱేడు తిన్నగ రాజప్రాసాదమునకు పయనమైపోయి అనుదినమును లేళ్ళను ఛేదించు వధ్యశిలపై తనకంఠముంచి వంటలవాని కత్తివ్రేటునకై నిరీక్షించుచుండెను ఇంతలో వంటలవాడు ఖడ్గమును చేతగొని వంటశాల ప్రవేశించి వధ్యశిలపై కంఠమునుసారించి ప్రాణములర్పింప సిద్ధముగనున్న యాస్వర్ణమృగమునుజూచి యాశ్చర్యమగ్నుడై యొక్కపరుగునన్నృపాలునికడకుజని యాయద్భుత సంభవమును తేనికి విన్నవించెను లేళ్ళరాజుల జంపవలదని రాజశాసనము. మున్నొకసారి యాజింకలరేడులకు రాజు అభయమిచ్చి, వానిజంపవలదని వంటలవాని శాసించెను. నాడు పసిడికురంగము వంటశాలకు వచ్చుట ఆతనికి ఆశ్చర్యము గల్గించెను "ఇందేదియో విశేషమున్న"దని యనుకొనుచు అతడు తక్షణమె స్యందనమెక్కి వంటశాలకడకేగిచూచుసరికి వంటలవాడు చెప్పినట్లె, పసిడిలేడి వధ్యశిలపై శిరమునానించి వంటలవాని ఖడ్గప్రహారములకై యెదురుజూచుచుండెను రాజు అబ్బురపాటుతో "జింకలఱేడా! నీవేలవచ్చితివి? నిన్ను జంపవలదని శాసించియుంటిని గాదా!" యనెను "స్వర్ణమృగము తనకథనంతయుజెప్పివైచెను. నరపాలుని హృదయము కరిగెను "లేడిరాజా! లెమ్ము, నీ ప్రాణములను ఆచూలాలిప్రాణములకూడరక్షించితిపొమ్ము" అనెను ఆలేడిరాజు నృపాలునిదిక్కు మొగంబై "భూపాలకా!

మేమిద్దరమును క్షేమముగనుండిన తక్కిన మృగములగతి యేమి?" అని యడిగెను రాజు దయగొని జింకలన్నిటికిని ప్రాణదానమొసగి యాజింకలతేని బంపివైచెను. ఇట్లాపసిడిలేడి సర్వజీవకోటులకును క్షేమముగూర్చెను

తరువాఁ గొంతకాలమునకు చూడిలేడి మిగుల సుంద మగు నొకమృగశాబకమును గనెను. ఒకనాఁ డాలేడిపిల్ల రెండ వమందలోని లేళ్లతో నాడుకొనుటకు బోవుచుండ తల్లి వా రించి "పసిడిలేడి మందతోనే యాడుకొనబొమ్ము, ఆతనికే భృత్యుడవగుము, రెండవమందలోని రాజుతోడి చిరకాల జీవనముకంటె సువర్ణమృగముతోడి మరణము మిగులయశో దాయకము, వాంఛనీయము" అని బోధించెను.

మఱియు నరులు తమపొలముల చుట్టును కంచెలనిర్మిం చుకొనవలయుననియు, కంచెలదాటి తనలేళ్లు పొలములలో నడుగువెట్టపనియు లోవగుషరతులతో నీపసిడిలేడి నరులకును, లేళ్లకును ఒకసంధికూర్చెను అంతటినుండియే పొలముల చుట్టునుకంచెలవేయు నాచారము ప్రపంచమున ప్రబలినది"

అని బుద్ధుడు తనకథ ముగించి రెండవమందలోని జింక లగాఁజే దేవదత్తుడైపుట్టెననియు చూడిలేడి కుమారకాశ్యపుని తల్లియనియు మృగశాబకము కుమారకాశ్యపుడనియు పసిడి లేడి తానేయనియు జెప్పెను.

ఈజాతకకథ భార్హూతుస్తూపముపై చిత్రింపబడియున్నది. ఈశిల్పచిత్రము నేటికిని ఈస్తూప ఉపరిభాగమున గాననగును.

## సంస్కృతసారస్వతము.

మౌర్యరాజులకాలమున సంస్కృతసారస్వతము ఆదరణ లేక కృశించినది. కాని గుప్తసామ్రాజ్యోదయమైనతోడనే సంస్కృత భాషావల్లిక నూతనజొంపములు దొడగి పుష్పింపసాగినది. అంతటినుండియే కాళిదాసులవంటి కవిశ్రేష్ఠులుద్భవింపసాగిరి. అద్వితీయ రచనాకౌశలమును కవితామాధురియు ప్రదర్శించు శాకుంతల, విక్రమోర్వశీయ, మాళవకాగ్నిమిత్ర, రత్నావళి, నాగానంద నాటకములును రఘువంశ, కుమారసంభవ, మేఘసందేశ, కిరాతార్జునీయ మహాకావ్యములును, పంచతంత్ర, దశకుమారచరిత్ర, కాదంబరి మున్నగు వచన ప్రబంధములును భర్తృహరి సుభాషితము మున్నగు ప్రఖ్యాత శతకములును ఈకాలముననే రచియింపబడినవి.

ఇందు కాళిదాసవిరచితములగు శాకుంతల విక్రమోర్వశీయ మాళవికాగ్నిమిత్రనాటకములగూర్చియు రఘువంశ మేఘసందేశ కుమారసంభవ మహాకావ్యములగూర్చియు నిట ప్రస్తావింపబనిలేదు అవి జగద్విఖ్యాతిని బడసిన గ్రంథరాజములు. అందు శాకుంతలమును మించిన నాటకము ప్రపంచమున నింకేసారస్వతమునఁగానరాదని విద్వాంసుల యభిప్రాయము. దీనిని జదివి గేటి (Goethe) ఆనందపారవశ్యమున నాట్యము సల్పెనట.

కిరాతార్జునీయమును రచించినకవి భారవి ఈతనికావ్యము లంతరసవత్తరములుగావు. కాళిదాసుని కావ్యములందు గనుబడు పదసౌష్టవము అర్థగాంభీర్యము, ఇతని కడలేవు.

పంచతంత్రి, కాదంబరి, దశకుమారచరిత్రిలు కల్పనా కథలు. ఇందుప్రిదర్శింపబడిన కల్పనాశక్తి నిరుపమానము. దశకుమారచరిత్రిమును దండి వ్రాసెను కాదంబరి హర్షుని యాస్థానకవియగు బాణునిచే వ్రాయబడినది హర్షచరిత్రి మునుగూడ నీతడే వ్రాసెను ప్రిఖ్యాత కవివరేణ్యులలో బాణుడొకడు. 'బాణోచ్ఛిష్ట మిదంజగత్' అను వాక్యమును వినుచుందుము. ఈతని కాదంబరి సంస్కృత సారస్వతమున మిగుల ప్రిఖ్యాతివడసినది

పంచతంత్రిము నీతిబోధకమైనది దీని మరపించు గ్రంథ మింతవరకును ప్రిపంచమున నేభాషయందును రచియింపబడ లేదు. ఈకథ లారవశతాబ్దమున గ్రింథస్థమైనను క్రీస్తుపుట్టు కకు పూర్వమునుండియు వాడుకలోనున్నట్లు గాన్పించుచు న్నది. ఇది ప్రిపంచమందలి యన్నిభాషలలోనికిని అనువదింప బడినది. ఆరవశతాబ్దమున నీగ్రింథము ఫ్రారశీకములోనికి పరివర్తింపబడినది. పిమ్మట పారశీకమునుండి, అరబ్బీ, గ్రీకు, హీబ్రూభాషలలోని కనువదింపబడినది. పదమూడవ శతాబ్దమున స్పానిషు భాషలోనికిని పదునైదవ శతాబ్దమున జర్మనీభాష లోనికిని భాషాంతరీకరణము గావింపబడినది ఇప్పుడిది ప్రిపం చములోనున్న భాషలన్నిటిలో నున్నది ఇది పిల్పేకల్పనా కథలను నామముతో యూరపుఖండమున సంచరించుచున్నది.

ఇవిగాక యీకాలమున వ్రాయబడిన యుత్కృష్టగ్రింథ ములలో కౌటిల్యుని అర్థశాస్త్రమొకటియు, మనుధర్మశాస్త్ర మొకటియు పేర్కొనదగినవి ఈ రెండును రాజనీతినిబోధించు గ్రింథములు

## అర్థశాస్త్రము.

ఇది చంద్రగుప్తమౌర్యునిమంత్రియగు చాణక్యునిచే వ్రాయబడినది రాజ్యనిర్వహణమున రాజులకును మంత్రులకు నుపకరించుటకై యిట్టి రాజనీతిగ్రంథము లీకాలమున పెక్కులు వ్రాయబడినవి ఇందు రాజధర్మములును, ప్రజాధర్మములును రాజెట్లు పరిపాలన సలుపవలసినదియు, వివరింపబడినవి సంస్కృతసారస్వతమునగల రాజనీతిగ్రంథములలో నిది మిగుల నుత్కృష్టమైనది. చంద్రగుప్తుని పరిపాలనమును గూర్చిన వర్ణనలుగూడ యిందచ్చటచ్చట గాన్పించును

## మనుధర్మ శాస్త్రము.

అర్థశాస్త్రము తరువాత ప్రాచీన రాజ్యతంత్రమును గూర్చి వర్ణింపగల గ్రంథమిదియె. రాజులు తమపరిపాలనాకృత్యముల నెట్లు నిర్వర్తింపవలయునో, నృపుడు ప్రజల నెట్లాదరింపవలయునో, ప్రజలు నృపునకెట్టి విధేయత జూపవలయునో యిందువర్ణింపబడినది పూర్వకాలమున మనుశాస్త్రము సాంఘికజీవనమునే గాక రాజ్యపరిపాలనమును గూడ శాసించి ధర్మపథమున నడిపించినది. రాజ్యప్రభుత్వము తొలుత ఎట్లుత్పన్నమైనదియు మనువు వివరించినాడు అరాజకము ప్రబలి ధర్మగ్లాని సంభవిల్లి, సంక్షోభము వాటిల్లినపుడు ఆర్యధర్మ ప్రతిష్ఠాపనకై రాజ్యప్రభుత్వ మేర్పడినట్లు మనువు వర్ణించినాడు. హాబ్సు, రూసో, లాక్ మున్నగు పాశ్చాత్యచరిత్ర పరిశోధకులుగూడ రాజత్వమిట్లే యుద్భవమైనదని నిర్ణయించిరి.

మనువు న్యాయవిచారణ మెట్లుగావింపవలయునో కూడ వర్ణించినాడు. ఈధర్మములే నేటికిని బ్రిటిషు న్యాయ స్థానముల నాదరింపబడుచున్నవి న్యాయాన్యాయ పరిశీలన యందిది హిందువులకు నేటికిని ప్రమాణగ్రంథమైయున్నది.

మనువు మనుజులకు గలుగువివాదముల పదునెనిమిది తరగతులుగ విభజించినాడు ఋణములు, నిక్షేపము (ఒకరి యొద్ద దాచుకొనినధనమును గూర్చినవి,) అస్వామివిక్రియము (తనదికాని సొత్తును విక్రయించుట), సాముదాయలాభము, (దానమిచ్చినసొత్తు నివ్వకుండుట,) వేతనములు, వాగ్దానభంగములు, క్రయవిక్రయములు, గోపాలనము, సీమవివాదలు (పొలిమేరతగవులు), వాక్పారుష్యము, దండపారుష్యము. చౌర్యము, సాహసము, స్త్రీసంగ్రహణము, స్త్రీపురుషధర్మములు, విభాగములు, ద్యూతము మున్నగువానిగూర్చి తగవులుత్పన్నమగునని మనువు వివరించినాడు

మనుధర్మశాస్త్రము పూర్వపు రాజ్యాంగమునే గాక హిందూసంఘమునుగూడ శాసించినది. వర్ణాశ్రమ ధర్మము లిందు వివరింపబడినవి ఇందుదహరింపబడిన నియమములు అనుల్లంఘనీయములని హిందువులిప్పటికిని భావింతురు.

మనువు తనధర్మశాస్త్రమున వర్ణోత్పత్తిని విపులముగ విమర్శించినాడు ఆదియందు చాతుర్వర్ణ్యములె యున్నవనియు, అవి క్రమముగ ధర్మప్రతిఘటనమువలన, వర్ణసంకరమువలన, అశాస్త్రీయవివాహప్రాబల్యమువలన నూతన వర్ణములుత్పన్నమైనవనియు యాతడు దలంచుచున్నాడు

మనువు మొత్తముమీాద పునర్వివాహముల నిరసించి నను బాలవితంతువులకు మరల పరిణయము గావింపవచ్చునని చెప్పియున్నాడు భర్త దేశాంతరగతుడై యిన్నేండ్ల లోపల దిరిగిరానియెడల భార్య మరల నుద్వాహమాడ వచ్చునని గూడ.మనువు శాసించినాడు ఈతడు అతిబాల్యవివాహముల గూడ నామోదించినాడు కాలపరిస్థితుల బట్టి మనువు ఇట్టి దురాచారమున కనుమతించినట్లు గాన్పించుచున్నది. ఆకాలమున అన్యదేశములనుండి ఘోరముగ దండయాత్రలు ప్రబలి దేశమును సంక్షోభమున ముంచుటచే స్త్రీపాతివ్రత్యమునకు భంగము వాటిల్లుచుండెను. మానసంరక్షణము దుర్ఘటమయ్యెను కన్యాపహరణము మిక్కుటమయ్యెను. అందువలననే యీ యతిబాల్యవివాహవిషవృక్ష మంకురించినది కాలవైపరీత్యమువలన ఈనాడేర్పడిన ఈదురాచారము విషకంటకమువలె నేటికిని మనల విడువక బాధించుచున్నది. పతిమృతదేహముతో పత్నియు చితిపై బడి దగ్ధమై పోవు ఘోర సహగమన దురాచారము మనువుకాలమున లేదు తరువాత నెప్పుడో సంఘమున బ్రవేశించినది.

## శాస్త్రములు.

బౌద్ధయుగమున జ్యోతిష గణితవైద్య శాస్త్రములు మిగుల అభివృద్ధిగాంచినవి. అందు జ్యోతిషవైద్య శాస్త్రములు పరిపూర్ణత నొందినవి.

## జ్యోతిషశాస్త్రము

అనాదినుండియు భారతభూమి జ్యోతిషశాస్త్రమునకు

ప్రసిద్ధినొందినది. బౌద్ధయుగముననే ఈశాస్త్రము కడలేనియభి వృద్ధి గాంచినది. అందు సిద్ధాంతభాగము బ్రహ్మాండ మందలి అనంతగోళముల యొక్కయు సౌరజగత్తునందలి గ్రహగోళ ముల యొక్కయు, సంచారమును గూర్చి వివరించు భాగము నెక్కు డభివృద్ధిగాంచినట్లు దోచుచున్నది జ్యోతిషశాస్త్రము నకు మూలపురుషులగు గర్గపరాశరాది మహాసిద్ధాంతు లీకాల మునవే క్రీ. పూ. 320, క్రీ శ. 400 మధ్యకాలమున వదలిరి.

పరాశరుడు పరాశర తంత్రమను జ్యోతిషశాస్త్రమును రచించెను. ఇది పద్య గద్యాత్మకమగుగ్రంథము. ఇందుపశ్చిమ ప్రాంతము నాక్రమించి రాజ్యమేలిన యవనులగూర్చిన వర్ణ నలుగలవు. అందువలన నిది క్రీ. పూ రెండవశతాబ్దమున రచియింపబడి యుండవలెనని తోచుచున్నది

గర్గుడు పృధుచక్రవర్తియాస్థానమున జ్యోతిష్కుడై యుండినట్లు మహాభారతమున జెప్పబడియున్నది ఇతడు 'గర్గ సంహిత' యనుగ్రంథమును వ్రాసెను జ్యోతిష సిద్ధాంతు లలో యవనుల దండయాత్రలగూర్చి విపులముగ వర్ణించిన దీత డొక్కడే. యవనదండయాత్రల వర్ణించుటయేగాక, అన్యదేశీ యులైనను, యవన సిద్ధాంతులయెడ నీతడు గౌరవమును గన బరచినాడు. "యవనులలో జ్యోతిషము పెంపొందినది అందు చేతనే ఋషులవలె వీరునుగౌరవమును బడయుచున్నారు" అని తనగ్రంథమున నీతడు యవనజ్యోతిష్కుల, జ్యోతిషశాస్త్ర ప్రావీణ్యము నుగ్గడించి యున్నాడు. ఈతడు తనగ్రంథములోని ఇతిహాస భాగమున శిశునాగ, మౌర్యవంశముల జేర్కొని నాడు. ఈసందర్భముననే 'శాలిసుకుని' (అశోకుని తరువాత

రాజ్యమేలిన మౌర్యరాజులలో నాల్గవవాడు) కూర్చి వ్రాయుచు "దుష్టులగు యవనులు సాకేత, పాంచాల మధుర రాజ్యములు జయించిరి కుసుమధ్వజము పై (పాటలీపుత్రము) దాడివెడల నున్నారు. పురుషపురము వారిపాలబడెనేని యిక నాశలేదు ఆర్యావర్తము వారిహస్తగతమగును. అరాజకము ప్రబలును. శాంతియంతరించును" అని వాపోయినాడు. ఈసందర్భముల నన్నిటిని బట్టిచూడ నీతనిగ్రంథము క్రీ. పూ. శతాబ్దమున రచియింపబడినట్లు గాన్పించుచున్నది.

గర్గపరాశరుల గ్రంథములుగాక ఇంక పదునారు జ్యోతిషగ్రంథము లీకాలమున వ్రాయబడినట్లు నిదర్శనములు గన్పించుచున్నవి. కాని యివియన్నియు కాలవాహినిలోగలసి పోయినవి. బ్రహ్మ, సూర్య, వైశ్య, వాసిష్ఠ, అత్రి, కాశ్యప నారద, మరీచి, మను, ఆంగీరస, రోమక, పులిశ, చ్యవన, యవన, భృగు, శౌనకుల సిద్ధాంతగ్రంథములు నేడుగానరావు. ఇందైదు సిద్ధాంతములను మాత్రము క్రోడీకరించి వరాహమిహిరుడు క్రీ. శ. ఆరవశతాబ్దమున పంచసిద్ధాంతిక మను గ్రంథముగ లిఖించినాడు ఇందు బ్రహ్మ, సూర్య, వాసిష్ఠ, రోమక, పౌలిశసిద్ధాంతములు గలవు. పౌలిశసిద్ధాంతము పులిశయను వానిచే రచియింపబడినది. ఇతడు యవనదేశస్థుడని తెలియవచ్చుచున్నది. ఈతడు చాల మేధావియనియు గణితభాగమునం దపారప్రజ్ఞ గలవాడనియు పెక్కండ్రు చరిత్రకారు లీతని ప్రశంసించి యున్నారు

వీరి తరువాత జ్యోతిషమున ప్రఖ్యాతివహించిన పురుషులు, ఆర్యభట్ట వరాహమిహిరులు. ఆర్యభట్టు ఆర్యభట్టీయ

వను జ్యోతిషగ్రంథమును వ్రాసెను ఈతడు మిగులబుద్ధి శాలి. జ్యోతిషమున అనేక నూతనాంశముల కనుగొనెను. భూమి వర్తులముగ నున్నదనియు, తనచుట్టును తాను దిరుగుచుండు ననియు,మనము ఓడనెక్కి పోవునప్పుడు తీరముననుండు అచలపదార్థము లెట్లు చలించుచున్నట్లు గోచరించునో అట్లే నక్షత్రములు అచలములైనను భూభ్రమణమువలన అనుదినము చలించుచున్నట్లు గన్పడుచుండుననియు సూర్యచంద్ర గ్రహణములకు చంద్రుడును, భూచ్ఛాయయు గారణములనియు, ఈతడు గనిపెట్టినాడు.

ఈతని తరువాతివాడగు వరాహమిహిరుడు జ్యోతిష శాస్త్రపారంగతుడని పేరుగాంచెను. ఈతడు క్రీ శ. 505 సంవత్సరప్రాంతమున ఉజ్జయినినగరమున జన్మించి విక్రమార్కుని యాస్థానమున నవరత్నములలో నొక్కడని ప్రఖ్యాతిగాంచెను. ఈతడు బృహత్సంహిత, పంచసిద్ధాంతములను రెండు అమూల్యగ్రంథముల వ్రాసెను ఈపంచసిద్ధాంతములలో సూర్యసిద్ధాంతము మిగుల నుత్కృష్టమైనది. బౌద్ధయుగమున వ్రాయబడిన ఈగ్రంథమిప్పుడు పెక్కుమార్పులచే మిగుల విరూపము జెందియున్నది ఇందు పదునాలుగధ్యాయములుగలవు. గ్రహసంచారము, సూర్యచంద్ర గ్రహణములు,గ్రహనక్షత్రముల సమాగమము, నక్షత్ర, గ్రహముల ఉదయాస్తమయములు, ఖగోళశాస్త్రపరికరములు, కాలప్రమాణమును కనుగొను మార్గములు మున్నగు విషయము లిందు జెప్పబడినవి. వరాహమిహిరుని దరువాత జ్యోతిషశాస్త్రము భారతవర్షమున అంతగ నభివృద్ధినొందలేదు. వరాహమిహిరునితో జ్యోతిష

శాస్త్ర మస్తమించినది. అంతటి ప్రతిభాశాలి భారతభూమిని మరలనుద్భవింపలేదు.

## గణితశాస్త్రము

జ్యోతిష గణితశాస్త్రముల కవినాభావసంబంధముండుటచే నీకాలమునాటి జ్యోతిష్కులు గణితశాస్త్రమున గూడ నపారమగు పాండిత్యమును గడించిరి. కోల్బ్రూకుఅను చరిత్రకారుడు హిందువుల గణితశాస్త్రప్రావీణ్యమును మిగుల కొనియాడినాడు. బీజగణితము భారతవర్షముననే యుద్భవిల్లినది. ఇందుండియె అరబ్బులు యీశాస్త్రమును ఎనిమిదవ శతాబ్దమున తమదేశమునకు గొనిపోయిరి. వీరినుండి పిసానివాసియగు లియనార్డో, దీని నభ్యసించి ఐరోపాఖండమునకు తీసికొనిపోయెను. ఖగోళశాస్త్ర పరిశోధనలందును రేఖాగణిత పరిశ్రమలందును బీజగణితము నుపయోగించు మార్గమును భారతవర్షమే ప్రపంచమునకు జూపినది. ఇప్పుడు ప్రపంచమందంతట వాడుకలోనున్న దశాంశగణితముకూడ ఇచ్చటనే యుద్భవించినది. దౌర్భాగ్యవశమున మనదేశము పరాధీనత పాలగుటవలన ఈశాస్త్రములిక్కడ మాటుమణగినవి. అన్యదేశములలో పెంపొందినవి.

## వైద్యశాస్త్రము

ఇంకివైద్యశాస్త్రమును గూర్చి కొంచెము జెప్పవలసియున్నది. బౌద్ధయుగమునాటి భారతవర్షము వైద్యశాస్త్రమున గూడ జాలప్రఖ్యాతి వడసినది. వైద్యశాస్త్ర ప్రావీణ్యమునకు భారతభూమి ప్రాచీనకాలమునుండియు పేరు

వ్రాసినది ప్రాచ్య పాశ్చాత్యఖండములకు ఆర్యావర్తము వైద్యశాస్త్రమున ఆచార్యపీఠము వహించినది. ప్రాచీనదేశములన్నియు భారతవర్షమునుండియే వైద్యవిద్యను నేర్చుకొనినవి. పశ్చిమఖండమున వైద్య పితామహుడని పేరు వడసిన హిప్పోక్రేటసు వైద్యశాస్త్రమును హిందువులనుండియే నేర్చుకొనెనని వైజను అను పాశ్చాత్యచరిత్రకారుడు దలంచుచున్నాడు యవనులు తమ వస్తుగుణదీపిక యందు వివరించిన యోషధుల జాలవరకు హిందువులనుండియే గ్రహించినసంగతి నిర్వివాదాంశము.

వైద్యశాస్త్రము భారత వర్షమున ఒక యుపవేదముగ పరిగణింపబడి ఆయుర్వేదమనిపిలువబడినది. ఆయుర్వేదమనిన ఆయుఃపదార్థమును వృద్ధిజేయువేదమని యర్థము. ఇది అధర్వవేదమున నొకయుపాంగముగ జేర్పబడినది. అధర్వవేదమందలి ఆయుర్వేదము శల్యతంత్ర, శాలక్యతంత్ర, కాయచికిత్స, భూతవిద్య, కౌమారభృత్య, ఆగద, రసాయన, వాజీకరణములను ఎనిమిది భాగములుగ విభజింపబడినది. హైందవ వైద్యశాస్త్రగ్రంథము లన్నిటిలో అధర్వవేద మత్యంత ప్రాచీనమయినది. అధర్వవేదము క్రీ. పూ 1000 ల క్రిందటిది.

తరువాతికాలమున ఆత్రేయమహాఋషి శిష్యులగు అగ్నివేశ, భేల, జతుకర్ణ, పరాశర, హారిత, క్షారపాణులు వైద్యశాస్త్రములు వ్రాసిరిగాని నేడొక్కటియు గానరాదు అన్నియు కాలగర్భమున మణగిపోయినవి

అధర్వవేదముతరువాత చెప్పదగిన వైద్యగ్రంథములు, చరక సుశ్రుత సంహితలు. ఇందు చరకసంహిత

క్రీ. శ. మొదటిశతాబ్దమున వ్రాయబడిన ట్లూహింపబడు చున్నది చరకసంహితను వ్రాసిన చరకాచార్యులు కనిష్క సార్వభౌముని యాస్థానభిషఙ్మణియని చీనాభాషాలోనున్న త్రిపిటకలో నొకచోట జెప్పబడినది. ఈవిషయమై యింకను చరిత్ర పరిశోధనలు గావింపవలసియున్నది ఈగ్రంథము క్రీ. శ ఎనిమిదవ శతాబ్దమున అరబ్బీభాషలోని కనువదింపబడి అరేబియాదేశమునకు గొనిపోబడినది.

చరకమున వైద్యభాగము వర్ణింపబడినది. ఇందు జీవాత్మలక్షణములు, శరీరావయములు, వానివిధులు, శరీరమున బుట్టువ్యాధులు, ఔషధక్రియలు మున్నగు విషయములెల్ల జెప్పబడినవి

సుశ్రుతమున శస్త్రచికిత్స వివరింపబడినది. ఇందొక ప్రకరణమున శస్త్రసాధనములును, మఱియొక ప్రకరణమున శస్త్రచికిత్సా విధానములును వర్ణింపబడి యుండుటచే నీ గ్రంథము చారిత్రికముగ మనకెంతయు నమూల్యమైనది. ఇదిగాక, వ్యాధిలక్షణములు, శరీరనిర్మాణము, వ్రణములు, పుండ్లు వానికి శస్త్రచికిత్స యొనర్చుమార్గములుగూడ ఇందు వివరింపబడినవి. సుశ్రుతసంహిత వైద్యప్రపంచమున మిగుల ప్రఖ్యాతమగు గ్రంథము ఎనిమిదవ శతాబ్దమున నిది అరబ్బీభాషలోని కనువదింపబడినది ఈభాషలో నిది నేటికిని గలదు. అరబ్బీభాషలో నిది కితాబ్ షౌసూన్ ఆల్ హిందియనియు, కితాబ్ యిసు శ్రుద్ అనియు పిలువబడుచున్నది. యజ్ఞశ్రీకాలమున మనిన నాగార్జునయతి ఈగ్రంథమును పెంచి కొలదిమార్పులతో మరలవ్రాసెనని ప్రతీతి

సుశ్రుత సంహితను వ్రాసిన సుశ్రుతు డేకాలమునాటివాడో సరిగ తెలియకున్నది. బౌద్ధయుగమునాటివాడని పలువుర యభిప్రాయము.

ఈకాలమున శల్యతంత్రము పరిపూర్ణత గాంచినది. ఈయుగమందలి వైద్యులు శస్త్రచికిత్సయం దసమానకౌశలమును గడించిరి. అప్పటి శస్త్రవైద్యులు ఎట్టి వ్రణమునైన అత్యంత నిపుణముగ శస్త్రచికిత్స యొనర్చి మాన్పెడివారు. మానుషశరీరమును కోసి పరీక్షించుట వార లెరుగుదురు. ఆకాలమునాటి వైద్యులు కపాలశస్త్రమునుగూడ జేయుచుండిరి శుద్ధోదన మహీపాలుని యాస్థానవైద్యుడగు జీవకుడు కపాలశస్త్రమును జయప్రదముగ జేసెనని మహావాగ్గమున వర్ణింపబడినది. గర్భస్థములగు శిశువుల నతినిపుణముగ పైకి దీయుటయందుగూడ ఆకాలమునాటి శస్త్రవైద్యు లత్యంతకుశలురు. వరిబీజముల, మూలశంకల, జలోదరముల శస్త్రచికిత్స యొనర్చి వీర లవలీలకుదుర్చువారు నాసికల్, కర్ణముల శస్త్రముజేసి కృత్రిమనాసికాకర్ణములనతికించి అంగవైకల్యముకనబడకుండచేయువారు అవయవములలో నేదియైన ప్రమాదవశమున తెగిపోయినపుడు కృత్రిమావయములవలన నాయంగవైకల్యమును సాధింపవచ్చునని ఋగ్వేదమునగూడ జెప్పబడినది మశూచిమున్నగు వ్యాధులంటకుండ టీకాలువేయు పద్ధతులుగూడ నాకాలమునగలవు. ఆకాలమునాటి వైద్యులకు వ్రణచికిత్సయం దసమాన చాతుర్యముగలదు. శరీరమున విరిగిపోయిన శరముల, బల్లెముల వా రతిలాఘవముగ దీయువారు శరీరావయవములనెల్ల వార లెరుగుదురు. మానవదేహ

మున నూటయే డాయుధపట్లుగలవనియు శస్త్రవైద్యులు ఆయాభాగముల శస్త్రములజేయుట పరిమాణమునియు వైద్యగ్రంథములందు జెప్పబడినది ఆనాటి శస్త్రవిద్యానైపుణ్యము మనదేశమున నింకను నశించిపోవలేదు. ఇప్పుడుగూడ పాశ్చాత్యవైద్యశాస్త్రప్రవీణులు గుర్తించుమిటకరించి ఇది యసాధ్యమని కాళ్లుపారజాచిన వ్రణములగూడ మన ఆయుర్వేదజ్ఞులు అతిలాఘవముగ కోసి కుదుర్చుచున్నారు. గర్భస్థశిశువుల ప్రాణాపాయము గలుగకుండ వెలికిదీయగల యెరుకలసానులింకను పలుప్రాంతములగలరు. ఈశస్త్రకౌశల మంతయు ఆదరణలేక అంతరించిపోవుచున్నది. పాశ్చాత్య విద్యాసంపర్కము మనవిద్యలన్నిటికిని సర్వమంగళము బాడినది

బౌద్ధయుగమందలి శస్త్రవైద్యులు పలువిధములగు శస్త్రసాధనముల నుపయోగించువారు. సుశ్రుతమున నూటయిరువదియేడు సునిశితశస్త్రములు వివరింపబడినవి. నఖమండలాగ్రి, కరపత్రి, వృద్ధిపత్రి, ముద్రికా, ఉత్పలపత్రి, అర్ధదార, కుశపత్రి శరారీముఖశస్త్రములు మున్నగునవి ఇవి యన్నియు తలవెండ్రుకనైన నిలువునజీల్పగల్గునంత నిశితములైనవని వర్ణింపబడినవి. వీనిలో మండలాగ్రిశస్త్రము వలయాకారముగనుండు అగ్రముగల్గిన శస్త్రము. వ్రణములు మున్నగువానిజల్చుటకు నిర్దేశింపబడినది కరపత్రము శరీరములోని యెముకల కపాలముల గోయుట కుపయోగింపబడు రంపమువంటి యొకవిధమగు శస్త్రసాధనము. దీనిపండ్లు హస్తమునందలి వ్రేళ్లను బోలియుండుటచే దీనికీ నామముగల్గినది. ముద్రికాశస్త్రము లేక అంగుళీశస్త్రము. ఉంగరమువలె నుం

డును గర్భమున జనిపోయిన శిశువుల అవయవముల గోసి వెలుపలకు దీయుట కిది యుపయోగించును ఉంగరమువలె దీనిని వ్రేలికి దొడుగుకొనవచ్చును. ఉత్పలపత్ర శస్త్రములు నల్ల కలువరేకు బోలియుండు శస్త్రములు రక్తనాళముల జీరుట కుపయోగపడునవి. అర్ధధార శస్త్రము సగభాగము మాత్రము వాడిగల ఆయుధము. శరీరావయవముల ఛేదించుట కుపయోగపడును శరారీముఖ శస్త్రము వెండ్రుకలు చర్మము మున్నగువాని గత్తిరించుట కుపకరించు కత్తెర వంటి సాధనము

ఇవిగాక యంత్రములనబడు స్థూలశస్త్రములు శలాకలు, సూదులు మున్నగునవి గలవు. సూదులు గాయములు కుట్టుటకు, శలాకలు ఒకవిధమగు సన్నని లోహపుకడ్డీలు. ఇవి పుండ్లను, వ్రణములను కదపి చీముమున్నగు వాని పైకిదీయుటకును, నాసిక, కర్ణ, గుద, యోనిపరిశోధనలకును ఉపకరించు శస్త్రోపకరణములు. యంత్రములలో పలువిధములగు యంత్రములుగలవు. వీనిలో స్వస్తిక, సదంశ, తాల, నాడీయంత్రములు పేర్కొనదగినవి స్వస్తిక యంత్రములు శరీరమున గ్రుచ్చుకొనిన ఈటెల శరముల వెలికిలాగుటకు బనికివచ్చు సాధనములు. ఇవి కంసాలిదుకాణమున గానుపించు కారుఁబోలియుండును వీనిలో సింహముఖ, వ్యాఘ్రముఖ, వృకముఖ, ఋక్షముఖ, మార్జాలముఖ, సృగాలముఖ, మకరముఖ, కాకముఖ, బకముఖ, ఉలూకముఖ మున్నగు నిరువదినాలుగు విధములగు స్వస్తికయంత్రములు గలవు సదంశ యంత్రములు చర్మము, రక్తనాళములు,స్నాయువులు లోనగు

మెత్తనితావ్రలందు గుచ్చుకొని పోయిన శాల్యపదార్థముల నూడదీయుట కుపయోగించునవి ఇవి లోహకారులకడ నుండు శ్రీవాణములవలెను, మంగలిపాది యందుండు తంటసములవలె నుండును తాలయంత్రి ములు చెవులలో నాసికారంధ్రములలో జిక్కుకొనిన పదార్థముల దీయుసాధనములు ఇవి గులివి తెడ్డుల బోలియుం డును. నాడీయంత్రములు నాసిక, వక్త్ర, మూత్ర గుదస్థాన ములనుండు శాల్య పదార్థముల పరిశీలించుట కుపకరించు గొట్టములవలెనుండు శస్త్రసాధనములు వీనిలో కంఠ శల్యా వలోకినీ (కంఠమున జిక్కుకడిన శల్యముల, చేపల, శిలల, పరీక్షించు యంత్రము) ఆర్మయంత్ర (మూలశంక కుపక రించునది.)నాధూకరణి (నాసికారంధ్రములబోయు తైలములు, రసములు పొర్లిపోకుండ నాసికాపుటముల దెరచియుంచు సాధనము) అంగులీరక్షణి (రోగి పండ్లకాటుల వలన శస్త్ర వైద్యుని వ్రేలికి హానికలుగకుండ రోగినోరును దెరచియుం చుటకై వ్రేలికి దొడుగుకొను ఉపకరణము) వ్రణవస్తి (వ్రణ ప్రక్షాళనయంత్రము లేక పిచ్చిగారి) యోనివ్రణేక్షణ (యోనిని పరిశీలించుట కుపకరించునది) జలోదరయంత్రము (జలోదరమునుండి దోషజలమును వెలుపలికి దోడు శస్త్రసాధనము) వస్తియంత్రము (గుదస్థానము నుండి లోనికి ఔషధజలమునుబంపు సాధనము ఇది యీకాల మున వైద్యులకడ నుండు ఎనీమాపంపిది) ఉత్తరవస్తి (స్త్రీల మర్మస్థానమునుండి లోనికి ఔషదజలమును బంపుసాధనము) ఉత్తరసువస్తి (మృగముల గుదస్థానమునుండి లోనికి జల

మునుబంపునది) ధూమనాడి (రోగులచే పొగపీల్పించు ఉప కరణము, ఉబ్బసవ్యాధుల నివారణకు) వ్రణ ధూమ్రనాడి (వ్రణములకును స్త్రీమర్మస్థానములకును ధూమము ప్రసరింప జేయు సాధనము భుజపత్రముల పాముకుబుసముల నుండి వెడలు ధూమము మర్మస్థానములో నికంపిన, ఋతుశ్రవణాభ్యంతరములు తొలగునని సుశ్రుతమున జెప్పబడినది) శృంగము లులేక విషాణములు (మేనినుండి యధికరక్తమును విషమును వెలికి ప్రవహింపజేయు ఉపకరణములు. ఆంగ్లవైద్యమున వీనినే "కప్పింగు లేక బ్లీడింగు" సాధనములందురు. జలగల కూడ నీపనికై వియోగించుటగలదు ) ఘటీయంత్రము (పాత్రలో సులభముగ వెలుగు పదార్థముల నంటించి పడవైచి పాత్ర ముఖమును ఉదరమున కదిమిన పాత్రఉదరమునకంటుకొనును. గుల్మవ్యాధుల నివారణకై ఇట్టిసాధనముల నుపయోగించు వారు) మున్నగు వివిధములగు సాధనములుగలవు

ఇన్ని శస్త్రసాధనములుండ, శస్త్రవైద్యమున నాకాలమునాటి వైద్యులంత ప్రవీణులైయుండ పూర్వకాలమున ఆర్యావర్తమున శస్త్రవైద్యమే లేదనినుడువుట సాహసము గదా? ఆకాలమున శస్త్రవైద్యులు, నిర్ఘాతన (పూరణ తిత్తుల మొదలగువాని తైలముతో నింపుట) బంధన (కట్లుకట్టుట) వ్యూహన (గాయనక్త్రములను చేర్చికుట్టుట) వర్తన(కుంచించుట) చాలన (శరీరమున తప్పిపోయిన శల్యములు మున్నగువాని నొకభాగమునుండి మరియొకభాగమునకు తీసికొనిపోవుట) వివర్తన, విదరణ (వ్రణముల చీల్చుట) పీడన (నొక్కి వ్రణమునుండి చీము మున్నగువానిని వెడలించుట), మార్గ

విశోధన (మూత్రమార్గములు మున్నగువాని శుభ్రము చేయుట), వికర్షణ (రక్తనాళములలో పేరుకొనిపోయిన పదార్థముల కదిపి వెలువరించుట), ఆహరణ, అంచణ (శకములు మున్నగువాని వెలుపలికిలాగుట), ఉన్నమన (వాలిపోయిన యెముకల కర్ణముల లేవనెత్తుట), వినమన (విరిగి పైకిలేచిన యెముకను క్రిందికివంచుట), భంజన (మర్దించుట, శస్త్రము జేయుటకుమున్ను బాధ తెలియకుండుటకై ఆభాగము నీతైలము రాచి రుద్దెదరు) ఉన్మథన (పుండ్లనుమున్నగువాని కెలకుట) ఆచూషణపడీయుట (విషరక్తములను, విషదుగ్ధములను విషాణములతోగాని నోటితోగాని బీల్చి పైకిదీయుట) ఏషణ (అన్యపదార్థముల కొరకు పుండ్లను శలాకులతో వెదకుట). దారణ (కర్ణములు తలపుత్తెలు మున్నగు వానికోయుట) ప్రక్షాళన (పుండ్లను గాయములను కడగుట) ప్రధమన (సన్నని గొట్టములతో చూర్ణములనాసికాపుటములనుండి లోనికిఊదుట) ప్రమార్జన (నులిమి, కన్నులనుండి అన్యపదార్థముల పారదోలుట) ఛేదన (గాయములవలన నిరుపయుక్తములైన అవయవముల గోసివేయుట) భేదన (వ్రణములచీల్చుట) లేఖన (గీయుట చర్మవ్యాధులకు గావింపబడు శస్త్రక్రియ) వేదన (రంధ్రములచేయుట రక్తమును స్రవింపజేయుటకు జలోదరములనుండి విషజలమును ప్రవహింపజేయుటకు సన్నని యంత్రసాధనములతో రక్తనాళములందు ఉదరములందు రంధ్రములు గావింపబడును) విశ్రావణ (వ్రణములనుండి చీమును వదుపుట) సౌవన (గాయముల మున్నగువాని సూదుల

తోకుట్టుట) బోనగు ముప్పదిరెండు విధములగు శస్త్రక్రియల జేయువారు. ఇంతటిశస్త్రనైపుణ్యము ఇప్పుడంతరించిపోయినది.

ఔషధములచేయుటలోగూడ హిందువులకు మించిన వారలాకాలమునలేరు. హిందువులెరుగని మందులులేవు. ఆ కాలమున యవనదేశపువైద్యులు పాముకాటునకు ఔషధము నెరుంగకుండిరి. కాని "హైందవులు సర్పదష్టులైనవారికి చికిత్స యొసర్చి ప్రాణముల రక్షింపగల"రని యార్కసు చరిత్రకారుడు హైందవుల వైద్యశాస్త్రప్రావీణ్యమును కొనియాడినాడు యవనవైద్యులు కుదుర్పజాలని రోగముల కుదుర్చుటకై పాముకాటులకు చికిత్సచేయించుటకై అలెగ్జాండరు హైందవవైద్యులనెల్లపుడును దనశిబిరమున నుంచుకొనువాడని ఈతడే వ్రాసినాడు. "యవనులకు రుగ్మతగల్గినపుడెల్ల (యవనులు భారతవర్షముపై దాడివల్పిన క్రీ పూ మూడవశతాబ్దము నాటిమాట) హైందవ వైద్యశిఖామణుల యొద్దకుబోయి వారి యద్భుతవైద్యకౌశలమువలన తమరుగ్మతల బాపుకొనెడివారు" అని పరియను నుడివియున్నాడు.

లోహముల రసవిషగంధకాదుల ఔషధముగ నుపయోగించుటను హిందువులే మొదటివారు.* రసాయన శాస్త్రమున వారలసమానపాండిత్యమును గడించిరి. పలువిధములగు రసాయనమిశ్రమముల జేయుటకు వారలెన్నియో యంత్రసాధనముల గనిపెట్టిరి. సువర్ణ, రజిత, రస, తామ్ర,

* ఠక్కూరు, గోయలు, తన 'హైందవ వైద్యశాస్త్రప్రాచీనత' యను గ్రంథమున జెప్పినాడు.

కాంత, సింధూర, శంఖభస్మములు వారెరుగుదురు గంధక ధృతి, శంఖద్రావకము, లవణద్రావకము మున్నగు ద్రావకముల దీయుట ఆకాలమునాటి హైందవవైద్యులకు దెలియును.

ఇదిగాక అసంఖ్యాకములగు ఓషధిలక్షణముల హిందువు లెరుగుదురు. ఓషధిప్రభావము హిందువులకు దెలిసిన ట్లీప్రపంచమున నేరికిని దెలియదు. భారతవర్షము వనమూలికలకును ఓషధులకును బుట్టినిల్లు. ఇచ్చటదొరకు ఓషధులు ప్రపంచమున వేరెచ్చటను గానరావు.

అప్పటి హైందవులు వైద్యశాస్త్రమునవనే గాక, జంతువృక్ష శాస్త్రములందు కూడ నారితేరిరి. పశువైద్యమున వారి ప్రావీణ్యమపారము పశువులకు, అశ్వములకు, గజములకు గలుగు రోగముల గుదుర్చుటలో వారి కత్యంత కౌశలము గలదు. ఈమృగములకు చికిత్సలొనర్చు విధానముల వర్ణించుచు వారలెన్నియో గ్రంథముల వ్రాసిరి. అప్పుడు వ్రాయబడిన, అశ్వవైద్య, గజవైద్య' 'సర్పవైద్య' 'విషవైద్యములు' నేటికినిగలవు.

బౌద్ధయుగమున వైద్యశాస్త్రమున భారతవర్షము గురుపీఠము వహించినదని నుడివితిమి. నాటి హైందవ భిషఙ్మణులు ప్రాచ్య పాశ్చాత్య ప్రపంచములందెల్ల తమవైద్యశాస్త్రప్రావీణ్యమునకు పేరుమోసిరి. అన్యదేశ నృపులు అమూల్య ధనములనొసగి హైందవవైద్యుల తమయాస్థానములకు బిలిపించుకొనువారు. అలెగ్జాండరుచక్రవర్తి హైందవ

వైద్య శాస్త్రజ్ఞుల తనశిబిరమున నుంచుకొనిన సంగతి జగత్ప్రసిద్ధమేగద. పారశీకఱేడగు హారూన్ ఆల్రషీదు, మంకసేల యనువారల తనయాస్థానమునకు రప్పించుకొనెను వీరలు చిరకాలమీతని యాస్థానమున ఆస్థానవైద్యులుగ నుండిరి. వీరిలో మంకసుశ్రుతమును కాణక్యుని విషవైద్యమును పారశీకభాషలో వ్రాసెను.

ఇచ్చటనుండి వైద్యుల నన్యదేశములకు గొనిపోబడుటయెగాక ఇచ్చట వైద్యవిద్య నభ్యసించుటకై జనులు పలుదేశములనుండి యిచ్చటకువచ్చువారు. పలువురు తక్షశిలానగరమున కేగువారు. ఈకాలమున తక్షశిలా విశ్వవిద్యాలయము వైద్యశాస్త్రమునకు వినుతికెక్కినది. టీసీయస్♦ మెగస్తనీసు* అను యవనదేశపు వైద్యులిరువురు హైందవవైద్యపద్ధతుల పరిశీలించుటకు ఈయుగముననే ఆర్యావర్తమును దర్శించిరి.

మఱియు వైద్యశాలల నిర్మించి, అందు నిరుపేదలకు ఔషధములిచ్చు పద్ధతులు ఈదేశముననే ప్రారంభమైనవి. ప్రపంచములోనికెల్ల మున్ముగ నిచ్చటనే ఔషధశాలలు నిర్మింపబడినవి యూరపుఖండమున. తొలుత ఔషధాలయములు నెలకొల్పబడుట క్రీ.శ. ఏడవశతాబ్దమున అంతకుమున్ను పెక్కుశతాబ్దముల క్రిందటనే ఆర్యావర్తమున ఔషధశాలలు తామరతంపరగ నిర్మింపబడినవి. అశోకుడు తన సామ్రాజ్య

---

♦ ఈతడు క్రీ. శ. 400 సంవత్సరప్రాంతమున ఆర్యావర్తమునకు వచ్చెను.

* ఈతడు క్రీ. శ. 300 సంవత్సరమున వచ్చెను.

పనసేగాక ఈజిప్టు, చీనా, సింహళముమున్నగు అన్యదేశములలోగూడ వైద్యశాలలు బెట్టించెనని చరిత్రి పరిశోధనలవలన దెలియుచున్నది. ఫాహియాను హ్యూయనిత్సాంగులు తాము దర్శించిన కాలమున భారతఖండమున లెక్కలేని ఔషధశాలలున్నవని వర్ణించిరి. సింహళదేశరాజగు ఉపతిస్సనృపాలుడు అంగవైకల్యమునొందినవారలకు గర్భిణీస్త్రీలకు ఔషధశాలలు గట్టించెనని మహావంశమున జెప్పబడినది. ఔషధశాలల నెట్లు నిర్మింపవలయునో ఎట్టిప్రిదేశముల నిర్మింపవలెనో అందు ఎట్టి పాత్రిలు ఆసనములు, ఉపకరణము లుండవలయునో చరకుడు తన గ్రింథమున వర్ణించిచెప్పినాడు. "ఔషధాలయములు విశాలమందిరములుగ నుండవలయును. గాలి పుష్కలముగ వీచుచుండవలయును. సూర్యరశ్మి చొరుచుండవలయును. ఆపరిసరమున దృశ్యములు రమణీయముగ హృదయానందకరముగ నుండవలయును. పొగయు, ధూళియు లేకుండవలయును. స్నానమందిరములు, వంటశాలలు, మూత్రవిసర్జనస్థలములు దూరముగ ప్రిత్యేకస్థలములందు నిర్మింపవలయును వైద్యశాలలందు నియమింపబడు సేవకులు తెలివిగలవారై, దయాశీలురై, హృదయమాలిన్యము లేనివారై రోగులకు ఉపచారములుజేయ నిచ్ఛగలవారై వంటలజేయుటయందు, మందులగలుపుటయందు, వ్యాధిగ్రిస్తుల నిపుణముగ లేవదీయుటయందు, శయ్యల పరచుటయందు కుశలురై యుండవలయును'' అని చరకుడు వైద్యశాలా నిర్మాణవిధానమును వర్ణించినాడు. ఆహా! భారతవర్షము నాడెట్టి ఉన్నతదశ

యందుండెను? నే డెట్టి నీచదశ ననుభవించుచున్నది! కాల వైపరీత్యము.

విద్యాసంపద; విద్యాపీఠములు.

ఆకాలమునాటి భారతవర్షము విద్యాసంపదకుగూడ నుతికెక్కినది. ఆనాటి ఆర్యావర్తము విద్యలతల్లియని పేరు గాంచినది. జగద్విఖ్యాతమగు విద్యాపీఠములెన్నియో నీయుగమున విలసిల్లినవి. అందు విద్యనభ్యసించుటకై, పలుదేశముల నుండి విద్యార్థులేతెంచువారు ఈకాలమున భారతఖండమున విద్యావిహీనత యనునది గానిపింపదు. విద్యపరిపూర్ణముగ నీ దేశమున వ్యాపించినది. ఆకాలమున రాజ్యమేలిన రాజులు, విద్యల సర్వవిధముల బ్రోత్సహించి, జనులలో వ్యాపకము జేసిరి.

ఒక్క బౌద్ధయుగమే యననేల అనాదినుండియు భారత వర్షము విద్యల కునికిపట్టయి ప్రఖ్యాతిగాంచినది అనాదినుండి కూడ నిచ్చట విద్యాపీఠములు వరలినవి. వేదకాలమున బదరిక (బదరీనాద్) నైమిశారణ్య ఆశ్రమములు ప్రఖ్యాత విద్యానిలయములై అసంఖ్యాకులగు జనులకు విద్యగరపినవి.

తరువాత బౌద్ధయుగమున విద్య కడలేని యభివృద్ధిగాంచినది. విద్యాశాలలీ కాలమున వేనవేలు స్థాపింపబడినవి. దీనికి గారణము బౌద్ధభిక్షువులు మతవ్యాపనమేగాక విద్యాప్రచార మునుగూడ జేసిరి. బౌద్ధవిహారములన్నియు విద్యాశాలలుగ జేయబడినవి. భిక్షువులు బౌద్ధమతవ్యాప్తికై, విద్యాపోషణకై, విహారములందు పాఠశాలల, కళాశాలల, విశ్వవిద్యాలయ

ములు స్థాపించి విద్యల ప్రోత్సహించిరి ఫాహియాను ఉద్యాన, పురుషపుర, మధుర, సంకాశ్య, కన్యాకుబ్జ, శ్రావస్తి, సాకేత, రామగ్రామ, కపిలవస్తు, వైశాలి, పాటలీపుత్ర, రాజగృహ, వారణాసి, గయా, చంపా, తామ్రలిప్తినగర ములు దర్శించెను. హుయ్యానిత్సాంగు, ఇతడుగాంచిన పట్టణ ములనేగాక, సింహపుర, ఉరశ, కాశ్మీర, పునచ, రాజపుర, ఘాజీపుర, నలందా, వృజ్జి, హిరణ్యపర్వత, కజింగడ, పుండ్ర వర్ధన, కామరూప, సమతట, వేంగి, ధనకటక, ముకూయట, సింహళ, కొంకణ, భరుకచ్ఛ, అటవీ, కచ్ఛ, వల్లభీ, ఆనంద పుర, ఉజ్జయినీ, మహేశ్వరపుర, మూలస్థాన, నగరముల వీక్షించెను. ఈత్సింగు* తామ్రలిప్తి, హరికేల, రాజగృహ, నలందా, గయా, వైశాలీ, కుశనగర, కపిలవస్తు, వారణాసుల జూచెను. ఈప్రదేశము లన్నిటిలో నానాకాలములయందు గొప్ప విద్యాలయములు వరలినవని ఈ యాత్రికులు వ్రా సిరి. ఆకాలమున విలసిల్లిన విద్యాపీఠములన్నిటిలో, కాశ్మీర, ధనకటక, తక్షశిలా, నలందా, వారణాశి, ఉజ్జయిని, ఉద్దండ పుర, నవద్వీపములు ప్రఖ్యాతములైనవి

ఈ విద్యాపీఠములు ఒక్కొక్కటి ఒక్కొక్క శాస్త్ర మునకు ప్రసిద్ధిగాంచినవి. నలందా కాశీ విద్యాపీఠములు వ్యాకరణమునకును, కాశ్మీర మలంకారమునకును, తక్షశిల ఆయుర్వేదమునకును, ఉజ్జయిని జ్యోతిశ్శాస్త్రమునకును నవ

* క్రీ. శ. 677 సంవత్సర ప్రాంతమున భారతవర్షమును దర్శించిన మరియొక చీనా యాత్రికుడు.

ద్వీపము న్యాయశాస్త్రాధ్యయనమునకును వాసికెక్కినవి కాశ్మీరము అలంకారశాస్త్రమున కాదిపీఠము. కాని యీవిద్యాపీఠమును గూర్చి మనకంతగ దెలియదు.

కాశీ: సంస్కృతవిద్యలకు వేదశాస్త్రములకు కాశీ అనాదినుండియు ప్రసిద్ధిజెందినది. ఇది అత్యంతప్రాచీనమగు విద్యాపీఠము. ఇచ్చట మహాపండితులు నివసించువారు. కాశికి బోయి విద్యనభ్యసించు నాచారము మొన్న మొన్నటి వరకును గలదు. కాశీ పండితుడనిన నిప్పటికిని ఆర్యావర్తమున పూజ్యతగలదు. ఇచ్చట విద్యార్థుల కెక్కుడు వసతులుండెడివి. అన్నమిడుటకు సత్రము లెన్నియోయుండునవి. మున్నాట యరువది సత్రము లుండెడివని ప్రతీతి ఇన్ని సౌకర్యము లుండుటవలననే వేలకొలది విద్యార్థులిచ్చటికి ఆకర్షింపబడువారు.

నలందా:—తక్షశిలతరువాత ఖ్యాతిజెందిన విశ్వవిద్యాలయ మిదియె ప్రాభవమున నిదియు తక్షశిలతో తులతూగును దీనికీర్తియు ఖండాంతరములకు వ్యాపించినది. తక్షశిల వలె నిదియు పలుదేశములనుండి విద్యాతురుల నాకర్షించినది. నలందాపట్టణము బీహారు రాష్ట్రములోనిది. నేడిదిగానరాదు. కాలవాహినిలో గలసిపోయినది. రాజగృహమున కేడుమైళ్ళ దూరములోనున్న ప్రస్తుతబారగాన్ పట్టణమె నలందాయని కొందరు చరిత్రకారు లూహించుచున్నారు. ఇది బౌద్ధవిశ్వవిద్యాలయము గౌతమబుద్ధుడు నిర్వాణము నొందిన పిమ్మట స్థాపింపబడి క్రి. శ. పదియవశతాబ్దము వరకును తనవిజ్ఞాన దీప్తులు నలుముఖముల ప్రసరింపజేసినది. ఏలాకో సాహిమానను

యాంత్రికుడు విశ్వవిఖ్యాతమగు నీవిద్యాపీఠమును గూర్చి మౌనము దాల్చినాడు. దీనినిగూర్చి యొక్కమాటనైనను నుచ్చరింపలేదు. అప్పటికిది యంత ప్రఖ్యాతినొందియుండలే దని యూహింపవలసివచ్చుచున్నది ఇది 450 సంవత్సరప్రాంత మునుండి మగధరాజుల యాదరమును బడసి యభివృద్ధిగాంచి నట్లు దోచుచున్నది.

ఏడవశతాబ్దమున హ్యూయనిత్యాంగు, ఈట్సింగు లార్యావర్తమును దర్శించినకాలమున నీవిద్యాపీఠము మహోత్కృష్టదశయందుండెను. ఈకాలమున నీవిద్యాలయమునకు ధర్మగంజా* యను నామాంతరము గలదనియు, అందు రత్నసాగరము, రత్నోదధి, రత్నరంజకము అనునామములబరగు మూడు మనోహరహర్మ్యములుండె ననియు, టిబెట్టుదేశపు బౌద్ధగ్రంథములలో వర్ణింపబడినవి. ఈమనోజ్ఞభవనములందే నిరుపమాన పుస్తకభాండాగారమొకటి నెలకొల్పబడినది ఈభాండాగారమునకే ఈబ్రహ్మాండహర్మ్యములు నిర్మింపబడినవి వీనిలో రత్నోదధి తొమ్మిదియంతస్తుల ప్రాసాదము ఇందు సూత్రప్రజ్ఞాపరిమిత మున్నగు నమూల్యబౌద్ధగ్రంథములును, సమాజగుహ్యాది తాంత్రిక గ్రంథములును ఉంచబడినవి.

ఈవిద్యాలయ వైభవమును హ్యూయనిత్యాంగు మనోహరముగ చిత్రించినాడు ఈతడు పుష్పమాలలతో, ఛత్రచామరధ్వజములతో సుగంధద్రవ్యములతో ధర్మసంరక్షకుల

* ధర్మగంజాయనిన ధర్మమును స్వీకరించుట కనువగుచోటనియర్థము.

స్తోత్రపాఠములతో నత్యంతవైభవముగ ఊరిబయటనుండి ఈవిద్యాలయ భవనమునకు గొనిపోబడెను ఇట్టిగౌరవము నుగాంచి హ్యూయానిత్సాంగు అశ్రుపూరితనయనుడై పోయెనట. నలందావిద్యాపీఠమున నీతనికి గావింపబడిన మర్యాదలజూచిన నాకాలమున మనప్రాచీనులు అన్యదేశీయులైనను విద్వాంసు లకెట్టి యాదరము జూపెడివారో దెలియగలదు ఇట్లు పలు ప్రాంతములనుండి యనుదినమును విద్యాభ్యాసమునకై విద్యార్థు లీవిద్యాపీఠమునకు వచ్చుచుండువారు

నలందా విద్యాలయ భవనములు అత్యున్నతములై మేఘమండలము నొరయుచు, గిరి, శృంగములవలె జూపట్టు బురుజులచే పరిరక్షితమగు ప్రాకారములచే నావరింపబడి, జలపూరితములగు సరోవరములతో రమణీయమై, గంభీరమై తనరారుచున్నవని హ్యూయానిత్సాంగు వర్ణించి తన్మయత్వము నొందినాడు. విద్యాలయ ఆవరణమున అధ్యాపకులు, విద్యార్థులు, భిక్షువులు నివసించుటకై చిత్రకల్పనలతో, వింతవింత రంగులతో, నలరారు గృహావళులు గలవు. ఇందు పదివేల విద్యార్థు లేవేళను విద్య నభ్యసించుచుండువారు. ఇచ్చట వ్యాకరణము అభిమానశాస్త్రము. ఇదిగాక బౌద్ధపురాణము లును, తర్క వైద్య చికిత్సా శాస్త్రములునుగూడ ఇచ్చట బోధింపబడెడివి. వీనికై యీవిద్యాపీఠమున ప్రత్యేక కళా శాల లుండెను. ఇచ్చటి పండితుల విద్యాప్రావీణ్యమును వేరొక సందర్భమున వర్ణించితిమి. ఆప్రాంతము నేలు నృపా లుడు ఈవిద్యాపీఠ పోషణాదికములకై నూరుగ్రామముల

ఓనమొసగెను. అందువలన విద్యార్థులు అన్నవస్త్రములకు గొరతలేక విద్యనభ్యసించి పోవుచుండువారు.

హుయాన్ త్సాంగు తరువాత 677 సంవత్సరప్రాంతమున ఈత్సింగను వతియొక చీనాయాత్రికుడుగూడ భారతవర్ష మును దర్శించి పదివత్సరము లీవిశ్వవిద్యాలయమున నివసించి విద్యాభ్యాస మొనర్చెను. ఈవిద్యాపీఠమందలి విద్యాపద్ధతుల నీతడుగూడ విపులముగ వర్ణించినాడు. ఇచ్చటివిద్యాభ్యాసపద్ధ తు లత్యుత్తమము లైనవనియు, ఇచ్చట విద్యాభ్యాసమువలన ధారణశక్తి, వాచాలత, తర్కచాతురి, అద్భుతముగ నలవడు ననియు, ఒక్కసారి వినినంతనే జ్ఞాపకముంచుకొనగల్గిన పెక సంతగ్రాహుల ననేకుల నీవిద్యాలయమున తానుగాంచితి ననియు నీతడు చెప్పియున్నాడు. ఇచ్చటివిద్యార్థులు వ్యా యామములందు పాల్గొనుచు శరీరరక్షణమున గూడ నప్రమత్తు లైయుండువారని ఇతడు నుడివియున్నాడు. ఈకాలమున నిచ్చట నొక ఘటికాయంత్ర ముండెడిదట. అది మగధ రాజ్యమున కంతకును సరియగు కాలప్రమాణమును జూపెడి దట. ఒక్క భారతవర్షమునుండియె గాక చీనా, త్రివిష్ట పము, మధ్యాసియా, బొఖారా, కొరియా, మున్నగు దేశ ములనుండి గూడ విద్యార్థు లసంఖ్యాకములుగ నిచ్చటకు వచ్చుచుండువారు. వీరందరికి నీవిద్యాపీఠమున భోజనాదు లొసగబడి ఉచితముగ విద్య గరపబడెడిది. యూరపు ఖండమం తయు అంధకారమున మున్గియుండిన కాలమున, ఆసియాఖండ మందెచ్చటను విద్యాలయములె తలసూపని తరుణమున,

నలందా విశ్వవిద్యాలయము ఐరోపా, ఆసియా ఖండములకు విద్యాప్రదాతయై నెగడినది.

ఇట్లే విద్యాలయము పదియవశతాబ్దమువరకును అసంఖ్యాకులగు విద్యార్థులకు విద్యగరపి, పృథ్వీతలమందంతటను విజ్ఞానమును వెదజల్లి తురుష్కుల దండయాత్రలతో నాశనమించినది.

ధాన్యకటకము:—ఇదిదక్షిణాపథమున విలసిల్లినప్రసిద్ధ బౌద్ధవిశ్వవిద్యాలయము. ఇది క్రీ శ. 200 ప్రాంతమునుండి ఆంధ్రసామ్రాజ్య కాలమున నుత్కృష్టపదవి ననుభవించినది. ఈపట్టణమునకే ధరణికోటయని గూడ పేరు. ఇది కృష్ణానదీ తీరమున శాతవాహనుల రాజధానియగు అమరావతి పట్టణమునకొక మైలుదూరమున నుండెడిది. ఇచ్చటి విద్యాపీఠమున నాలు కళాశాల లుండెనని ప్రతీతి వీనిలోని విద్యావిధానమెట్టిదో తెలిసికొనుటకు దగిన యాధారము లెవ్వియు గన్పింపకున్నవి.

ఉద్దండపురము:—ఇందలి విద్యాపీఠము నలందావలె విఖ్యాతినొందినది టిబెట్టుదేశమున ప్రసిద్ధిగాంచిన శాక్యనగర విశ్వవిద్యాలయము దీని యనుకరణమేయని చెప్పెదరు.

విక్రమశిల:—ఈవిద్యాలయము తొమ్మిదవ శతాబ్దమున నెలకొల్పబడిన దగుటచే నిది బౌద్ధయుగము తరువాతిది. నలందా యందువలె నిచ్చటను నాలుకళాశాల లుండెడివి. వంగరాజ్యాధిపుడైన ధర్మపాలుని కాలమున శ్రీ భద్రజ్ఞానపాదు డను పండితుడు విద్యాపారంగతుడు దీని కాచార్యుడుగ

నుండెను ఈవిద్యాలయ భవనమునకు నాల్గుకోనలందును నాల్గు అన్నసత్రము లుండెడివి

నవద్వీపము:—ఇదికూడ సిటీవలిదే 11వ శతాబ్దమున సేనరాజులచే స్థాపింపబడినది వంగదేశమున నిది ప్రకృతమున డియాడని వ్యవహరింపబడుచున్నది ఇప్పటికిని దీని ప్రసిద్ధి యంతరింపలేదు. నేటికిని ఇచ్చట న్యాయశాస్త్రము కొనసాగుచునేయున్నది ధీవిశారదుడును న్యాయశాస్త్రపారంగతుడునగు వాసుదేవుడిచ్చటనే యధ్యాపకులుగ నుండెను. భక్తిరసప్రధానమగు చైతన్యమతసంస్థాపకుడగు చైతన్యుడిచ్చటనే విద్యాభ్యాస మొనర్చెను,

ఇచ్చట నేటికిని గురువులే తాము కష్టించి తెచ్చిన ధనముతో విద్యార్థులకు భోజనవసతు లొసగి న్యాయధర్మశాస్త్రములు గరపెదరు. అధ్యాపకులును, విద్యార్థులును ఇచ్చట పటకుటీరములలో నివసింతురు ఈగుడిసెలే యిచ్చటి ఉపన్యాస మందిరములు, పాఠశాలాభవనములు ప్రతివిద్యార్థియు ఒక్కొక కుటీరమున నివసించును. తరతరములనుండి నిరంతర పరిశ్రమచే ప్రాచీనవిద్యనట్లు అవిచ్ఛిన్నముగ గాపాడుకొనుచువచ్చిన ఈవిద్యాపీఠ గురువరేణ్యు లెంతయు ప్రశంసాపాత్రులు.

ఉజ్జయిని:—జ్యోతిశ్శాస్త్రమునకు ప్రసిద్ధికెక్కినది. జ్యోతిషమునకిది యాదిపీఠము. ఇటీవల నిచ్చటనొక నక్షత్రశాల కూడ నిర్మింపబడినది. ఇందు ఖగోళపరిశోధనాయంత్రము లెన్నియో కల్పింపబడినవి.

తక్షశిల:— ఇది పశ్చిమోత్తరప్రాంతమున విలసిల్లినది. భారతవర్షమున స్థాపింపబడిన విద్యాపీఠము లన్నిటిలో మిగుల ప్రఖ్యాతమైనది ప్రాచీనార్యవిద్యలకు బుట్టినిల్లు. ఈవిద్యాలయము రామాయణ మహాభారతకాలమునుండియు ప్రసిద్ధి నొందియున్నట్లు నిదర్శనములు గాన్పించుచున్నవి శ్రీ రామచంద్రుని సోదరుడగు భరతునితనయుడు దీనిగట్టించె ననియు నిది యాకాలమున సింధు వితస్తానదులమధ్య విలసిల్లినదనియు మహాభారతమున జెప్పబడినది. ఇది బౌద్ధ యుగమున మహోత్కృష్టదశ ననుభవించినది. అన్నిటికంటెను వైద్యశాస్త్రమున కిది యీకాలమున జాల ప్రఖ్యాతి వడసినది. పలుదేశములనుండి విద్యార్థులు ఇచ్చటవైద్య విద్య నభ్యసించుటకై వచ్చువారు

ఈకాలమునాటి తక్షశిలాపట్టణవిభవమును స్ట్రాబో, ప్లీనీ, టోలమీ, క్లైనీసియసు మున్నగు రోమక చరిత్రకారులు వర్ణించిరి. ఈవిద్యాలయ పరిసరములన్నియు ఔషధముల కుపకరించు వనమూలికలతో, వృక్షజాలములతో లతా వితానములతోనిండియుండెడివి. సృష్టిలోగన్పించు తరులతాదులన్నియు నిచ్చటనుండెడిదట.

భారత ఇతిహాసరంగమున -మతసాంఘిక, రాజకీయ క్షేత్రములందు కీర్తిగాంచిన మహాపురుషు లందరును ఇచ్చట విద్యనభ్యసించిరి. ఆర్యావర్తము నేలిన రాజులుతమతనయుల నిచ్చటికంపి విద్య గరపించువారు. రాజకుమారు లిచ్చట శిక్షనందిన గాని సింహాసనమధిష్ఠింప నర్హులుగారు నిరక్షరకుక్షులరాజ్యపాలనమునప్రజలకు సౌఖ్యముండ నేరదు. విద్యలు ప్రోత్సహింపబడ

నేరవు. సారస్వతము పెంపొందనేరదు. బుద్ధునకు సమకాలీనుడును, కోసల రాజ్యాధీశ్వరుడునగు ప్రసన్నధ్వీయిచ్చట విద్యనభ్యసించెను. సిద్ధార్థకుమారుడును ఇచ్చటనే విద్య నేర్చుకొనెనని ప్రతీతి. అశోక చక్రవర్తియీ విద్యాపీఠముననే జదువు నేర్చుకొనెను. చంద్రగుప్తమౌర్యుని మంత్రియు మౌర్య సామ్రాజ్య నిర్మాతయు అసమాన రాజకీయ విద్యాప్రవీణుడునగు చాణక్యుడును ఇచ్చటనే విద్యాభ్యాస మొనర్చెను. మగధ రాజ్యము నేలిన బింబిసారనృపాలునకును, గౌతమ బుద్ధునకును వైద్యచికిత్స యొనర్చిన జీవకుడిచ్చటనే విద్యగరచెను. ఈతడిచ్చట నేడు సంవత్సరములు జదివి వైద్యశాస్త్రమున నసమాన కౌశలమును గడించెను. చరకసంహిత గ్రంథకర్తయగు చరకుడిచ్చటనే తన కాయచికిత్సను బోధించెను. శబ్దశాస్త్రపారంగతుడగు పాణిని తన వ్యాకరణము నిచ్చటనే రచించెను. క్రీ శ. 45 సంవత్సరప్రాంతమున అపలోనియస్, దామిసు అనునిరువురు యవనదేశస్థు లిచ్చట విద్యనభ్యసించుటకై వచ్చిరి. అలెగ్జాండరు చక్రవర్తి ఈవిశ్వవిద్యాలయ వైభవమునుగాంచి విస్మయుడయ్యెను. ఈతడిచ్చటి గ్రంథములనేగాక ఇచ్చటి విద్వాంసులకూడ తనదేశమునకు గొనిపోయెను. దీనిఖ్యాతి యవన, ఫులస్తీనీ, ఐగుప్త మున్నగు రాజ్యములకుకూడ బ్రాకినది.

విద్య పూర్తియైనపిమ్మట విద్యార్థుల విద్యాపాటవమును పరిశీలించు పద్ధతులుకూడ నీకాలమున నవలంబింపబడినవి. జీవకుడు తక్షశిలానగరమునకు జుట్టును పదునైదు మైళ్ళ దూరములోనున్న వనమూలికావృక్షలతాదుల గుణగణముల

వర్ణింపవలసియుండెను. ఇదియె యీతనివిద్యాప్రావీణ్యమును పరిశీలించుట కిష్వబడినపరీక్ష. జీవకుడు నాల్గుదినము లీప్రదేశమంతయుదిరిగి అన్నిటిగుణసంపదల నవలీలగ వర్ణించెనట.

ఈవిద్యాపీఠములలో జాలభాగము తురుష్కుల దండయాత్రా మహాగ్నిజ్వాలలలోబడి దగ్ధమైపోయినవి. ఆంగ్లేయ విద్యాసంపర్కముచే తక్కినవి యంతరించినవి ప్రాచీనవిద్యా ప్రాభవము మాటుమణగినది.

## గ్రంథాలయములు.

బౌద్ధయుగమున మనదేశమున పెక్కుచోట్ల పుస్తకభాండాగారములుగూడ వెలసినవి ప్రతిబౌద్ధమఠమును ఒక్కొక గ్రంథాలయమై నెగడినది బౌద్ధవిహారములందు, భిక్షువులు పఠించుకొరకు బౌద్ధగ్రంథములు ప్రోవుచేసి యుంచబడెడివి. భిక్షువులు దూరదేశముల నుండిగూడ ప్రయాసపడి గ్రంథముల సంపాదించి తెచ్చువారు నలందాయం దెట్టియమూల్య గ్రంథము లుండెడివో చెప్పియుంటిమి. ఇచ్చటి పుస్తకభాండాగారములోని గ్రంథసముదయము మూడు బ్రహ్మాండ హార్మ్యముల నావరించినవి ఇం దెన్ని గ్రంథములుండెడివో లెక్కించినవారు లేరు. బీహారములోని ఉద్దండపురమునగూడ పెద్దగ్రంథాలయ ముండినట్లు చరిత్రపరిశోధనలు దెల్పుచున్నవి. భారతవర్షమందలి పుస్తకభాండాగారములలోని అమూల్య గ్రంథముల పఠించుకొరకు అన్యదేశముల నుండికూడ యాత్రికులు వచ్చువారు ఫాహియాను, హుయ్యానిత్సాంగు, ఈత్సింగులు ఇచ్చటిగ్రంథములకు ప్రతులు వ్రాసి తీసికొని

పోవుటకే వచ్చిరి. తురుష్క దండయాత్రిలతో ఈగ్రంథాలయములన్నియు విధ్వంసమైనవి. తురుష్కులు బౌద్ధవిహారముల నాశనమొనర్చిరి అంతటితో ఈవిహారములలోని గ్రంథసముదయము గూడ నశించినది. ఒక్కగ్రంథాలయమైనను దక్కలేదు. అన్నియు నాశనమొనర్పబడినవి. 1176 సంవత్సర ప్రాంతమున తురుష్కులు నలందా విహారము పైబడి అందలి బౌద్ధభిక్షువుల దునుమాడి గ్రంథసంచయమును దగులబెట్టిరట. చేతికి జిక్కిన గ్రంథములగొని కొందరు సన్యాసులెట్లో ప్రాణముల దక్కించుకొని విక్రమశిలానగరమును జేరుకొనిరట.

## నాటివిద్యావిధానము

పైనవివరించిన ప్రఖ్యాత విద్యాస్థానములెగాక ప్రతియూర నొక్కొక్క పాఠశాల యుండెడిది ఇది గ్రామవాసుల నిరంతర పరిశోధనలకు గురియై నిర్విఘ్నముగ కొనసాగుచుండెడిది. ఆయూరివారె తమ బాలుర విద్యాపోషణమును గావించుకొనెడివారు అయ్యవారిని దామె గృహ మాన్యము లొసగి గౌరవించువారు.

నాటి విద్యా విధానముగూడ సర్వోత్కృష్టమైనది. నాటి విద్యావిధాన మందలి ప్రధానలక్షణము గురుకుల వాసము బాలురు శైశవమునందేపోయి గురువునింటనే విద్య నభ్యసించువారు ఆచార్యునింట బాలురెట్టి కొరతయులేక జనకుని గృహమునందువలెనే నిర్విచారముగ జదువుకొను వారు. విద్యాభ్యసనము పూర్తియైనతోడనే స్వగృహములకు

దిరిగివచ్చి ఉద్వాహమాడి సంసారమున బ్రవేశించువారు. దీనికే గురుకులవాసమని పేరు. మెగస్తనీసుగూడ నీకాలము నాటి విద్యాపద్ధతుల నీరీతిగనే వర్ణించినాడు దీనివలన పెక్కు సంవత్సరములు గురుని దృష్టిపథమున సంచరించుటవలన అతనితోడి నిరంతర సాంగత్యమువలన అతని ఉత్తమ గుణములు బాలురకు పట్టుబడెడివి. దుష్టసాంగత్య దుర్వ్యసనములకు తావు లేకుండెడిది.

ఆకాలమున విద్యాభ్యాసమునకు సొగసైన మందిరములతో బనిలేకపోయినది ఆచార్యులు తమ బాలురనే పటకుటీరములందో, యేవృక్ష మూలములందో, ఏ చెట్లనీడలనో, ఏ ఆరామసీమలందో, కూర్చుండబెట్టుకొని విద్య గరపువారు. అప్పుడు ఉన్నతాసనములు, కుర్చీలు, బెంచీలు, గ్యాలరీలు మున్నగు ఆడంబరములును లేవు విద్యార్థులును, ఆచార్యులును, భూతలముననే ఆసీనులై విద్యాగోష్ఠియందు మునిగిపోవువారు గురుశిష్యులు ప్రత్యేక యుడుపుల ధరింపవలెనను నిర్బంధములు లేవు ఆచార్యులకు బాలురు నెలనెలకు జీతములు సమర్పించుకొను దుర్భర దురాచారములును ఆకాలమున గానరావు. పొట్టకూటికై విద్యనమ్ముకొను వారలా కాలమున గాన్పింపకుండిరి విద్యావిక్రయము ఆకాలములో మిగుల హేయముగ పరిగణింపబడినది. అందువలన ఎంతటి నిరుపేదకైనను విద్యాభ్యాసము సులభసాధ్యమయ్యెను ఇప్పటివలె తనయుల విద్యాభ్యాసపూర్తికై తండ్రిపితార్జితపు మడిమాన్యముల, ఇల్లాలిమెడలోని మంగళసూ

త్రిముల నమ్ముకొని దైన్యత నొందవలసిన దుస్థితు లాకాల మున ప్రబలియుండలేదు.

గురువునొద్ద విద్యాభ్యాసము పూర్తియైనపిమ్మట, విద్యార్థు లింద్లకుబోయి పెండ్లియాడి గృహస్థాశ్రమమును స్వీకరింపవచ్చును. విద్య పూర్తియగువరకు బ్రహ్మచర్యమునే యవలంబింపవలయును. దాలిగుంటలో నంటుకొనినబూడిదను విదలించు శునకములరీతి, పరీక్షలైనతోడనే తాము నేర్చిన విద్యల కచ్చుటనే తిలోదకముల నిడిపోవు ఇప్పటి విద్యార్థుల వలెగాక నాటి బాలురు గృహస్థాశ్రమమును స్వీకరించినను తాము నేర్చిన విజ్ఞానమును లోకమున ప్రసరింపజేయుచు ధర్మపథమున నడువవలయును.

ఆచార్యుడుగాక, తలిదండ్రులు కూడ బాలురకు విద్యాభ్యాసమొనరింప నర్హు లనుభావ మాకాలమున ప్రబలియుండెను "మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్యదేవోభవ" యనునార్యోక్తి ననుసరించి తల్లియు, తండ్రియు, నాచార్యుడు ను బాలుర విద్యాభ్యాసమున పాల్గొనవలసిన గురుత్రయము. ఈగురుత్రయమున తల్లికే ప్రథానస్థాన మొసంగబడినది అంద రిలో నామెయె పరమగురువు. ఆదిగురువు. శిశువు గర్భస్థమైన నాటనుండియు, నామెయె భగవానునిచే గురువుగ నిర్ణీతమైనది. ఆమె యొసగుశిక్షణయే విశ్వవిద్యాలయమును ఏగురుకుల వాసమును ఒసంగజాలదు. బాలు నుయ్యెలలో పరుండబెట్టి యూచుచు, మృదుమధుర స్వరములలో నామెపాడు జోల పాటలలో, ఎత్తి ముద్దాడునపు డామెవదనసీమనుండి ప్రవ హించు ప్రేమతరంగములలో, మాటలునేర్పుటలో విద్దె

ములుచేయించి చేష్టలుగరువుటలో నామెప్రదర్శించు చాతుర్యమున, శిశుపోషణమున నామెగనబరచు ఉల్లాసమున నెంతటి విద్యాశిక్షణమున్నదో వర్ణింపవలవికాదు అందువలననే మన ప్రాచీనులు గురుత్రయమున తల్లికి ప్రధానస్థానమొసగిరి.

ఇదిగాక మనప్రాచీన విద్యావిధానమున నింకొకశ్లాఘనీయమగు అంశమున్నది మనుజునకు గురువునొద్ద జదువుకొనుకాలమే విద్యాకాలముగాదు ప్రాచీనసాంప్రదాయముల ననుసరించి ఆజన్మాంతమును విద్యాభ్యాసకాలమె బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్యాసాశ్రమము లన్నిటిలో మనుజుడు బ్రహ్మజ్ఞానము బడయువరకు విద్యకొనసాగింపవలసినదే. గురుకులవాసము ప్రాచీనవిద్యావిధానమున నొకయవస్థ.

మఱియు ప్రాచీన విద్యాభ్యాసమునకు లక్ష్యము మహోత్కృష్టమైనది. కేవల ముదరపోషణయు, ధనార్జనయు దీనికి లక్ష్యములుగావు. మోక్షసాధనము దీనిపరమ లక్ష్యము, గమ్యస్థానము.

బాలురు విద్య పూర్తిగావించుకొని ఇండ్లకు బోవునపుడు ఆచార్యుడు వారలు గృహస్థాశ్రమమున నాచరింపవలసిన ధర్మముల నుపదేశించును. ఇవి నవీన విశ్వవిద్యాలయములందు పట్టప్రధాన మహోత్సవ సమయమున వచింపబడు నీతివాక్యములకు బోల్పనగును. కాని ఆనీతివాక్యములకును ఈనీతివాక్యములకు నక్కకును నాకలోకమునకునుగల తారతమ్యమున్నది. ఆనీతివాక్యములలో ఉత్కృష్టధర్మము లిమిడియున్నవి. వీనిలో స్వాతంత్ర్యమును కలనైన స్మరింపక విజాతీయ దొరతనమునకు జోహారు లొనర్చుచు మనుచుండవలయు

నను ఉపదేశములుండును. బాలురు చదువుచాలించి తమ్ము వీడి పోవుకాలమున గురువులుపదేశించు వాక్యములను శిక్షావల్లిక యనిపేరు దీనియందు మన ప్రాచీనవిద్యాపద్ధతుల యుత్కృష్టత ప్రదర్శిత మగుచున్నది. బాలురందరును తన్నువిడచి పోవు మహాతరుణమున గురువు, అశ్రుపూరిత నయనములతో ప్రశాంత గంభీరవాక్కులతో నిట్లుపన్యసించును:—

"సత్యంవద, ధర్మంచర, స్వాధ్యాయాన్మా ప్రమదః। ఆచార్యాయ ప్రియంధన మాహృత్య ప్రజాతన్తుం మావ్యవచ్ఛేత్సీః। సత్యా న్నప్రమదితవ్యమ్। ధర్మా న్నప్రమదితవ్యమ్। కుశలా న్నప్రమదితవ్యమ్। భూత్యై నప్రమదితవ్యమ్। స్వాధ్యాయ ప్రవచనాభ్యాం నప్రమదితవ్యమ్। దేవ పితృకార్యాభ్యామ్ నప్రమదితవ్యమ్। మాతృదేవోభవ। పితృదేవోభవ। ఆచార్యదేవోభవ। అతిథిదేవోభవ। యాన్యనవద్యాని కర్మాణి। తాని సేవితవ్యాని నో యితరాణి। యాన్యస్మాకగ్ం సుచరితాని। తానిత్వ యోపాస్యాని। నోయితరాణి। యేకేచాస్మచ్ఛ్రేయాగ్ం సోబ్రాహ్మణాః। తేషాంఽఽ సనేనప్రశ్వసితవ్యమ్। శ్రద్ధయా దేయమ్। అశ్రద్ధయాఽదేయమ్। శ్రియా దేయమ్। హ్రియా దేయమ్। భియా దేయమ్। సంవిదా దేయమ్। అథయది తే కర్మవిచికిత్సావా వృత్త విచికిత్సావాస్యాత్। యేతత్ర బ్రాహ్మణా స్సం మర్శినః। యుక్తా అయుక్తాః। అలూక్షా ధర్మకామాస్స్యుః। యథా తే తత్రవర్తేరన్। తథా తత్రవర్తేథా। అథాభ్యాఖ్యాతేషు యేతత్ర బ్రాహ్మణాస్సం మర్శినః। యుక్తా అయుక్తాః। అలూక్షా ధర్మకామాస్స్యుః।

యథా తే తేషు వర్తేరన్। తథా తేషు వర్తేథాః
ఏష ఆదేశః। ఏష ఉపదేశః ఏషా వేదోపనిషత్। ఏతదనుశాస
నమ్। ఏవముపాసితవ్యమ్। ఏవముచైతదుపాశ్యమ్॥"
తైత్తిరీయోపనిషత్తు.

అనువాక్యములతో ఆచార్యుడెంతయో కష్టముమీద తనశిష్యులవీడ్కొల్పును.

ఈవాక్యముల కర్థమేమన:—

"సత్యమునుబల్కుము. ధర్మము నాచరింపుము స్వాధ్యాయనమునుండి యెన్నడును ఏమరి యుండకుము (నీవుకొంచెము సంపాదించుకొనిన పిదప) నీ యాచార్యునకు ప్రియమగునట్లు కొంతధనము నొసగుము. ప్రజాతంతువు తెగిపోకుండునటుల మంచిసంతానమును బడయుము. సత్యమును తప్పకుము. ధర్మపథమును వీడిపోకుము. క్షేమకరమగు మార్గముల సంచరింపుము. మంగళప్రదములగు కర్మముల నాచరింపుము. స్వాధ్యాయన ప్రవచనములనుండి తొలగకుము. దేవ పితృకార్యముల నెన్నడును విస్మరింపకుము జననీజనకులు ఆచార్య అతిథులు దైవములని తలంపుము. నింద్యకర్మల చాయలకుబోవకుము. మాకడనుండు సుగుణములనే గ్రహింపుము. దుర్గుణముల విసర్జింపుము. మనకంటె శ్రేష్ఠులగు బ్రాహ్మణుల ఆసనాదికములచే గౌరవింపుము. వారియుపదేశముల నాలకింపుము. వారిని బహుమానింపదలచినచో ఆదరపూర్వకముగ నిమ్ము నీసంపదకు దగినటుల సన్మానింపుము. ఆచారకర్మలగూర్చి నీకేదియైన సందియము గల్గినచో ధర్మవిచారముజేయ సమర్థులును,

ఆచార్యులును, ఆచారకర్మలందు స్వతంత్రులును, క్రౌర్యము లేనివారును ధర్మకాములునగు బ్రాహ్మణులు అట్టి సందిగ్ధ సమయములందెట్లు సంచరింతురో నీవును అట్లే సంచరింపుము. ఇది నీకాదేశము ఇదినీకుపదేశము. ఇది వేదరహస్యము. ఇది నీకాజ్ఞ. ఇది యుపాసింపదగినది.

విజాతీయ విద్యాసంపర్కమువలన నీయుత్తమపద్ధతు లన్నియు మాయమైనవి. విఖ్యాతములగు ప్రాచీన విద్యా పీఠములు అంతర్ధానమైనవి. గ్రామపాఠశాలలు గంగ గలసినవి. అయిదుక్రోశముల కొక్కబడియో, ఆరుగ్రామముల కొక్క బడియో కడకు గతియైనది రఘువంశ, కుమారసంభవ, అమరకోశములు మూలబడినవి. "గాడిద బరువుమోయును. మంగలి క్షౌరముచేయును" మున్నగు మహావిషయములతో నిండిన వాచకపుస్తకములు బాలురు పఠింపవలసిన దుర్గతిపట్టి నది. ఈ చదువులతో బాలుర యుత్సాహ బలతేజములు తలిదండ్రుల మడిమాన్య గృహసువర్ణ భూషణాదులు మఱగి పోవు దుస్థితులు సంభవించినవి.

ఆహా నాటికిని నేటికిని, యెంతటి వ్యత్యాసము! ఎం తటి ఉత్తమనాగరికత! ఎంతటి యుత్కృష్ట పరిపాలన! ఎంతటి రణప్రావీణ్యము! ఎట్టికళాకౌశలము! ఎట్టి వాణిజ్యవైభము! ఎట్టి విద్యాసంపద! అన్నియు స్వప్నదృశ్యము లైనవిగదా? పరా ధీనత భారతఖండము నెట్టి దుర్గతికి తెచ్చినది! సంతాప కరము.

సమాప్తము.

---

# పోతన వేమనల యుగము

చెన్నపురిరాజధాని కళాశాలవారి
1922 సంవత్సరపు పవెల్ అండ్ మోర్ హెడ్
బహుమానము (రు 150 లు) పొందిన
ఆంధ్ర వ్యాసము.

గ్రంథకర్త: దిగవల్లి వేంకటశివరావు, బి. ఏ, బి. యల్.

## విషయవిభాగము.

కాలము, కృతులు, పరస్పరసంబంధము, రాజుల యాస్థానములు, సంఘము, మతములు, ఆచారవ్యవహారములు, పోతన వేమనలు, వారి కాలము, అభిప్రాయభేదములు. 14, 15 శతాబ్దముల దక్షిణహిందూదేశము, ఆంధ్ర దేశరాజకీయస్థితి, సాంఘికస్థితి, ఆర్థికస్థితి, మతములు. శైవవైష్ణవులు, ప్రపంచచారిత్రమున 14, 15 శతాబ్దముల ప్రాముఖ్యము వాఙ్మయము. పోతనకృతియందు దీస్థితిగతులకు నిదర్శనములు సంఘము, మతములను గూర్చిన అభిప్రాయములు, ఉదాహరణములు పోతనకృతి విమర్శనము, భాగవతము, కథాచమత్కృతి, పాత్రపోషణము, శ్రీకృష్ణ పాత్రము. అవతారము పురుషస్త్రీపాత్రములు, శిల్పనాచాతురి, రసపోషణము, కవిత్వవిశేషములు పోతనకృతు లనుకొనబడు ఇతరగ్రంథములు వేమనకృతిలో ఆకాలపు రాజకీయ సాంఘిక మత పరిస్థితులకు నిదర్శనము. ఉదాహరణములు. వేమన విమర్శనములు వేమన నీతులు. వేమనహాస్యములు. వేమన జీవితము. వేమనకవిత.

"పక్షపాతములైన అభిప్రాయములను విమర్శలను తేటతెలుగు పదములతో సమకూర్చియుండుటచే నీవ్యాస మాంధ్రభాషావ్యాసంగముచేయు గోరు విద్యార్థుల కత్యంతోపయుక్తముగా నుండగలదు"

భారతి,
రక్తాక్షి - పుష్యము

వెల 0—8—0

వలయువారు:—దిగవల్లి వేంకటశివరావు, బి ఏ బి. యల్ లేక విజ్ఞానచంద్రికాగ్రంథమండలి, బెజవాడ అని వ్రాయవలెను.

# విజ్ఞానచంద్రికా గ్రంథమాల

——:o:——

సక్రమముగా పునరుద్ధరింపబడి, కార్యాలయము బెజవాడకు మార్చబడినది.

—• నియమములు •—

1. దేశాభివృద్ధికి అవశ్యకములైన గ్రంథములు ప్రచురించి భాషాభివృద్ధి చేయుటయే యీగ్రంథమాల యొక్కయుద్దేశ్యము ఇందు సంవత్సరమునకు రమారమి 1600 పుటలుగల స్వతంత్రమైన గ్రంథములు ప్రచురింపబడును.

2. కొందఱు తలచునట్లు ఇది మాసపత్రిక కాదు. ఇందు దేశదేశముల చరిత్రములును, పదార్థవిజ్ఞాన, రసాయన, జీవ, వృక్ష మొదలగు ప్రకృతిశాస్త్రములును, దేశోపకారులగు కొందఱు మహనీయుల చరిత్రములును, ఇంగ్లీషునందలి ఉద్గ్రంథముల భాషాంతరీకరణములునుమాత్రము ప్రచురింపబడును చరిత్రానుసారములగు కల్పిత కథలు (Historical) Novels) కూడ ప్రచురింపబడును

3. ఈ గ్రంథమాలలో నిదివరకు అచ్చువేయబడిన గ్రంథముల నన్నిటిని కొనుచు నికముందు ప్రచురింపబడు గ్రంథముల నన్నిటినిగొనుటకు నొప్పుకొనువారు శాశ్వతపు చందాదారులు.

శాశ్వతపు చందాదారులకు ఈ గ్రంథమాలలోని గ్రంథములన్నియు చౌకగా అమ్మబడును.

5. శాశ్వతపు చందాదారులు సంవత్సరపు చందా మొదట నీయనక్కరలేదు. ఒక్కొక్కపుస్తక మచ్చుపడగానే

అది వాల్యూపేయబిల్ ద్వారా పంపబడును పోస్టేజి చందా దారులే భరింపవలయును

**6.** వెనుకటి పుస్తకముల నన్నిటినిఁ గొను చందా దారులు ప్రవేశరుసు మియ్యనక్కరలేదు. వెనుకటి పుస్తకముల నన్నిటిని ఒక్కసారి కొనలేనివారు మావద్దనిలువలోనున్న పుస్త కములలో రు ౩-౦-౦ ల వెలగల పుస్తకములు మొట్టమొదట కొనినజాలును. మిగత పుస్తకములు తరువాత తెప్పించుకొన వచ్చును. ఆమిగత పుస్తకములకొఱకు వ్రాయునపుడు తమ చందా రిజష్టరుసంఖ్యను ఉదహరింపవలెను.

**7.** వెనుకటి పుస్తకములు అక్కరలేనివారు ప్రవేశరుసు ముక్రింద రు. ౦-౮-౦ చెల్లించవలెను

**8.** చందాదారులు మాప్రచురములలోని గ్రంథములను చందాదారులవెలకు ఒకటికన్న నెక్కువ పొందలేరు

**9.** గ్రంథమాలలోని గ్రంథములన్నియు నును పైన దళ సరికాగితములమీఁద ముద్రింపఁబడును అనేకచక్కని పటము లతోనొప్పుచుండును శ్రేష్ఠమయిన బైండుచేయఁబడును సరస మైన వచనశైలినికలిగియుండును. ఇట్టి సర్వాంగసుందరములై చౌకవెలకు దొరకుగ్రంథములు తెలుగుభాషలో నరుదు.

అయ్యదేవర కాళేశ్వరరావు,
కార్యదర్శి,
విజ్ఞానచంద్రికామండలి,
బెజవాడ

# విజ్ఞానచంద్రికా మండలివారిచే ప్రకటితమైన గ్రంథములు

1925 నవంబరు 15 తేదీనుండి ధరలు తగ్గింపబడినవి

| | చందాదారులకు | ఇతరులకు |
|---|---|---|
| 1. అబ్రహాములింకను (జీవితచరిత్ర) * | | |
| శ్రీయుత గాడిచెర్ల హరిసర్వోత్తమరావుగారు. | | |
| 2 హిందూమహాయుగము. (దేశచరిత్ర) * | | |
| శ్రీయుత కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు. | | |
| 3. జీవశాస్త్రము (శాస్త్రగ్రంథము) * | | |
| 4. రాణీసంయుక్త (నవల) * | 0-12-0 | 1-0-0 |
| శ్రీయుత వేలాల సుబ్బారావుగారు. | | |
| 5. మహమ్మదీయమహాయుగము (దేశచరిత్ర) * | | |
| శ్రీయుత కీ॥ శే॥ కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు. | | |
| 6. పదార్థ విజ్ఞానశాస్త్రము (శాస్త్రగ్రంథము) * | | |
| శ్రీయుత మంత్రిప్రగడ సాంబశివరావుగారు. | | |
| 7. రసాయనశాస్త్రము (శాస్త్రగ్రంథము) * | 1-4-0 | 1-8-0 |
| శ్రీయుత వేమూరి విశ్వనాథశర్మగారు. | | |

8 ఆంగ్గులు చరిత్రము 1వ భా. (దేశచరిత్ర)
శ్రీయుత చిలుకూరి వీరభద్రరావుగారు.

9 విమలాదేవి (నవల)
శ్రీయుత భోగరాజు నారాయణమూర్తిగారు

10. కిలరా (శాస్త్రగ్రంధము)
శ్రీయుత ఆచంట లక్ష్మీపతిగారు. 0-5-0

11. జంతుశాస్త్రము (శాస్త్రగ్రంధము)

12 వృక్షశాస్త్రము (శాస్త్రగ్రంధము)

13 శారీరశాస్త్రము (శాస్త్రగ్రంధము)

14. భౌతికశాస్త్రప్రధమపాఠములు (శాస్త్రగ్రంధము)

15 స్త్రీయచరిత్రము 1వ భాగము
కీ॥ శే॥ కందుకూరి వీరేశలింగం పంతులుగారు.

16. భౌతిక శాస్త్రము (శాస్త్రగ్రంధము)

17. ఫిన్లండ్ (దేశచరిత్ర)

18 ఆంధ్రుల చరిత్ర 2 వ భాగము (దేశచరిత్ర.)
శ్రీయుత చిలుకూరి వీరభద్రరావుగారు. 1-8-0

19. చంద్రగుప్తచక్రవర్తి (జీవితచరిత్ర.)

20. చలిజ్వరము (శాస్త్రగ్రంధము)
శ్రీయుత ఆచంట లక్ష్మీపతిగారు. 0-7-0

21. అర్ధశాస్త్రము 1వ సంపు. (శాస్త్రగ్రంధము)
శ్రీయుత కట్టమంచి రామలింగారెడ్డిగారు. 1-8-0

22. బెంజమిను ఫ్రాంక్లిను చరిత్రము
శ్రీయుత్ పసుమర్తి శ్రీనివాసరావుగారు. 0-8-0

23. వ్యవసాయ శాస్త్రము 1వ భా. (శాస్త్రగ్రం 1-0-0
ధము.) శ్రీయుత గోటేటి జోగిరాజుగారు.

24 డిటో రెండవభాగము. డిటో 1-0-0

25. రాయచూరు యుద్ధము. 0-12-0
శ్రీయుత కేతవరపు వేంకటశాస్త్రిగారు.

26. అర్ధశాస్త్రము 2వ సంపు. (శాస్త్రగ్రంధము ) 1-0-0
శ్రీయుత కట్టమంచి రామలింగారెడ్డిగారు.

27. విజయనగర సామ్రాజ్యము (నవల) 0-12-0
శ్రీయుతదుగ్గిరాలరాఘవచంద్రయ్యచౌదరిగారు

| | |
|---|---|
| 28. పాతాళభైరవి (నవల) | 0-12-0 |
| 29. స్వీయచరిత్ర 2వ భాగము.<br>కీ॥ శే॥ కందుకూరి వీరేశలింగం పంతులుగారు. | 1-0-0 |
| 30. వృక్షశాస్త్రము, (మ్యాన్యుయల్) | 1-8-0 |
| 31. లక్ష్మణరాయవ్యాసావళి, 1వ సంపుటము.<br>కీ॥ శే॥ కొమర్రాజు లక్ష్మణరావుగారు. | 1-8-0 |
| 32 ఫ్రెంచిస్వాతంత్ర్యవిజయము 1వ సంపుటము.<br>శ్రీయుత అయ్యదేవర కాళేశ్వరరావుగారు | 1-4-0 |
| 33. అమెరికాసంయుక్తరాష్ట్రములు<br>శ్రీయుత అయ్యదేవర కాళేశ్వరరావుగారు. | 1-4-0 |
| 34. బౌద్ధమహాయుగము(ఫాహియాన్ భా॥యాత్రతో) | 1-14-0 |
| డిటో మాత్రము | 1-4-0 |
| శ్రీయుత వేలూరి సత్యనారాయణగారు.<br>పుస్తకములు ప్రస్తుతము నిల్వలో లేవు. | |

## మావద్ద వెలకు దొరకు ఇతర గ్రంథములు

| | |
|---|---|
| 1. శివాజీచరిత్ర......<br>కీ॥ శే॥ కొమర్రాజు లక్ష్మణరావు గారు.* | 1—0—0 |
| 2. ఉద్యానకృషి [ప్రథమ భాగము]<br>గోటేటి జోగిరాజుగారు. | 1—0—0 |
| 3. ఋతుకాలనిర్ణయము | 1—0—0 |
| 4 శ్రీరామచరిత్ర (గురువ్యాఖ్యానము)<br>శ్రీయుత గాడిచర్ల హరిసర్వోత్తమ రావు. | 0—8—0 |
| 5 స్వాతంత్ర్యలక్షణము<br>శ్రీయుత వా॥ గో॥ వేంకటసుబ్బయ్య శాస్త్రిగారు,<br>అనువాదకర్త. | 1—0—0 |
| 6. స్వప్నకుమారము<br>శ్రీయుత రాయప్రోలు సుబ్బారావుగారు. | 0—4—0 |
| 7. కష్టకమల ,, | ,, |
| 8 స్నేహలత ,, | ,, |
| 9. తృణకంకణము ,, | ,, |

| | | |
|---|---|---|
| 10 | తెనుగుతోట<br>శ్రీయుత రాయప్రోలు సుబ్బారావుగారు. | 0—4—0 |
| 11. | లలిత ,, | ,, |
| 12. | త్రైవిక్రమ నాటకము<br>శ్రీయుత వెన్నెలకంటి సుందరరామశర్మగారు. | 0—6—0 |
| 13. | [illegible]<br>డాక్టరు ఆచంట లక్ష్మీపతిగారు. | 1—0—0 |
| 14 | పోతనవేమన యుగములు<br>గ్రంథకర్త: శ్రీయుత దిగవల్లి వెంకటశివరావుగారు. | 0—8—0 |

---

# ప్రకటన నియమములు

1. మాప్రకటనలు తమ పత్రికలలో, నుచితముగ వేయు పత్రికాధిపతుల ప్రకటనలు మాపుస్తకముల చివర ఉచితముగ వేయగలవారము.

2. తమప్రకటన మాపుస్తకములో వేయగోరు పత్రికాధిపతులు తాము ప్రకటనవేసిన సంచికను మాకు బంపుచు దమ ప్రకటన యెటుల వేయవలసినది తెలుపవలెను.

3. పైకముతీసికొని మేమితర ప్రకటనలను వేయగలము. ఒకసారి ఒకపుట ప్రకటనవేయుటకు రు 10 0-0 లు ఈయవలెను. అరపుటకు రు 6-0-0. ఎక్కువపుటలు కోరువారు ప్రత్యేకముగ వెల నిర్ణయించుకొనవచ్చును.

4. మాకు చాలమంది శాశ్వతచందాదారు లున్నందు చేను ప్రతిదినము, క్రొత్తక్రొత్త చందాదారులు వచ్చుచున్నందునను మాగ్రంథములు ఆంధ్రభాషలో శాశ్వతముగ నుండునవిగనుకను, ఇందొకసారి ప్రకటన వచ్చినయెడల అది భాషలో శాశ్వతముగ నుండును దినపత్రికలు, వారపత్రికలు, మాసపత్రికలవలె అప్పుడుమాత్రము చదివి అవతల పారవేయునట్టివి మాగ్రంథములుకావు. కనుక వీనియందు ప్రకటనలు వేయువారికి మిక్కిలి లాభముండునని చెప్పవచ్చును

ప్రకటన వెయించదలచిన వారీక్రింది చిరునామాకు వ్రాయుడు:—

మేనేజరు, విజ్ఞానచంద్రికామండలి,

బెజవాడ.

# విజ్ఞానచంద్రికాగ్రంథమండలి

బె జ వా డ.



తయారై అచ్చులోనున్న గ్రంథములు.

## దక్షిణాఫ్రికా చరిత్ర

గ్రం థ క ర్త.

శ్రీయుత దిగవల్లి వేంకట శివరావుపంతులుగారు,

బి. ఏ., బి. యల్.

ఇందు ప్రథమభాగమున దక్షిణాఫ్రికా పూర్వచారిత్రము, పాశ్చాత్యులరాక, బోయరులు ఆదిమనివాసులను పారదోలి రాజ్య మాక్రమించుట, రాజనీతి, సాంఘికచరిత్ర, బోయరుయుద్ధము, దక్షిణాఫ్రికా సంయుక్తరాష్ట్ర స్థాపనము, రెండవభాగమున దక్షిణాఫ్రికాలోని భారతీయులు, వారిస్థితిగతులు, వలసకూలి, గాంధిగారిరాక, సత్యాగ్రహసమరము, గాంధివిజయము, ఉత్తరకథ శాస్త్రీ సప్రూ ప్రభృతులగు రాజకీయనాయకుల యాశాభంగము, తూర్పు ఆఫ్రికా లేక కెన్యా సమస్య, భారతీయుల జైళ్ళలోను బయటను పడిన దురవస్థలు, ఉదాహరణములతో వర్ణింపబడినవి గాంధిగారి జీవితమున దక్షిణాఫ్రికాలో గడచినకాలమును చక్కగ వర్ణింపబడినది.

మేనేజరు, విజ్ఞానచంద్రికామండలి,

బెజవాడ.

# డచ్చిప్రజాస్వామికము (DUTCH REPUBLIC)

స్పైన్ రాజుయొక్క నిరంకుశత్వమునుండియు, దౌష్ట్యమునుండియు హాలెండు దేశప్రజలు మతస్వేచ్ఛను రాజకీయ స్వతంత్రమును పొందుటకు సలిపిన మానవచరిత్రితో సుప్రసిద్ధమైన స్వతంత్ర పోరాటము ఇందు కడు మనోహరముగ వర్ణింపబడినది. గ్రంథకర్త: సుప్రసిద్ధ నాయకులగు దేశభక్త కొండ వెంకటప్పయ్య పంతులుగారు. చిత్రపటములుగలవు.

మేనేజరు, విజ్ఞానచంద్రికామండలి,

బెజవాడ.

# ఫాహియాన్ భారతవర్ష యాత్ర

గ్రంథకర్త; వేలూరి సత్యనారాయణగారు, బి. ఏ,

నాల్గవ శతాబ్దాంతమున—ఇప్పటికి పదునైదువందలేండ్లక్రిందట, చీనా సామ్రాజ్యమునుండి భారతభూమిని సందర్శింపవచ్చిన 'ఫాహియాన్' అను సుప్రసిద్ధబౌద్ధసన్యాసుని యాత్రావృత్తాంతమిందు వర్ణింపబడినది. చంద్రగుప్త, విక్రమార్కుడు రాజ్యమేలిన ప్రాచీనకాలమున భారతవర్ష మే తీరుగనుండెనో, పరిపాలనావిధాన మేగతినడచుచుండెనో, మత సాంఘిక పరిస్థితు లెట్లుండెనో పూర్వకాలమున భూవలయమున సువర్ణభూమియని పేరుమోగిన భారతవర్షసౌభాగ్య మెట్లుండెనో, యిందు కన్నులకు గట్టినట్లు జిత్రింపబడినది ఆరు దీర్ఘవత్సరము లమితశ్రమలబడి మహాభీలమగు గాలిదుమారముల కాకరమగు యెడారులదాటి, యత్యున్నతములగు పర్వతావళుల నిర్గమించి, శరవేగమునబారు నదీప్రవాహముల తరించి, యార్యావర్తమున కీపాంథుడుగావించిన యాత్రావృత్తాంత మత్యంతవిషాదపూరితమై, నవలవలె చదువరులకింపుగానుండును. ప్రాచీనభారత నాగరకతా సౌభాగ్యముల నరయగోరు ప్రతియాంధ్రుడును చదివితీరవలయును. చరిత్రపరిశోధకుల కియ్యది యమూల్యలమగు గ్రంథము. మృదుమధుర శైలిలో వ్రాయబడినది.

మూల్యము 1 రూపాయి మాత్రమే.

చందాదారులకు 0—12—0

వలయువారు;—విజ్ఞానచంద్రికా గ్రంథమండలి, బెజవాడ అనివ్రాయవలెను.

# నీలగిరి

## చక్కని తెలుగు వార్తాపత్రిక

ఇది నిజాము రాష్ట్రమునుండి మొట్టమొదలు వెలువడి పండ్రెండు పుటలపై ముద్రింపబడి క్రమముగా నడుపబడుచున్నది.

## ప్రతిగురువారమున బ్రకటింపబడును

ఇందు విమర్శనలు, విదేశవృత్తాంతములు, నిజాముదేశ వార్తలు, వింతలు, వినోదములు, వ్యవసాయాభివృద్ధి కవసరమైన వ్యాసములు, వ్యవహారికవిషయములు, శ్రీవారి ఫర్మానులు, హైకోర్టుతీర్పులు, క్రొత్తచట్టములు, పద్యములు ప్రహసనములు, వైద్యవిధానములు, పరిశ్రామికసంబంధములైన వ్యాసములు, పరిశోధక విషయములు, రూపపటములు సాంఘిక సంస్కరణచర్చలు, నిజామురాష్ట్రాంధ్రోద్యమమునుగూర్చిన సంగతులు, ప్రకటనలు, వేయేల? ప్రపంచమందు జరుగు వివిధాంశములును, మనయభివృద్ధి కవసరమైన నూతన విషయములును ప్రకటింపబడుచున్నవి.

ప్రతిసంవత్సర మనేకరూపపటములతో సంవత్సరాది పంచాఙ్గముతో వివిధవ్యాసములతో, పద్యములతో మూడు రంగుల ముఖపత్రముతో గూడుకొనిన "నీలగిరి ఉగాది సంచిక" ప్రకటింపఁబడుచున్నది

సంవత్సరమునకు చందా 4-8-0 మాత్రమే స్థానికులకు నాలుగురూపాయలు విడిపత్రిక రెండణాలు బ్రిటిషుప్రాంతములవారు ముందుగ మనిఆర్డరు పంపవలెను.

నీలగిరి కార్యస్థానము, నల్లగొండ (నిజాం)

# ఆంధ్రిఆయుర్వేద ఫార్మసి (లిమిటెడ్)

185, వరాంటు రోడ్డు, మదరాసు

డాక్టరు ఆచంట లక్ష్మీపతి, బి ఏ, యమ్. బి, సి యమ్. గారిచే స్థాపింపబడినది.

వసూలైన మూలధనము రు. 1,30,054

మా యొద్ద రహస్యమనునది లేదు. గొప్ప ఉత్కృష్టమైన మందులు ఇచ్చుటనే దొరకును.

సిద్ధమకరధ్వజము:— కామోద్దీపజనకము- శ్రేష్ఠమయిన రసాయనము ధాతుపుష్టికరము. బుద్ధిని ఆయుష్షును వృద్ధిపరచును. అతిమూత్రము, క్షయ, సుఖరోగములు వీనియందు మంచిగుణము లిచ్చును. 25 మాత్రిలు రూ 5—0—0.

చ్యవనప్రాశ లేహ్యము:— శ్రేష్ఠమయిన రసాయనము. శ్వాసకోశవికారములను పోగొట్టును. కాసములకు మంచిఔషధము. శరీరపుష్టిని గలుగజేయును.

1 పౌను రూ 3-0-0  4 ఔన్సులు రూ 1-0-0

కస్తూరి మాత్రిలు;—బాలురకుకలుగు దగ్గు, జ్వరము, జలుబు, అజీర్ణము మొదలగు వికారములను పోగొట్టును.

ఒకబుడ్డి రూ 1-0-0

తాళీసాదివటి:—దగ్గు, గొంతునొప్పి, అజీర్ణము. కఫజ్వరములు, వాంతులు, అరోచకము మొదలగువానిని పోగొట్టును 25 మాత్రిలు రూ 0-8-0

ఆంధ్రయువజన స్వరాజ్యసభవారి పక్షమున ప్రచురింపబడు
జాతీయ వారపత్రిక

# కాంగ్రెస్

ప్రథమ, ప్రస్తుత సంపాదకులు:-మద్దూరి అన్నపూర్ణయ్యాగారు.
(18 మాసముల కఠినశిక్ష అనుభవించియున్నారు)

ద్వితీయ సంపాదకులు:—కాండ్రేగుల రామచంద్రరావుగారు.
(15 మాసముల కఠినశిక్ష అనుభవించినారు.)

# ఆంధ్ర యువజన స్వరాజ్య గ్రంథమాల

ప్రథమ పుష్పము:—
"మనకీ దారిద్ర్యమేల" అను భారతవర్ష ఆర్థికచరిత్ర.
గ్రంథకర్తలు:—
దేశరాజు సత్యసుబ్రహ్మణ్యం, రామచంద్రరావుగార్లు.
శ్రీయుత భోగరాజు పట్టాభిసీతారామయ్య గారిచే
పీఠిక వ్రాయబడినది ఆంధ్రనాయకు లనేకులచే కీర్తింపబడినది.
వెల రు. 1-6-0, చందాదారులకు రు. 1-2-0

ద్వితీయపుష్పము: —కళా వేంకటరావుగారిచే రచింపబడిన
"సామ్రాజ్యతత్త్వము"
వెల రు 0-8-0, చందాదారులకు రు 0-6-0

వలయువారు:—

కార్యదర్శి,
ఆంధ్రయువజన స్వరాజ్య సభ,
సీతానగరం, కొవ్వూరు తాలూకా,
పశ్చిమగోదావరిజిల్లా

# కార్మిక పత్రిక

కార్మికుల పక్షమున రంగూనులో వెలువడు తెలుగు వారపత్రిక.

సంపాదకులు:—శ్రీయుత అవటపల్లి నారాయణరావు గారు, ఎ. ఏ, యం. యల్. సి

సంవత్సరమునకు చందా రు 3—0—0.

వలయువారు:—మేనేజరు, కార్మికపత్రిక, రంగూన్,

అని వ్రాయవలెను.

---

# సరస్వతి

ఇది యొక సారస్వత విషయిక మాసపత్రిక.

సంపాదకులు:—శ్రీరాజా వాసిరెడ్డి దుర్గా సదాశివేశ్వర ప్రసాదరావు బహద్దరు జమీందారుగ్గారు.జయంతిపురం.

ఇందు సుప్రసిద్ధ ప్రాచీనాంధ్రాముద్రిత గ్రంథములును చారిత్రిక విమర్శక వ్యాసములును శాస్త్రపరిశోధనలును వాఙ్మయ విషయిక సమస్య జిజ్ఞాసలును భావపూరితములగు స్వకపోల కల్పనముగల ఖండకావ్యములును ప్రచురింపబడు చుండును.

చందా: విద్యార్థులకు, స్త్రీలకు సం॥ నకు రు-2—0—0

ఇతరులకు 2—8—0

వలయువారు:—

సంపాదకులు, సరస్వతీపత్రిక, ముక్త్యాల, కృష్ణాజిల్లా.

అనివ్రాయవలెను.